శ్రీకాలిదాసవిరచితమ్

# కుమారసమ్భవమ్

తెలుగుసేత :
'ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న'
**జి.వి.యస్. సుబ్రహ్మణ్యశర్మ** ఎం.ఏ.



ప్రకాశకులు : **ఆర్.సి. శాస్త్రి**
5-54/1, స్టోనీకార్టర్, 8/22, హబ్సిగూడ,
హైదరాబాద్-500007.

శ్రీ కాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమ్

తెలుగుసేత .
"ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
**గొల్లమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ,** ఎం.ఏ.
వైస్-ప్రిన్సిపాల్, రీడరు, సంస్కృతశాఖాధ్యక్షుడు (రిటైర్డ్)
మిసెస్. ఏ.వి.యన్. కళాశాల
డోర్ నెం.31-8-62, రవిభవనం, బంగారమ్మమెట్ట,
విశాఖపట్టణము - 530 004.

ప్రకాశకులు :
**ఆర్.సి. శాస్త్రి**
5-54/1, స్టోనీకార్టర్, 8/22, హబ్సిగూడా, హైదరాబాద్ - 500 027.
ఫోన్స్ : (ఇ) 040-27170256, (ఆ) 27151947, 27172301

శ్రీ కాళిదాసవిరచితమ్
**కుమారసమ్భవమ్**

ఆంధ్రానువాదము

**జి.వి.యస్. సుబ్రహ్మణ్యశర్మ**, ఎం.ఏ.
ఫోను నం. 0891-2748809 (రెసి)





ప్రతులు : 500

ముద్రణ : 10 మే, 2003

ముఖచిత్రం : ప్రశాంతి ఫిల్మ్కానా








ప్రతులకు :

1) ప్రకాశకులు
ఫోన్ : (ఇ) 040-27170256, (ఆ) 27151947, 27172301

2) శ్రీ గోపాల్ పబ్లికేషన్సు
3-3-860, ఆర్యసమాజ్ ఎదురుసందులో
కాచిగూడ, హైదరాబాదు-27.
ఫోన్ : 24658101

అక్షరకూర్పు, టైటిల్ డిజైన్ & ముద్రణ :
**అపర్ణా గ్రాఫిక్స్**
కాచిగూడ, హైదరాబాద్-27.
ఫోన్ : 040-55631389



శ్లో॥ వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే।

జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ॥



శ్రీ ఆర్. చంద్రశేఖర శాస్త్రి, శ్రీమతి ఆర్. కమలాదేవి

# విషయసూచిక


| | | | పుట |
|---|---|---|---|
| 1. | ఆకాంక్ష<br>ఆర్.సి. శాస్త్రి | ... | i |
| 2. | ముందుమాట<br>జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మ | ... | iii |
| 3. | ఆమోదము - ఆశీస్సు<br>అప్పల్ల సోమేశ్వరశర్మ | ... | xix |
| 5. | కుమారసమ్భవమ్<br>(కావ్యము + అనువాదము) | ... | 1-278 |
| 6. | లోకోక్తులు | ... | 279-283 |
| 7. | అకారాదిశ్లోకానుక్రమణిక | ... | 284-329 |
| 8. | అనుబంధము-1<br>మూలకథ (శివపురాణంలోని శ్లోకముల ఛాయ ఉన్న కుమారసమ్భవ శ్లోకములు- దేవనాగరి లిపిలో) | ... | 330-363 |
| 9. | అనుబంధము-2<br>(కాళిదాసకృతులలో అతనికిగల సర్వశాస్త్రపరిచయము) | ... | 364-367 |

**ఆర్.సి. శాస్త్రి**
చైర్మన్, స్టోనీకార్టర్
డైరెక్టర్, డివైన్ఇండియా లిమిటెడ్

# ఆకాంక్ష

సృష్టికార్యక్రమంలోనే పరివర్తనశీలం ఇమిడియున్నది. సమాజాలు కూడా పరివర్తన చెందుతూనే ఉంటాయి. ఏదో ఒక చైతన్యశక్తి మనుష్యులను, వారు ఏర్పరచుకున్న సమాజాలను మార్పులకు గురిచేస్తుంది. మార్పు అనివార్యం. అయితే సనాతనమైన, మానవజీవితాన్ని ఉత్తేజపరిచే స్ఫూర్తి నివ్వగలిగిన శక్తులు ఈ మార్పులవల్ల నశించిపోయే పరిస్థితి ఏర్పడితే మాత్రం అది బాధాకరం అవుతుంది. కాని నేడు మన భారతీయత, మన సాంప్రదాయం, జాతిమనుగడ, కూడా దెబ్బతినే పరిస్థితిలో మన మున్నాం. మన ముందుతరం మన కందించిన అమూల్యసంపదలను – సత్యం, ధర్మం, కర్మఫలత్యాగం అనే సద్గుణాలనే కాక – కాళిదాసు, భాసుడు, బాణుడు, హర్షుడు మరెందరో మహానుభావులు, కవులు మనం అభివృద్ధి చెందాలనే తపనతో మనకోసం వదలివెళ్లిన అమూల్య సదుపదేశరత్నాలను మనము పోగొట్టుకుంటున్నాము. దేశ సంస్కృతిని చాటిచెప్పుతూ మన సంస్కృతికే అలంకారమైన గుళ్లు, గోపురాలు, కట్టడాలు నేడు విచ్ఛిన్నమై కనిపిస్తున్నాయి. అవికూడా ఇకముందు మిగిలి ఉంటాయన్న నమ్మకం ఏది? నేటి కుహనాప్రపంచంలో. ఆశ్చర్యమేమంటే మనం మంచి చేయలేకపోయినా, మరిఒకరు చేసినా, లేక చేయుటకు ప్రయత్నించినా అటువంటి వారికి స్ఫూర్తినివ్వటం కూడా అతికష్టం అవుతున్నది. నేటి కాలంలో ఒక్క ధనసంపాదన విషయం మినహాయించి మరేదీ నచ్చటం లేదు నేటి సామాజికులకు.

ఇటువంటి వాతావరణంలో, చిన్ననాటి నుండి సంస్కృతభాషమీద, ఆ భాషలో ఉన్న గ్రంథాలు, కావ్యాలమీద ప్రత్యేకాభిమానమున్న నాకు, ఏదో ఒకరోజు మహాకవి కాళిదాసు రచించిన నాటకాలను, కావ్యాలను తెలుగు లిపిలో, సరళమైన తెలుగు అనువాదంతో వెలుగులోకి తేవాలని ఆకాంక్ష కలిగింది.

"పునరపి జననం, పునరపి మరణం.." అని ఆదిశంకరులు చెప్పిన సత్యాన్ని తెలుసుకుని కూడా చాలామంది తమకు మాత్రం అది అన్వయింపదని

అనుకుంటున్నట్లుగ ప్రవర్తిస్తారు. కొద్ది జన్మకాలంలో ఏదోఒకటి మంచి కార్యాన్ని చేద్దామన్న సంకల్పం ప్రదర్శింపక పోగా, ఇతరుల ప్రయత్నానికి ఒక చేయి ఇవ్వటానికి కూడా నిర్లక్ష్యం చేస్తారు. అధిక వ్యయప్రయాసలతో కాళిదాస కావ్యాలను తెలుగులోనికి తీసుకువచ్చే ప్రయత్నంలో చరమాంకంకు చేరిన ఈ ప్రయత్నంలో, పై అభిప్రాయం కలగటం ఒకచేదు అనుభవం.

అయితే స్ఫూర్తి కలిగించిన కొద్దిమంది పాఠకులు, ప్రశంసించిన పండిత వాక్యం ఇటువంటి లోటును భర్తీ చేశాయి.

అభిజ్ఞానశాకున్తలమ్, మేఘసన్దేశమ్, మాలవికాగ్నిమిత్రమ్, విక్రమోర్వశీయమ్ లను అభిమానించి, ఆదరించిన రసజ్ఞులకు ఈ మే 10వ తేదీన ఋతుసంహారమ్, కుమారసమ్భవమ్‌లను మీ ముందుంచుతున్నాము. తన కంటికి సర్జరీ చేయించుకుని ఎంతో బాధ, అసౌకర్యం ఉన్నా ఒక దృఢనిశ్చయంతో, మిత్రుడు శ్రీ జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మ ఈ కావ్యాలను దీక్షతో మీకందించాడు. శర్మకు నా కృతజ్ఞతలు. చి॥ సౌ॥ ప్రశాంతి ఢిల్లీలో అనేక బాధ్యతలమధ్య సతమతమవుతూ నామీద ఉన్న గౌరవభావంతో శ్రమించి పంపించిన కలర్ పెయింటింగ్స్ ఈ పుస్తకాలకు అధిక శోభనిస్తాయని ఆశిస్తూ, ప్రశాంతికి నా ఆశీర్వాదం తెలియజేస్తున్నాను. చి॥ గణేష్‌బాబు, చి॥ రఘు ఈ కార్యక్రమంలో పూర్తిగా నాకు సహాయసహకారాలు అందించి ప్రతిక్షణం ఈ బాధ్యత తమదిగా తీసికొని అవిరామంగా కృషిచేసినందుకు వారిరువురికి నా అభినందనలు, ఆశీర్వచనాలు.

ఎంతో కృషిచేసి, సమయం చూసుకుని, యావచ్ఛక్తిని కూడగట్టి, నాతో సహకరించి, తెలుగుసేత చేసిన ఆప్తమిత్రుడు సుబ్రహ్మణ్య శర్మకు 250 కాపీలను పూర్తి హక్కుతో అత్యానందంతో అందజేస్తున్నాను. ఉత్కృష్టమైన కవులు, పండితులు ధనసంపాదనలో నాడు, నేడు కూడా విఫలమయ్యారు. శర్మ గొప్ప పండితుడు. అలాంటి పండితుణ్ణి ఆదరించండి – ఈ పుస్తకాలను “కొని” చదవండి. కవులకు, పండితులకు, రచయితలకు స్ఫూర్తినిచ్చే సదాచారాన్ని నిలుపండి. అటువంటి ఆదరణ, స్ఫూర్తి మా శర్మకు అందజేస్తారని ఆశిస్తూ, అకాంక్షిస్తూ, అభ్యర్థిస్తూ...

విధేయుడు

హైదరాబాదు,

తేది: 07-05-2003

**ఆర్.సి. శాస్త్రి**

"ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
**జి.వి.యస్. సుబ్రహ్మణ్యశర్మ,** ఎం.ఏ.,
వైస్-ప్రిన్సిపాల్, రీడరు మరియు
సంస్కృతశాఖాధ్యక్షుడు (రిటైర్డ్)
మిసెస్. ఏ.వి.యన్. కళాశాల, విశాఖపట్టణం-1.
ఫోను నం. 0891-2748809 (నివాసము)

# ముందుమాట

## కవిప్రశంశ

కాళిదాసు కవిత్వములో ఉన్న విశిష్టగుణములను గమనించి, ఆతని వినయ విజ్ఞానాది గుణములను గుర్తుంచుకొని, ఆనందవర్ధను డను లాక్షణికుడు ఈ మహాకవి నిట్లు ప్రశంసించినాడు.

"వ్యాస వాల్మీకి కాలిదాసాద్యాః ద్విత్రాః
పంచషా వా, మహాకవయ ఇతి గణ్యన్తే."

'వ్యాసుడు, వాల్మీకి, కాళిదాసు మొదలగు ఏ ఇద్దరో, ముగ్గురో, లేక ఏ అయిదుగురో, ఆర్గురో మాత్రమే మహాకవులుగా పరిగణింపబడుచున్నారు' అని దీని భావము.

ఇట్టి ప్రశంసల నందుకొన్న కవికులతిలకుడైన కాళిదాసమహాకవి రచించిన తొలి మహాకావ్యము కుమారసంభవము. సంస్కృత పంచ మహాకావ్యములలో నిది యొకటి. ఈ మహాకావ్యమునందు 17 సర్గములు, 1096 శ్లోకములు ఉన్నవి.

## కుమారసంభవరచన

శ్రీమద్రామాయణమునందు, వేదవతి యనునామె యోగాగ్నిలో దగ్ధురాలై, సీతగా పుట్టి, శ్రీరాముని వివాహము చేసికొనినది. ఈ కథయే కాళిదాసుని హృదయముపైన గాఢమైనముద్ర వేసి, పార్వతీకళ్యాణగాథను, "కుమార సంభవ"

కావ్యముగ, ఇతనిచే రచింపజేసినది. అందువలననే సతీదేవి యోగాగ్నిలో దగ్ధురాలై పార్వతిగా పుట్టి, తపస్సు చేసి, తపఃఫలముగా పరమేశ్వరుని వివాహమాడిన వృత్తాంతమును గ్రహించి, కుమారసంభవమును హిమవద్వర్ణనము, పార్వతిజన్మతో కథ నారంభించినాడు.

శివపురాణము నందలి శ్లోకపాదములు, కొన్ని యథాతథముగా కుమారసంభవమునందు ప్రయోగింపబడినవి. మహాకవి కాళిదాసు "అస్త్యుత్తరస్యాం దిశి" అని ప్రారంభించిన మొదటికావ్యము ఈ కుమారసంభవము. ధ్వని ప్రధానముగా నడిచి, "కశ్చిత్ కాంతా విరహ గురుణా" అని ప్రారంభించిన మేఘదూతము 2వ కావ్యము. పరమపరిపాకదశలో "వాగర్థావివ సంపృక్తౌ" అను శ్లోకముతో ప్రారంభించి రచించిన, "రఘువంశము" కాళిదాసుని మూడవకావ్యము అని శైలిని బట్టి, ఆలంకారికు లూహించిరి. ఈ మూడు కావ్యముల మొదటిపదములే కలిసి కావ్యరచనా కాలక్రమమును సూచించుచు 'అస్తి కశ్చిత్ వాగర్థః' అను వాక్యముగా పండితులలో ప్రచారమునకు వచ్చినది.

## నామౌచిత్యము

కాళిదాసు దృష్టిలో "కుమారసంభవము" అనగా కుమారస్వామి జన్మించుటకు నాందిపలికిన, శివపార్వతుల సమాగమము అని అర్థము. 'సంభవ' శబ్దమునకు "జన్మ" అని కాక, "సమాగమము" అను అర్థమునే దృష్టిలో ఉంచుకొని, ఈ కావ్యమును 8 సర్గములతో పూర్తి చేసినాడు.

శివపార్వతుల సమాగమమువలన కుమారుడు జన్మింపగలడని అంతకుముందే బ్రహ్మ చెప్పినాడు. అందువలననే కాళిదాసు ధ్వనిగర్భితముగా శివపార్వతుల సురతవర్ణనముతోనే ఈ కావ్యమును సమాప్తిచేసినాడు. అందువలననే మల్లినాథసూరి కూడ 8 సర్గములవరకే తన సంజీవినీవ్యాఖ్యను వ్రాసినాడు. శివపార్వతుల అవినాభావ, నిత్య, సాంగత్యమునకు ఈ కావ్యము గొప్ప సంకేతము. ఈ కావ్యమునకు 8 సర్గముల వరకు 1. దక్షిణావర్తనాథుడు; 2. అరుణగిరినాథుడు అనువారు కూడ వ్యాఖ్యానమును రచించినారు.

కాని, నేడు మనకు లభించు కుమారసంభవకావ్యమునందు పదునేడు సర్గములు కనబడుచున్నవి. 9 నుండి 17 సర్గముల వరకుగల 9 సర్గముల భాగమును, ఎవరో కాళిదాసనామముతోనే తరువాత రచించి, గ్రంథమున చేర్చియుందురు. "కుమారసంభవ"మునకు "కుమారుడు పుట్టుట" అని భావించుటే, ఈ అదనపు సర్గములను రచించుటయందలి ఉద్దేశ్య మయియుండును.

కనుకనే ఈ అదనపు సర్గలకు మల్లినాథసూరి తన "సంజీవనీవ్యాఖ్య" ను వ్రాయలేదు.

శ్రీ పర్వణీకర శ్రీసీతారామకవి అనునతడు 'సంజీవనీవ్యాఖ్య' పేరుతోనే, ఈ అదనపుసర్గలకు వ్యాఖ్యానమును సంస్కృతమున రచించినాడు.

కుమారసంభవకావ్యమును 8 సర్గములవరకే రచించుటకు కారణములు.

1. జగత్పితరుల సంభోగవర్ణనము చేయుటవలన కాళిదాసుకే 'సిగ్గు' అనిపించి, తదనంతరకథను వ్రాయలేదని కొంద రందురు.
2. పార్వతిశాపము : కుమారసంభవమును 8 సర్గములవరకే కాళిదాసు వ్రాయుటకు కారణ మిది యని మరికొంద రందురు. కాని అది అవిశ్వసనీయముగా నున్నది.

కాళిదాసు ఇందలి 8వ సర్గములో పార్వతీపరమేశ్వరుల సంభోగ శృంగారమును అతివేలముగ వర్ణించుటవలన కోపించిన పార్వతి 'తరువాతి కథను వ్రాయకుందువు గాక' అని శపించినదట.

కాళిదాసుని కుమారసంభవకావ్యమునకు మూలము శివపురాణము నందున్నది. దానిని గ్రంథాతమున 1వ అనుబంధమునందు పొందుపరచితిని.

## కథాసంగ్రహము

మొదటి సర్గములో, హిమవద్వర్ణనము, పార్వతి జన్మ, బాల్యము. రెండవ సర్గములో, శివపార్వతుల సంయోగమునకు బ్రహ్మ సూచన చేయుట, మూడవ

సర్గములో వారి సంయోగమునకు, మన్మథుడు చేసిన ప్రయత్నము, నాలుగవ సర్గములో రతీవిలాపము,ఆమెకు శివుడు వరమిచ్చుట, 5వ సర్గములో శివ సమాగమమునకై పార్వతి తపస్సుచేయుట. 6వ సర్గములో పిల్ల నిమ్మని హిమవంతుని వద్దకు సప్తర్షుల దౌత్యము, 7వ సర్గములో వివాహము, 8వ సర్గములో శివపార్వతుల ప్రణయవిహారములు వర్ణింపబడినవి.

## కాళిదాసుని కవితపై వాల్మీకి వ్యాసుల ప్రభావము

కాళిదాసునిదృష్టిలో కవిశబ్దవాచ్యు డొక్క వాల్మీకియే. ఇందుకు నిదర్శనము 1. "కవిః కుశేధ్మాహరణాయ యాతః", 2. "కవిః కారుణికో వనే" అని రఘువంశమునందలి రామాయణభాగమునందు కాళిదాసు వాల్మీకిని గూర్చి కవి శబ్దమును ప్రయోగించినాడు. 3. శ్రీరాముని కొలువులో కుశలవులు రామాయణమును గానము చేయుదురు. దానిని విన్న సభాసదులు రంజిల్లి, తలలూపగా, వారి అనందమునకు కారణము "వృత్తం రామస్య" మరియు వాల్మీకేః కృతిః" అని ప్రస్తుతించును.

4. వాల్మీకి యొక్క గొప్పతనమును ప్రకటించుటకై అతనిని -
"విషాదవిద్ధాండజదర్శనోత్థః
శ్లోకత్వ మాపద్యత యస్య శోకః" అనినాడు.

వాల్మీకిపై ఇంతటి గౌరవ మున్నను అతని కవిత్వమునందలి గుణమునే గ్రహించెను కాని, వాల్మీకి, వ్యాసులను కాళిదాసు గుడ్డిగా అనుసరింపలేదు. వాల్మీకి వ్యాసాదుల ఆయా భావములకు మెఱుగుపెట్టినాడు. పూర్వకవుల రచనలతో కాళిదాసకృతులను పోల్చి చూచినచో కాళిదాసుని కవిత, బంగారమునకు మెఱుగును, నగిషీని పెట్టినట్లుండును.

కాళిదాసు తన కంటె పూర్వులైన, వాల్మీకి, వ్యాసులను, నాటకకర్తలైన భాసాదులను తన కవిత్వమునకు మార్గదర్శకులుగా స్వీకరించినట్లు తన కావ్యములలో ఎన్నియో చోట్ల స్పష్టపరచినాడు. వాల్మీకియును, వ్యాసుడును, కాళిదాసునకు ఆరాధ్యదైవములు. కావ్య రచనకు వాల్మీకిని, నాటకరచనకు

భాసుని, మార్గదర్శకులుగా ఎన్నుకొని, తన కావ్య, నాటకములను కాళిదాసు రచించినట్లు ప్రమాణములు కనబడుచున్నవి. అందువలననే,

1. రఘువంశారంభమున "అథవా కృత వాగ్ద్వారే వంశే ఉ స్మిన్ పూర్వసూరిభిః మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యే వాస్తి మే గతిః" అనినాడు.
2. రఘువంశములో దిలీపునినుండి, ఇతర రాజులందరి కథారచనకును మూలము వ్యాసుని మహాభారతమే.
3. మేఘసందేశ రచనకును వాల్మీకి రామాయణములోని హనుమద్దౌత్యమే ప్రేరకమని "ఇత్యాఖ్యాతే పవనతనయం, మైథిలీ వోన్ముఖీ సా" అని యక్షపత్నిని గూర్చి యక్షునిచే చెప్పినాడు.
4. కుమారసంభవరచనకు వ్యాసుని శివపురాణమునందలి సతీదేవియే పార్వతిగా పుట్టిన కథ ఆధారమైనట్లు కనబడును.
5. విక్రమోర్వశీయమునందలి చతుర్థాంకమునకు వాల్మీకమునందలి శ్రీరాముని సీతాన్వేషణమే మార్గదర్శకమై యుండును.
6. అభిజ్ఞానశాకుంతలమునందలి అభిజ్ఞానముద్రికాసన్నివేశమునకు శ్రీరామ ముద్రికాప్రదాన సన్నివేశము ఆధారమై యుండును.
7. పైగా అభిజ్ఞానశాకుంతలమునకు మూలము వ్యాసుని మహాభారతమే.
8. రఘువంశములోని శ్రీరామచరితమునకు వాల్మీకికృత శ్రీమద్రామాయణమే మూలము.
9. ఋతుసంహారకావ్యరచనకు వాల్మీకిరామాయణమునందలి ఋతు వర్ణనములే మూలములు.

ఈ విధముగా ఒక్క మాళవికాగ్నిమిత్రమునకు తప్ప, తక్కిన తన రచనల కన్నింటికిని ఏదో ఒక విధముగా వాల్మీకి, వ్యాసుల రచనలతో కాళిదాసు ప్రత్యక్షసంబంధము నేర్పరచుకొనినాడు. ఆ కవుల పైనను, వారి రచనల పైనను తనకు గల గౌరవాభిమానములను బహుభంగుల ప్రదర్శించినాడు.

## కాళిదాసకవితావిశేషములు - వ్యాస వాల్మీకుల మార్గదర్శకత్వము

వాల్మీకి, వ్యాసులే కాళిదాసునకు కవితామార్గదర్శకులని తెలిసికొంటిమి కదా!

1. పాత్రల మనోభావములను వెలువరించుటలోని మెళుకువలను, కాళదాసు వాల్మీకినుండియే గ్రహించినాడు. వాల్మీకియొక్క సమాసగుంభనము, పదప్రయోగచాతుర్యము, వాక్యరచనలను, దీటుపోకుండ కాళిదాసు అనుకరించినాడు.

**ఉదాహరణములు:** 'జరాజర్జరితః, శీర్ణకేసరః, స్నిగ్ధగంభీరనిర్ఘోషః, పశ్యన్ యయౌ' అను వాల్మీకి పలుకులను యథాతథముగా కాళిదాసు చిలుక పలుకుల వలె పలికినాడు.

## అక్షరరమ్యత

కాళిదాస కవిత్వములోని అక్షరరమ్యత కీ క్రింది ప్రయోగములు ఉదాహరణములు.

**గురు లఘు సమ్మేళనమునకు :**

1. హిమాలయో నామ నగాధిరాజః (కుమార సంభవము)
2. యం యం వ్యతీయాయ స భూమిపాలః (రఘువంశము)
3. గత్యుత్కంపా దలకపతితైః. (మాటలను చుట్టచుట్టుటకు)
4. సచామరే దేవ మసేవిషాతాం - చామరము వీచినట్లు మాటను అటు ఇటు విరిచి చెప్పుటకు ఉదాహరణము (కుమారసంభవము).

## కాళిదాసుని వర్ణనముల వైశిష్ట్యము

కాళిదాసు చేసిన వర్ణనము లన్నియు, కథాభాగమున కుపకారకములై కథలో ఇమిడిపోవునవే కాని, కేవలము కవికల్పనాచాతుర్యమును, కవితా పాటవమును, శబ్దజ్ఞానమును, పాండిత్యప్రకర్షను, ప్రదర్శించుటకు, చేసినవి కానేకావు. కథాంతర్గతములైన వర్ణనములను వ్రాయు కళలో కాళిదాసు సిద్ధహస్తుడు. భావవర్ణనమైనను, ప్రకృతివర్ణనమైనను సందర్భోచితముగా నుండును. వర్ణనములోని ఔచిత్యము, అయనకు వెన్నతో బెట్టిన విద్య.

కథావస్తువు, వర్ణనము, అను రెండును ఒకదానితో నొకటి కలిసిపోయి యుండును.

కాళిదాసుని వర్ణనములలో భావసౌందర్యముతో బాటు భాషాసౌందర్యము కూడ ప్రస్ఫుటముగా కనబడును.

**ఉదాహరణములు :**

1. పెండ్లికి తరలి వచ్చుచున్న శివునిమీది గౌరవముతో పెద్ద శరీరముగల నందీశ్వరుడు తన శరీరమును కుంచించుకొని, కూర్చొనినాడను భావమును తెలుపుటకు, ప్రదర్శించిన భావానుగుణమైన భాషాప్రయోగ మిది. "తద్భక్తి సంక్షిప్త బృహత్ప్రమాణం " అని.
2. ఈశ్వరుడు ఆ నందిమీద కూర్చొనగానే అది మహావేగముతో కదిలినది అనుటకు ప్రయోగము ఇది. "ఖే ఖేలగామీ త మువాహ వాహః" ఈ వాక్యములోని ఖేఖే అను అక్షరములు దానిని ముందుకు పొమ్మని, హెచ్చరించు హే, హే పదములోని అక్షరములవలె ధ్వనించుచున్నవి. తరువాతి 'వాహ వాహ' అను అక్షరములు పల్లకిని మోయు ఓహోం, ఓహోం, ఓం అనే పదమును స్మరింపజేయుచున్నవి.
3. నంది మెడలోని మువ్వల చప్పుడు, "సశబ్ద చామీకర కింకిణీకః" అను ప్రయోగముతో సూచింపబడినది.
4. వరవేషమును ధరించి, శివుడు పెండ్లి పీటలపై కూర్చొని యున్నప్పుడు, గంగా యమునలు ఆయనకు చామరములను వీచుచున్నప్పటి భావమునకు తగినట్టి భాష ఇట్లున్నది.
   "సచామరే దేవ మసేవిషాతాం" – ఈ పదముల విరుపులో చామరముల కదలికను ఎంత పొందికగా కాళిదాసు చూపినాడో గమనించితిరి గదా!

## భావతీవ్రత

కాళిదాసుని కవితలో భావతీవ్రత ఎంత ఉధృతముగా (పైకి) ఉండునో మరల దానిని అంతటి సామాన్య స్థితికి (కిందికి) చూపుట, అతని కవితలోని మరియొక ప్రత్యేకత.

వేడినీళ్ళకు, చన్నీళ్ళుగా రెండుభావతీవ్రతలను కలిపి, ఒక భావ సామరస్యమును ప్రదర్శించుటకు ఈ క్రింది ఉదాహరణను గమనింతము.

1. కుమారసంభవమునందు శివపార్వతులు పరస్పరము చూచుకొని భావ తీవ్రతతో శృంగారభావమును వికసింపచేయునంతలోనే మన్మథుని శివుడు, భస్మావశేషుని చేసి, సంభోగశృంగారరసపరాకాష్ఠ స్థితిని తగ్గించివేయును.

2. ఇక విప్రలంభశృంగారవిషయమున కూడ ఇట్లే కాళిదాసుని రచన సాగినది. కామదహనముతో స్త్రీసాంగత్యమును రోసి, మౌనియై తపస్సు చేసికొను శివుడు, పంచమసర్గములో, పార్వతికి తనపైగల ప్రేమాభినివేశనమును పరీక్షించుటకై బ్రహ్మచారిగా వచ్చి, ఎన్నెన్ని హాస్యోక్తు లాడెనో తెలియని వారెవరు?

3. భావమాధుర్యమునకు మరొక ఉదాహరణము:

కుమారసంభవమునందలి 6వ సర్గములో సప్తర్షులు హిమవంతుని ప్రశంసించుచు –

శ్లో॥ "గా మధాస్యత్ కథం నాగో మృణాళమృదుభిః ఫణైః॥
అరసాతలమూలా త్త్వం అవాలంబిష్యథా న చేత్॥" (6–68)

"అధాస్యత్కథం" అను పదము ద్వారా శేషుడు బరువును పైకి, ఎత్తుట సూచించబడినది. బలహీనుడైన నాగము భూభారమును మోయలేదు అనుటకు, 'మృణాళమృదు' అను పదము ప్రయోగింపబడినది.

## పదప్రయోగచాతుర్యము – సార్థకత

కాళిదాసుని వర్ణనములలోని పదములు దృశ్యమును కళ్ళకుకట్టినట్లు చూపునట్టి సామర్థ్యము కలవి. వర్ణనములు బహుసుందరములు.

1. 3వసర్గములో, అకాల వసంతోదయమురాగా, ప్రమథగణములు కోలాహలము చేయుచుండగా, శివునకు తపోభంగము జరుగరాదని ద్వారపాలుడైన నందీశ్వరుడు ప్రకృతిని అదిలించును. అప్పు డా ప్రకృతి

చిత్రగతమైనట్లు, ఎట్లు నిశ్చలమైనదో ఈ వర్ణనమును గమనింపుదు.
"నిష్కంపవృక్షం, నిభృతద్విరేఫం,
మూకాండజం, శాంతమృగప్రచారమ్" అనును.

2. ఇరువురిమధ్య సంభాషణములను చెప్పవలసివచ్చినప్పుడు, నాటకము నందుగాని, కావ్యములయందు గాని చిన్ని చిన్ని వాక్యములతో మహత్తరమైన అర్థమును ప్రకటించుట కాళిదాసుని కవితలోని ప్రత్యేకత. ఇందు కుదాహరణములను గమనింపుదు.

1) కుమారసంభవమునందలి ఇంద్ర మన్మథసంభాషణమునందు–
త ద్గచ్ఛ సిద్ధ్యై, కురు దేవకార్యం
అర్థో౽య మర్థాన్తరభావ్య ఏవ।
అపేక్షతే ప్రత్యయ ముత్తమం త్వాం
బీజాఙ్కురః ప్రా గుదయా దివామ్భః॥ (కుమారసంభవము 3-18)

2.) ఇంద్రుడు మన్మథునితో –
"సురాః సమభ్యర్థయితార ఏతే ..... స్పృహణీయ వీర్యః"
(కుమార – 3-20)

3. అభిజ్ఞానశాకుంతలమునందు కణ్వశిష్యుడును దుష్యంతుడును శకుంతలా పరిణయమును గూర్చి వివదించుకొనునప్పుడు శారద్వతుని వాక్యము– "త దేషా భవతః కాంతా, త్యజ వైనాం గృహాణ వా."
(శాకున్తలమ్ 5-7)

4. హిమవంతుడు సప్తర్షులతో –
"ఏతే వయ మమీ దారాః, కన్యేయం కులజీవితమ్। .....
అనాస్థా బాహ్యవస్తుషు." (కుమార – 6-63)

## సార్థకపదప్రయోగమునకు ఉదాహరణము

ఎ) రఘువంశమునందు – వశిష్ఠుడు దిలీపుని గూర్చి "రాజ్యాశ్రమమునిం మునిః" – దిలీపుడు రాజ్యాశ్రమముని యనుట సార్థకమైన పదప్రయోగము.

బి) "గిరీశగౌరీతనయేన సార్థం" (కుమార 13-9) మొ॥.

## కాళిదాసుని రచనలలో పురుషాధిక్యము కానరాదు

కాళిదాసు తాను రచించిన పాత్రలలో, హెచ్చు తగ్గులను చూపక, అందరికి సమానప్రాతినిధ్యము నిచ్చును. ఎవరిని కించపరచుటకు అత దంగీకరింపడు. స్త్రీ పురుష, పాత్రలచిత్రీకరణమునందు వ్యత్యాసమును చూపడు.

శివుడు సంధ్యాదేవి నుపాసించి రాగానే పార్వతికి అతనిపై కోపము వచ్చును. అపుడు శివు డామెతో "నేను ఆ సంధ్యాదేవి నుపాసించుటయే కాదు, ఆమె కూడ, "అనన్యనారీకమనీయమైన నా అంకము నెక్కి, నాకు దాసురాలైనది" అనును. ఆమె శివకామేశ్వరాంకస్థ గదా! ఇట్లు ఆదిదంపతులైన పార్వతీపరమేశ్వరులే, పరస్పర ప్రేమదాసులైనచో ఇక నాటకములయందలి నాయికానాయకుల ప్రేమదాసత్వమును గూర్చి వేరుగా చెప్పవలసిన దేముండును?

అందువలననే శాకుంతలమున దుష్యంతుడు –

"కిం వీజయామి నళినీదళతాలవృంతైః?
సంవాహయామి చరణా వుత పద్మతామ్రౌ" అనును.

## స్త్రీపాత్రలవిషయమున ప్రత్యేకతను, ఔచిత్యమును కాళిదాసు ప్రదర్శించును

1. కుమారసంభవమునందు 6వ సర్గలో – సప్తర్షులే బయలుదేరవలసి యుండగా, కన్యావరణమునకు, అరుంధతినికూడ కాళిదాసు పంపించును. – "ప్రాయే ణైవంవిధౌ కార్యే పురంధ్రీణాం ప్రగల్భతా" అనును.

2. హిమవంతుడు సప్తర్షుల మాటలను విని,

"మేనాముఖ ముద్రైక్షత మేనే మేనాపి తత్సర్వం" మరియు
"ప్రాయే ణావ్యభిచారిణ్యో భర్తు రిష్టే పతివ్రతాః" అనును.

3. హిమవంతుడు తమ దాంపత్యసామరస్యమును చూపుచు "ఏతే వయ మమీ దారాః కన్యేయం కులజీవితమ్" అని భార్యయొక్క, బిడ్డల యొక్క ప్రాముఖ్యమును వివరించును.

4. అభిజ్ఞానశాకుంతలములో కథాపరముగా శాపోపహతుడైన దుష్యంతుడు, శకుంతలను, తిరస్కరించినను శాపము తొలగగానే, ఎంత పశ్చాత్తాప పడునో, ఎట్లు పాదాక్రాంతుడై క్షమాపణ చెప్పుకొనునో మనకు తెలిసినదే.

## సామరస్యము, అన్యోన్యప్రేమ

ఉదా॥ 'పర్యాప్త పుష్పస్తబకస్తనాభ్యః, స్ఫురత్ప్రవాళోష్ఠమనోహరాభ్యః ।
లతావధూభ్యః తరవో హ్యవాపుః వినమ్రశాఖాభుజబంధనాని॥'

నదీ సముద్రములు, భూమ్యాకాశములు, కూడా కాళిదాసు దృష్టిలో సరసులైన, సామరస్యము కలిగిన, దంపతులే!

ఉదాహరణములు:

1. అజుని ఇందుమతి వివాహమాడుటను సూచించిన ఉపమ
"జలనిధి మనుకూలా జహ్నుకన్యా వతీర్ణా
శశిన ముపగతేయం కౌముదీ మేఘముక్తా". అందువలననే కాళిదాసు తన రఘువంశకావ్యములో 'ఇతి సమగుణ యోగప్రీతయః తత్ర పౌరా' అని సామరస్యమును సూచించును. కాళిదాసు చూపినది దాంపత్య సామరస్యమేకాని కేవల లౌకికశృంగారము కాదు. కనుక కాళిదాసు శృంగారప్రియుడు, కాముకుడు అనుకొనుట తప్పు.

కాళిదాసు వర్ణించిన శృంగారమునకు పరమప్రయోజనము శాంతిప్రాప్తి. ఈ విషయమును కుమారసంభవమునందు ఇట్లు వివరించినాడు. కపట బ్రహ్మచారిగా వచ్చిన శివుడు పార్వతితో వాదోపవాదములనుచేసి, ఆమె కోపించి వెళ్ళిపోవుచుండగా ఆమె చేతిని పట్టుకొని, ఆపి,

"అద్య ప్రభృ త్యవనతాంగి! తవాస్మి దాసః
క్రీత స్తపోభి రితి వాదిని చంద్రమౌళౌ ।

అహ్నాయ సా నియమజం క్లమ ముత్ససర్జ
క్లేశః ఫలేన హి పున ర్నవతాం విధత్తే॥ " అనును.

## అలంకారములో సామరస్యము

వివాహసమయమునందు వరుడైన శివుడు అలంకరించుకొనిన తరువాత అతని అలంకారసామరస్యము ప్రకటింపబడినది. ఒకదానికొకటి పొంతనలేని అలంకారములైనను, అవి అతనికి శోభనే చేకూర్చి, అలంకారసాఫల్యమునే కలిగించినవి.

"బభూవ భస్మైవ సితాంగరాగః
కపాలమే వామలశేఖరశ్రీః ।
ఉపాంతభాగేషు చ రోచనాఙ్కో
గజాజినస్యైవ దుకూలభావః " (కుమార 7-32)

సామాన్య ప్రతిపత్తిపూర్వకముగనే కాళిదాసు ఆయాపాత్రలను సృష్టించును.
ఉదా. : సప్తర్షులు అరుంధతితోబాటు శివునిసన్నిధికి వెళ్ళినపుడు
"స్త్రీ పుమా ని త్యనాస్థైషా వృత్తం హి మహితం సతామ్॥" అని శివుడు సప్తర్షులతో అనును.

కాళిదాసు దాంపత్యసామరస్యమును ఆదిదంపతులైన పార్వతీ పరమేశ్వరులలో దర్శించిన తీరును గమనింపుడు. ఆ శివపార్వతుల లీలా సంభూతమైన చరాచరజగత్తునందలి, మహర్షులలో, మహారాజులలో, చివరకు పశుపక్ష్యాదులలోకూడ సామరస్యమును కాళిదాసు చూచినాడు.
ఉదా. : కుమారసంభవమునందు స్థాణ్వాశ్రమములో అకాలవసంత విజృంభణము జరుగగా -

"మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః ।
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగనామా ।  (కుమార 3-36)

దదౌ రసా త్పఙ్కజరేణుగన్ధి
గజాయ గణ్డూషజలం కరేణుః
శృఙ్గేణ చ స్పర్శనిమీలితాక్షీం ॥
మృగీ మకణ్డూయత కృష్ణసారః ॥ (కుమార 3-37)

ఈ ప్రేమపారవశ్యము జంగమములైన తిర్యగవస్థనుదాటి కాళిదాసుని కవితలో స్థావరములైన లతావృక్షములలోనికి కూడా వ్యాపించినది.

ఉదా. : అభిజ్ఞానశాకుంతలమునందు సహకారవృక్షము వరుడుకాగా వనజ్యోత్స్న లతావధువైనది.

## కాళిదాసుని శివాద్వైతము

1. కాళిదాసు స్వతః శివభక్తుడు. పైగా అతని స్వస్థలము మహాకాలేశ్వరుని స్థానమగు ఉజ్జయిని. కనుక అతడు మహాకాళేశ్వరునికి పరమభక్తుడు. ఆ శైవాభిమానమును చాటుచు మేఘసందేశకావ్యమునందు –
"వక్రః పంథా యదపి భవతః ప్రస్థిత స్యో త్తరాశాం
సౌధోత్సంగ ప్రణయవిముఖో మాస్మ భూ రుజ్జయిన్యాః" అనును.
పై కారణమువలన, పరమమాహేశ్వరుడైన కాళిదాసుయొక్క భావన శివాద్వైతభావన అయినది. తన అన్ని కావ్యములందును కాళిదాసు ఏకదీక్షతో ప్రతిపాదించిన అంశ మీ శివాద్వైతభావనయే. ఆంధ్రభాషలో తిక్కన హరిహరాద్వైతమును ప్రతిపాదించుటకు బహుశః కాళిదాసుని శివాద్వైతమే స్ఫూర్తి నిచ్చియుండును.

2. కాళిదాసు రచించిన మాలవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము, అభిజ్ఞాన శాకుంతలము అను మూడునాటకములయందలి నాందీశ్లోకములు శివశక్తిపరములైనవే. అట్లే విక్రమోర్వశీయమునందు తప్ప తక్కిన రెండు నాటకములయందును భరతవాక్యములుకూడ శివపరములైనవే.

3. రఘువంశమునందలి మొట్టమొదటి ప్రార్థన శ్లోకము –

'వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌః॥'
ఇది శివాద్వైతమునే చెప్పుచున్నది.

4. కుమారసంభవ మంతయు ఈయంశమునే చాటుచున్నది. ప్రత్యేకముగా శివాశివకళ్యాణోత్సవమునందు, బ్రాహ్మ్యాది సప్తమాతృకా స్మరణముతోబాటు తన ఉపాస్యదైవమైన కాళీమాతనుకూడ స్మరించి, సమగ్ర శైవాభిమానమును ప్రకటించును.

'తాసాం చ పశ్చాత్ కనకప్రభాణాం
కాళీ కపాలాభరణా చకాసే' అని స్తుతించినాడు.

5. కుమారసంభవమునందు శివశక్త్యైక్యమును చాటిచెప్పుచు పార్వతీ పరమేశ్వరుల క్రీడతో 8వ సర్గముతోనే కావ్యమును ముగించినాడు.

6. మేఘదూతకావ్యమునందు, మేఘుని శివునిగను, విద్యుత్ కళత్రమును శక్తిగను భావించి, శివశక్తుల కభేదమును చాటిచెప్పినాడు.

7. కుమారసంభవ కథ అంతయు, వస్త్వైక్యమును సాధించును. అందుకు సాధనమైన, హిమవంతుని వర్ణనతో కావ్యముప్రారంభమై, హిమవంతుని కుమార్తె, శివునిభర్తగ పొందుటకై చేసిన తపశ్చర్య, ఆతడొనర్చిన గౌరీకళ్యాణములను కథలను మధ్యనచెప్పి, గిరిజాశంకరు లా గిరిపైనే చేసిన విహారముతో ముగియును.

ఈ కావ్యమునందు హిమవంతుడు దేవతాత్మగను, నగాధిరాజుగను కూడ వర్ణింపబడినాడు. అతడు దేవతాత్ముడుకానిచో పార్వతికి జనకుడు కాలేడుకదా!

సతీవియోగముతో స్థాణువైన శివుడు, పార్వతీసంయోగముతో, సర్వ శక్తిమంతుడు, పరమేశ్వరుడుగా మారును. ఈ భావమునే శ్రీమదాది శంకరులు తమ సౌందర్యలహరిలో 'శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం' అని వివరించినారు.

## గ్రంథముఖ్యాంశములు

1. మూలగ్రంథమును, అనువాదమును స్థూలాక్షరములలో ముద్రింపబడినవి. తెలుగులిపిలో ఈ కావ్యము ప్రస్తుతము పూర్తిగా ఇతరత్ర లభింపనందున దీని నిట్లు ముద్రింపదలిచితిని.
2. మూలగ్రంథపు భావము చెడిపోకుండ, భావస్పష్టతకై కొన్నిచోట్ల వివరణము ఇవ్వదలచినపుడు ఆ విషయమును కుండలీకరణములో ( ) ఉంచితిని.
3. వ్యాఖ్యానము నందలి కొన్ని విశేషాంశములను శాస్త్రవిశేషములను కుండలీకరణమునందు ( ) పొందుపరచితిని.
4. పఠితల, పరిశోధకుల, సౌకర్యార్థమై గ్రంథాంతమున అకారాది శ్లోకానుక్రమణిక చేర్పబడినది. శ్లోకము చివరనున్న సంఖ్య సర్గమును, శ్లోకమును సూచించును.
5. సర్గాంతములందు సందర్భోచితములైన కొన్ని రేఖాచిత్రములు ముద్రింపబడినవి.
6. కావ్యమునందలి లోకోక్తుల పట్టిక కూడా ఈయబడినది.
7. కుమారసంభవకావ్యమునకు మూలకథ అయిన శివపురాణపు ఛాయలను కావ్య శ్లోకములయందు ప్రదర్శించు అనుబంధము ముద్రింపబడినది.
8. కాళిదాసుని సర్వశాస్త్రపరిజ్ఞానమును సూచించు ఉదాహరణములు అనుబంధము–2లో ప్రదర్శింపబడినవి.

## కృతజ్ఞతలు

తన సాహిత్యాభిలాషను, నాపై సౌహార్దమును ప్రకటించుచు ఈ గ్రంథమునకు ప్రకాశనబాధ్యతను స్వీకరించిన శ్రీమతి ఆర్. కమలాశాస్త్రి, శ్రీ ఆర్.సి. శాస్త్రి దంపతులకు నా హృదయపూర్వక కృతజ్ఞతలను తెలుపుచున్నాను. ఆ దంపతులకు శ్రీ కమలా చంద్రశేఖరుల అనుగ్రహముతో భోగభాగ్యములు సదా వెన్నంటియుండుగాక!

పగలనక, రాత్రియనక, ప్రెస్‌వారితో అనుబంధము నేర్పరచుకొని గ్రంథముద్రణమునకై విశేషకృషి చేసిన శ్రీ యు. గణేష్‌బాబుకు నా హృదయపూర్వక శుభాభినందనముల నందించుచున్నాను.

గ్రంథప్రామాణ్యమును పెంచుటకై తగు సూచనల నిచ్చుటతోబాటుగా దీని పంపిణీ బాధ్యతను కూడ చేపట్టిన శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్స్ అధిపతి శ్రీమాన్ సి.వి. శేషాచార్యులుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను.

ముద్రణ ప్రతిని సిద్ధముచేయుటలోను, ప్రూఫులను సరిచూచుటలో నాకు సహకరించిన చి॥ సౌ॥ శ్రీమతి బెన్నూరు కళ్యాణజానకిగారికిని, చి॥ సౌ॥ శ్రీమతి కల్లూరి ఉషాకుమారిగారికిని, చి॥సౌ॥ శ్రీమతి జి. పరమేశ్వరిగారికిని నా ఆశీః పూర్వకాభినందనములను తెలుపుచున్నాను.

ముఖచిత్రాన్ని అందించిన కుమారి ప్రశాంతి ఫిల్కానాగారికిని, టైప్‌సెట్టింగ్ మరియు ముద్రణగావించిన అపర్ణాగ్రాఫిక్స్ శ్రీ రఘుగారికిని కృతజ్ఞతలు.

విశాఖపట్టణము
2-4-2003
స్వభాను సం॥, ఉగాది

ఇట్లు
సారస్వతోపాసకుడు
గోళ్ళమూడి వెంకటశ్రీహరి సుబ్రహ్మణ్యశర్మ



"వ్యాకరణాలంకార చక్రవర్తి" 'సాహిత్యవిశారద

**ఆచార్య, అప్పల్ల సోమేశ్వర శర్మ**

ఎం.ఏ., పి ఒ ఎల్,

(సువర్ణ ముద్రాకంకణ విభూషితులు - భారత సర్కార - రాష్ట్రీయ సంస్కృతసంస్థాన సంమానితులు - వివిధ ఆధ్యాత్మిక, సాంస్కృతిక, సాహిత్యసంస్థా సత్కృతులు)
(విశ్రాంత సంస్కృతాచార్యులు - ఆంధ్ర విశ్వవిద్యాలయం)

ఇ.నెం 50-96-8/2.
టి పి.టి కాలనీ.
సీతమ్మదార.
విశాఖపట్టణం-530 013.
ఫోన్ 0891-2528410

గౌరవాధ్యక్షులు :

1. శ్రీ గీతా ప్రచారసమితి
2. శ్రీ గీతాసత్సంగము
3. శ్రీ కావ్యకంఠపీఠము

# ఆమోదము - ఆశీస్సు

శ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్యశర్మగారు నాకు చిరపరిచుతుడు - సురుచిర పరిచితులు - సంస్కృతసాహిత్య సనాతన బంధువు. కనుకనే వీరు నాకు సజాతీయులు. వీరిని గురించిన ఈ అంశాన్ని నేను చాలా సార్లు ప్రస్తరించినాను. (వీరి రచనలలో) వీరు "ప్రవచన ప్రభాకరు"లే కాక "సంస్కృతాంధ్రరచనాధురంధరులు" కూడా. ఈ సంగతి సహృదయులకు అనుభూతమే! వీరి ప్రతి రచనకున్ను "రెండు మాటలు వ్రాయండి" అని, వీరు నన్ను విధిగా కోరడం, ఏవో ప్రశంసాశీర్వచనాలను నేను వ్రాయడమున్ను నాకు పరిపాటి. ఈ దిగువ మాటలు ఆ తీరులో వ్రాసినవే! ఈ సరళి వారి సౌజన్యానికి , వృద్ధగౌరవానికిన్ని - నా సౌహార్దప్రవణతకున్ను నిదర్శనం. ॥భవతు॥

ప్రస్తుతం : శ్రీ శర్మగారు మహాకవి కాళిదాసుని "విక్రమోర్వశీయము" అన్న రూపకమునకు ఆంధ్రంలో అనవద్యమైన అనువాదాన్ని అందించినారు. "వీరి సుహృన్మణి శ్రీ ఆర్.సి.శాస్త్రి గారి మహాసంకల్పబలం - ఫలమున్ను ఇది" అని చెప్పవచ్చును. ఈ ప్రణాళికలో ఇదివరకే కాళిదాసీయములైన ఇతర

రూపకాలు (అభిజ్ఞానశాకుంతలము, మాలవికాగ్నిమిత్రము) శ్రీ శర్మగారి అనువాదానికి నోచుకుని, సహృదయుల హస్తభూషణాలై వెలుగుతున్నాయి.

ఈ అనువాదాన్ని నేను "స్థాలీపులాకన్యాయం" తో (అక్కడక్కడ) ఆస్వాదించినాను. ఇది ప్రసాదమాధుర్యగుణ సంవలితమై, అలరారుతున్నది."అన్యూనాతిరిక్తం" గాను (హెచ్చు తగ్గులు లేకుండా సమతూకంతో), పాఠకులకు సుబోధంగాను, హృద్యంగాను సాగింది. స్వీకరించిన భాష సరళంగా ఉండడం ప్రత్యేకగుణమని చెప్పవలసి ఉంది. "మహాన్మోదః".

ఇక్కడ - అనువాదయిత జిజ్ఞాసకు సంబంధించిన ఒకటి రెండు అంశాలను కొద్దిగా స్పృశింపవలసి ఉంది. - అవి నాయికానాయకుల నామధేయాలను ఉద్దేశించినవి - నాయిక పేరు - "ఉర్వశి" అనియా? "ఊర్వశి" అనియా? లోకంలో "ఊర్వశి" అని అతిప్రసిద్ధంగా ఉంది. కాని ముద్రితమైన (ముఖ్యంగా నాగరీలిపి) ప్రతులలో "ఉర్వశి" అని అధికంగా కనబడుతుంది. అయినా వ్యాకరణపరంగా రెండింటినీ సమర్థించవచ్చు: "ఉరు+వశీ" = "తన సౌందర్యంతోను, విలాసాలతోను అందరిని అత్యధికంగా ఆకర్షించేది" అని భావం. ('ఉరు' శబ్దంలో రేఫ మీది ఉకారానికి లోపం - ఈ తీరు నిఘంటువులలోనే ఉంది.) కాగా "ఉరు" అన్నదానికి బదులుగా "ఊరు" అన్న శబ్దాన్ని చేర్చితే "ఊర్వశి" అని కూడా సిద్ధిస్తుంది. ("ఊరు" అన్న అవ్యయం కూడా ఉంది. భావంలో భేదం ఉండదు) మరొకతీరు: "ఊరు+వసీ = ఊర్వసీ" అని కూడా వ్యాఖ్యానింపవచ్చు. "నారాయణర్షి తొడలనుండి పుట్టినది" అని అర్థం. ఇది వైదికసంప్రదాయానికి, పౌరాణికగాథకున్ను సరిపోతుంది. ఈ అంశాన్ని "ఊరూద్భవా నరసఖస్య మునేః సురస్త్రీ" అని, కాళిదాసకవియే ప్రారంభంలో ఉటంకించినాడు (విక్రమ-మొదటి అంకం, 3వ శ్లోకం). ఒక విశేషం మాత్రం ఉంది. ఈ వ్యాఖ్యానంలో "వస" అన్నది ధాతువు. "ఊర్వశి" పదంలో "వశ" అన్నది ధాతువు. (వస=నివాసే, వశ=కాంతౌ) దీన్ని తప్పక గమనించాలి.

ఇక నాయకునిపేరు "పురూరవసుడు" అనియా? లేక "పురూరవుడు" అనియా? ఈ అంశంలో కూడా చిరకాలంనుండి అభిప్రాయభేదాలు ఉన్నవి.

ఈ శబ్దం "సకారాంతము" అంటే "పురూరవసుడు" అని ప్రయోగించడం మంచిది. "అకారాంతము" అంటే "పురూరవుడు" అన్నది సముచితం అవుతుంది. (మంచి తేజస్సుగలవాడు, గంభీరమైన కంఠధ్వనిగలవాడు, గొప్పబలం గలవాడు - మొదలైన అర్థాలను చెప్పవచ్చు). వ్యాకరణం రెండు శబ్దాలను కూడా సాధువులుగా చూపగలదు. ఒక రహస్యం! "నిరుక్త సమయం"లో (యాస్కాచార్యుని మార్గం) ప్రతి ఒక శబ్దానికిన్నీ వ్యుత్పత్తిని చూపే అవకాశం ఉంది! ప్రపంచభాషలలో ఒక్క సంస్కృతానికి మాత్రమే ఈ సౌభాగ్యం అబ్బింది!" ॥అస్తు॥

శ్రీ ఆర్.సి. శాస్త్రిగారి సంకల్పం, ఔదార్యం, శ్రీ జి.వి.యస్. సుబ్రహ్మణ్య శర్మగారి ఉత్సాహం, సామర్థ్యం, "నిత్యసమన్వితాలు"గా వెలిసి, వెరశి ఇటువంటి "అనువాదరత్నాల"ను పదింబదిగా భావుకులకు అందించుగాక! అని "సదా ముదా" ఆశిస్తున్నాను.

ఇదే నా ఆమోదం! ఇదే నా ఆశీస్సు! "ఏవ మస్తు"!

నిత్యసాహిత్యసేవి

విశాఖపట్నం - 13,
తేది : 29-10-2002
(శ్రీ చిత్రభాను, అశ్వయుజ
బహుళ అష్టమి, మంగళవారం)

( అప్పల్ల సోమేశ్వరశర్మ )





శివపార్వతీ కళ్యాణము, కన్యాదాత విష్ణువు,
కుమారస్వామి.

# కుమారసమ్భవమ్

## "ఉమోత్పత్తిర్నామ"

## ప్రథమః సర్గః

### హిమాలయవర్ణనమ్

అవతారికా : వస్తునిర్దేశం కుర్వన్ కావ్య మారభతే.

శ్లో॥ అ స్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా
హిమాలయో నామ నగాధిరాజః ।
పూర్వాపరౌ వారినిధీ విగాహ్య
స్థితః పృథివ్యా ఇవ మానదణ్డః ॥ 1

శ్లో॥ యం సర్వశైలాః పరికల్ప్య వత్సం
మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే ।
భాస్వన్తి రత్నాని మహౌషధీంశ్చ
పృథూపదిష్టాం దుదుహు ర్ధరిత్రీమ్ ॥ 2

శ్లో॥ అనన్తరత్నప్రభవస్య యస్య
హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్ ।
ఏకో హి దోషో గుణసన్నిపాతే
నిమజ్జ తీన్దోఃకిరణే ష్వివాఙ్కః ॥ 3

# కుమారసంభవము

## "ఉమోత్పత్తి"
## అను మొదటి సర్గము

### హిమాలయవర్ణనము

**అవతారికా :** వస్తునిర్దేశమును చేయుచు కావ్యము నారంభించుచున్నాడు.

భరతఖండమునకు ఉత్తరదిక్కున తూర్పుసముద్రమును, పడమటి సముద్రమును ఒరసికొనుచు, భూమండలమును కొలుచుటకై బ్రహ్మ సృష్టించిన కొలబద్దఏమో అనునట్లుగా దేవతాత్మయగు (దేవతాస్వరూపముకల) 'హిమవంతుడు' అను పర్వతరాజు కలదు. (ఇందలి శ్లోకములు ఇంద్రవజ్రావృత్తములో కూర్పబడినవి) **1**

ఈ హిమవంతుని దూడగా చేసికొని, మేరుపర్వతమును పాలను పితికు సామర్థ్యముకల దోగ్ధగా (పాలను పితుకువానినిగా) చేసికొని, పృథుచక్రవర్తియొక్క ఉపదేశముమేరకు గోరూపమును ధరించిన భూమినుండి ప్రకాశవంతములైన రత్నములను, ఓషధులను పర్వతము లన్నియు పితికినవి. **2**

అనంతములైన రత్నములకు పుట్టినిల్లైన ఆ హిమవంతునకు అతనిపైనున్న మంచు, అతని సౌభాగ్యమును లోపింపజేయజాలక పోయెను. చంద్రునిలో ఎన్నియో సుగుణములు ఉన్నను అతనిలో ఉన్న మచ్చ, అతని శోభను తొలిగింపలేనట్లు, అనేక సుగుణములు కలవారిలో ఒక్కదుర్గుణము ఉన్నను అది పరిగణనలోనికి రాదుకదా! **3**

శ్లో॥ య శ్చాప్సరోవిభ్రమమణ్డనానాం
సమ్పాదయిత్రీం శిఖరై ర్బిభర్తి।
వలాహకచ్ఛేదవిభక్తరాగా
మకలాసంధ్యా మివ ధాతుమత్తామ్ ॥ 4

శ్లో॥ ఆమేఖలం సఞ్చరతాం ఘనానాం
ఛాయా మధస్సానుగతాం నిషేవ్య ।
ఉద్వేజితా వృష్టిభి రాశ్రయన్తే
శృఙ్గాణి య స్యాతపవన్తి సిద్ధాః ॥ 5

శ్లో॥ పదం తుషారస్రుతిధౌతరక్తం
యస్మి న్న దృష్ట్వాపి హతద్విపానామ్ ।
విదన్తి మార్గం నఖరన్ధ్రముక్తై
ర్ముక్తాఫలైః కేసరిణాం కిరాతాః ॥ 6

4. ఆ హిమవత్పర్వత శిఖరములయందున్న సిందూరము మొదలగు రంజక ద్రవ్యములు (రంగురాళ్ళు) తమ కాంతిని ఆకాశమునందు వ్యాపింపజేయుటచేత ముక్కలుముక్కలుగా ఉన్న మేఘములయందు, ఆ ఎఱ్ఱరంగు అలుముకొని, సంధ్యాకాలము కాకున్నను సంధ్యాసమయము అయినదేమో అను భ్రాంతిని కల్గించుచున్నది. అందువలన రాత్రివేళ భోగసమయమునకై అలంకరించుకొనుటకు వేళదాటిపోవుచున్నదేమో అను కంగారుతో అప్సరసలు తొందరపడి అలంకారమును వ్యత్యాసముగా (ఒకచోటిదానిని మరియొకచోట) అలంకరించుకొనుచుందురు. (ఈ పర్వతశిఖరములు మేఘమండల పర్యంతము ఎత్తుగా ఉన్నవనియు, వానిపై గైరికాదిధాతువులు సమృద్ధిగా ఉన్నవనియు ఈ శ్లోకమునందు హిమవంతుని గుణములు ప్రకటింపబడినవి.) 4

సూర్యునివేడిమి తాకకుండుటకై సిద్ధులు ఆ హిమవత్పర్వతపు మేఖలయందు (మధ్యభాగమున) సంచరించుచు, మేఘముల క్రింది భాగమున నివసించి, వర్షము కురియగా, వానజల్లులచే క్లేశపెట్టబడిన వారై, ఎండకాయుచుండు ఆ పర్వతశిఖరములను ఆశ్రయించుచుందురు. (హిమాలయశిఖరములు మేఘమండలముకంటె ఎత్తయినవనియు, అవి దేవతలకు నివాసస్థలము లనియు ఈ శ్లోకమునందు సూచింపబడినది.) 5

ఆ హిమాలయపర్వతములందు సింహములను వేటాడు కిరాతులు, అప్పుడే ఏనుగులకుంభస్థలములను చీల్చి, రక్తముతో తడిసిన పాదములతో, నడిచిన సింహముల మార్గమును అనుసరించి పోవుచుందురు. కొంతదూరము వెళ్ళిన తరువాత ఆ సింహము కాళ్ళకు అంటియున్న రక్తము కరిగిపోయి, సింహముల కాలిగుర్తులు కనబడక




శ్లోకము 6

శ్లో॥ న్యస్తాక్షరా ధాతురసేన యత్ర
భూర్జత్వచః కుఞ్జరబిన్దుశోణాః ।
వ్రజన్తి విద్యాధరసున్దరీణా
మనఙ్గలేఖ క్రియయోపయోగమ్ ॥ 7

శ్లో॥ యః పూరయన్ కీచకరన్ధ్రభాగాన్
దరీముఖోత్థేన సమీరణేన ।
ఉద్గాస్యతా మిచ్ఛతి కిన్నరాణాం
తానప్రదాయిత్వ మివోపగన్తుమ్ ॥ 8

శ్లో॥ కపోలకణ్డూః కరిభి ర్వినేతుం
విఘట్టితానాం సరళద్రుమాణామ్ ।
యత స్రుతక్షీరతయా ప్రసూత
స్సానూని గన్ధ స్సురభీకరోతి ॥ 9

పోవును. అయినను ఆ సింహముల గోళ్ళలో ఇరుకుకొని, క్రిందికి జారి, గుట్టలుగాపడియున్న ఏనుగుల కుంభస్థలములయందలి ముత్యములనుబట్టి సింహములున్న ప్రదేశమునకు చేరి, వానిని ఆ కిరాతులు వేటాడుచుందురు. (హిమాలయము మదపుటేనుగులకు, సింహములకు, కిరాతులకు నివాసస్థలము అని చెప్పుట ఇందలి భావము.) 6

హిమవత్పర్వతమునందు (కుంజరబిందు) మదపుటేనుగుల వయోవస్థను సూచించు దద్దురులవలె ఎఱ్ఱని రంగుకల, భూర్జవృక్షముల పట్టలున్నవి. వానిపై సిందూరాది ద్రవ్యములతో, తమప్రియులకు మన్మథలేఖలను వ్రాసి పంపుటకు వీనిని విద్యాధరాంగనలు ఉపయోగింతురు. (ఈ కొండ దేవతాస్త్రీలకు విహార యోగ్యమైనదని భావము. కుంజరబిందువులనే "పద్మకములు" అని కూడ అందురు.) 7

ఉచ్ఛస్థాయి అగు గాంధారగ్రామమునందు (సంగీతములో ఒక స్థాయి) పాడగోరుచున్న కిన్నరులకు హిమవంతుడు తన గుహలనుండి వెలువడుగాలిని వెదురుబొంగులలోనికి దూర్చి, ఆ గాలితో ఆ వెదురు బొట్టలను పూరించి, కిన్నరులపాటలకు తానమును (శృతిని) సమకూర్చుచున్నాడో అన్నట్లున్నాడు. (హిమవంతుని సంగీతజ్ఞానము, పరోపకార దీక్ష, సద్వ్యాసంగము ఇందు చెప్పబడినవి.) 8

హిమాలయమునందు దురదను తొలగించుకొనుటకై ఏనుగులు తమ చెక్కిళ్ళను సరళ (దేవదారు) వృక్షములమీద రాచుకొనగా ఆ చెట్లనుండి పాలవంటి తెల్లని ద్రవము కారుచుండును. ఆ ద్రవము నుండి పుట్టిన కమ్మని గంధము ఆ పర్వత చరియలను పరిమళ భరితములుగా చేయుచుండును. (హిమాలయము దేవదారువృక్షములకు మదగజములకు పుట్టినిల్లని అర్థము.) 9

శ్లో॥ వనేచరాణాం వనితాసఖానాం
దరీగృహోత్సఙ్గనిషక్తభాసః ।
భవన్తి యత్రౌషధయో రజన్యా
మతైలపూరా స్సురతప్రదీపాః ॥ 10

శ్లో॥ ఉద్వేజయ త్యఙ్గులిపార్ష్ణిభాగా౯
మార్గే శిలీభూతహిమేఽపి యత్ర ।
న దుర్వహశ్రోణిపయోధరార్తా
భిన్దన్తి మన్దాం గతి మశ్వముఖ్యః ॥ 11

శ్లో॥ దివాకరా ద్రక్షతి యో గుహాసు
లీనం దివాభీత మివాన్ధకారమ్ ।
క్షుద్రేఽపి నూనం శరణం ప్రపన్నే
మమత్వ ముచ్చైశ్శిరసాం సతీవ ॥ 12

ఆ పర్వతమునందు రాత్రి సమయములందు పర్వతగుహలు అను ఇండ్లయొక్క లోపలిభాగములయందు ఆవరించి ప్రకాశించుచున్న ఓషధుల కాంతులు, ఆ ప్రాంతములయందు ప్రియురాండ్రతో విహరించు నట్టి కిరాతులకు, నూనె అక్కరలేని శృంగారదీపములు అగుచున్నవి. (హిమాలయము ఓషధులకు నిలయమనియు కిరాతదంపతులకు శయ్యా గృహమనియు ఇందు సూచన ఉన్నది.) **10**

ఆ హిమాలయమునందు మంచు గడ్డకట్టి ఉండుటవలన దాని మీద నడుచు కిన్నర స్త్రీలయొక్క కాలివేళ్ళును, మడమలును చలిచే బిగిసికొని పోవుచున్నను, భరింపరాని పిరుదల బరువుగల, స్తనముల బరువుగల ఆ స్త్రీలు, నెమ్మదిగా నడుచుటను మానలేకుండిరి. (మంచుపై నడుచుట కష్టమైనపుడు అచ్చటినుండి వేగముగా పోవుటకు ప్రయత్నించుట లోకసహజమైన విషయము. కాని ఈ కిన్నరస్త్రీలు తమ పిరుదుల, స్తనముల బరువుతో వేగముగా నడువలేకపోయిరని కాళిదాసుని భావము. హిమాలయము మంచుకొండ అనియు కిన్నరస్త్రీలకు విహార భూమి అనియు ఈ శ్లోకము చెప్పుచున్నది.) **11**

పగటిపూట గుడ్లగూబలవలె భయపడినదో అన్నట్లు కొండగుహలలో దాగుకొనిన (శరణుపొందిన) చీకటిని, ఆ హిమాలయము సూర్యునినుండి రక్షించుచున్నది. (నీచులను (చీకటిని) కాపాడుట మంచిది కాదుకదా! అను అనుమానమునకు ఈ క్రింది సామెతద్వారా సమాధానమును చెప్పుచున్నాడు). ఉచ్చైః శిరసాం = 1. ఎత్తైన తలలు (శిఖరములు) గల హిమవంతునకు, 2. గొప్ప ఆలోచనలుగల మహాత్ములకు, తమను శరణుపొందినవాడు ఎంతటి నీచుడైనను, అతనిని సజ్జనునివలె సంభావించి, మమకారమును చూపుట (తోడ్పడుట) సహజలక్షణము కదా! (హిమవంతుడు ఎత్తైన శిఖరములుకల మహాత్ముడనియు, అందువలననే నీచమైన చీకటికి కూడ ఆశ్రయము నిచ్చినాడనియు ఇందలి భావము.) **12**

శ్లో॥ లాఙ్గూలవిక్షేపవిసర్పిశోభై
రిత స్తత శ్చన్ద్రమరీచిగౌరైః ।
య స్యార్థయుక్తం గిరిరాజశబ్దం
కుర్వన్తి వాలవ్యజనై శ్చమర్యః ॥ 13

శ్లో॥ యత్రాంశుకాక్షేపవిలజ్జితానాం
యదృచ్ఛయా కిమ్పురుషాఙ్గనానామ్ ।
దరీగృహద్వారవిలమ్బిబిమ్బా
స్తిరస్కరిణ్యో జలదా భవన్తి ॥ 14

శ్లో॥ భాగీరథీనిర్ఝరశీకరాణాం
వోఢా ముహుః కమ్పితదేవదారుః ।
య ద్వాయు రన్విష్టమృగైః కిరాతై
రాసేవ్యతే భిన్నశిఖణ్డిబర్హః ॥ 15

హిమాలయమునందు చమరీమృగములు, తమ అందమైన తోకలను ఇటు అటు విసరుచు తిరుగుచుండుటచేత చంద్రకిరణములవలె తెల్లనైన వాని తోకలకుచ్చులు అనెడి వింజామరలతో హిమవంతునికి విసురుచున్నవేమో అన్నట్లు కనబడుచున్నవి. చామరములచే నిత్యము వీవబడుటవలన హిమవంతునకు గిరిరాజు (కొండలకు రాజు) అను పేరు సార్థకమైనది. (హిమవంతుని గిరిరాజ శబ్దమునకు సార్థక్యమును కల్గించుచు, అది చమరీమృగములకు నివాసస్థలమని ఈ శ్లోకమునందు ప్రతిపాదింపబడినది.) **13**

హిమాలయమునందు తమ వస్త్రములను లాగివైచుటవలన సిగ్గుపడిన కిన్నరస్త్రీలకు పర్వతగుహలు అను ఇండ్లయొక్క ద్వారములయందు దైవవశమున వ్రేలాడుచున్న మేఘమండలములే (పరువును రక్షించు) తెరలు అగుచున్నవి. (ఇందులో హిమవంతుని ఔన్నత్యము, కిన్నర దంపతుల స్వేచ్ఛావిహారము, వారికి కలిసివచ్చిన అదృష్టమును వివరింపబడినవి). **14**

అచ్చట గంగాప్రవాహమునందలి నీటితుంపురులను తమలో కలుపుకొని, చల్లనైనదియును, గాలివేగముచేత నిలువెల్ల కంపింపజేయబడిన (కదల్పబడిన) దేవదారువృక్షముల సువాసనలవలన పరిమళభరితము అయినదియును, తన తాకుదలచేత నెమళ్ళయొక్క పింఛములను విప్పజేసి, శరీరమును ఝల్లుమనిపించునదియును అగు ఆ కొండగాలి, వేటకై జంతువులను వేటాడి వేటాడి అలసిపోయిన కిరాతులచేత సేవింపబడుచున్నది. (అచ్చటి వాతావరణము ఆహ్లాదకరమైనదనియు అందుకు కారణములును ఈ శ్లోకమునందు వివరింపబడినవి.) **15**

శ్లో॥ సప్తర్షిహస్తావచితావశేషా
ణ్యధో వివస్వాన్ పరివర్తమానః ।
పద్మాని యస్యాగ్రసరోరుహాణి
ప్రబోధయ త్యూర్ధ్వముఖై ర్మయూఖైః ॥ 16

శ్లో॥ యజ్ఞాఙ్గయోనిత్వ మవేక్ష్య యస్య
సారం ధరిత్రీధరణక్షమం చ ।
ప్రజాపతిః కల్పితయజ్ఞభాగం
శైలాధిపత్యం స్వయ మన్వతిష్ఠత్ ॥ 17

## హిమవతో వివాహః

శ్లో॥ స మానసీం మేరుసఖః పితౄణాం
కన్యాం కులస్య స్థితయే స్థితిజ్ఞః ।
మేనాం మునీనామపి మాననీయా
మాత్మానురూపాం విధి నోపయేమే ॥ 18

ఆ పర్వతపు శిఖరముమీదనున్న సరోవరములయందు సప్తఋషులు (తమపూజకై) స్వహస్తములతో త్రుంపగా, మిగిలిన పద్మములను సూర్యుడు ఆ సరోవరముకంటె క్రిందిభాగమున సంచరించుచు, తన మండలము యొక్క పైభాగముననుండి పైకి ప్రసరించు కిరణములతో వికసింపజేయుచున్నాడు. (హిమవంతుడు సూర్యమండలముకంటె ఎత్తుగా ఉన్నాడనియు అతని శిఖరములు సప్తర్షులకు నిలయములనియు ఈ శ్లోకము సూచించుచున్నది). **16**

ఆ హిమవంతునియందు యజ్ఞాంగములు (యజ్ఞమునకు కావలసిన సోమలత మొదలగు ఓషధులు) ద్భవించుటవలనను, భూమిని మోయుటకు తగిన బలమును కలిగియుండుటవలనను, (పై రెండు లక్షణములను పరిశీలించి) బ్రహ్మదేవుడు స్వయముగా ఈ హిమవంతునకు 1. యజ్ఞములయందు హవిర్భాగములను పొందుటకు అర్హతను, 2. సర్వపర్వతరాజ్యాధిపత్యమును కల్పించెను. (హిమవంతుడు యజ్ఞభాగభోక్తయును, పర్వతరాజును అయిన విధానము ఇందు వివరింపబడినది. ఈ శ్లోకమునుండి ఇక కథను ప్రస్తావించుచున్నాడు). **17**

# హిమవంతుని వివాహము

మేరుపర్వతమునకు స్నేహితుడును, మర్యాదలు తెలిసినవాడును అగు ఆ హిమవంతుడు పితృదేవతలకు మానసికసంతానమైనదియును, మునులకు కూడ గౌరవింపదగినదియును, తనకు అనురూపయైనదియును అగు 'మేనాదేవి' అను కన్యను తనకులముయొక్క ప్రతిష్ఠను నిలబెట్టుటకొరకు శాస్త్రోక్తవిధానముగా వివాహముచేసికొనెను. **18**

శ్లో॥ కాలక్రమేణాథ తయోః ప్రవృత్తే
స్వరూపయోగ్యే సురతప్రసఙ్గే ।
మనోహరం యౌవన ముద్వహన్త్యా
గర్భోఽభవ ద్భూధరరాజపత్న్యాః ॥ 19

## పుత్రసంతానప్రాప్తిః

శ్లో॥ అసూత సా నాగవధూపభోగ్యం
మైనాక మమ్భోనిధిబద్ధసఖ్యమ్ ।
క్రుద్ధేఽపి పక్షచ్ఛిది వృత్రశత్రా
వవేదనాజ్ఞం కులిశక్షతానామ్ ॥ 20

## పార్వత్యాః జన్మ

శ్లో॥ అథావమానేన పితుః ప్రయుక్తా
దక్షస్య కన్యా భవపూర్వపత్నీ ।
సతీ సతీ యోగవిసృష్టదేహా
తాం జన్మనే శైలవధూం ప్రపేదే ॥ 21

శ్లో॥ సా భూధరాణా మధిపేన తస్యాం
సమాధిమత్యా ముదపాది భవ్యా ।
సమ్యక్ప్రయోగా దపరిక్షతాయాం
నీతా వివోత్సాహగుణేన సమ్పత్ ॥ 22

ఆ తరువాత కాలము గడచుచుండగా ఆ మేనాహిమవంతులు తమ సౌందర్యమునకు తగినట్లుగా శృంగారవిహారముచేసిరి. అప్పుడు మనోహరమైన యవ్వనమును ధరించిన ఆ పర్వతరాజు భార్యయగు మేనాదేవి గర్భమును ధరించెను. 19

## పుత్రసంతానప్రాప్తి

ఆ మేనాదేవి, నాగవధువులచే అనుభవించుటకు యోగ్యుడైనవాడును, సముద్రునితో స్నేహబంధమును పెంచుకొనినవాడును, తన రెక్కలను ఛేదించునట్టి దేవేంద్రుడు తనపై కోపగించినను, ఇంద్రుని వజ్రాయుధపు దెబ్బలవలన కలుగు బాధలు ఎట్లుండునో తెలియనివాడును అగు 'మైనాకుడు' అను కుమారుని కనెను. 20

## పార్వతిజన్మ

ఆపిమ్మట దక్షుని కుమార్తె అయిన, ఈశ్వరునకు మొదటిభార్య అయిన, ప్రతివ్రత అగు సతీదేవి, తన తండ్రియగు దక్షప్రజాపతి చేసిన అవమానముచేత ప్రేరితురాలై, తన యోగసాధనబలముతో శరీరమును విడిచి, మరల తాను పుట్టుటకై హిమవంతుని భార్యఅగు మేనాదేవి గర్భములోనికి చేరుకొనెను. 21

(భవ్య) శుభప్రదురాలైన ఆ సతీదేవి, పర్వతరాజగు హిమవంతునిచేత నియమవంతురాలగు మేనాదేవియందు, బాగుగా ప్రయోగించుటవలన (అపరిక్షత) చెడని నీతియందు ఉత్సాహశక్తిచేత సంపద ఉంచబడినట్లు సృష్టింపబడెను. (నీతిని బాగుగ ప్రయోగించుటవలన ఉత్సాహగుణముచే

శ్లో॥ ప్రసన్నది క్పాంసువివిక్తవాతం
శంఖస్వనాన్తరపుష్పవృష్టి ।
శరీరిణాం స్థావరజఙ్గమానాం
సుఖాయ త జ్జన్మదినం బభూవ ॥ 23

శ్లో॥ తయా దుహిత్రా సుతరాం చకాసే
స్ఫురత్ప్రభామణ్డలయా సవిత్రీ ।
విదూరభూమి ర్నవమేఘశబ్దా
దుద్భిన్నయా రత్నశలాకయేవ ॥ 24

## పార్వత్యాః బాల్యమ్

శ్లో॥ దినే దినే సా పరివర్ధమానా
లబ్ధోదయా చాన్ద్రమసీవ లేఖా ।
పుపోష లావణ్యమయా న్విశేషా౯
జ్యోత్స్నాన్తరాణీవ కలాన్తరాణి ॥ 25

కార్యసిద్ధి, సంపద ఎట్లు స్వయముగా ఉద్భవించునో అట్లే మేనాదేవి అను నీతియందు ఉత్సాహగుణము అను హిమవంతుని ద్వారా, పార్వతి అను సంపద ఉద్భవించినది అని భావము.) 22

నిర్మలమైన దిక్కులు కలదియును, దుమ్మురేగని గాలి కలదియును, శంఖపుశబ్దముల తరువాత పూలవాన కలదియును, అయి, ఆ పార్వతి యొక్క పుట్టినరోజు, స్థావరజంగమాత్మకమైన, ప్రపంచములోని ప్రాణు లన్నిటికిని సుఖమునే కలిగించినది. (పూలవాన, దిక్కుల నిర్మలత్వము, శంఖములమోత మొదలగు వానిద్వారా మహాత్ములజన్మ, లోకము లన్నిటికి ఆనందదాయక మగును అను విషయము ఈ శ్లోకమునందు నిరూపింపబడినది.) 23

ప్రకాశించుచున్న ముఖతేజస్సుకల ఆ కుమార్తెచేత, ఆమె తల్లియగు మేనాదేవి, తొలకరిమేఘముల ఉరుములచేత భూమిని చీల్చుకొని, పైకి వచ్చిన రత్నపు మొలకచేత విదూర పర్వతప్రాంతభూమి ప్రకాశించునట్లుగ వెలుగొందినది. (తల్లియగు మేనాదేవికి, కుమార్తెయగు పార్వతివలన నూతనశోభ ఏర్పడినది అను విషయము సోదాహరణముగా ఇక్కడ వివరింపబడినది.) 24

## పార్వతిబాల్యము

జన్మించిన ఆ పార్వతి దినదినప్రవర్ధమానయై, చంద్రరేఖవలె తేజోవంతమైన అవయములను కల్గియుండెను. ఆ అవయములు వెన్నెలయందు దాగులాడుచున్న చంద్రకళల శోభను పోషించుచున్నవో అన్నట్లున్నవి. (పార్వతియొక్క సౌందర్యము దినదిన ప్రవర్ధమాన మగుచున్న చంద్రరేఖవలె ఉన్నది అని ఇందలి భావము). 25

## నామకరణమ్

శ్లో॥ తాం పార్వతీ త్యాభిజనేన నామ్నా
బన్ధుప్రియాం బన్ధుజనో జుహావ ।
ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చా
దుమాఖ్యాం సుముఖీ జగామ ॥ 26

శ్లో॥ మహీభృతః పుత్త్రవతోఽపి దృష్టి
స్తస్మి న్నపత్యే న జగామ తృప్తిమ్ ।
అనన్తపుష్పస్య మధో ర్హి చూతే
ద్విరేఫమాలా సవిశేషసఙ్గా ॥ 27

శ్లో॥ ప్రభామహత్యా శిఖయేవ దీప
స్త్రిమార్గయేవ త్రిదివస్య మార్గః ।
సంస్కారవత్యేవ గిరా మనీషీ
తయా స పూతశ్చ విభూషితశ్చ ॥ 28

## నామకరణము

బంధువులకు ప్రీతిపాత్రురాలైన ఆ బాలికను తండ్రి, మొదలగు బంధువులు తమ వంశగౌరవమునకు తగిన, 'పార్వతి' అను పేరుతో పిలిచిరి. ఆ తరువాత, శివుని పొందుటకై ఆమె చేయదలచుకొన్న తపస్సునుండి మరలింపగోరిన ఆమె తల్లియగు మేనాదేవి (ఉ=ఓ చిన్నదానా! మా= తపస్సుచేయవద్దే) అనుటవలన ఆమె 'ఉమా అనుపేరుతో సుప్రసిద్ధురాలైనది. (ఈ బాలికకు 1. పార్వతి, 2. ఉమ అను పేర్లు ఎట్లు సార్థకములైనవో ఈ శ్లోకము వివరించుచున్నది.) 26

చాలమంది కొడుకులు, కుమార్తెలు కలవాడైనప్పటికి ఆ హిమవంతుని యొక్క దృష్టి పార్వతియందే తనివితీరని అభిమానమును పెంచుకొనెను. ఏలయనగా అనేకపుష్పములుకల వసంతునియొక్క దృష్టి తుమ్మెదల పంక్తులచే నిండియున్న మామిడిపువ్వుమీదనే విశేషముగా ప్రేమతో లగ్నమై ఉండునుకదా! (హిమవంతునికి తన సంతానమందరిలోను పార్వతిపైనే ప్రేమ అధికముగా ఉండెడిదని భావము.) 27

మిక్కిలి ప్రకాశముకల జ్వాలచేత దీపము ప్రకాశించునట్లును, (స్వర్గ, మర్త్య, పాతాళ లోకములను) మూడు మార్గములయందు ప్రవహించునట్టి గంగానదిచేత స్వర్గమార్గము ప్రకాశించునట్లును, వ్యాకరణాది సంస్కారము కల్గిన మాటచేత విద్వాంసుడు ప్రకాశించునట్లును, ఆ పార్వతీదేవిచేత హిమవంతుడు పవిత్రుడును, అలంకరింపబడినవాడును అయ్యెను. 28

శ్లో॥ మన్దాకినీసైకతవేదికాభి స్సా
కన్దుకైః కృత్రిమపుత్త్రికైశ్చ ।
రేమే ముహు ర్మధ్యగతా సఖీనాం
క్రీడారసం నిర్వశతీవ బాల్యే ॥ 29

## పార్వత్యాః విద్యాభ్యాసః

శ్లో॥ తాం హంసమాలా శ్శరదీవ గఙ్గాం
మహౌషధీం నక్తమివాత్మభాసః ।
స్థిరోపదేశా ముపదేశకాలే
ప్రపేదిరే ప్రాక్తనజన్మవిద్యాః ॥ 30

## నవయౌవనసమ్పన్నాయాః పార్వత్యాః అవయవవర్ణనమ్

శ్లో॥ అసంభృతం మణ్డన మఙ్గయష్టే
రనాసవాఖ్యం కరణం మదస్య ।
కామస్య పుష్పవ్యతిరిక్త మస్త్రం
బాల్యా త్పరం సా థ వయః ప్రపేదే ॥ 31

శ్లో॥ ఉన్మీలితం తూలికయేవ చిత్రం
సూర్యాంశుభి ర్భిన్న మివారవిన్దమ్ ।
బభూవ తస్యా శ్చతురశ్రశోభి
వపు ర్విభక్తం నవయౌవనేన ॥ 32



బంతియాడుచున్న పార్వతి. శ్లోకము 29

ఆ పార్వతీదేవి బాల్యమునందు ఆటలయొక్క రుచిని అనుభవించు చున్నదో అన్నట్లు చెలికత్తెలయొక్క మద్యన ఉండి ఆకాశగంగయొక్క ఇసుకతిన్నెలయందు ఏర్పరచిన అరుగులతోను (వేదికలతోను) బంతులతోను ఆటబొమ్మలతోను మాటిమాటికి ఆడుకొనుచు ఆనందించెడిది **29**

## పార్వతి విద్యాభ్యాసము

(గురువుద్వారా) స్థిరమైన ఉపదేశమును పొందిన ఆ పార్వతీదేవిని ఆమె పూర్వజన్మలో అభ్యసించిన విద్యలన్నియు ఉపదేశసమయమునందే ఆమెలోనికి ప్రవేశించినవి ఎట్లనగా శరత్కాలమునందు గంగానదిని హంసలబారులు (వరుసలు) సహజముగా చేరుకొనునట్లును రాత్రిపూట మహౌషధులను వాని కాంతులే స్వయముగా చేరునట్లును గురూపదేశకాలమున పూర్వజన్మలో నేర్చిన విద్యలు ఇప్పుడు మరల ఆమెను చేరినవి **30**

## నవయౌవనసంపన్నురాలైన పార్వతియొక్క అవయవవర్ణనము

పిమ్మట అప్రయత్న సిద్ధమైన అలంకారమైనదియును మద్యపానపు అవసరమేలేనట్టి మదమునకు (ఉల్లాసమునకు) సాధనమైనదియును మన్మదునికి పూవులకంటె వేరైన బాణమును అగు బాల్యావస్థకు తరువాతి దశయగు యౌవనదశ ఆ పార్వతీదేవియొక్క కల్లువలె సన్ననైన శరీరమునకు సంప్రాప్తించెను **31**

రంగులు వేయుకుంచెతో వన్నెపెట్టబడిన చిత్రమువలెను సూర్యకికరణములచేత వికసింపజేయబడిన పద్మమువలెను క్రొత్త వయస్సుచేత ఏర్పడిన ఆ పార్వతీదేవియొక్క శరీరము అన్నివైపులనుండి ఎక్కువ తక్కువలులేని సౌందర్యశోభకలదై ప్రకాశించెను **32**

అవతారికా : దేవతానాం రూపం పాదాఙ్గుష్ఠప్రభృతి
వర్ణ్యతే. మానవానాం కేశాదారభ్యేతి ధార్మికాః.
సమ్ప్రతి సప్తదశభిః శ్లోకైః పాదాదికేశాన్త
వర్ణన మారభతే.

శ్లో॥ అభ్యున్నతాఙ్గుష్ఠనఖప్రభాభి
ర్నిక్షేపణా ద్రాగ మివోద్గిరన్తౌ ।
ఆజహ్రతు స్తచ్చరణౌ పృథివ్యాం
స్థలారవిన్దశ్రియ మవ్యవస్థామ్ ॥ 33

శ్లో॥ సా రాజహంసై రివ సన్నతాఙ్గీ
గతేషు లీలాఞ్చితవిక్రమేషు ।
వ్యనీయత ప్రత్యుపదేశలుబ్ధై
రాదిత్సుభి ర్నూపురశిఞ్జితాని ॥ 34

అవతారిక : దేవతల రూపమును పాదముయొక్క బొటనవేలు మొదలుకొనియును, మనుష్యులయొక్క రూపమును కేశములు మొదలుకొనియును వర్ణింపబడుననియును ధార్మికు లనుచుందురు. కనుక పార్వతీదేవి దేవతకనుక ఈ శ్లోకము నుండి 17 శ్లోకములలో ఆమె యొక్క రూపమును పాదాంగుష్ఠవర్ణనముతో ప్రారంభించుచున్నాడు.

ఎత్తైన బొటనవేళ్ళయొక్క గోళ్ళకాంతులతో అడుగువేయుటవలన, గోళ్లలోని ఎరుపుదనమును వెదలగ్రక్కుచున్నవో అన్నట్లున్న ఆమె పాదములు, భూమిమీద కదులుచున్న మెట్టతామరపూవుల శోభను అపహరించినవి. (ఎట్టిని పాదములు ఉండుట దేవుతలకును, మహారాణులకును సహజగుణమని సాముద్రికశాస్త్రము చెప్పుచున్నది). 33

34. విద్యను నేర్చుకొనదలచినవారు "గురుశుశ్రూషయా విద్యా అథవా విద్యయా విద్యా" అను న్యాయము ప్రకారము విద్యద్వారా విద్యను నేర్చుకొనుటకు అవకాశ మున్నదని పెద్ద లందురు. ఈ శ్లోకమునందు 1.రాజహంసలు, 2.పార్వతి అను ఇద్దరు తమతమ వద్దనున్న విద్యను ఒకరు ఇంకొకరికి నేర్పిరి అను భావమును కాళిదాసు మనోహరముగా ప్రతిపాదించినాడు. రాజహంసలవద్ద నడక అను విద్య ఉన్నది. పార్వతి వద్ద నడుచునప్పుడు అందెలను మనోహరముగా చప్పుడు చేయించువిద్య ఉన్నది. అందువలన హంసలు తమ అందమైన నడకను పార్వతికి నేర్పి, ఆమె అడుగులలోని అందెల చప్పుడును తమ కూతల రూపమున నేర్చుకొనినవట! (పార్వతి నడక హంసనడకకాగా, హంసలకూత అందెలమోతవలె ఉన్నదని భావము.) 34

శ్లో॥ వృత్తానుపూర్వే చ న చాతిదీర్ఘే
జఙ్ఘే శుభే సృష్టవత స్తదీయే ।
శేషాఙ్గనిర్మాణవిధౌ విధాతు
ర్లావణ్య ముత్పాద్య ఇవాస యత్నః ॥ 35

శ్లో॥ నాగేన్ద్రహస్తా స్త్వచి కర్కశత్వా
దేకాన్తశైత్యా త్కదలీవిశేషాః ।
లబ్ధ్వాఽపి లోకే పరిణాహి రూపం
జాతా స్తదూర్వో రుపమానబాహ్యాః ॥ 36

శ్లో॥ ఏతావతా న న్వనుమేయశోభి
కాఞ్చీగుణస్థాన మనిన్దితాయాః ।
ఆరోపితం య ద్గిరిశేన పశ్చా
దనన్యనారీకమనీయమఙ్కమ్ ॥ 37

శ్లో॥ తస్యాః ప్రవిష్టా నతనాభిరన్ధ్రం
రరాజ తన్వీ నవరోమరాజిః ।
నీవీ మతిక్రమ్య సితేతరస్య త
న్మేఖలామధ్యమణే రివార్చిః ॥ 38

శ్లో॥ మధ్యేన సా వేదివిలగ్నమధ్యా
వలిత్రయం చారు బభార బాలా ।
ఆరోహణార్థం నవయౌవనేన
కామస్య సోపానమివ ప్రయుక్తమ్ ॥ 39

గుండ్రముగను, ఆవుతోకవలె పైన లావుగను క్రిందికిపోనుపోను సన్నగను ఉండి, మిక్కిలి పొడవుగాని, మంచి లక్షణములుకల ఆ పార్వతి యొక్క క్రీగాళ్ళను (మోకాలినుండి మడమవరకు ఉన్న కాలియొక్క భాగము) సృష్టించిన బ్రహ్మ ఆమెయొక్క తక్కిన అవయములను సృష్టించుపనియందు ఇంకను ఎక్కువకాంతిని సంపాదించుకొనుటకై అధిక ప్రయత్నమును చేయవలసివచ్చినదేమో! అన్నట్లున్నది. **35**

చర్మమునందు గరుకుదనము కలిగియుండుటవలన ఐరావతము మొదలగు దిగ్గజముల తొండములును, మిక్కిలి చల్లదనమును కలిగి యుండుటవలన అరటిబోదెలును, ఆయా ఆకారములసామ్యమును కలిగియున్నను, ఆ తొండములును, అరటి బోదెలును పార్వతియొక్క తొడలతో పోల్చుటకు తగనివి అయిపోయినవి. **36**

వివాహము పూర్తికాగానే శివుడు ఇతర స్త్రీలకు ఎవ్వరికిని దక్కని సౌందర్యముగల తన తొడపై ఈ పార్వతిని కూర్చుండబెట్టుకొనుటవలన మాత్రమే, దోషరహితురాలైన పార్వతీదేవియొక్క కాంచీస్థానము (కటి ప్రదేశము = పిరుదు) యొక్క సౌందర్యము ఊహింపదగియున్నది. **37**

పొకముడి దాటి, లోతుగాఉన్న బొడ్డు గుంటలోనికి ప్రవేశించిన, సూక్ష్మమైన ఆ పార్వతియొక్క నూతనరోమపంక్తి, నల్లనైన ఆమె వడ్డాణమునకు మధ్యనున్న ఇంద్రనీలమణియొక్క కాంతియేమో అనునట్లు ప్రకాశించెను. **38**

39. యజ్ఞవేదికయొక్క మధ్యభాగమువంటి నడుముకల (చదునైన) ఆ పార్వతీదేవి తన నడుముమీద మూడు అందమైన మడతలను కల్గియుండెను. ఆ మడతలు (వళులు) మన్మథుడు పైకి ఎక్కుటకై నవయౌవనముచేత నిర్మింపబడిన మెట్లేమో! అనిపించుచున్నవి. **39**

శ్లో॥ అన్యోన్య ముత్పీడయ దుత్పలాక్ష్యాః
స్తనద్వయం పాణ్డు తథా ప్రవృద్ధమ్ ।
మధ్యే యథా శ్యామముఖస్య తస్య
మృణాలసూత్రాన్తరమ ప్యలభ్యమ్ ॥ 40

అవ. : లోకే సుకుమారత్వమేవ కుసుమాయుధస్య
సాధకత్వ మితి స్థితే సత్యాహ.

శ్లో॥ శిరీషపుష్పాధికసౌకుమార్యౌ
బాహూ తదీయా వితి మే వితర్కః ।
పరాజితేనాపి కృతౌ హరస్య
యౌ కణ్ఠపాశౌ మకరధ్వజేన ॥ 41

శ్లో॥ కణ్ఠస్య తస్యా స్తనబన్ధురస్య
ముక్తాకలాపస్య చ నిస్తలస్య ।
అన్యోన్యశోభాజననా ద్బభూవ
సాధారణో భూషణభూష్యభావః ॥ 42

శ్లో॥ చన్ద్రం గతా పద్మగుణా న్న భుఙ్క్తే
పద్మాశ్రితా చాన్ద్రమసీ మభిఖ్యామ్ ।
ఉమాముఖన్తు ప్రతిపద్య లోలా
ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః ॥ 43

నల్లకలువలవంటి అందమైన కనులుగల ఆ పార్వతీదేవియొక్క నల్లని అగ్రభాగముకలదియును, మధ్యభాగమునందు తామర తూడునుండి తీసిన, సన్నని తీగె కూడ ఎక్కుటకు (పట్టుటకు) ఖాళీ లేనంతగా పెరిగినదియును అగు ఆమె స్తనద్వయము ఒండొంటితో వక్షఃస్థలముపై ఒరిసికొని నిండియున్నది. **40**

అవతారిక : లోకమునందు కుసుమాస్త్రునకు సుకుమారత్వమే కార్యసిద్ధికర మనుటకై దీనిని చెప్పుచున్నాడు.

దిరిసెనపువ్వులకంటె మిక్కిలి సుకుమారములైన ఆ పార్వతియొక్క కోమలములైన చేతులు, శివునిచేత ఓడింపబడిన మన్మథుని చేత శివునకు కంఠపాశములుగా తగిలింపబడినవేమో అని నే ననుకొను చున్నాను. **41**

స్తనములచేత ఆకర్షణీయముగానున్న పార్వతియొక్క కంఠమునకును, గుండ్రముగానున్న ముత్యములహారమునకును, (భూషణ=అలంకారము) ముత్యములహారము, భూష్య=అలంకరింపబడిన మెడ అను ఈ రెండింటికి సౌందర్యమును పెంపొందించుకొనుటవలన పరస్పరము అనన్యమైన శోభకల్గినది. **42**

చంచలురాలైన లక్ష్మీదేవి (కాంతి అభిమానదేవత) ముందుగా చంద్రుని చేరినది. కాని అచ్చట పద్మపులక్షణమైన పరిమళము, మధువు లేకుండుటచే వానిని అనుభవింపలేకపోయినది. ఆ తరువాత ఆ కాంతి అభిమానదేవతయే పరిమళాది గుణములను కోరి, పద్మమును ఆశ్రయించినది. కాని ఆ పద్మమునందు ఆమెకు చంద్రునియందలి ఆనందరూపమైన శైత్యశోభ లభింపలేదు. కనుక పద్మమువద్ద కూడా పరిపూర్ణమైన ఆనందమును అనుభవింపలేకపోయినది. ఇంకను తనకు



శ్లో॥ పుష్పం ప్రవాళోపహితం యది స్యా
న్ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థమ్ ।
తతో ఽనుకుర్యా ద్విశదస్య తస్యా
స్తామ్రౌష్ఠపర్యస్తరుచ స్స్మితస్య ॥ 44

శ్లో॥ స్వరేణ తస్యా మమృతస్రుతేన
ప్రజల్పితాయా మభిజాతవాచి ।
అప్యన్యపుష్టా ప్రతికూలశబ్దా
శ్రోతు ర్వితన్త్రీరివ తాడ్యమానా ॥ 45

శ్లో॥ ప్రవాతనీలోత్పలనిర్విశేష
మధీరవిప్రేక్షిత మాయతాక్ష్యా ।
తయా గృహీతం ను మృగాఙ్గనాభ్య
స్తతో గృహీతం ను మృగాఙ్గనాభిః ॥ 46

ఆశ్రయమిచ్చువాడు ఎవరా? అని ఆలోచించుచు, చిట్టచివరకు ఉమాదేవి యొక్క ముఖమును ఆశ్రయించి స్థిరపడినది. ఏలయనగా ఆ పార్వతి పద్మినీజాతి స్త్రీ అగుటవలన పద్మలక్షణములును, పరమేశ్వరుని చేపట్టబోవునుగాన ఉత్తమలగు రాణులకు ఉండు శోభను, చంద్రునకుండు శీతలత్వ కాంతిమత్వ గుణములను పొంది, పార్వతి ముఖములో ఉండి, చంద్రుని పద్మమును కూడా ఆశ్రయించిన సంతోషమును పొందినది. )43

ఎఱ్ఱని క్రిందిపెదవిపై, ప్రకాశించు ఆ పార్వతీదేవియొక్క తెల్లని చిరునవ్వు ఎఱ్ఱని చిగురాకుపై తెల్లని పుష్పమును ఉంచినప్పటి శోభను, ఎఱ్ఱని పగడముపై తెల్లని ముత్యము నుంచినప్పటి శోభను, అనుకరించుచు అందముగా కనిపించుచున్నది. 44

మధురభాషిణి అగు ఆ పార్వతీదేవి అమృతమొలుకు కంఠస్వరముతో పలుకునపుడు (ఆ స్వరమాదుర్యమునకుముందు) కోకిలస్వరము కూడ విషమముగా (ఎగుడు దిగుడుగా) కట్టిన వీణతీగెలను మీటినప్పుడు వచ్చు కఠోరధ్వనివలె వినిపించును. (పార్వతి కంఠస్వరము కోకిల కంఠస్వరము కంటె మిక్కిలి మృదుమధురముగా ఉన్నదని భావన.) 45

మిక్కిలి గాలి వీచు ప్రదేశమునందు కదలియాడు నల్లకలువల వలె ఇటునటు చలించు పార్వతీదేవియొక్క చూపులను చూచువారు "ఈ విశాలనేత్రయగు పార్వతీదేవికి గల చంచలదృష్టి ఆడులేళ్ళదగ్గరనుండి ఈమె అయినను నేర్చుకొని ఉండవచ్చును, లేదా ఈమె నుండి ఆ లేళ్ళయినను నేర్చుకొని ఉండవచ్చును" అని ఊహించెడివారు. (పార్వతి చూపులు విలాసవంతములైన చూపులు, బెదరుచు, లేడి చూపులవలె అందముగా ఉన్నవని భావము.) 46

శ్లో॥ తస్యా శ్శలాకాఞ్జననిర్మితేవ
కాన్తి ర్భ్రువో రాయతలేఖయో ర్యా ।
తాం వీక్ష్య లీలాచతురా మనఙ్గః
స్వచాపసౌన్దర్యమదం ముమోచ ॥ 47

శ్లో॥ లజ్జా తిరశ్చాం యది చేతసి స్యా
దసంశయం పర్వతరాజపుత్ర్యాః ।
తం కేశపాశం ప్రసమీక్ష్య కుర్యు
ర్వాలప్రియత్వం శిథిలం చమర్యః ॥ 48

శ్లో॥ సర్వోపమాద్రవ్యసముచ్చయేన
యథాప్రదేశం వినివేశితేన ।
సా నిర్మితా విశ్వసృజా ప్రయత్నా
దేకస్థసౌన్దర్యదిదృక్షయేవ ॥ 49

## నారదాగమనమ్

శ్లో॥ తాం నారదః కామచరః కదాచి
త్కన్యాం కిల ప్రేక్ష్య పితు స్సమీపే ।
సమాదిదే శైకవధూం భవిత్రీం
ప్రేమ్ణా శరీరార్ధహరాం హరస్య ॥ 50

కాటుకపుల్లతో గీయబడినవో అనునట్లు నల్లగా, పొడుగుగా ఉన్న, ఆ పార్వతీదేవియొక్క కనుబొమ్మలయందలి విలాసమును సౌందర్యమును చూచి, మన్మథుడు తన వింటియందలి సౌందర్యమును చూచుకొని, ఇంతకుపూర్వము ప్రదర్శించిన గర్వమును నేడు వదలుకొనినాడు. 47

పశుపక్ష్యాదులకు కూడ సిగ్గుతెలియుట నిజమైనచో, అప్పుడు చమరీ మృగములు పార్వతీదేవియొక్క కేశపాశమును చూచి, తమ తోకకుచ్చుల మీది ప్రేమను విడిచిపెట్టి తీరును. (ఆమె కేశపాశము, చమరీమృగముల తోకకుచ్చులకంటె అందముగా, దట్టముగా ఉండుటవలన అవి సిగ్గుపడి, తమ దురభిమానమును విడిచిపెట్టినవని భావము.) 48

పార్వతి సౌందర్యమునుగూర్చి అధికముగా చెప్పనేల? ఒక్క మాటలో చెప్పవలెనన్నచో లోకములో నున్న సర్వసౌందర్యమును కలబోసి (కుప్పపోసి) ఒకేచోట చూడదలచుకొనిన బ్రహ్మ, ప్రయత్నపూర్వకముగా అందమును పోల్చి చెప్పుటకు కావలసిన, ఉపమావాచకముల నన్నింటిని ఆయా అవయవములలో పొందుపరచి చూచుచు, పార్వతిని లోకోత్తర సౌందర్యవతిగా సృష్టించినాడేమో! అన్నట్లున్నది! 49

## నారదుని ఆగమనము

ఒకనాడు కామగమనశక్తికల, నారదుడు తండ్రి వద్దనున్న, కన్య అగు పార్వతీదేవిని చూచి, ప్రేమపూర్వకముగా "మీ అమ్మాయి పరమేశ్వరుని శరీరములో సగభాగమును సంపాదించుననియును, సవతులు లేని కాపురము చేయుననియు", హిమవంతునకు చెప్పెను. 50

శ్లో॥ గురుః ప్రగల్భేఽపి వయ స్యతో ఽస్యా
స్తస్థౌ నివృత్తాన్యవరాభిలాషః ।
ఋతే కృశానో ర్న హి మన్త్రపూత
మర్హన్తి తేజాం స్యపరాణి హవ్యమ్ ॥ 51

అవ. తర్హి త మేవాహూయ దీయతా మిత్యాశ ఙ్క్యాహ ।

శ్లో॥ అయాచితారం న హి దేవ మద్రి
స్సుతాం ప్రతిగ్రాహయితుం శశాక ।
అభ్యర్థనాభఙ్గభయేన సాధు
ర్మాధ్యస్థ్య మిష్టేఽప్యవలమ్బతే ఽర్థే ॥ 52

## శివస్య వైరాగ్యమ్ - తపశ్చ

అవ. నచ తథైవ స్థితః కిం తూపాయాన్తరం చి
న్తితవా నితి వక్తుం ప్రస్తౌతి.



నారదుని రాక. శ్లోకము 50

పార్వతియొక్క తండ్రియగు హిమవంతుడు పై శ్లోకములయందు నారదుడు చెప్పిన మాటను నమ్మినవాడై, ఆమెకు పరిపూర్ణ యౌవనదశ వచ్చినను తదితర వరులను వెదుకుటయందు చేయవలసిన ప్రయత్నమును విరమించెను. ఏలయనగా మంత్రములచేత పవిత్రమైన ఆహుతిని స్వీకరించుటకు, అగ్నిహోత్రుడు తప్ప, తదితరతేజోవంతములైన సువర్ణము మొదలగు పదార్థములు అర్హములు కావు కదా! (పార్వతి పవిత్రమైన ఆహుతి కాగా, ఆమెను స్వీకరించు అర్హత అగ్ని స్వరూపుడగు పరమేశ్వరునకే గాని, ఇతరుల కెవ్వరికిని లేదని దీని భావము.) **51**

**అవతారిక :** అయినచో ఆ పరమేశ్వరునే పిలిచి, పిల్లను స్వీకరింపుమని అడుగవచ్చును కదా! అను భావమునకు సమాధాన మీ శ్లోకమునం దీయబడినది.

తన కుమార్తెను స్వీకరింపుమని శివుని ప్రార్థించుటకు హిమవంతుడు తన అభ్యర్థనభంగమైపోవునేమో అను భయముతో తన కుమార్తెయగు పార్వతిని మహేశ్వరునకు ఇవ్వలేకపోయెను. అది యుక్తమే కదా. సాధు వగువాడు, తన కిష్టమైన కార్యమునందు కూడ, అది నెరవేరదేమో అను అనుమానము కలిగినపుడు, మధ్యస్థుడై (తటస్థుడై, ఉదాసీనుడై) ఉండిపోవును కదా! **52**

## శివుని వైరాగ్యము - తపస్సు

**అవతారిక :** హిమవంతుడు అట్లు కేవల ముదాసీనుడై ఉండిపోలేదు. తన కుమార్తె వివాహమునకు ఉపాయాంతరమును ఆలోచించినా డని చెప్పుటకీ క్రింది శ్లోకమును ప్రారంభించుచున్నాడు.

శ్లో॥ యద్దైవ పూర్వే జననే శరీరం సా
దక్షరోషా త్సుదతీ ససర్జ ।
తదాప్రభృ త్యేవ విముక్తసజ్గః
పతిః పశూనా మరిపగ్రహో ఽభూత్ ॥ 53

శ్లో॥ స కృత్తివాసా స్తపసే యతాత్మా
గజ్గాప్రవాహోక్షిత దేవదారు ।
ప్రస్థం హిమాద్రే ర్మృగనాభిగన్ధి
కిఞ్చిత్క్వణత్కి న్నర మధ్యువాస ॥ 54

శ్లో॥ గణా నమేరుప్రసవావతంసా
భూర్జత్వచః స్పర్శవతీ ర్దధానాః ।
మనశ్శిలావిచ్ఛురితా నిషేదు
శ్శైలేయనద్ధేషు శిలాతలేషు ॥ 55

శ్లో॥ తుషారసఙ్ఘాతశిలాః ఖురాగ్రై
స్సముల్లిఖ౯ దర్పకలః కకుద్మా౯ ।
దృష్టః కథఞ్చి ద్గవయై ర్వివిగ్నై
రసోఢసింహధ్వని రున్ననాద ॥ 56

సుదతి (మంచి పల్వరుసకలది) యగు ఆ పార్వతి పూర్వజన్మమునందు దక్షప్రజాపతికి కూతురుగా ఉన్నప్పుడు ఆ దక్షుని కోపమువలన అవమానింపబడినదై, దుఃఖావేశముతో తన శరీరమునుండి ఉద్భవించిన యోగాగ్నియందు ఎప్పుడు తన దేహమును పరిత్యజించెనో, అప్పటి నుండియే, పశుపతి యగు శివుడు లౌకికసంగములను విడిచి, మఱియొక భార్యను స్వీకరింపకుండెను. **53**

కృత్తివాసుడగు (గజచర్మధారియగు) ఆ శివుడు జితేంద్రియుడై, తపస్సును చేసికొనుటకై, గంగాప్రవాహముచే తడుపబడుచుండు దేవదారు వృక్షములు కలదియును, కస్తూరిపరిమళములు కలదియును, కొన్ని చోట్ల కిన్నెరల గానము కలదియును అగు ఒక్క హిమవత్పర్వతపు చరియయందు కూర్చుండెను. **54**

నమేరు (సురపొన్న) పుష్పములను తలపై ధరించి, మెత్తని భూర్జవృక్షపు పట్టలనే పట్టువస్త్రములుగా ధరించి, మనశ్శిలలు అను ధాతువిశేషముల నుండి (రంగురాళ్ళనుండి) వచ్చిన రంగును శరీరమం దంతయు పూసికొని, పర్వతశిలలనుండి పుట్టు శైలేయము (శిలాజిత్తు) యొక్క గంధముతో పరిమళించు పెద్ద పెద్ద శిలలపై శివుని పరివారమగు ప్రమథగణములు కూర్చొనియుండిరి. **55**

మంచు గడ్డకట్టి, మంచురాయిగా మారగా, ఆ మంచురాళ్ళను, తన డెక్కల ముందుభాగములతో చిమ్ముచు (దీనిని గోరాడుట అందురు. మదించిన వృషభములు, ఏనుగులు ఈ ఆటనాడునని వ్యాఖ్యానకారు లందురు. దీనినే కాళిదాసు మేఘసందేశములో 'వప్రక్రీడ' అనినాడు.) అరణ్యమునందు సంచరించు, గోవువంటి ఆకారముకల గవయ మృగములచే భయముతో అతి కష్టముమీద చూడబడుచు, ఆ వనము

శ్లో॥ తత్రాగ్ని మాధాయ సమిత్సమిద్ధం
స్వ మేవ మూర్త్యన్తర మష్టమూర్తిః ।
స్వయం విధాతా తపసః ఫలానాం
కేనాపి కామేన తప శ్చచార ॥ 57

## పార్వత్యాః పరిచర్యా

శ్లో॥ అనర్ఘ్య మర్ఘ్యేణ త మద్రినాథః
స్వర్గౌకసా మర్చిత మర్చయిత్వా ।
ఆరాధనా యాస్య సఖీసమేతాం
సమాదిదేశ ప్రయతాం తనూజామ్ ॥ 58

నందలి సింహముల గర్జనలను సహింపలేక, మదమువలన అవ్యక్త మధురమైన ధ్వనితో పరమేశ్వరుని వాహనమగు వృషభము (నంది) బిగ్గరగా అంకె వేసేను. 56

తపస్సుచేసినవారి తపమునకు ఫలములగు ఇంద్రత్వము మొదలగు దివ్యపదములను స్వయముగ తానే ఇవ్వగలిగినట్టి అష్టమూర్తి, (పంచ భూతములు+సూర్యచంద్రులు+యజ్ఞముచేయు సోమయాజి అను 8 మూర్తులు కలవాడు) యగు పరమేశ్వరుడు ఆ హిమపర్వతపు చరియ యం దుండి సమిధిలతో బాగుగా ప్రజ్వరిల్లుచున్న, తన మూర్తులలో ఒకటియగు అగ్నిని ప్రతిష్ఠించి, ఏదో ఒక కోర్కెను నెరవేర్చుకొనుటకై తపస్సును చేయనారంభించెను. ("ప్రయోజనము నుద్దేశింపకుండ మందుడు కూడ ఏ పనిని ప్రారంభింపడు" అను వాక్యమునుబట్టియు, ఈశ్వరుడు సదా సఫలమనోరథుడై నిరీహు డగుటవలనను, "ఏదో ఒక కామముతో" అని కాళిదాసు విషయమును స్పష్టపరిచినాడు.) 57

## పార్వతిపరిచర్య

నగాధిరాజైన హిమవంతుడు, వెలకట్టరానంత విలువకల, (మహామహిముడైన, దేవతలచే అర్చింపబడు, ఆ పరమేశ్వరుని (సమీపించి), అర్ఘ్యపాద్యాది జలోపచారములతో అర్చించి, (జయ విజయులను) చెలికత్తెలతో కూడిన, నియమవంతురాలైన, తన కుమార్తెయగు పార్వతీదేవిని, ఆ ఈశ్వరు నారాధించుటకై నియమించెను. 58

శ్లో॥ ప్రత్యర్థిభూతా మపి తాం సమాధేః
శుశ్రూషమాణాం గిరిశో ఽనుమేనే ।
వికారహేతౌ సతి విక్రియన్తే
యేషాం న చేతాంసి త ఏవ ధీరాః ॥ 59

అవ. శుశ్రూషాప్రకార మే వాహ.

శ్లో॥ అవచితబలిపుష్పా వేదిసమ్మార్గదక్షా
నియమవిధి జలానాం బర్హిషాం చోపనేత్రీ ।
గిరిశ ముపచచార ప్రత్యహం సా సుకేశీ
నియమితపరిఖేదా తచ్ఛిరశ్చన్ద్రపాదైః ॥ 60

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"ఉమోత్పత్తిర్నామ" ప్రథమః సర్గః

-o0o-

తన తపఃసమాధికి ప్రతిపక్షురాలైనను (అననుకూలురా లైనను) తాను చెప్పినట్లుగా సేవింపగోరుచున్న ఆ పార్వతిని తనకు సేవ చేయుటకై శివుడు అనుమతించెను. ఏలయనగా మనస్సు చలించుటకు (వికారము కలుగుటకు) కారణ మున్నను ఎవరి మనస్సులు వికారమును పొందవో (చలింపవో) వారే ధీరులు అగుదురు కదా! (పరమేశ్వరుని మనః స్థైర్యము ఈ శ్లోకమునందు ప్రశంసింపబడినది.) 59

**అవతారిక :** పార్వతి పరమేశ్వరున కెట్లు శుశ్రూష చేసినదో ఈ శ్లోకము వివరించుచున్నది.

అందమైన కేశపాశములుగల ఆ పార్వతీదేవి, 1. దేవపూజకై పుష్పములను కోసి తెచ్చుచును, 2. పూజావేదికను ఊడ్చుటలో తన నేర్పును ప్రదర్శించుచును, 3. నిత్యకర్మానుష్ఠానమునకై జలమును, దర్భలను సమకూర్చుచును, 4. తనకు శివసేవవలన కలిగిన శ్రమమును ఆ శివుని తలపైనున్న చంద్రకిరణములచేత తొలగించుకొనుచును ప్రతిదినము ఆ గిరీశుని (శివుని) సేవించెను. 60

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "ఉమోత్పత్తి" అను పేరుగల మొదటి సర్గమునకు
"ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన
బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ
వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-

# కుమారసమ్భవమ్

## "బ్రహ్మాసాక్షాత్కారో" నామ ద్వితీయః సర్గః

### తారక విప్రకృతైః దేవైః కృతా బ్రహ్మాస్తుతిః

శ్లో॥ తస్మిన్ విప్రకృతాః కాలే
తారకేణ దివౌకసః ।
తురాసాహం పురోధాయ ధామ
స్వాయమ్భువం యయుః ॥ 1

శ్లో॥ తేషా మావిరభూ ద్బ్రహ్మా
పరిమ్లానముఖశ్రియామ్ ।
సరసాం సుప్తపద్మానాం
ప్రాత ర్దీధితిమా నివ ॥ 2

శ్లో॥ అథ సర్వస్య ధాతారం తే
సర్వే సర్వతోముఖమ్ ।
వాగీశం వాగ్భి రర్థ్యాభిః
ప్రణిప త్యోపతస్థిరే ॥ 3

# కుమారసంభవము

## "బ్రహ్మాసాక్షాత్కారము" అను రెండవసర్గము

### తారకునకు భయపడిన దేవతలు బ్రహ్మను స్తుతించుట

పార్వతీదేవి ఈశ్వరుని సేవించు ఆ కాలమునందే శత్రువుల వేగమును సహింపగలిగిన, లేక శత్రువుల వేగమును త్వరగా అవమానించువాడైన, (వజ్రణఖుడనువాని పుత్రుడైన) తారకాసురునిచేత బాధింపబడిన దేవతలు, దేవేంద్రుని (నాయకునిగా) ముందుంచుకొని, బ్రహ్మయొక్క నివాసమగు సత్యలోకమునకు వెళ్ళిరి. (ఇందలి శ్లోకములు అనుష్టుప్ ఛందస్సులో కూర్పబడినవి.) 1

చిన్నబోయిన ముఖములతోఉన్న ఆ దేవతల ఎదుట, ముకుళించిన పద్మములున్న చెఱువులకు ఉదయకాలపు సూర్యుడో అనున్నట్లుగా, బ్రహ్మదేవుడు సాక్షాత్కరించెను. 2

అట్లు సాక్షాత్కరింపగనే ఆ దేవత లందరు వాక్కులకు యజమానియును, సమస్తలోకములను నిర్మించినవాడును, అగు ఆ బ్రహ్మకు నమస్కరించి, సార్థకములైన మాటలతో స్తుతించిరి. 3

అవతారికా : ద్వాదశిభిః శ్లోకైః స్తువన్తి ।

శ్లో॥ నమ స్త్రిమూర్తయే తుభ్యం
ప్రాక్సృష్టేః కేవలాత్మనే ।
గుణత్రయవిభాగాయ
పశ్చా ద్భేద ముపేయుషే ॥ 4

శ్లో॥ య దమోఘ మపా మన్త
రుప్తం బీజ మజ త్వయా ।
అత శ్చరాచరం విశ్వం
ప్రభవ స్తస్య గీయసే ॥ 5

శ్లో॥ తిసృభి స్త్వ మవస్థాభి
ర్మహిమాన ముదీరయన్ ।
ప్రళయస్థితిసర్గాణా
మేకః కారణతాం గతః ॥ 6

అవతారికా : భూతసృష్టికర్తృత్వ ముక్త్వా మిథునసృష్ట్యర్థం
మూర్తిమతో బ్రహ్మణో భేద మాహ ।

శ్లో॥ స్త్రీ పుంసా వాత్మభాగౌ తే
భిన్న మూర్తే స్సిసృక్షయా ।
ప్రసూతిభాజ స్సర్గస్య
తావేవ పితరౌ స్మృతౌ ॥ 7

అవతారిక : ఇచ్చటినుండి 12 శ్లోకములలో ఆ బ్రహ్మను స్తుతించుచున్నారు.

ఓ భగవంతుడా! నీవు సృష్టికంటె పూర్వము కేవలుడవు. (ఒకే మార్గము కలవాడవు. ఆ తరువాత, సృష్టి చేయు సమయమునందు) సత్వరజస్తమో గుణములు అను మూడు గుణభేదములకు మూలకారణుడవై, సృష్టి, స్థితి, లయములు అను ఉపాధిభేదములను పొందినావు. కనుకనే త్రిమూర్తివి=బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడవు అయితివి. అట్టి నీకు నమస్కారము. 4

ఓ అజుడా! (పుట్టుక లేనివాడా!) జలమధ్యమున నీవు ఏ అమోఘమైన (సార్ధకమైన) బీజమును నిక్షేపించితివో, ఆ బీజమునుండియే జంగమస్థావరాత్మకమైన ప్రపంచమంతయు ఉద్భవించినది. కనుక ఆ విశ్వమునకు మూలకారణమైనవాడుగా నీవు కీర్తింపబడుచున్నావు. 5

సృష్టికి పూర్వము నీవొక్కడవే అయినను, నీవు సత్వరజస్తమోగుణ స్వరూపులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు అను అవస్థలచే నీ మహిమను ప్రదర్శించుచు, సృష్టి, స్థితి, సంహారములకు మూలకారణుడవని ప్రశంసింపబడుచున్నావు. 6

**అవతారిక:** భూతసృష్టికర్తృత్వమును ప్రస్తావించి, మిథునసృష్టికొఱకై బ్రహ్మమూర్తియొక్క స్త్రీ పురుష విభాగమును ఇక దేవతలు చెప్పబోవుచున్నారు.

7. (జీవసృష్టికై) స్త్రీ పురుషులను సృష్టించు కోరికతో ఒక్కడవే అయ్యును స్త్రీ, పురుషులను రెండు భిన్నరూపములను ధరించితివి. ఆ రూపములే ఈ సృష్టికి జననీజనకులైనవి. అవి వేద, శాస్త్రాదుల్లో [illegible]నవి. 7



శ్లో॥ స్వకాలపరిమాణేన
వ్యక్త రాత్రిన్దివస్య తే ।
యౌతు స్వప్నావబోధౌ తౌ
భూతానాం ప్రలయోదయౌ ॥ 8

శ్లో॥ జగద్యోని రయోని స్త్వం
జగదన్తో నిరన్తకః ।
జగదాది రనాది స్త్వం
జగదీశో నిరీశ్వరః ॥ 9

అవ. : తవతు న ప్రపఞ్చస్యేవ జన్మతిరోధానజ్ఞానేషు పరాపేక్షే త్యాహ॥

శ్లో॥ ఆత్మాన మాత్మానా వేత్సి
సృజ స్యాత్మాన మాత్మనా ।
ఆత్మనా కృతినా చ త్వ
మాత్మన్యేవ ప్రలీయసే ॥ 10

శ్లో॥ ద్రవ స్సఙ్ఘాతకఠినః స్థూల
స్సూక్ష్మో లఘు ర్గురుః ।
వ్యక్తో వ్యక్తేతర శ్చాసి
ప్రాకామ్యం తే విభూతిషు ॥ 11

"చతుర్యుగసహస్రాణి బ్రహ్మణో దిన ముచ్యతే" అను గీతావాక్యము ప్రకారము బ్రహ్మయొక్క పగలు, రాత్రుల ప్రమాణము మన కాలమానము కంటె భిన్నమైనది. చాల పెద్దకాలము. కనుక నీ కాలపరిమాణపు లెక్కతో నీకు రాత్రియును పగలును విడివిడిగా ఏర్పడుచున్నవి. నీకు రాత్రియగుటయే నీ దృష్టిలో జగత్ప్రళయకాల మగుచున్నది. నీ పగలే జగత్తునకు పునః సృష్టికాల మగుచున్నది. **8**

ఓ భగవంతుడా! నీ వీ విశ్వమున కంతటికిని కారణుడవు. కాని స్వయముగా నీవు కారణములేనివాడవు. నీ వీ విశ్వమును సంహరించువాడవు. కాని నీవు స్వయముగా అంతరహితుడవు. నీ వీ జగత్తు కంతటికి ఆదివి. కాని నీవు స్వయముగా అనాదివి. నీ వీ విశ్వమున కంతటికి ప్రభువువు. కాని స్వయముగా నీ కెవరును ప్రభువులు, శాసకులు లేని వానివి. **9**

అవతారిక: ప్రపంచముయొక్క సృష్ట్యంతముల, జ్ఞానమును తెలిసికొనుటకు ఇతరుల వలె పరాపేక్ష నీకు లేదు అను విషయమును ప్రస్తావించు చున్నారు.

ఓ దేవా! (లోకానుగ్రహార్థము బ్రహ్మరూపమును ధరించి, లోకసృష్టి చేయు) నీ స్వరూపమును నీవు (నీ స్వశక్తిచేతనే) తెలిసికొనుచున్నావు. నిన్ను నీవు (అధిష్ఠానరూపమగు) నీ యందే సృష్టించుకొనుచున్నావు. సర్వ సమర్థుడవగు నీవు (నీ శక్తిచే) నీ యందే లీనమై పోవుచున్నావు. **10**

దేవా! నీవు నదులు, సముద్రాదులవలె రసస్వరూపుడవు. అణువులు మిక్కిలి దగ్గరగా పేర్కొనుట వలన ఏర్పడిన పర్వతముల వలె కఠినుడవు. ఇంద్రియగ్రహణయోగ్యములైన ఘటాదులవలె స్థూల స్వరూపుడవు. అతీంద్రియములైన పరమాణువుల వలె సూక్ష్మస్వరూపుడవు. ఉత్పాదన యోగ్యమైన దూది వలె లఘుస్వరూపుడవు. బంగరు కొండయగు

శ్లో॥ ఉద్ఘాతః ప్రణవో యాసాం
న్యాయై స్త్రిభి రుదీరణమ్ ।
కర్మయజ్ఞః ఫలం స్వర్గ
స్తాసాం త్వం ప్రభవో గిరామ్ ॥ 12

అవ. : సాంఖ్యమతేన స్తువన్తి.

శ్లో॥ త్వా మామనన్తి ప్రకృతిం
పురుషార్థ ప్రవర్తినీమ్ ।
తద్దర్శిన ముదాసీనం త్వా
మేవ పురుషం విదుః ॥ 13

శ్లో॥ త్వం పితౄణా మపి పితా
దేవానా మపి దేవతా ।
పరతోఽపి పరశ్చాసి
విధాతా వేధసా మపి ॥ 14

శ్లో॥ త్వ మేవ హవ్యం హోతా చ
భోజ్యం భోక్తాచ శాశ్వతః ।
వేద్యం చ వేదితా చాసి ధ్యాతా
ధ్యేయం చ యత్పరమ్ ॥ 15

మేరువువలె అబలుడవైన గురు (బరువైన) స్వరూపుడవు. కార్యరూపమున నుండు వ్యక్తి స్వరూపుడవు. కారణరూపముననుండు వ్యక్తేతర (కనబడని) స్వరూపుడవు. అణిమాద్యష్టసిద్ధిస్వరూపమున నీవు యథేచ్ఛముగా ఉండుటకు నీకు శక్తియున్నది. **11**

ఏ వేదమునకు మొదట ఓంకార ముందునో, ఉచ్చారణము ఉదాత్తానుదాత్త, స్వరితములో, యజ్ఞమే పనియో, స్వర్గమే ఫలమో, అట్టి వేదములకే నీవు కారణమవు. (స్వర్గమోక్షాది ఉత్తమ ఫలమునిచ్చు వేదములకే నీవు మూలకారణుడవని భావము.). **12**

అవతారిక: సాంఖ్యమతమురీత్యా స్తోత్రము చేయుచున్నారు.

దేవా! నిన్ను ఆత్మయొక్క ఇహపరప్రయోజనమునకై ప్రవర్తించునట్టి మూలకారణముగా చెప్పుచున్నారు. నిన్నే ఆ ప్రకృతిని చూచుచున్న నిర్వికారుడగు పురుషునిగా తెలిసికొందురు. **13**

నీవు అగ్నిష్వాత్తాది పితృదేవతలకు కూడ తండ్రివి. (పితృదేవతలకు కూడ తర్పణము నీయదగిన వాడవని భావము.) ఇంద్రుడు మొదలగు దేవతలు కూడ నిన్ను ఉద్దేశించి, యజ్ఞము చేయవలసిన దేవుడవు. పరమునకంటె పరముడవైన సర్వోత్తరుడవు. దక్షుడు మొదలగు ప్రజాపతులకు కూడ విధాతవు. (స్రష్టవు) **14**

15. శాశ్వతుడైన నీవే హవ్యమవు. (నేయి మొదలగు హోమద్రవ్యమవు.) హోతవు. (యజ్ఞము చేయువాడవు.) భోజ్య మగు ఆహారమవు. భుజించువాడవును నీవే. వేద్యం = (తెలిసికొనబడదగినవాడవు.) వేదితా. (తెలిసికొనువాడవు) అయి ఉన్నావు. ఏది ముఖ్యముగా

శ్లో॥ ఇతి తేభ్య స్తుతీ శ్ర్శుత్వా
యథార్థా హృదయఙ్గమాః ।
ప్రసాదాభిముఖో వేధాః
ప్రత్యువాచ దివౌకసః ॥ 16

శ్లో॥ పురాణస్య కవే స్తస్య
చతుర్ముఖసమీరితా ।
ప్రవృత్తి రాసీ చ్ఛబ్దానాం
చరితార్థా చతుష్టయీ ॥ 17

శ్లో॥ స్వాగతం స్వా నధీకారా౯
ప్రభావై రవలంబ్య వః ।
యుగప ద్యుగబాహుభ్యః
ప్రాప్తేభ్యః ప్రాజ్యవిక్రమాః ॥ 18

దేవానాం దుఃఖకారణం బ్రహ్మా పృచ్ఛతి

శ్లో॥ కి మిదం ద్యుతి మాత్మీయాం
న బిభ్రతి యథా పురా ।
హిమక్లిష్టప్రకాశాని
జ్యోతీంషీవ ముఖాని వః ॥ 19

ధ్యానింపబడదగినదో, ధ్యాత (ఎవడు ధ్యానముచేయువాడో) అతడు కూడ నీవే అయిఉన్నావు. 15

ఆ దేవతలు చేసిన, యథార్థములు కనుకనే హృదయంగమములైన, స్తోత్రములను బ్రహ్మదేవుడు విని, వారి ననుగ్రహింపదలిచి దేవతల కిట్లు ప్రత్యుత్తరము నిచ్చెను. 16

ద్రవ్య, గుణ, క్రియా, జాతిభేదముచే నాల్గు అవయవములుకల శబ్దవ్యాపారము పురాణకవియగు ఆ బ్రహ్మయొక్క నాల్గు ముఖముల నుండి పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అను నాల్గు విధములుగా వెలువడి, శబ్దప్రవృత్తి సార్థకమైనది. 17

సుప్రసిద్ధపరాక్రమముకల ఓ దేవతలారా! మీ ప్రభావ సామర్థ్యముల చేత మీ మీ అధికారములను పొంది, ఆజానుబాహులై, వచ్చిన మీ కందరకు స్వాగతము. 18

## దేవతల దుఃఖమునకు కారణమును బ్రహ్మ అడుగుట

నాయనలారా! మంచుచే కాంతిహీనములైన నక్షత్రముల వలె మీ ముఖములు పూర్వమువలె తమ కాంతిని ప్రసరింపజేయకున్నవి. ఇది ఏమి ? మీ దుఃఖమునకు కారణ మేమి? 19

శ్లో॥ ప్రశమా దర్చిషా మేత
దనుద్గీర్ణ సురాయుధమ్ ।
వృత్రస్య హన్తుః కులిశం
కుణ్ఠితా శ్రీవ లక్ష్యతే ॥ 20

శ్లో॥ కిం చాయ మరిదుర్వారః
పాణౌ పాశః ప్రచేతసః ।
మన్త్రేణ హతవీర్యస్య
ఫణినో దైన్య మాశ్రితః ॥ 21

శ్లో॥ కుబేరస్య మనశ్శల్యం
శంసతీవ పరాభవమ్ ।
అపవిద్ధగదో బాహు
ర్భగ్నశాఖ ఇవ ద్రుమః ॥ 22

శ్లో॥ యమోఽపి విలిఖన్ భూమిం
దండే నాస్తమితత్విషా ।
కురుతేఽస్మి న్నమోఘేఽపి
నిర్వాణాలాతలాఘవమ్ ॥ 23

శ్లో॥ అమీ చ కథ మాదిత్యాః
ప్రతాపక్షతిశీతలాః ।
చిత్రన్యస్తా ఇవ గతాః
ప్రకామాలోకనీయతామ్ ॥ 24

తనయందలి తేజస్సు అణగారిపోవుటవలన వృత్రహంతయగు ఇంద్రుని చేతిలో, ఇంద్రధనుస్సు వలె వెలుగొందు ఈ వజ్రాయుధము నే దేలనో కుంఠితశ్రీ (మొక్క వోయినది) గా కనబడుచున్నది. 20

మరియు అరిదుర్వారమైన (శత్రువులకు వారింపరాని), వరుణుని చేతిలోనుండు 'పాశము' అను ఆయుధవిశేషము నే దేలనో గరుడమంత్రముచే కట్టబడిన నాగరాజుయొక్క పరాక్రమపు దైన్యము నొందియున్నది. 21

గదను విడిచిపెట్టుటవలన, కొమ్మ విరిగిన చెట్టు వలె ఉన్న, కుబేరుని యొక్క భుజము, ఆతని మనఃశల్యమును మనస్సుకు బాణపుదెబ్బ వలనకలిగిన బాధ వలె పీడించుచు ఆతనికి కలిగిన పరాభవమును సూచించుచున్నది. 22

యమధర్మరాజు కూడ, పూర్వము అమోఘమైనదైనను, నేడు నశించిన తేజస్సు కల, తన దండముతో భూమిపై గీయుచు, ఆలాతము (ఆరినకొరివి) వలె దీనభావమును కలిగియున్నాడు. (కొరివి వలె ఆతడు యమదండమును, (నిష్ప్రయోజనమగుట వలన) చులకన చేసి చూచుచున్నాడని భావము. ఆలాత మనగా భూమిని త్రవ్వు కఱ్ఱ అని మరియొక అర్థము కూడ కలదు.) 23

తమయందలి ప్రతాపము నశించుటచే చల్లబడిన ఈ ద్వాదశాదిత్యులు చిత్రమునందు గీయబడిన వారువలె, ఎందువలన మిక్కిలి దర్శనీయ స్థితిని పొందినారు? (తమ తాపముచే దుర్నిరీక్ష్యులుగా ఉండవలసినవారు సామాన్యునకు కూడ చూడదగినంతటి శీతలు రైనారని భావము.)24

శ్లో॥ పర్యాకులత్వా న్మరుతాం
వేగభఙ్గో ఽనుమీయతే ।
అమ్బుసా మోఘసంరోధః
ప్రతీపగమనా దివ ॥ 25

శ్లో॥ ఆవర్జిత జటామౌలి
విలమ్బిశశికోటయః ।
రుద్రాణా మపి మూర్ధానః
క్షతహుంకారశంసినః ॥ 26

శ్లో॥ లబ్ధప్రతిష్ఠాః ప్రథమం
యూయం కిం బలవత్తరైః ।
అపవాదై రివోత్సర్గాః
కృతవ్యావృత్తయః పరైః । 27

శ్లో॥ త ద్బ్రూత వత్సాః కి మితః
ప్రార్థయధ్వం సమాగతాః ।
మయి సృష్టి ర్హి లోకానాం
రక్షా యుష్మా స్వవస్థితా ॥ 28

శ్లో॥ తతో మన్దానిలోద్ధూత
కమలాకరశోభినా ।
గురుం నేత్రసహస్రేణ
చోదయామాస వాసవః ॥ 29

49 సంఖ్య గల మరుద్గణములు తొట్రుపాటుతో కూడిన, తమ సంచార విషయమున వారికి కలిగిన వేగభంగము, నదీజలము వెనుకకు తిరుగుటవలన ప్రవాహవేగమునకుకలిగినప్రతిబంధకమువలె ఊహింపబడుచున్నది. 25

పరాభవదుఃఖమువలన వంగిన జటాజూటములనుండి వ్రేలాడుచున్న చంద్రరేఖలుగల ఏకాదశరుద్రులయొక్క శిరస్సులు, తమ హుంకారమును మాని, దీనముగా ఉన్నవేలనో? ("హుంకారశస్త్రా రుద్రాః" అను వాక్యము ప్రకారము రుద్రులు తమ హుంకారాస్త్రమును ప్రయోగించుటలేదని భావము.) 26

లోగడ మీరు మంచి ఉనికి కలవారే, నేడు ఓ దేవతలారా! మీరు (వ్యాకరణశాస్త్రములో) ఉత్సర్గాః = సామాన్యశాస్త్రములు (గోవును చంపకుడు అను వాక్యము) విశేషశాస్త్ర విధిచేత (గోయాగమున గోవును చంపుము అను వాక్యము) సంకోచము చేయబడినట్లు (దాని వ్యాప్తి ఆపబడినట్లు) మీరు బలవత్తరులైన శత్రువులచే కృతవ్యావృత్తయః పరాభవమును పొందితిరా? 27

ఓ వత్సలారా! మీరందఱు కలిసి వచ్చి, నన్నేమి అభ్యర్థింపదలిచినారో ఆ విషయమును చెప్పుడు. ఈ లోకములయొక్క సృష్టి బాధ్యత నాయందు ఉన్నది. లోకముల రక్షణ బాధ్యత మీయందున్నది. (కనుక రక్షణకై మీరు నా వద్దకు రానక్కరలేదని భావము.) 28

భగవంతుడైన బ్రహ్మ ప్రశ్నించిన తరువాత ఇంద్రుడు మందవాయువుచే కదల్పబడిన పద్మసరస్సువంటి శోభకల తన వెయ్యి కళ్ళతో, గురువైన బృహస్పతిని "సమాధాన మిమ్ము" అని ప్రేరేపించెను. 29

శ్లో॥ స ద్వినేత్రం హరే శ్చక్షు
స్సహస్రనయనాధికమ్ ।
వాచస్పతి రువాచేదం
ప్రాఞ్జలి ర్జలజాసనమ్ ॥ 30

శ్లో॥ ఏవం యదాత్థ భగవ
న్నామృష్టం నః పరైః పదమ్ ।
ప్రత్యేకం వినియుక్తాత్మా
కథం న జ్ఞాస్యసి ప్రభో! ॥ 31

## తారకకృతలోకోపద్రవ చర్యానివేదనమ్

శ్లో॥ భవల్లబ్ధవరోదీర్ణ
స్తారకాఖ్యో మహాసురః ।
ఉపప్లవాయ లోకానాం
ధూమకేతు రివోత్థితః ॥ 32

శ్లో॥ పురే తావన్త మేవాస్య
తనోతి రవి రాతపమ్ ।
దీర్ఘికాకమలోన్మేషో
యావన్మాత్రేణ సాధ్యతే ॥ 33

శ్లో॥ సర్వాభి స్సర్వదా చన్ద్ర
స్తం కళాభి ర్నిషేవతే ।
నాదత్తే కేవలాం లేఖాం
హరచూడామణీకృతామ్ ॥ 34

ఇంద్రునకున్న వెయ్యికళ్ళకు గల శక్తికంటె అధికమైన, వేయికళ్ళకు కూడ కనరాని దానిని చూచుశక్తిగలుగుటచే ఇంద్రుని కనులకంటె అధికమైన తన రెండు కళ్ళు గల (ఇంద్ర ప్రతినిధియగు) ఆ బృహస్పతి, చేతులు జోడించి, జలజాసనుడైన ఆ బ్రహ్మతో ఇట్లనెను. 30

ఓ భగవంతుడా! (షడ్గుణైశ్వర్య సంపన్నుడా!) మేము ఓడిపోయినా మని నీ వన్నమాట నిజమే. (అట్టిదే) మా అధికారము మా శత్రువులచే అపహరింపబడినది. ఓ ప్రభూ! మాలోని ప్రతివ్యక్తియందు అంతరాత్మ స్వరూపమున నుండు నీవు ఈ విషయము నెట్లు తెలిసికొనలేకున్నావు? (నీకు తెలియునని భావము.) 31

## తారకుని లోకోపద్రవచర్యలను నివేదించుట

నీవద్దనుండి పొందిన వరములచేత గర్వించిన, "తారకు" డను రాక్షసుడు లోకములను నశింపజేయుటకు తోకచుక్కవలె ఉదయించి, విజృంభించుచున్నాడు. 32

ఆ తారకాసురుని పట్టణమునందు (ఆతనికి భయపడి) సూర్యుడు దీర్ఘికల యందలి (= జలక్రీడార్థము నిర్మింపబడిన దిగుడుబావులయందలి) కమలములు వికసించుటకు ఎంతటి ఎండ కావలయునో సరిగా అంతటి ఎండనే (సర్వకాల సర్వావస్థలయందును) కాయుచున్నాడు. 33

చంద్రుడు ఎల్లప్పుడు కృష్ణపక్షమునందు కూడ) తన 16 కళలతో (సంపూర్ణుడై) ఆ తారకాసురుని సేవించుచున్నాడు. కాని, వాని భయము వలన శివుడు తన తలపై దాల్చిన చంద్రలేఖారూపమును ఆ చంద్రుడు ఏనాడును ధరించుటలేదు. 34

శ్లో॥ వ్యావృత్తగతి రుద్యానే
కుసుమస్తేయసాధ్వసాత్ ।
న వాతి వాయు స్తత్పార్శ్వే
తాలవృన్తానిలాధికమ్ ॥ 35

శ్లో॥ పర్యాయసేవా ముత్సృజ్య
పుష్పసమ్భారతత్పరాః ।
ఉద్యానపాలసామాన్య
మృతవ స్త ముపాసతే ॥ 36

శ్లో॥ తస్యోపాయన యోగ్యాని
రత్నాని సరితామ్పతిః ।
కథమ ప్యమ్భసామన్త
రానిష్పత్తేః ప్రతీక్షతే ॥ 37

శ్లో॥ జ్వలన్మణిశిఖా శ్చైనం
వాసుకిప్రముఖా నిశి ।
స్థిరప్రదీపతా మేత్య
భుజఙ్గాః పర్యుపాసతే ॥ 38

శ్లో॥ తత్కృతానుగ్రహాపేక్షీ
తం ముహు ర్దూతహారితైః ।
అనుకూలయ తీన్ద్రోఽపి
కల్పద్రుమవిభూషణైః ॥ 39

తారకుని రాజ్యమునందు పూవులను రాల్చి, దొంగిలించె నను అభియోగముతో శిక్షించునేమో అని భయపడిన వాయుదేవుడు, ఉద్యానవనములో సంచరించుటను మాని, ఆ రాక్షసునివద్ద వింజామరల నుండి వచ్చు గాలి కంటె వేగముగా ప్రసరింపకున్నాడు. 35

ఋతువులారును, ఒకదాని తరువాత మఱియొకటి వచ్చు విధిని మానివైచి, (ఆతనిభోగమునకై) సర్వకాలములయందును పూలను సమకూర్చుటయం దాసక్తి కలవియై, తోటమాలురతో సరిసమానముగా ఆ తారకుని సేవింపసాగినవి. 36

సముద్రుడు ఆ తారకాసురునకు కానుకగా ఇచ్చుటకు తగిన రత్నములు తనలో పరిపక్వస్థితికి వచ్చువరకు అతికష్టము మీద ఎదురుచూచు చున్నాడు. 37

మీదుమిక్కిలి, తమ తలలపై ప్రకాశించుచున్న మాణిక్యకాంతులుకల వాసుకి మొదలగు నాగనాయకులు వానికి ఆరని మణిదీపములై, సేవించుచున్నారు. 38

ఇంద్రుడు కూడ, ఆ తారకుని అనుగ్రహము నపేక్షించినవాడై, తన (నందనవనములోని) కల్పవృక్షములనుండి ఉద్భవించిన దివ్యాభరణములను దేవదూతలద్వారా పంపి, ఆతనిని తన కిష్టుడుగా (అనుకూలుడుగా) చేసికొన యత్నించుచున్నాడు. 39

శ్లో॥ ఇత్థ మారాధ్యమానో౽పి
క్లిశ్నాతి భువనత్రయమ్ ।
శామ్యే త్ప్రత్యపకారేణ
నోపకారేణ దుర్జనః ॥ 40

శ్లో॥ తేనామరవధూహస్తైః
సదయాలూనపల్లవాః ।
అభిజ్ఞా శ్ఛేదపాతానాం
క్రియన్తే నన్దనద్రుమాః ॥ 41

శ్లో॥ వీజ్యతే స హి సంసుప్త
శ్వాససాధారణానిలైః ।
చామరై స్సురబన్దీనాం
బాష్పశీకరవర్షిభిః ॥ 42

శ్లో॥ ఉత్పాట్య మేరుశృఙ్గాణి
క్షుణ్ణాని హరితాం ఖురైః ।
ఆక్రీడపర్వతా స్తేన
కల్పితాః స్వేషు వేశ్మసు ॥ 43

శ్లో॥ మన్దాకిన్యాః పయశ్శేషం
దిగ్వారణమదావిలమ్ ।
హేమామ్భోరుహసస్యానాం
తద్వాప్యో ధామ సామ్ప్రతమ్ ॥ 44

ఈ విధముగా (సర్వదేవతలచే) పూజింపబడుచుండి కూడ ఆ తారకుడు ముల్లోకములను పీడించుచునే యున్నాడు. దుర్జనుడు ఇతరులకు అపకారము చేయుటవలననే శమించును కాని, పరోపకారముచే ఉపశమింపడు కదా! 40

దేవతా స్త్రీలయొక్క మృదులములైన హస్తములచే దయతో కోయబడిన చిగుళ్ళు కల, నందనవనములోని కల్పవృక్షములు ఆ తారకునిచే నేడు నరుకులకు, దెబ్బలకు అలవాటు పడినవి. 41

తారకుడు నిద్రించునపుడు వానిచే చెఱపెట్టబడిన దేవాంగనలు, తాము వీచుచున్న చామరములనుండి, పుట్టిన గాలిని తమ కన్నీళ్ళ తుంపురులతో కూడినదిగా చేసి, (చల్లగా) ఊపిరిగాలికంటె ఎక్కువ వేగము లేకుండునట్లు నెమ్మదిగా విసురుచున్నారు. (తమ దుఃఖమునుండి శాంతినొందుటకు వానిచే చెఱపెట్టబడిన దేవాంగనలు వాడు నిద్రించుచున్నప్పుడే ఏడ్చుచుండిరని భావము.) 42

సూర్యాశ్వములు గిట్టలచే చూర్ణములైన మేరుపర్వతశిఖరములను పెల్లగించి, తన ఇండ్లయందు క్రీడాపర్వతములుగా చేసికొనుచున్నాడు. 43

ఇప్పు డాకాశగంగానదిలో దిగ్గజములయొక్క మదముచే మలినమైన నీరు మాత్రమే మిగిలియున్నది. అందలి బంగారుకమలములపంటకు వాని దిగుడుబావులే నివాసస్థానము లైనవి. (ఆ బంగారు కమలముల నన్నింటిని పీకి, తన దిగుడుబావులలో నాటుకొని పండించుచున్నాడని భావము.) 44

శ్లో॥ భువనాలోకనప్రీతి
స్స్వర్గిభి ర్నానుభూయతే ।
ఖిలీభూతే విమానానాం
తదాపాతభయా త్పథి ॥ 45

శ్లో॥ యజ్వభి స్సమ్భృతం హవ్యం
వితతే ష్వధ్వరేషు సః ।
జాతవేదోముఖా న్మాయీ
మిషతా మాచ్ఛినత్తి నః ॥ 46

శ్లో॥ ఉచ్చై రుచ్చైశ్శ్రవా స్తేన
హయరత్న మహారి చ ।
దేహబద్ధ మివేన్ద్రస్య
చిరకాలార్జితం యశః ॥ 47

శ్లో॥ తస్మి న్నుపాయా స్సర్వే నః
క్రూరే ప్రతిహతక్రియాః ।
వీర్యవ న్త్యౌషధానీవ
వికారే సాన్నిపాతికే ॥ 48

శ్లో॥ జయాశా యత్ర చాస్మాకం
ప్రతిఘాతోత్థితార్చిషా ।
హరిచక్రేణ తేనాస్య
కణ్ఠే నిష్క మివార్పితమ్ ॥ 49

విమానములెక్కి సంచరించునపుడు తారకుడు కనపడి దండించునేమో అను భయముతో దేవతలు పూర్వము వలె తమ తమ విమానములెక్కి వివిధలోకములను దర్శించు ఇష్టమును అనుభవింపలేకున్నారు. 45

విధి పూర్వకముగా యజ్ఞముచేయు హోతలు, మా కొఱకై మా ముఖమగు అగ్నియందు వ్రేల్చిన హవ్యమును, ధాన్యములను బలవంతముగా మేము చూచుచుండగనే అగ్నినుండి ఈ మాయావియగు తారకుడు లాగికొనుచున్నాడు. 46

మీదుమిక్కిలి, చిరకాలమునుండి సంపాదించుకొనిన ఇంద్రుని కీర్తియో అన్నట్లున్న ఉచ్చైఃశ్రవము అను హయరత్నమును ఇంద్రునినుండి ఆ తారకాసురుడు అపహరించినాడు. 47

క్రూరుడైన ఆ రాక్షసునిపై మేము ప్రయోగించిన ఉపాయము లన్నియు, సన్నిపాత (వాతపిత్త శ్లేష్మములు సమానముగా అధిక్యమును పొందు) జ్వరమునందు ఉపయోగింపబడిన సారవంతములగు ఔషధములు నిష్ప్రయోజనము లగునట్లు, వ్యర్థము లైపోయినవి. 48

పైగా (నిజముగా మేము గెలిచెద మని) ఏ విష్ణుచక్రముమీద మాకు జయాశ యుండెడిదో, లక్ష్యమును తాకుటచే జ్వాలలను ఎగజిమ్ము, అది ఆతని మెడలో నిష్కము (కంటె) వలె అయిపోయినది. 49

శ్లో॥ తదీయా స్తోయదే ష్వద్య
పుష్కరావర్తకాదిషు ।
అభ్యస్యన్తి తటాఘాతం
నిర్జితైరావతా గజాః ॥ 50

తారకవధార్థం సేనానాయకసృష్టా వనురోధః

శ్లో॥ త దిచ్ఛామో విభో! స్రష్టుం
సేనాన్యం తస్య శాన్తయే ।
కర్మబన్ధచ్ఛిదం ధర్మం
భవస్యేవ ముముక్షవః ॥ 51

అవ. : సేనానీ సృష్టేః ఫల మాహ.

శ్లో॥ గోప్తారం సురసైన్యానాం
యం పురస్కృత్య గోత్రభిత్ ।
ప్రత్యానేష్యతి శత్రుభ్యో
బన్దీమివ జయశ్రియమ్ ॥ 52

శ్లో॥ వచ స్యవసితే తస్మిన్
ససర్జ గిర మాత్మభూః ।
గర్జితానన్తరాం వృష్టిం
సౌభాగ్యేన జిగాయ యా ॥ 53

(ఆకారములోను, బలములోను ఇంద్రుని తెల్లఏనుగగు) ఐరావతమును జయింపజాలిన ఆ తారకుని ఏనుగులు నేడు పుష్కరము, ఆ వర్తకము అను పేర్లుకల పెద్దమేఘముల మీద వప్రక్రీడను (దంతముల దురదను తీర్చుకొనుటకై దంతములతో అడ్డముగా కొట్టు ఆటను అభ్యసించు చున్నవి. 50

## తారక వధకై సేనానిని సృష్టింపుమని బ్రహ్మను దేవతలు ప్రార్థించుట

అందువలన ఓ దేవా! భవబంధ మోక్షమునందగోరువారు ఆ బంధమును ఛేదించు జ్ఞానమును కోరునట్లు, మేమా తారకుని వధించుటకై మాకొక సేనానాయకుని సృష్టించి ఇచ్చి, మ మ్మనుగ్రహింప గోరుచున్నాము. 51

అవతారిక : సేనానిని సృష్టించుటవలన కలుగు ఫలమును చెప్పుచున్నాడు.

దైవసైన్యమును రక్షింపజాలిన, ఎవనిని ముందుంచుకొని, బంధించిన స్త్రీని వలె, దేవేంద్రుడు రాజ్యలక్ష్మిని శత్రు సైన్యమునుండి తిరిగి తీసికొని రాగలడో, అట్టి సేనానాయకుని సృష్టించి మా కిమ్ము. 52

ఆ బృహస్పతి మాటాడుట పూర్తికాగానే, బ్రహ్మ మేఘగర్జన తరువాత వచ్చు వర్షపుధాటిని గెలువజాలినంతటి, (వర్షధాటికంటె మిక్కిలి ధాటిగల) సుందరమైన మాటను ఇట్లు పలికెను. (మేఘగర్జనకు వర్షము ఫలమైనట్లు వీరి ప్రార్థనము సఫలమైనదని బ్రహ్మవాక్కు సూచించినదని భావము.) 53

శ్లో॥ సంపత్స్యతే వః కామో౽యం
కశ్చి త్కాలః ప్రతీక్ష్యతామ్ ।
న త్వస్య సిద్ధౌ యాస్యామి
సర్గవ్యాపార మాత్మనా ॥ 54

తారకస్య అవధ్యత్వశక్తికత్వే హేతుః

శ్లో॥ ఇత స్స దైత్యః ప్రాప్తశ్రీ
ర్నేతఏ వార్హతి క్షయమ్ ।
విషవృక్షో౽పి సంవర్ధ్య
స్వయం ఛేత్తు మసామ్ప్రతమ్ ॥ 55

అవ. : కుత ఇ త్యాశ జ్క్యాహ.

శ్లో॥ వృతం తే నేదమేవ ప్రా
జ్మయా చాస్మై ప్రతిశ్రుతమ్ ।
వరేణ శమితం లోకా
నలం దగ్ధుం హి త త్తపః ॥ 56

శ్లో॥ సంయుగే సాంయుగీనం త
ముద్యన్తం ప్రసహేత కః ।
అంశాదృతే నిషిక్తస్య
నీలలోహితరేతసః ॥ 57

అవ. కథ మసా వీదృక్ శక్తి రిత్యాహ.

(దేవతలారా!) మీ ఈ కోర్కె నెరవేరగలదు. కొంతకాలము వేచి ఉండుడు. సేనానాయకుని సృష్టి విషయములో నేను నా శక్తితో సృష్టివ్యాపారమును (పనిని) చేయను. **54**

## తారకుని అవధ్యతకు కారణమును బ్రహ్మ చెప్పుట

నావలననే ఆ రాక్షసుడు తన ఆయుస్సును (అభివృద్ధిని) పొందినాడు. కనుక నావలననే అతడు నశింపరాదు. తాను పెంచిన విషవృక్షమును కూడ పెంచినవాడే దానిని నరికివేయుట తగదు కదా! **55**

**అవతారిక :** ఎందువలన చంపరాదను అనుమానమునకు సమాధానమును చెప్పుచున్నాడు.

దేవతలచే మరణము లేకుండునట్లుగా పూర్వము ఈతడు వరమును కోరినాడు. 'అట్లే అగుగాక' అని నే నీతనికి అభయము నిచ్చితిని. లోకముల నన్నింటిని దగ్ధము చేయుటకు చాలినంతటి వాని తపోగ్నిని నే నిచ్చిన ఈ చిన్ని వరముచే నేను ఆర్పివేసితిని. **56**

రణకుశలుడై, యుద్ధములో విజృంభించుచున్న ఆ తారకుని, శివవీర్య సంభవుడైనవాడు తప్ప, మరి ఏ ఇతరుడు ఆతని ధాటికి తట్టుకొనజాలును? (ఇతరు డెవరును సహింపజాలరని భావము.) **57**

**అవతారిక :** ఆ శివుని కిట్టి శక్తి ఎట్లు వచ్చినది? అను ప్రశ్న కీ శ్లోకము సమాధానము నిచ్చుచున్నది.

శ్లో॥ స హి దేవః పరంజ్యోతి
స్తమః పారే వ్యవస్థితమ్ ।
పరిచ్ఛిన్న ప్రభావర్ద్ధి ర్న
మయా న చ విష్ణునా ॥ 58

అవ. సమ్ప్రతి తదంశోత్పత్తా వుపాయం దర్శయతి.

శ్లో॥ ఉమారూపేణ తే యూయం
సంయమస్తిమితం మనః ।
శమ్భో ర్యతధ్వ మాక్రష్టు
మయస్కాన్తేన లోహవత్ ॥ 59

అవ. న చ గత్యన్తర మ స్తీ త్యాహ.

శ్లో॥ ఉభే ఏవ క్షమే వోఢు
ముభయో ర్బీజ మాహితమ్ ।
సా వా శంభో స్తదీయా
వా మూర్తి ర్జలమయీ మమ ॥ 60

శ్లో॥ తస్యాత్మా శితికణ్ఠస్య
సైనాపత్య ముపేత్య వః ।
మోక్ష్యతే సురబన్దీనాం
వేణీ ర్వీర్యవిభూతిభిః ॥ 61

ఆ దేవుడు తమోగుణమున కవ్వల నున్న పరంజ్యోతి కదా! కనుకనే ఆ మహేశ్వరుడు విష్ణుమూర్తిచేత ప్రభావమును పొందువాడు కాడు. నా చేతకూడ ప్రభావమును పొందువాడు కాడు. (వశపడదని భావము.) **58**

అవతారిక: ఇప్పుడా శివుని అంశతో పుత్రోత్పత్తిని గూర్చి ఉపాయమును చెప్పుచున్నాడు.

ఆ కార్యార్థులగు మీరు ఇప్పుడు, సమాధిస్థితిలో ఉండుటవలన నిశ్చలమైన శివునిమనస్సును సూదంటురాయిచే ఇనుము ఆకర్షింపబడునట్లు, పార్వతీదేవిరూపసౌందర్యముచే ఆకర్షించుటకు ప్రయత్నింపుడు. **59**

అవతారిక : ఇంతకంటె మరియొక గతి లేదనుట కీ శ్లోకము నారంభించు చున్నాడు.

బ్రహ్మ రుద్రులను పేర్లుగల మా ఇరువురి వీర్యమును ధరించుటకు శక్తి కలవారు ఇద్దరే ఇద్దరున్నారు. 1. రుద్ర వీర్యమును ధరింపగలిగినది ఆ పార్వతి మాత్రమే. 2. శివుని అష్టమూర్తులతో ఒకటియగు జలమూర్తి మాత్రమే నా వీర్యమును ధరింపగలుగును. **60**

ఆ ఈశ్వరుని పుత్రుడు (ఒకడే) మీ దేవసైన్యమునకు సేనాపతియై, అసురులచే బంధింపబడిన దేవతాస్త్రీలయొక్క జుట్టుముడులను తన పరాక్రమముచే ఊడదీయింపగలడు. (అసురవిజయముతో దేవతా స్త్రీల కానందమును కలిగింపగల డని భావము) **61**

శ్లో॥ ఇతి వ్యాహృత్య విబుధా
న్విశ్వయోని స్తిరోదధే ।
మన స్యాహితకర్తవ్యాః
తేఽ పి దేవా దివం యయుః ॥ 62

## ఇన్ద్రేణ హరచిత్తాకర్షణార్థం స్మరసంస్మరణమ్

శ్లో॥ తత్ర నిశ్చిత్య కన్దర్ప
మగమ త్పాకశాసనః ।
మనసా కార్యసంసిద్ధౌ
త్వరా ద్విగుణరంహసా ॥ 63

శ్లో॥ అథ స లలితయోషిద్భ్రూలతాచారుశృఙ్గం
రతివలయపదాఙ్కే చాప మాసజ్య కణ్ఠే ।
సహచరమధుహస్తన్యస్తచూతాఙ్కురాస్త్ర
శ్శతమఖ ముపస్థే ప్రాఞ్జలిః పుష్పధన్వా ॥ 64

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"బ్రహ్మసాక్షాత్కారో" నామ ద్వితీయః సర్గః

-o0o-

దేవతల కిట్లు, చెప్పి, బ్రహ్మ అంతర్ధానము నందెను. ఆ దేవతలు కూడ తమ మనస్సునందు తమ కర్తవ్యమును నిర్ణయించుకొనినవారై, స్వర్గమునకు వెళ్ళిరి. **62**

## హరుని చిత్తాకర్షణమునకై దేవేంద్రుడు మన్మథుని స్మరించుట

శివుని చిత్తమును ఆకర్షింపజాలినవాడు మన్మథుడే అని నిశ్చయించుకొని, త్వరగా కార్యసిద్ధి కావలెనను ద్విగుణితోత్సాహముతో దేవేంద్రుడు, మన్మథుని స్మరించెను. **63**

దేవేంద్రు డిట్లు తలచుకొనగానే ఆ తలవబడిన పూవిలుకాడు, అందమైన స్త్రీలకనుబొమల వలె అందమైన, వంకర తిరిగిన, తన ధనస్సును (తనను కౌగిలించుకొనిన) రతీదేవియొక్క కంకణములు ఒరుసుకొనిన గుర్తులు కల తన కంఠముపై (భుజముపై తగిలించుకొని, తన మిత్రుడగు వసంతుని చేతియందు మావిమొగ్గ అను బాణమును ఉంచి, చేతులు జోడించుచు వచ్చి, ఇంద్రుని కలిసికొనెను. **64**

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "బ్రహ్మసాక్షాత్కారము" అను పేరుగల రెండవ
సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-

# కుమారసమ్భవమ్

## “మదనదాహో” నామ

## తృతీయః సర్గః

శ్లో॥ తస్మిన్ మఘోన స్త్రిదశాన్ విహాయ
సహస్రమక్ష్ణాం యుగపత్ పపాత ।
ప్రయోజనాపేక్షితయా ప్రభూణాం
ప్రాయ శ్చలం గౌరవ మాశ్రితేషు ॥ 1

ఇన్ద్రంప్రతి స్మరేణ స్వసామర్థ్యజల్పనమ్

శ్లో॥ స వాసవే నాసనసన్నికృష్ట
మితో నిషీ దేతి విసృష్టభూమిః ।
భర్తుః ప్రసాదం ప్రతిగృహ్య మూర్ధ్నా
వక్తుం మిథః ప్రాక్రమతైవ మేనమ్ ॥ 2

శ్లో॥ అజ్ఞాపయ జ్ఞాతవిశేష! పుంసాం
లోకేషు యత్ తే కరణీయ మస్తి ।
అనుగ్రహం సంస్మరణప్రవృత్త
మిచ్ఛామి సంవర్ధిత మాజ్ఞయా తే ॥ 3

# కుమారసంభవము

## "మదనదాహము" అను

## మూడవసర్గము

అంతవరకు దేవతలపై నిల్చియున్న దేవేంద్రుని వేయికన్నులు, ఒక్కసారిగా వారి రూపమును చూచుటను మాని, ఆ మన్మథునిపై పడెను. ప్రయోజనమును కోరిన ప్రభువులయొక్క గౌరవము, తరచుగా తన నాశ్రయించిన వారియందు సందర్భానుసారము మారుచుండును. (ఈ సర్గమునందలి శ్లోకములు ఇంద్రవజ్రా ఛందస్సులో కూర్పబడినవి.) 1

### మన్మథుడు తన సామర్థ్యమును ఇంద్రునివద్ద పొగడుకొనుట

దేవేంద్రుడు తన ఆసనమునకు దగ్గరగా ఏర్పాటు చేసిన ఆసనముపై కూర్చొనుమని స్థానమును చూపింపగనే, ఆ మన్మథుడు దేవతాభర్తయగు ఆ దేవేంద్రుని అనుగ్రహమును శిరసావహించి, రహస్యముగా ఆతనితో మాటాడనారంభించెను. 2

పురుషులయొక్క శక్తి తారతమ్యమును, విశేషములను తెలిసికొనినవాడా! 14 లోకములలో నీకు చేయదగినపని ఏది యున్నదో దానిని నా కాజ్ఞాపింపుము. నన్ను నీవు తలుచుకొనుటతో ప్రారంభమయిన నీ దయను నీ ఆజ్ఞతో వృద్ధిపొందించుకొన దలచుచున్నాను. (నీ వాజ్ఞాపింపనిచో నాకు సంతోషము లేదని భావము.) 3

అవ. : న చ మే కిఞ్చి దసాధ్య మస్తీ త్యాహ.

శ్లో॥ కేనాభ్యసూయాపదకాంక్షిణా తే
నితాన్తదీర్ఘై ర్జనితా తపోభిః ।
యావ ద్భవ త్యాహితసాయకస్య
మత్కార్ముక స్యాస్య నిదేశవర్తీ ॥ 4

అవ. : సమ్ప్రతి చతుర్వర్గే మోక్ష మధికృ త్యాహ.

శ్లో॥ అసమ్మతః క స్తవ ముక్తిమార్గం
పునర్భవక్లేశభయా త్ప్రపన్నః ।
బద్ధ శ్చిరం తిష్ఠతు సున్దరీణా
మారేచితభ్రూచతురైః కటాక్షైః ॥ 5

అవ. : ధర్మార్థా వధికృ త్యాహ.

శ్లో॥ అధ్యాపిత స్యోశనసాఽపి నీతిం
ప్రయుక్తరాగ ప్రణిధి ర్ద్విష స్తే ।
క స్యార్థధర్మౌ వద పీడయామి
సిన్ధో స్తటా వోఘ ఇవ ప్రవృద్ధః ॥ 6

అవ. : కామ మధికృ త్యాహ.

అవతారిక : లోకములో నాకు సాధ్యము కానిదే లేదని చెప్పుచున్నాడు.

ఇంద్రపదవిని కాంక్షించు ఎవడు తన నిరంతరములైన దీర్ఘ తపస్సులతో నీ కసూయను కలిగించుచున్నాడో చెప్పుము. వానిని నేను నా బాణమును సంధించిన వింటియొక్క ఆజ్ఞకు లొంగిన వానినిగా చేసివైతును. (వానిని స్త్రీ దాసునిగా మదన పీడితునిగా చేసెదనని ప్రగల్భమును పలికినాడని భావము.) 4

అవతారిక : ఇప్పుడు చతుర్వర్గమునందలి మోక్షమునుగూర్చి చెప్పుచున్నాడు.

మరల పుట్టుటయందలి బాధను అనుభవింపవలసియుండునేమో అను భయముతో (సంసారబంధమగు జరామరణానుభవము అను భయముతో) నీ కిష్టుడు కాని ఎవడు మోక్షమార్గము ననుసరించు చున్నాడు? అట్టి వానిని గూర్చి, నీవు నాకు చెప్పుము. నీకై నేను అట్టి జితేంద్రియుడు కూడ, అందమైన స్త్రీలయొక్క ఒకటి తరువాత ఒకటిగా విలాసముగా తిప్పబడుచున్న కనుబొమలకు చిరకాలము బందీ యగునట్లు చేసెదను. (వానిని స్త్రీవశునిగా చేసి మోక్షమార్గమునుండి మరలింతు నని భావము.) 5

అవతారిక : ధర్మార్థములను గూర్చి చెప్పుచున్నాడు.

(రాక్షసగురువైన) శుక్రాచార్యునిచే నీతిశాస్త్రము నభ్యసించినప్పటికి నీ శత్రువైనందువలన, నాయొక్క పరివారములో ఒకడగు విషయాభిలాష అను దూతను ప్రయోగించి, వరదవలన అభివృద్ధిచెందిన నదీప్రవాహము దాని గట్లను పీడించినట్లు, నేను వానిని పీడించివైచెదను. ఎవనిని నే నిట్లు చేయవలెను? 6

అవతారిక : కామమును గూర్చి చెప్పుచున్నాడు.

శ్లో॥ కా మేకపత్నీవ్రతదుఃఖశీలాం
లోలం మన శ్చారుతయా ప్రవిష్టామ్ ।
నితమ్బినీ మిచ్ఛసి ముక్తలజ్జాం
కణ్ఠే స్వయంగ్రాహనిషక్తబాహుమ్ ॥ 7

అవ. : త్రివిధా నాయికాః-స్వకీయా పరకీయా సాధారణీ చేతి
తత్ర పరకీయాం ప్రత్యుక్తమ్ - ఇతరే ప్రత్యాహ.

శ్లో॥ కయాఽసి కామిన్ సురతాపరాధాత్
పాదానతః కోపనయాఽవధూతః ?
తస్యాః కరిష్యామి దృఢానుతాపం
ప్రవాలశయ్యాశరణం శరీరమ్ ॥ 8

శ్లో॥ ప్రసీద విశ్రామ్యతు వీర! వజ్రం
శరై ర్మదీయైః కతమ స్సురారిః ।
బిభేతు మోఘీకృత బాహువీర్యః
స్త్రీభ్యోఽపి కోపస్ఫురితాధరాభ్యః ॥ 9

ఒకనికే భార్యగా ఉండుట అను పాతివ్రత్యనియమమే స్వభావముగా కలిగియుండుటవలన, దుఃఖస్వభావురాలైనదియును, తన సౌందర్యముచే ఆసక్తికలిగిన నీ మనస్సునందు ప్రవేశించినదియును, అగు ఏ సుందరిని సిగ్గు విడిచి, తనంతటతాను తన బాహువులతో నీ కంఠము నాలింగనము చేసికొనునట్లుగా నన్ను చేయమందువు? (నీ కామమును నే నేట్లు తీర్తును? అని మన్మథుని ప్రశ్న ఇందున్నది.) 7

అవతారిక : 1. స్వకీయ 2. పరకీయ 3. సాధారణ అని నాయికలు మూడు విధములుగా నుందురు. వారిలో పరకీయ నాయికను గూర్చి ఇంతకుముందే చెప్పబడినది. తక్కిన ఇద్దఱినిగూర్చి చెప్ప నారంభించు చున్నాడు.

కాముకుడవగు ఓ దేవా! నీవు పరస్త్రీని పొందుట అను తప్పిదమును చేసి, దానిని గ్రహించుట వలన, నీవు సాంత్వన పరచుటకై ఆమె యొక్క పాదములకు నమస్కరించినను, శాంతింపక, కోపించిన ఎవతె నిన్ను తిరస్కరిచినది? ఆమె పేరును నాకు చెప్పుము. నేను దృఢమైన మదన తాపముతో ఎల్లప్పుడు చిగురుసెజ్జనే ఆశ్రయించి ఉండునట్లు ఆ గర్వితురాలియొక్క శరీరమును చేసెదను. (మదనపరవశురాలిగా చేసెదనని భావము.) 8

ఓ వీరుడా! న న్ననుగ్రహింపుము. నీ వజ్రాయుధము కూడ విశ్రమించును గాక! తన బాహు వీర్యము వ్యర్థమై, కోపముతో వణుకుచున్న క్రింది పెదవులుకల, దేవతలకు శత్రువైన, ఏ రాక్షసుని స్త్రీలవలనకూడ భయపడునట్లు నా బాణములతో నేను చేయవలెనో అట్టి వానిని నాకు చెప్పుము. 9

శ్లో॥ తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి
సహాయ మేకం మధుమేవ లబ్ధ్వా।
కుర్యాం హరస్యాపి పినాకపాణేః
ధైర్యచ్యుతిం కే మమ ధన్వినోఽన్యే? 10

శ్లో॥ అథోరుదేశా దవతార్య పాద
మాక్రాన్తిసమ్భావితపాదపీఠమ్।
సఙ్కల్పితార్థే వివృతాత్మశక్తి
మాఖణ్డలః కామ మిదం బభాషే॥ 11

ఇన్ద్రేణ సప్రశంసం స్వకార్యనిర్దేశః

శ్లో॥ సర్వం సఖే! త్వ య్యుపపన్న మేత
దుభే మామాస్త్రే కులిశం భవాంశ్చ।
వజ్రం తపోవీర్యమహత్సు కుణ్ఠం
త్వం సర్వతోగామి చ సాధకం చ॥ 12

శ్లో॥ అవైమి తే సార మతః ఖలు త్వాం
కార్యే గురు ణ్యాత్మసమం నియోక్ష్యే।
వ్యాదిశ్యతే భూధరతా మవేక్ష్య
కృష్ణేన దేహోద్వహనాయ శేషః॥ 13

పలుమాటలు చెప్పనేల? నీ దయవలన నేను మృదువులైన (దుర్బలములైన) కుసుమములనే అస్త్రములుగా కలిగి యుండియు (లలితలలితుడైన) ఒక్క వసంతునే సహాయకునిగా కలిగియుండియు, శత్రుభయంకరమైన పినాకమను పేరుగల ధనస్సును చేతిలో పట్టుకొని యుండు ఆ పరమేశ్వరుని ధైర్యమును కూడ నశింపజేయగలను. నాకు సాటివచ్చు ఇతర ధనుర్ధరు లెవ్వరున్నారు? (ఎవరును లేరు. నేనే ఏకైకధనుర్ధారిని. అతిలోక పరాక్రమవంతుడను అని భావము.) 10

మన్మథుడిట్లు చెప్పిన తరువాత ఎడమతొడపై నున్న తన కుడి పాదమును క్రిందికి దించి, దానినుంచుట చేత క్రిందనున్న పాదపీఠమును అనుగ్రహించుచు, ఇంద్రుడు, ఉద్దేశింపబడిన శివుని చిత్తమును ఆకర్షించు విషయమునందు తన సామర్థ్యమును ప్రకటించిన మన్మథునితో ఇట్లు మాటాడ ప్రారంభించెను. 11

## ఇంద్రుడు ప్రశంసాపూర్వకముగా మన్మథునకు స్వకార్యమును నిర్దేశించుట

మిత్రుడా! నీవు చెప్పినదంతయు నీ విషయమున తగినట్లేయున్నది. నాకు 1. వజ్రాయుధము 2. నీవును అను రెండే అస్త్రము లున్నవి. వానిలో ఒకటవదియగు వజ్రాయుధము తపోబలముగలవారివద్ద వ్యర్థమైపోవును. (శక్తిహీనమగును.) కాని నీవో, అందరి మీదను ప్రసరింపగలవు. అన్ని కార్యములను సాదింపగలవు. 12

నీ బలమును నే నేఱుగుదును. కనుకనే నాతో సమానుడవగు నిన్ను ఈ గొప్ప కార్యమును నెరవేర్చుటకు నియోగించుచున్నాను. విష్ణువు కూడ ఆదిశేషుని భూభారవాహకత్వగుణమును, శక్తిని చూచియే తనను మోయుటకై (ప్రక్కగా) ఆ శేషుని అజ్ఞాపించెను. 13

అవ. : నియోగాఙ్గీకారం సిద్ధవత్ కర్తు మాహ.

శ్లో॥ ఆశంసతా బాణగతిం వృషాఙ్కే
కార్యం త్వయా నః ప్రతిపన్నకల్పమ్ ।
నిబోధ యజ్ఞాంశభుజా మిదానీ
ముచ్చై ర్ద్విషా మీప్సిత మేత దేవ ॥ 14

శ్లో॥ అమీ హి వీర్యప్రభవం భవస్య
జయాయ సేనాన్య ముశన్తి దేవాః ।
స చ త్వ దేకేషునిపాతసాధ్యో
బ్రహ్మాఙ్గభూ ర్బ్రహ్మణి యోజితాత్మా ॥ 15

శ్లో॥ తస్మై హిమాద్రేః ప్రయతాం తనూజాం
యతాత్మనే రోచయితుం యతస్వ ।
యోషిత్సు తద్వీర్యనిషేకభూమిః
సైవ క్షమే త్యాత్మభువోపదిష్టమ్ ॥ 16

అవ. : సాఽపీదానీం సంనికృష్టైవ తస్యే త్యాహ.

శ్లో॥ గురో ర్నియోగా చ్చ నగేన్ద్రకన్యా
స్థాణుం తపస్యన్త మధిత్యకాయామ్ ।
అన్వాస్త ఇ త్యప్సరసాం ముఖేభ్యః
శ్రుతం మయా మత్ప్రణిధిః స వర్గః ॥ 17

అవతారిక : ఇచ్చిన ఆజ్ఞను అంగీకరించి, కర్తవ్యమునకై సిద్ధపడుమని ఈ శ్లోకమునందు చెప్పుచున్నాడు.

శివుని మీద బాణప్రయోగమును చేసెదనని నీవు చెప్పుటచేతనే మేము చెప్పిన పనిని చేయుటకు నీ వంగీకరించినట్లైనది. ఇప్పుడు ప్రబలుడైన శత్రువులుగల దేవతలయొక్క కోర్కె ఇదే అని తెలిసికొనుము. 14

ఎందువలననగా ఈ దేవతలు తమ శత్రువులను గెల్చుట కొరకు శివుని వీర్యమువలన సంభవించునట్టి ఒక దేవసేనాపతిని కోరుచున్నారు. ప్రస్తుతము ఆ శివుడు బ్రహ్మ=సద్యోజాతాది మంత్రములకును, అంగ= హృదయాది మంత్రములకును స్థానమగు బ్రహ్మయందు (స్వతత్వమున) తన మనస్సును లగ్నము చేసి (తపఃసమాధియందు) ఉన్నాడు. కనుక కార్యమును సాధించుట (శివుని చిత్తము నాకర్షించుట) ఒక నీ బాణమునకు మాత్రమే సాధ్యము. 15

పరమపవిత్రురాలగు ఆ పార్వతీదేవిని జితేంద్రియుడగు ఆ శివునకు ఇష్టురాలినిగా చేయుటకు ప్రయత్నింపుము. స్త్రీలలో ఆ పార్వతి ఒక్కతెయే శివుని వీర్యమును భరింపజాలిన క్షేత్రము. (భార్య లేక స్థలము) అని బ్రహ్మ ఇంతకు పూర్వమే ఉపదేశించినాడు కదా! 16

అవతారిక : ఇప్పుడా పార్వతి కూడ శివుని వద్దనే ఉన్నదని చెప్పుచున్నాడు.

"తన గురువగు హిమవంతుని ఆజ్ఞవలన పార్వతీదేవి ఆ కొండపై భాగమున తపస్సు చేసుకొనుచున్న శివుని కొలువసాగినది." అని అప్సరసల ద్వారా వింటిని. ఆ అప్సరసలు నా గూఢచారి వర్గములోని వారు కదా! 17

## దైవకార్యమనుష్ఠాతుం మదనస్య ప్రస్థానమ్

శ్లో॥ త ద్గచ్ఛ సిద్ధ్యై కురు దేవకార్య
మర్థోఽయ మర్థాన్తరభావ్య ఏవ ।
అపేక్షతే ప్రత్యయ ముత్తమం త్వా
బీజాఙ్కురః ప్రా గుదయా దివామ్భః ॥ 18

శ్లో॥ తస్మిన్ సురాణాం విజయాభ్యుపాయే
తవైవ నామాస్త్రగతిః కృతీ త్వమ్ ।
అప్యప్రసిద్ధం యశసే హి పుంసా
మనన్యసాధారణమేవ కర్మ ॥ 19

అవ. : ప్రోత్సాహనార్థం స్తౌతి.

శ్లో॥ సురాః సమభ్యర్థయితార ఏతే
కార్యం త్రయాణామపి విష్టపానామ్ ।
చాపేన తే కర్మ న చాతిహింస్ర
మహో బతాసి స్పృహణీయవీర్యః ॥ 20

శ్లో॥ మధుశ్చ తే మన్మథ సాహచర్యా
దసా వనుక్తోఽపి సహాయ ఏవ ।
సమీరణో నోదయితా భవేతి
వ్యాదిశ్యతే కేన హుతాశనస్య? ॥ 21

## దైవకార్యనిర్వహణమునకై మదనుడు బయలుదేరుట.

అందువలన ఈ కార్యము సిద్ధించుటకై నీవు (శివుని వద్దకు) పొమ్ము. ఈ దేవతల కార్యమును నెరవేర్పుము. ఈ కార్యము పార్వతీ సన్నిధానరూపమగు కారణాంతరము వలననే (నీకంటె వేరగు మరియొక కారణమున మాత్రమే) నెరవేరునది. విత్తనపు మొలక మొలకెత్తుటకు ముందు నీటిని అపేక్షించినట్లు ఈ కార్యసాఫల్యమునకు నీవు ఉత్తమ కారణము కమ్మని నిన్ను నేను కొరుచున్నాను. (నీ బాణప్రయోగములేనిదే పార్వతీవీక్షణాద్యాసక్తియే కలుగదు. కావున శీఘ్రముగా కార్యసిద్ధికై బయలుదేరు మని భావము.) 18

దేవతావిజయమున కుపాయభూతుడైన ఆ శివునియందు అస్త్రమును ప్రయోగించు అవకాశము నీకే దక్కినది. కనుక నీవు ధన్యుడవు. ఎట్లనగా ప్రారంభించిన కర్మ అప్రసిద్ధమైనదైనను, ఇతరులకెవరికిని సాధింపరానిదైనచో ఆ కర్మ ఆ పురుషులకు కీర్తిప్రదమే అగును. 19

**అవతారిక :** ప్రోత్సహించుటకై ఇంద్రుడు మన్మథుని స్తుతించుచున్నాడు.

ఈ దేవతలు నిన్ను వేడుకొనువారు. నీవు సాధింపవలసిన పని ముల్లోకములకు ఇష్టమైనది. నీవింటి చేత సాధింపవలసిన ఈ పని అతిక్రూరమైనది కూడ కాదు. ఆహా! నీ పరాక్రమము అత్యాశ్చర్యకరము అయినది. 20

ఓ మన్మధుడా! ఈ వసంతుడు కూడ (నీ స్నేహితుడగుట వలన) ప్రత్యేకముగా చెప్పకపోయినను నీకు సహాయకుడుగా (నీ వెంటనే) వచ్చును. అగ్నిని ప్రజ్వలింపజేయుమని వాయుదేవుని ఎవ్వరు ప్రేరేపింతురు? (ఎవరును ప్రేరేపింపకయే స్నేహితుడుగా కార్యసాధనలో తోడ్పడునని భావము.) 21

శ్లో॥ తథేతి శేషామివ భర్తు రాజ్ఞా
మాదాయ మూర్ధ్నా మదనః ప్రతస్థే ।
ఐరావతాస్ఫాలనకర్కశేన
హస్తేన పస్పర్శ తదఙ్గ మిన్ద్రః ॥ 22

శ్లో॥ స మాధవే నాభిమతేన సఖ్యా
రత్యా చ సాశఙ్క మనుప్రయాతః ।
అఙ్గవ్యయప్రార్థిత కార్యసిద్ధి
స్థాణ్వాశ్రమం హైమవతం జగామ ॥ 23

## స్మరసహాయార్థం వసన్తధర్మప్రవర్తనమ్

శ్లో॥ తస్మిన్ వనే సంయమినాం మునీనాం
తపస్సమాధేః ప్రతికూలవర్తీ ।
సఙ్కల్పయోనే రభిమానభూత
మాత్మాన మాధాయ మధు ర్జజృమ్భే ॥ 24

అవ. : వసన్తధర్మా నాహ.

శ్లో॥ కుబేరగుప్తాం దిశ ముష్ణరశ్మౌ
గన్తుం ప్రవృత్తే సమయం విలఙ్ఘ్య ।
ది గ్దక్షిణా గన్ధవహం ముఖేన
వ్యలీకనిశ్వాస మివోత్ససర్జ ॥ 25

అట్లే అని చెప్పి, తన ప్రభువైన ఇంద్రు డిచ్చిన ఆజ్ఞను శేషమాలను వలె (భగవత్ప్రసాదరూపముగా ఇచ్చిన పూలమాలను వలె) ఔదల దాల్చి, మన్మథుడు కార్యసిద్ధికై బయలుదేరెను. ఇంద్రుడు కూడ తన ఐరావత గజమును ప్రోత్సాహమునకై తాటించుటవలన కర్కశమైన తన అరచేతితో ఆ మన్మథుని వీపుపై తాటించి, ప్రోత్సహించెను. (ప్రభువులు సేవకులను హస్తస్పర్శ గావించుట బహుమానసూచకమని అర్థము.) **22**

ఆ మన్మథుడు, ఇష్టసఖుడగు వసంతునితోను, భార్యయగు రతీదేవితోను, కలిసి బయలుదేరినవాడై, ఆపద వచ్చునేమో అని అనుమానపడుచునే తన శరీరనాశనముతో నయినను దేవతల కార్యమును సిద్ధింపజేయదలచి, హిమవత్పర్వతప్రాంతమునందున్న శివుని ఆశ్రమమునకు చేరెను. **23**

## మన్మథునకు తోడ్పడుటకై వసంతధర్మము ప్రవర్తిల్లుట

ఆ శివాశ్రమమునందు తపస్సమాధివలన నిశ్చల చిత్తులైన మునులయొక్క తపస్సుకు, ఏకాగ్రతకు భంగము కలిగించునట్లుగా ప్రవర్తించుచు, మధువు (వసంతుడు) మన్మథుని గర్వమునకు మూలకారణమగు తన నిజస్వరూపమును ధరించి, విజృంభించెను. **24**

**అవతారిక :** వసంతధర్మములను చెప్పుచున్నాడు.

25. వసంతవర్ణనముతోబాటుగా ఈ శ్లోకమునందు ఒక చక్కని శృంగార భావమును కూడ కాళిదాసు మనోహరముగా కల్పించినాడు. ఆ భావము కుండలీకరణములలో చూపబడినది-

సూర్యుడు (సాహసికుడగు నాయకుడు) దక్షిణాయనకాలమును (సంగమకాలమును) అతిక్రమించి, కుబేరునిచే పాలింపబడిన (కుత్సిత నాయకునిచే ఉంచుకొనబడిన) ఉత్తరదిశను (ఒకానొక నాయికను) గూర్చి పోవుటకు (సంభోగించుటకు పోవుటనుగూర్చి) ప్రయత్నించు

## వసన్తావతారజనిత స్థావరవికారవర్ణనమ్

శ్లో॥ అసూత సద్యః కుసుమా న్యశోకః
స్కన్ధాత్ప్రభృత్యేవ సపల్లవాని ।
పాదేన నాపైక్షత సున్దరీణాం
సమ్పర్క మాశిఞ్జితనూపురేణ ॥ 26

శ్లో॥ సద్యః ప్రవాలోద్గమచారుపత్రే
నీతే సమాప్తిం నవచూతబాణే ।
నివేశయామాస మధు ర్ద్విరేఫాః
నామాక్షరాణీవ మనోభవస్య ॥ 27

శ్లో॥ వర్ణప్రకర్షే సతి కర్ణికారం
ధునోతి నిర్గన్ధతయాస్మ చేతః ।
ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః॥ 28

చుండగా ఆ దక్షిణదిక్కు (దాక్షిణ్యముగల ఆ నాయిక, తన అగ్రభాగముచే (ముఖముచే) గాలిని (ఊర్పును) దుఃఖముచేవచ్చు నిట్టూర్పువలె విడిచిపెట్టెను. (ఉత్తరాయణసూచకములుగా వేడిగాలులు వెలువడినవి. భర్త తనకంటె దూరముగా ఇతర స్త్రీసంగమమునకై పోవుచున్నాడను విషయము తెలిసిన దక్షిణదిక్కు అను నాయిక విడిచిన నిట్టూర్పులేమో అన్నట్లున్నవని చమత్కారకల్పనము ఇందున్నది.) 25

## వసంతావతారమువలన స్థావరములలో కలిగిన వికారముల వర్ణనము

అశోకవృక్షము దోహదక్రియయొక్క అవసరము లేకుండగానే మ్రాను మొదలుకొని చిగుళ్ళతో, పువ్వులతో నిండియుండెను. (అకాలములో అశోకవృక్షము పూయవలెనన్నచో అందమైన స్త్రీ కాళ్ళకు పారాణిని పెట్టుకొని, అందెలు తొడిగికొని తన్నుట అను దోహదక్రియను చేయవలెను) కాని నేడా అశోకము దోహదక్రియ నపేక్షింపకయే వసంతుని కాలము కనుక తనంత తాను పూచినదని కాళిదాసు చెప్పుటలోని ఆంతర్యము ఇది. (దోహదక్రియా వివరములు మా మాలవికాగ్నిమిత్ర నాటకమునందలి చతుర్థాంకమునందు పొందుపరుప బడినవి.) 26

మన్మధునకు బాణములను చేసిఇచ్చు వసంతుడు పల్లవాంకురములే చక్కని రెక్కలుగాగల మామిడి మొగ్గ అను బాణమును తయారు చేసి, ఆ బాణముపై మన్మధుని నామాక్షరముల వలె తుమ్మెదలను ఆ మామిడి మొగ్గలపై జోడించెను. 27

హెచ్చుగా వాసన ఉన్నను ప్రజల మనస్సును కొండగోగువువ్వు రంగు విషయములో ఖేదపెట్టుచున్నది కదా! బహుశః తన సృష్టిలో సంపూర్ణతా సంపాదనవిషయమున బ్రహ్మయొక్క ప్రవృత్తి పరాఙ్ముఖమై (పెడమోము కలదై) ఉండును. (అని అనిపించుచున్నది) 28

శ్లో॥ బాలేన్దువక్రా ణ్యవికాసభావా
ద్బభుః పలాశా న్యతిలోహితాని ।
సద్యో వసన్తేన సమాగతానాం
నఖక్షతానీవ వనస్థలీనామ్ ॥ 29

శ్లో॥ లగ్నద్విరేఫాఞ్జనభక్తిచిత్రం
ముఖే మధుశ్రీ స్తిలకం ప్రకాశ్య ।
రాగేణ బాలారుణకోమలేన
చూతప్రవాలోష్ఠ మలఞ్చకార ॥ 30

## వసన్తర్తుజనితజఙ్గమవికారవిర్ణనమ్

శ్లో॥ మృగాః ప్రియాలద్రుమమఞ్జరీణాం
రజఃకణై ర్విఘ్నితదృష్టిపాతాః ।
మదోద్ధతాః ప్రత్యనిలం విచేరు
ర్వనస్థలీ ర్మర్మరపత్రమోక్షాః ॥ 31

శ్లో॥ చూతాఙ్కురాస్వాదకషాయకణ్ఠః
పుంస్కోకిలో య న్మధురం చుకూజ ।
మనస్వినీమానవిఘాతదక్షం
తదేవ జాతం వచనం స్మరస్య ॥ 32

బాగుగా వికసింపకపోవుటవలన, బాలచంద్రునివలె వంకరతిరిగి, మిక్కిలి ఎఱ్ఱనైన మోదుగపువ్వులు వసంతునిచే భోగింపబడిన (సంగమమందిన) వనాంగనల దేహమునందు, అతనిచే రతి సమయమునం దుంచబడిన నఖక్షతములవలె ప్రకాశించినవి. 29

అంటిన తుమ్మెదలు అను, కాటుకవలె నల్లని అలంకార రేఖలుగల తిలకపుష్పము అను తిలకమును ముఖమునందు (వసంతఋతువుయొక్క ఆరంభకాలమున) అలంకరించుకొని, మెఱియుజేయుచు, బాలసూర్యునివలె ఎఱ్ఱనైన, మృదువైన లత్తుకద్రవముతో మామిడి చిగురు అను క్రింది పెదవిని వసంతలక్ష్మి అలంకరించెను. (వసంతము రాగానే తిలకవృక్షములు పూచెను. తుమ్మెదలు వ్యాపించెను. మామిడి చిగిర్చెను అని భావము.) 30

## వసంతోదయమువలన జంగమములలో కలిగిన వికారములవర్ణనము

(ప్రియాల) ప్రేంకణపు తీగెల పూగుత్తులనుండి రాలిపడు పుప్పొడిచే తమ దృష్టి ప్రసారము అడ్డుపడుచున్నను మదముచే అనివారితములగు లేళ్ళు, ఎదురుగాలికి రాలి, గలగలలాడుచున్న ఎండుటాకులు గల వనప్రదేశములలో తిరుగసాగినవి. 31

మామిడిమొలకలను భక్షించుటవలన రక్తకంఠముకల (కషాయపు రుచిని చవిచూచిన కంఠముకల) ఏ గండుకోయిల కూసినదో ఆ కూతయే ప్రణయకలహములుకల మానవతుల కోపములను పోగొట్టజాలిన మన్మథుని ఆజ్ఞ (మాట) అయినది. (కోకిలలు కూసెను. మావిమొగ్గలు తొడిగెను. మానవతులకు మానములు (కోపములు) పోయెను. అను వసంతధర్మము లిందు చెప్పబడినవి.) 32

శ్లో॥ హిమవ్యపాయా ద్విశదాధరాణా
మా పాణ్డురీభూతముఖచ్ఛవీనామ్ ।
స్వేదోద్గమః కిమ్పురుషాఙ్గనానాం
చక్రే పదం పత్త్రవిశేషకేషు ॥ 33

శ్లో॥ తపస్వినః స్థాణువనౌకస స్తా
మాకాలికీం వీక్ష్య మధుప్రవృత్తిమ్ ।
ప్రయత్నసంస్తమ్భితవిక్రియాణాం
కథఞ్చి దీశా మనసాం బభూవుః ॥ 34

శ్లో॥ తం దేశ మారోపితపుష్పచాపే
రతిద్వితీయే మదనే ప్రపన్నే ।
కాష్ఠాగతస్నేహరసానువిద్ధం
ద్వన్ద్వాని భావం క్రియయా వివవ్రుః ॥ 35

అవ. : తా శ్చేష్టా అహ 'మధు' ఇత్యాదిభి శ్చతుర్భిః.

మంచు లేకపోవుటవలన (కింపురుషస్త్రీలు తమ పెదవులు పగులకుండుటకు శిశిరఋతువులో పూసుకొనెడు మైనము వసంత ఋతువులో పూయకుండుటచేత) వారి పెదవులు ఇప్పుడు నిర్మలముగా, స్పష్టముగా కనబడుచున్నవి. (శిశిర ఋతువులో వారు, చలిపోయి వెచ్చగా ఉండుటకై, కుంకుమను పూసుకొనెడివారు. ఇప్పుడా అవసరము లేకుండుటవలన కుంకుమ పూయక పోవుటతో) కింపురుషాంగనల ముఖములు కొంచెము పాండురవర్ణముతో (తెల్లగా) ఉన్నవి. (ఆ కింపురుషాంగనల బుగ్గలపై వసంతశృంగారసూచకముగా) రచింపబడిన మకరికాపత్రరచనలయందు (చెక్కిళ్ళయందు కుంకుమ మొదలగు శోభనద్రవ్యములతో అలంకారముగా రచింపబడు గజసింహాద్యాకృతి రేఖలయందు) చిరుచెమట పట్టసాగినది. 33

ఆ శివుని తపోవనమున నివసించి, తపస్సుచేసికొను మునులు అకాలికమైన (అకాలమున పుట్టి కార్యావసానమున నశించు) వసంత విజృంభణమును చూచి వారి మనస్సులలో కలిగిన మన్మథవికారములను అతికష్టముమీద నిగ్రహించుకొనజాలిరి. 34

విల్లు నెక్కుపెట్టి, పూలబాణములను చేతబట్టి, తన భార్యయగు రతీదేవి తోడురాగా, మన్మథుడు ఆ శివాశ్రమప్రాంతమునకు చేరుకొనగనే (స్థావర జంగమాత్మకములగు) జంటలన్నియు పెల్లుబుకిన ప్రేమరసముతో కూడిన శృంగారభావమును తమ చేష్టచే ప్రకటించినవి. 35

అవతారిక : ఆ శృంగారభావములనే ఇకమీదనున్న 4 శ్లోకములలో చెప్పినాడు.

శ్లో॥ మధు ద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌ ప్రియాం స్వా మనువర్తమానః ।
శృఙ్గేణ సంస్పర్శనిమీలితాక్షీం
మృగీ మకణ్డూయత కృష్ణసారః ॥ 36

శ్లో॥ దదౌ రసా త్పఙ్కజరేణుగన్ధి
గజాయ గణ్డూషజలం కరేణుః ।
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సమ్భావయామాస రథాఙ్గనామా ॥ 37

శ్లో॥ గీతాన్తరేషు శ్రమవారిలేశైః
కిఞ్చి త్సముచ్ఛ్వాసితపత్త్రలేఖమ్ ॥
పుష్పాసవాఘూర్ణితనేత్రశోభి
ప్రియాముఖం కిమ్పురుష శ్చుచుమ్బే ॥ 38

శ్లో॥ పర్యాప్త పుష్పస్తబకస్తనాభ్యః
స్ఫురత్ప్రవాలోష్ఠమనోహరాభ్యః ।
లతావధూభ్య స్తరవో ఽ ప్యవాపు
ర్వినమ్రశాఖాభుజబన్ధనాని ॥ 39

శ్లో॥ శ్రుతాప్సరోగీతిరపి క్షణేఽ స్మి౯
హరః ప్రసంఖ్యానపరో బభూవ ।
ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నాః
సమాధిభేదప్రభవో భవన్తి ॥ 40

పూవు అనెడు ఏకపాత్రలో తన ప్రియురాలిని అనుసరించుచు తుమ్మెద మదువును త్రాగెను. తన స్పర్శవలన కలిగిన ప్రేమపారవశ్యముతో కనులు మూతపడిన తన ప్రియురాలగు ఆడులేడిని తన కొమ్ముకొనతో నల్లలేడి గోకెను. 36

ఆడ ఏనుగు, పద్మపుపుప్పొడిచే సువాసనగల తన పుక్కిటియందలి నీటిని తన ప్రియుడగు మగఏనుగుకు ఇచ్చెను. (అట్లే) చక్రవాకపక్షి, తాను సగభాగమును తిన్న తామరతూటితో తన ప్రియురాలిని గౌరవించెను. (ప్రియాప్రియులు ఒకరి ఎంగిలిని మరొకరు తినుట వారి ప్రేమకు నిదర్శన మని భావము.) 37

చెమటనీటచుక్కలచేత కొంచెముగా పొంగిన (శిథిలమైన) మకరికాపత్రరచనలుకలదియును, పుష్పములనుండి తీయబడిన మద్యముచే గిరగిర తిరుగుచున్నకళ్ళచే అందముగా ప్రకాశించు నదియును అగు తన ప్రియురాలి ముఖమును, ఆమె పాటలు పాడుచుండగా మధ్యమధ్యన కింపురుషుడు ముద్దాడెను. 38

సంపూర్ణమగు (గుండ్రని, పెద్ద) పూగుత్తులు అనెడు స్తనములు గలవియును, ప్రకాశించుచున్న చిగుళ్ళు అను పెదవులతో అందమైనవి యును అగు తీగెలు అను నాయికలచే చెట్లు అను నాయకులు వంగిన కొమ్మలు అను, చేతులతో కౌగిలింతలను పొందిరి. 39

ఈ వసంత సమయమునందు అప్సరసలు పాడుచున్న గానమును విని కూడ, ఆత్మానుసంధానమునందే శివుడు ఆసక్తికలిగియుండెను. ఆత్మేశ్వరులకు (జితేంద్రియులకు) విఘ్నములు ఎన్నడును వారి తపస్సమాధికి భంగకరములు కానేరవు. 40

శ్లో॥ లతాగృహద్వారగతోఽథ నన్దీ
వామప్రకోష్ఠార్పిత హేమవేత్రః ।
ముఖార్పితైకాఙ్గులిసంజ్ఞయైవ
మా చాపలాయేతి గణాన్ వ్యనైషీత్ ॥ 41

అవ. : న కేవలం ప్రమథాః, జరాయుజాది చతుర్విధ
ప్రాణినోఽపి నన్దీశ్వర స్యాజ్ఞాబద్ధా బభూవుః ఇత్యాహ.

శ్లో॥ నిష్కమ్పవృక్షం నిభృతద్విరేఫం
మూకాణ్డజం శాన్తమృగప్రచారమ్ ।
తచ్ఛాసనాత్ కాననమేవ సర్వం
చిత్రార్పితారమ్భ మివావతస్థే ॥ 42

## పరమేశ్వరస్య ధ్యానస్థితిః

శ్లో॥ దృష్టిప్రపాతం పరిహృత్య తస్య
కామః పురశ్శుక్రమివ ప్రయాణే ।
ప్రాన్తేషు సంసక్తనమేరుశాఖం
ధ్యానాస్పదం భూతపతే ర్వివేశ ॥ 43

ఆ పిమ్మట (శివుని తపోవనమైన) పొదరింటి గడపవద్దనున్న, (శివుని వాహనమగు) నందీశ్వరుడు తన బంగారు బెత్తమును ఎడమ ముంజేతి వద్ద ఉంచుకొని, తన మూతిమీద (చూపుడు) వేలి నొక్కదానినే ఉంచుకొని (శివుని పరివారమైన) ప్రమథగణములను (శబ్దము చేయవద్దు అని సూచించు) సంజ్ఞ చేతనే "చపలచేష్టలను చేయకుడు" అని ఆజ్ఞాపించెను. **41**

అవతారిక : ప్రమథులే కాదు జరాయుజములు మొదలగు (చరాచర జగత్ ప్రాణులన్నియు) చతుర్విధప్రాణులు నందీశ్వరుని ఆజ్ఞకు లోబడిరని చెప్పుచున్నాడు.

ఆ నందీశ్వరుని ఆజ్ఞవలన శివుని తపోవన మంతయు చిత్రమునందు గీయబడినదివలె, కదలికలేని చెట్లు కలదిగను, చలింపని తుమ్మెదలు కలదిగను, మూగవోయిన పక్షులు కలదిగను, సంచారములేని మృగములు (లేళ్ళు) కలదిగను అయిపోయెను.
(ఇందు 1.జరాయుజములు = లేళ్ళు 2. ఉద్భిజ్జములు = చెట్లు 3.అండజములు = పక్షులు 4.స్వేదజములకీ సన్నివేశమున తావులేదు. ఇవన్నియును నంది ఆజ్ఞను పాలించినవన్నచో జగత్తంతయు ఆతని ఆజ్ఞకు లోబడి నిశ్చలమైపోయినదని భావము.) **42**

## పరమేశ్వరుని ధ్యానస్థితి

(పురఃశుక్ర) ఎదుట శుక్రుడున్న తావునువలె, ఆ నందీశ్వరుని దృష్టినుండి తప్పించుకొని, పక్కభాగములయందు అల్లుకొనియున్న సురపొన్నలుగల శివుని తపఃప్రాంతములోనికి మన్మథుడు ప్రవేశించెను. **43**

శ్లో॥ స దేవదారుద్రుమవేదికాయాం
శార్దూలచర్మవ్యవధానవత్యామ్ ।
ఆసీన మాసన్నశరీరపాత
స్త్రియమ్బకం సంయమినం దదర్శ ॥ 44

అవ. : త మేవ దేవం షడ్భిః శ్లోకై ర్వర్ణయతి

శ్లో॥ పర్యఙ్కబన్ధస్థిరపూర్వకాయ
మృజ్వాయతం సన్నమితోభయాంసమ్ ।
ఉత్తానపాణిద్వయసన్నివేశాత్
ప్రఫుల్లరాజీవమివాఙ్కమధ్యే ॥ 45

శ్లో॥ భుజఙ్గమోన్నద్ధజటాకలాపం
కర్ణావసక్తద్విగుణాక్షసూత్రమ్ ।
కణ్ఠప్రభాసఙ్గవిశేషనీలాం
కృష్ణత్వచం గ్రన్థిమతీం దధానమ్ ॥ 46

శ్లో॥ కిఞ్చిత్ప్రకాశస్తిమితోగ్రతారై
ర్భ్రూవిక్రియాయాం విరతప్రసఙ్గైః ।
నేత్రై రవిస్పన్దితపక్ష్మమాలై
ర్లక్ష్యీకృతఘ్రాణ మధోమయూఖైః ॥ 47

పులితోలు కప్పిన, దేవదారు వృక్షపు అరుగుపై కూర్చొనియున్న, తపస్సమాధిలోఉన్న ముక్కంటిని, మరణకాలము సమీపించిన ఆ మన్మథుడు చూచెను. 44

అవతారిక : ఆ ఈశ్వరునే ఆరు శ్లోకములతో వర్ణించుచున్నాడు.

45. (పర్యంకబంధము) వీరాసనము వేయుటవలన శరీరపు పై సగభాగము (నడుమునుండి తలవరకు) తిన్నగను, పొడుగుగను ఉన్నది. బాగా వంచబడిన రెండు భుజములు కలదియు, వెల్లకిలగా ఉండునట్లుంచబడిన రెండు అరచేతుల స్థితివలన తొడలనడుమన బాగుగా వికసించిన పద్మము కలవాడో అన్నట్లున్న ఆ శివుని రూపమును (మన్మథుడు చూచెను.) 45

46. పాములతో పైకెత్తికట్టిన జటాకలాపముకలవాడును, చెవినుండి వ్రేలాడుచున్న రెండుపేటల జపమాల కలవాడును, మెడయందలి నల్లనిమచ్చకాంతితో మిక్కిలి నల్లగా కనబడుచున్న కంఠముకలవాడును, ముడికల నల్లచారల లేడిచర్మమును ధరించిన వాడును, అగు ఈశ్వరుని (మన్మథుడు చూచెను.) 46

47. కొంచెము కాంతికలిగినట్టియు, నిశ్చలములై, భయంకరములగు కనుగుడ్డుకలిగి, చలింపని కనుబొమలు, రెప్పలుకలిగి, క్రిందివైపునకు ప్రసరించుచున్న దృక్కిరణములతో ముక్కుకొనను చూచుచు ధ్యానించుచున్న (శివుని మన్మథుడు చూచెను. ఈ శివునకు మూడు కన్నులుండుట వలన కాళిదాసు నేత్రైః అని బహువచనమును వాడినాడు) 47

శ్లో॥ అవృష్టిసంరమ్భ మివామ్బువాహ
మపా మివాధార మనుత్తరఙ్గమ్ ।
అన్తశ్చరాణాం మరుతాం నిరోధా
న్ని వాతనిష్కమ్పమివ ప్రదీపమ్ ॥ 48

శ్లో॥ కపాలనేత్రాన్తరలబ్ధమార్గైః
జ్యోతిఃప్రరోహై రుదితై శ్శిరస్తః ।
మృణాళసూత్రాధికసౌకుమార్యాం
బాలస్య లక్ష్మీం గ్లపయన్త మిన్దోః ॥ 49

శ్లో॥ మనో నవద్వారనిషిద్ధవృత్తి
హృది వ్యవస్థాప్య సమాధివశ్యమ్ ।
య మక్షరం క్షేత్రవిదో విదు స్త
మాత్మాన మాత్మ న్యవలోకయన్తమ్ ॥ 50

శ్లో॥ స్మర స్తథాభూత మయుగ్మనేత్రం
పశ్య న్నదూరా న్మనసా ఉ ప్యధృష్యమ్ ।
నాలక్షయత్ సాధ్వససన్నహస్తః
స్రస్తం శరం చాపమపి స్వహస్తాత్ ॥ 51

శ్లో॥ నిర్వాణభూయిష్ఠ మథాస్య వీర్యం
సంధుక్షయన్తీవ వపుర్గుణేన ।
అనుప్రయాతా వనదేవతాభ్యా
మదృశ్యత స్థావరరాజకన్యా ॥ 52

శరీరమునందు సంచరించు పంచప్రాణములప్రసారమును ప్రాణాయా మముద్వారా (యోగనిరోదముద్వారా) నిరోధించుటవలన, వానలేని మేఘమువలెను, అలలులేని మడుగువలెను, గాలిలేని చోటనుంచిన దీపమువలెను నిశ్చలముగానున్న (శివుని మన్మథుడు చూచెను). 48

బ్రహ్మకపాలముయొక్క కంటినడుమనుండి, (మాడు లేక బ్రహ్మరంధ్రము నుండి) వెలువడు దారులను కలిగి, బ్రహ్మరంధ్రము నుండి వెడలివచ్చు తేజోంకురములచే, తామరతూటి దారముకంటె మిక్కిలి కోమలమగు కిరణములుగల బాలచంద్రుని శోభను తాడింపజేయుచున్న (శివుని మన్మథుడు చూచెను). 49

నవరంధ్రములనరికట్టి, సమాధిదశచే స్వాధీనమైన మనస్సును హృదయమున నిలిపి, క్షేత్రజ్ఞులగు పురుషులు ఎవనిని అక్షరునిగా తెలిసికొనిరో, అట్టి తనను తనయందే (తన ఆత్మను ఆత్మయందే) సాక్షాత్కరింపజేసికొనిన (ఈశ్వరుని మన్మథుడు చూచెను.) 50

పూర్వము చెప్పబడిన రీతిగా ఉన్నట్టియు, మనస్సుతోనైనను బెదరింప శక్యము కానట్టియు, మూడుకన్నులు కలిగినట్టియు ఆ శివుని, సమీపమునుండి చూచుచు భయముచే పట్టువిడిన తన చేతినుండి అమ్మును, ధనస్సును, జారిపోయిన విషయమును తెలిసికొనలేక పోయెను. (భయపడినవానికి ఒళ్ళు తెలియదని భావము.) 51

మన్మథుడు శివుని చూచిన తరువాత, దాదాపు ఆరిపోయినట్లే ఉన్న మన్మథుని బలమును వృద్ధిపొందించుచున్నదో అన్నట్లు (తన చెలికత్తెలగు) వనదేవతలతో కలిసి, వచ్చుచున్న పార్వతీదేవి మన్మథుని కంటబడినది. 52

## ఉమాయాః వసన్తపుష్పాభరణ రమణీయత్వమ్

అవ. : తా మేవాహ చతుర్భిః.

శ్లో॥ అశోకనిర్భర్త్సిత పద్మరాగ
మాకృష్టహేమద్యుతికర్ణికారమ్ ।
ముక్తాకలాపీకృతసిన్దువారం
వసన్తపుష్పాభరణం వహన్తీ ॥ 53

శ్లో॥ ఆవర్జితా కిఞ్చిదివ స్తనాభ్యాం
వాసో వసానా తరుణార్కరాగమ్ ।
పర్యాప్తపుష్పస్తబకావనమ్రా
సఞ్చారిణీ పల్లవినీ లతేవ ॥ 54

శ్లో॥ స్రస్తాం నితమ్బా దవలమ్బమానా
పునఃపునః కేసరదామకాఞ్చీమ్ ।
న్యాసీకృతాం స్థానవిదా స్మరేణ
మౌర్వీం ద్వితీయామివ కార్ముకస్య ॥ 55

శ్లో॥ సుగన్ధినిఃశ్వాసవివృద్ధతృష్ణం
బిమ్బాధరాసన్నచరం ద్విరేఫమ్ ।
ప్రతిక్షణం సమ్భ్రమలోలదృష్టి
ర్లీలారవిన్దేన నివారయన్తీ ॥ 56

## ఉమాదేవి ధరించిన వసంతపుష్పాభరణముల రమణీయత

అవతారిక : ఆ పార్వతినే నాలుగు శ్లోకములలో వర్ణించుచున్నాడు.

పద్మరాగమణులను, ఆభరణములను ఎఱ్ఱని అశోకపుష్పముచే తిరస్కరించునదియును, కొండగోగుపూలతో బంగారు నగలను ఆకర్షించునదియును, వావిలిపూలనే ముత్యముల నగలుగా ధరించినదియును, (అశోకము, కొండగోగు, వావిలిపుష్పము అను వసంతఋతువునకు సంబంధించిన పూలనే ఆభరణములుగా ధరించినదియును) అగు పార్వతీదేవి ఈశ్వరుని సన్నిధానమునకు వచ్చుచు కనబడినది. **53**

స్తనభారముచే కొంచెము వంగినదివలెనున్నదియును, బాలసూర్యునివలె ఎఱ్ఱగానున్న, వస్త్రమును ధరించినదియును అగు పార్వతి పూర్ణములైన పూగుత్తుల బరువుచే వంగియున్న ఎఱ్ఱని చిగురాకులుకల తిరుగాడు పూదీగవలె కనబడినది. **54**

భద్రమగు స్థలము నెరిగిన మన్మథుడు తన వింటియొక్క రెండవ నారిని (వింటి త్రాటిని) దీనియందు తాకట్టుపెట్టినాడేమో అన్నట్లు పిరుదులనుండి క్రిందికి వ్రేలాడుచున్న పొగడపూదండ అను మొలత్రాడు మాటిమాటికి జారిపోవుచుండగా, దానిని చేతితో పట్టుకొనుచున్న పార్వతి కనబడినది. **55**

పద్మినీజాతిస్త్రీ అగుటవలన పార్వతియొక్క నిట్టూర్పుగాలి పద్మసుగంధమును కలిగియుండెను. ఆ సువాసనను పీల్చి ఆనందించుటయందత్యాశ గలిగిన, దొండపండువంటి ఎఱ్ఱని క్రిందిపెదవివద్ద (రొద చేయుచు) తిరుగుచున్న తుమ్మెదను, తన చేతిలో క్రీడార్థము పట్టుకొనిన కమలముచే ప్రతిక్షణము అడ్డుచు కంగారుతో బెదురుచూపులు చూచుచున్న పార్వతి కనబడెను. **56**

శ్లో॥ తాం వీక్ష్య సర్వావయవానవద్యాం
రతేరపి హ్రీపద మాదధానామ్ ।
జితేన్ద్రియే శూలిని పుష్పచాపః
స్వకార్యసిద్ధిం పున రాశశంసే ॥ 57

శ్లో॥ భవిష్యతః పత్యు రుమా చ శమ్భోః
సమాససాద ప్రతిహారభూమిమ్ ।
యోగాత్ స చాన్తః పరమాత్మసంజ్ఞం
దృష్ట్వా పరంజ్యోతి రుపారరామ ॥ 58

శ్లో॥ తతో భుజఙ్గాధిపతేఃఫణాగ్రై
రధః కథఞ్చి ద్ధృతభూమిభాగః ।
శనైః కృతప్రాణవిముక్తి రీశః
పర్యఙ్కబన్ధం నిబిడం బిభేద ॥ 59

శ్లో॥ తస్మై శశంస ప్రణిపత్య నన్దీ
శుశ్రూషయా శైలసుతా ముపేతామ్ ।
ప్రవేశయామాస చ భర్తు రేనాం
భ్రూక్షేపమాత్రానుమతప్రవేశామ్ ॥ 60

శ్లో॥ తస్యా స్సఖీభ్యాం ప్రణిపాతపూర్వం
స్వహస్తలూన శ్శిశిరాత్యయస్య ।
వ్యకీర్యత త్ర్యమ్బకపాదమూలే
పుష్పోచ్చయః పల్లవభఙ్గభిన్నః ॥ 61

ఏ అవయవము నందును ఎట్టి లోపమును లేని (అందువలన తన సౌందర్యముతో) రతీదేవికి కూడ (అంత సౌందర్యము లేకుండుటవలన) సిగ్గును కలిగించుచున్న, ఆ పార్వతీదేవిని చూచి, మన్మథుడు జితేంద్రియుడైన శివుని గెలుచు విషయమున, మరల తన కార్యసిద్ధిపై ఆశను బూనెను. 57

ఆ పార్వతీదేవి తనకు కాబోవు భర్తయగు శివుడు తపస్సు చేసికొనుచున్న స్థలముయొక్క ప్రవేశద్వారమును చేరెను. ఆ శివుడును పరమాత్మ (పరబ్రహ్మ) అను పేరుగల ముఖ్యతేజస్సును (తపస్సమాధి ద్వారా అంతర్ముఖముగా) సాక్షాత్కరింపజేసికొని, యోగసమాధిని విరమించి, బహిర్ముఖు డయ్యెను. 58

ఆ తరువాత భూమి క్రిందనుండి అతి కష్టముగా భూభారమును తన పడగలకొనలతో శేషుడు వహించునట్లుగా శివుడు ప్రాణాపాయమును విడిచి, బరువెక్కిన శరీరముతో తన దట్టమగు వీరాసనమును సడలించెను. 59

నందీశ్వరుడు శివునికి నమస్కరించి, “సేవించుటకై పార్వతి వచ్చిన”దని విన్నవించెను. కనుబొమలకదలిక అను సంజ్ఞచేతమాత్రమే ప్రవేశించుట కనుమతింపబడిన పార్వతిని, తపోవనములోనికి ప్రవేశపెట్టెను. 60

పార్వతియే స్వయముగా తన హస్తములతో కోసిన, చిగుళ్ళతో కూడియున్న, వసంతఋతువులో పూయునట్టి, పుష్పములను పార్వతియొక్క ఇద్దరు చెలికత్తెలు, సాష్టాంగపడి ఈశ్వరుని పాదములకడ చల్లిరి. 61

శ్లో॥ ఉమాఽపి నీలాలకమధ్యశోభి
విస్రంసయన్తీ నవకర్ణికారమ్ ।
చకార కర్ణచ్యుతపల్లవేన మూర్ధ్నా
ప్రణామం వృషభధ్వజాయ ॥ 62

శ్లో॥ అనన్యభాజం పతి మాప్నుహీతి సా
తథ్య మేవాభిహితా భవేన ।
న హీశ్వర వ్యాహృతయః కదాచి
త్పుష్ణన్తి లోకే విపరీతమర్థమ్ ॥ 63

హరబద్ధలక్ష్యేణ కామేన శరసన్ధానమ్

శ్లో॥ కామస్తు బాణావసరం ప్రతీక్ష్య
పతఙ్గవ ద్వహ్నిముఖం వివిక్షుః ।
ఉమాసమక్షం హరబద్ధలక్ష్య
శ్శరాసనజ్యాం ముహు రామమర్శ ॥ 64

శ్లో॥ అథోపనిన్యే గిరిశాయ గౌరీ
తపస్వినే తామ్రరుచా కరేణ ।
విశోషితాం భానుమతో మయూఖై
ర్మన్దాకినీపుష్కరబీజమాలామ్ ॥ 65

శ్లో॥ ప్రతిగ్రహీతుం ప్రణయిప్రియత్వాత్
త్రిలోచన స్తా ముపచక్రమే చ ।
సంమోహనం నామ చ పుష్పధన్వా
ధను ష్యమోఘం సమధత్త బాణమ్ ॥ 66

పార్వతీదేవి తన నల్లని ముంగురులమధ్య అందముగా కనబడుచున్న క్రొత్త కొండగోగుపువ్వును క్రిందికి జార్చుచు, చెవి సందున ఉంచుకొనిన చిగురుటాకును జార్చుచు, తల వంచి, వృషభధ్వజునకు (వృషభమే జెండాపై గుర్తుగాగల శివునకు) ప్రణామము చేసెను. **62**

పార్వతీదేవి మ్రొక్కగానే పరమేశ్వరుడు "వేఱొక కాంతను పెండ్లాడని, (సవతిపోరులేని) ప్రియుని పొందు మని, దీవించెను. ఆ మాట నిజమే! (యుక్తమే). ఈశ్వరుల (మహాపురుషుల) మాటలు, ఎన్నడును లోకమునందు జరుగని విపరీతమైన విషయమును చాటిచెప్పవు కదా! **63**

## శివునిపై గురిపెట్టి, కాముడు బాణమును విడుచుట

పార్వతీదేవి శివునివద్ద నుండుటయే తన బాణప్రయోగమునకు తగిన సమయమని తలచి, అగ్నిలోనికి నురకగోరు మిడుతవలె హరుని మీద బాణమును గురిపెట్టి, తన వింటినారిని పలుమారు స్పృశించెను. **64**

ఆ తరువాత పార్వతీదేవి తపశ్శాలి యగు ఆ గిరీశునకు సహజముగా రాగిరంగువలె ఎఱ్ఱనైన తన (మృదువైన) హస్తముతో సూర్యుని కిరణములచే ఎండిన ఆకాశగంగయందలి పద్మబీజములతో తయారుచేసిన మాలను (తావళమును) సమర్పించెను. **65**

ముక్కంటియగు ఆ శివుడు ఆశ్రితులయందు ఇష్టముకలవా డగుట వలన, (పార్వతి సమర్పించిన తావళమును) స్వీకరించుటకు అంగీకరించి, తీసికొనబోవుచుండెను. (ఇంతలో) ఆ మన్మథుడు (పూవిలుకాడు) సమ్మోహనమను ప్రసిద్ధమైన, వ్యర్థముకాని, శరమును తన వింట సంధించెను. **66**



శ్లో॥ హరస్తు కించి త్పరిలుప్తధైర్య
శ్చన్ద్రోదయారమ్భ ఇవామ్బురాశిః ।
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని ॥ 67

శ్లో॥ వివృణ్వతీ శైలసుతా పి భావ
మఙ్గైః స్ఫురద్బాలకదమ్బకల్పైః ॥
సాచీకృతా చారుతరేణ తస్థౌ
ముఖేన పర్యస్తవిలోచనేన ॥ 68

శ్లో॥ అథేన్ద్రియక్షోభ మయుగ్మనేత్రః
పున ర్వశిత్వా ద్బలవ న్నిగృహ్య ।
హేతుం స్వచేతోవికృతే ర్దిదృక్షు
ర్దిశా ముపాన్తేషు ససర్జ దృష్టిమ్ ॥ 69

శ్లో॥ స దక్షిణాపాఙ్గనివిష్టముష్టిం
నతాంస మాకుఞ్చితసవ్యపాదమ్ ।
దదర్శ చక్రీకృతచారుచాపం
ప్రహర్తు మభ్యుద్యత మాత్మయోనిమ్ ॥ 70

హరుడైతే చంద్రోదయ కాలమునందు సముద్రునివలె, ధైర్యగుణము తగ్గినవాడై (కల్లోలపడుచు), దొండపండువంటి ఎఱ్ఱని క్రిందిపెదవిగల పార్వతీదేవి ముఖములోనికి (ప్రేమతో) తన నేత్రములను (దృష్టిని) ప్రసరింపజేసెను. 67

పార్వతీదేవి కూడ, వికసించిన బాలకదంబవృక్షముతో సమానమగు (పులకరించిన) అవయవములతో "రతి" అను పేరుగల శృంగార భావమును తెలియజేయుచు, మిక్కిలి సుందరములైన, సిగ్గుచే చెదరిన కనులుగల ముఖమును అడ్డముగా త్రిప్పుకొనియుండెను. 68

ఆ తరువాత త్రినేత్రుడు జితేంద్రియు డగుటవలన (తనకు కలిగిన) ఇంద్రియవికారమును (ప్రేమ భావమును) దృఢముగా నివారించి, తన చిత్తవికారమునకు కారణమును చూడగోరినవాడై, అన్ని దిక్కులకును తన దృష్టిని ప్రసరింపజేసెను. 69

కుడి క్రీగంటి దగ్గర (నారిని, బాణపు కుచ్చును పట్టుకొనుటకై) పిడికలిని బిగించినవాడును, భుజములను వంచియున్నవాడును, ఎడమకాలిని వంచినవాడును, వింటిని మండలాకారమేర్పడునట్లుగా ఆకర్షించినవాడును, తనపై బాణమును వేయుటకు సిద్ధముగా ఉన్నవాడును అగు మన్మథుని శివుడు చూచెను. (బాణప్రయోగము చేయునపుడు వీరులు తమ శరీరమును ఆలీఢము, మొదలగు 5 విధములుగా వంచుదురని యాదవకోశకారుడు ఇట్లు పేర్కొనినాడు.)

శ్లో॥ తపఃపరామర్శవివృద్ధమన్యో
ర్భ్రూభఙ్గదుష్ప్రేక్ష్యముఖస్య తస్య ।
స్ఫురన్నుదర్చి స్సహసా తృతీయా
దక్ష్ణః కృశానుః కిల నిష్పపాత ॥ 71

## శివేన స్మరస్య భస్మసాత్కరణమ్

శ్లో॥ క్రోధం ప్రభో! సంహర సంహరేతి
యావ ద్గిరః ఖే మరుతాం చరన్తి ।
తావ త్స వహ్ని ర్భవనేత్రజన్మా
భస్మావశేషం మదనం చకార ॥ 72

శ్లో॥ తీవ్రాభిషఙ్గప్రభవేణ వృత్తిం
మోహేన సంస్తమ్భయ తేన్ద్రియాణామ్ ।
అజ్ఞాతభర్తృవ్యసనా ముహూర్తం
కృతోపకారేవ రతి ర్బభూవ ॥ 73



మదనదహనం - శ్లోకము 72

శ్లో॥ స్థానాని ధన్వినాం పంచ తత్ర [1]వైశాఖ మస్త్రియామ్
విత్యస్త్యన్తరగౌ పాదౌ [2]మణ్డలం తోరణాకృతీ ।
[3]సమానౌస్యా త్సమపద [4]మాలీఢం పదమగ్రతః
దక్షిణం, వామ మాకుంచ్య [5]ప్రత్యాలీఢం విపర్యయః॥

1. వైశాఖము, 2. మండలము, 3. సమానము, 4. ఆలీఢము,
5. ప్రత్యాలీఢము అనునవి వీరులు ప్రదర్శించు అయిదు స్థానములు. 70

తపోభంగముచేత కోపము పెరిగినవాడును, కనుబొమ ముడిచే తేరిపార జూడరాని మోము కలవాడును, అగు ఆ శివునియొక్క మూడవకంటి నుండి, ప్రకాశమానమైన, జ్వాలల నెగజిమ్ముచున్నఅగ్ని వేగముగా వెడలెను. 71

## శివుడు కామదహనముచేయుట.

ఓ లోకనాథా! నీ కోపమును తగ్గించుకొనుము. తగ్గించుకొనుము అని దేవతల మాటలు ఆకాశమునందు ఎంతలో ప్రవర్తించుచున్నవో అంతలో హరుని నేత్రములనుండి జన్మించిన అగ్ని, ఆ మన్మథుని భస్మావశేషునిగా (బూడిదయే మిగిలిన శరీరము కలవానిగా) చేసెను. 72

తీవ్రమైన దుఃఖమే కారణముగా కలదియై, ఇంద్రియములయొక్క వ్యాపారమును అరికట్టుచున్న, మోహముచే క్షణకాలము పాటు భర్తయొక్క వినాశమువలన కలిగిన దుఃఖము తెలియనిదియై, మోహముచేత ఉపకారము చేయబడినదో అన్నట్లుగా రతీదేవి మూర్ఛిల్లియుండెను. 73

శ్లో॥ త మాశు విఘ్నం తపస స్తపస్వీ
వనస్పతిం వజ్రఇవావభజ్య ।
స్త్రీసన్నికర్షం పరిహర్తు
మిచ్ఛ న్నన్తర్దధే భూతపతి స్సభూతః ॥ 74

## శూన్యహృదయయా పార్వత్యా స్వభవనప్రస్థానమ్

శ్లో॥ శైలాత్మజాఽపి పితు రుచ్ఛిరసో ఽభిలాషం
వ్యర్థం సమర్థ్య లలితం వపు రాత్మనశ్చ ।
సఖ్యోః సమక్ష మితి చాధికజాతలజ్జా
శూన్యా జగామ భవనాభిముఖీ కథఞ్చిత్ ॥ 75

శ్లో॥ సపది ముకులితాక్షీం రుద్రసంరమ్భభీత్యా
దుహితర మనుకమ్ప్యా మద్రి రాదాయ దోర్భ్యామ్ ।
సురగజ ఇవ బిభ్రత్ పద్మినీం దన్తలగ్నాం
ప్రతిపథగతి రాసీ ద్వేగదీర్ఘీకృతాఙ్గః ॥ 76

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"మదనదాహో" నామ తృతీయః సర్గః

-౦0౦-

తపోనిష్ఠుడగు పరమేశ్వరుడు తపోభంగకారకుడైన ఆ మన్మథుని పిడుగు వృక్షమును నశింపజేయునట్లు, వేగముగా నశింపజేసి, స్త్రీసన్నిధానమును తొలగించుకొనగోరినవాడై, ప్రమథగణములతో సహా అదృశ్యు డయ్యెను. 74

## శూన్యహృదయఅయిన పార్వతి స్వభవనమునకు చేరుట

మహాత్ముడగు (గొప్పవాడగు) తండ్రియైన హిమవంతుని కోర్కెయును మృదువై, సుందరమైన తన శరీరమును, వ్యర్థములగుటను గమనించి, తన మనోరథము తన చెలికత్తెల సమక్షముననే నిష్ప్రయోజనమగుట వలన మరింత సిగ్గునొందుచు పార్వతీదేవి, శూన్యహృదయురాలై అతికష్టము మీద ఇంటిదారిని పట్టెను. (పితృగృహమును చేరెను.) 75

రుద్రుని కోపమువలన భయముచే కన్నులు మూసికొనినదియును, కనికరింపబడదగినదియును, అగు తన కుమార్తెను ఐరావతము తొండముతో గుచ్చిపట్టుకొనిన తామరతూడువలె తన చేతులమీదికి తీసికొని (పట్టుకొని) వేగముగా నడుచుటకై శరీరమును పొడుగుగా సాగదీసి, అయామార్గములయందున (ఎత్తుపల్లములకు) తగినట్లుగా నడువసాగెను. 76

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "మదనదాహము" అను పేరుగల మూడవ
సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-

# కుమారసమ్భవమ్

## "రతివిలాపవర్ణనమ్" నామ

## చతుర్థః సర్గః

అవ. : మూర్ఛితా రతి రిత్యుక్తమ్ - సమ్ప్రతి తద్వృత్తాన్త మేవాహ.

### రతివిలాపవర్ణనమ్

శ్లో॥ అథ మోహపరాయణా సతీ
వివశా కామవధూ ర్విబోధితా ।
విధినా ప్రతిపాదయిష్యతా
నవవైధవ్య మసహ్యా వేదనమ్ ॥ 1

శ్లో॥ అవధానపరే చకార సా
ప్రలయాన్తోన్మిషితే విలోచనే ।
న వివేద తయో రతృప్తయోః
ప్రియ మత్యన్తవిలుప్తదర్శనమ్ ॥ 2

# కుమారసంభవము

## "రతివిలాపవర్ణనము" అను
## నాల్గవసర్గము

అవతారిక : రతి మూర్ఛిల్లినదని లోగడ చెప్పినాడు. ఇప్పు డామె వృత్తాంతమునే కొనసాగించుచున్నాడు.

## రతివిలాపవర్ణనము

భర్తయగు మన్మథుడు తన కన్నుల ఎదుటనే మరణింపగా చూచి, మూర్ఛనొంది తేరుకొనిన తరువాత మోహపరవశురాలైనట్టిదియును, పతివ్రతయును అగు రతిదేవి భరింపరాని నవవైధవ్యముయొక్క కష్టమును అనుభవింపజేయుచున్న విధిచే, (దైవముచే) మూర్ఛనుండి మేల్కొలుపబడినది. (ఈ సర్గయందలి శ్లోకములు, వియోగినీ వృత్తమునందు కూర్పబడినవి.) 1

మూర్ఛదశపోయి తెలివిలోనికి రాగానే ఆ రతిదేవి, కనులు తెరిచి, ఆతని రూపమును చూచుట యందాసక్తికలవానినిగా చేసి, దిక్కులన్నిట యందును తన కన్నులను ప్రసరింపజేసెను. ఎంత చూచినను తనివితీరని రూపసౌందర్యముగల ఆ మన్మథుని రూపము (ప్రస్తుతము భస్మమగుట వలన) ఆ కన్నులకింక దర్శింప వీలులేదను విషయమును మాత్రము ఆమె గ్రహింపలేకపోయెను. 2

శ్లో॥ అయి జీవితనాథ! జీవసీ
త్యభిధా యోత్థితయా తయా పురః ।
దదృశే పురుషాకృతి క్షితౌ
హరకోపానలభస్మ కేవలమ్ ॥ 3

శ్లో॥ అథ సా పున రేవ విహ్వలా
వసుధాలిఙ్గనధూసరస్తనీ ।
విలలాప వికీర్ణమూర్ధజా
సమదుఃఖామివ కుర్వతీ స్థలీమ్ ॥ 4

శ్లో॥ ఉపమాన మభూ ద్విలాసినాం
కరణం యత్తవ కాన్తిమత్తయా ।
తదిదం గత మీదృశీం దశాం న
విదీర్యే కఠినాః ఖలు స్త్రియః ॥ 5

శ్లో॥ క్వ ను మాం త్వదధీనజీవితాం
వినికీర్య క్షణభిన్నసౌహృదః ।
నలినీం క్షతసేతుబన్ధనో
జలసఙ్ఘాత ఇవాసి విద్రుతః ॥ 6

శ్లో॥ కృతవానసి విప్రియం న మే
ప్రతికూలం న చ తే మయా కృతమ్ ।
కి మకారణమేవ దర్శనం
విలపన్త్యై రతయే న దీయతే? ॥ 7

"ఓ ప్రాణేశ్వరుడా! జీవించి ఉంటివా?" అని పలికి, భూమిపైనుండి (మూర్ఛనుండి) లేచిన ఆ రతిదేవిఎదుట భూమిపై పురుషుని ఆకారమువంటి ఆకారముకల, శివుని కోపాగ్నిచే దగ్ధమైయున్న, బూడిద మాత్రమే ఆమె కంటబడెను. 3

పిమ్మట ఇంకను దుఃఖపరవశ అయి, భూమిని కౌగిలించుకొనుటకై (పొరలుటచే) బూడిదరంగుగల స్తనములు కలదై, వ్రేలాడుచున్న వెంట్రుకలు కలదై, ఆ రతిదేవి, ఆ శివాశ్రమమునందున్న ప్రాణికోటినంతటిని కూడ తనతో సమానమగు దుఃఖము కలదివలె చేయుచు విలపించెను. 4

సుందరతరమగుటచేత ఏ నీ శరీరము విలాసవంతులకు (సుందరులకు) పోల్చదగినది అయ్యెనో, ఆ ఈ శరీరము ఇట్టి దశను (భస్మమగుటను) పొందెను. (ఇట్లైనను ఈ నీ భస్మశరీరమును చూచికూడ) నేను ఖండఖండములై మరణింపకున్నాను. అనగా స్త్రీలు ఎంతటి కఠినాత్మురాండ్రో కదా! 5

(ఓ ప్రియుడా)! గట్టు తెగిన జలప్రవాహము తామరపువ్వునువలె, (జలైకాయత్త జీవితయైనదని భావము.) నీకు స్వాధీనమైన జీవనముకల నన్ను క్షణకాలముపాటు మనమధ్యనున్న స్నేహమును భంగపరచి, ఎక్కడ పడవైచి, పారిపోయితివి? 6

ఓ మనోహరా! నేను నీకుగాని నీవు నాకుగాని అనిష్టము నెన్నడును చేయలేదు. అయినను నీకై విలపించుచున్న ఈ రతిదేవికి, అకారణముగనే నీ దర్శనమునేల ఇప్పింపకున్నావు? 7

శ్లో॥ స్మరసి స్మర! మేఖలాగుణై
రుత గోత్రస్ఖలితేషు బన్ధనమ్ ।
చ్యుత కేసరదూషితేక్షణా
న్యవతంసోత్పలతాడనాని వా ॥ 8

శ్లో॥ హృదయే వససీతి మత్ప్రియం
య దవోచ స్త దవైమి కైతవమ్ ।
ఉపచారపదం న చే దిదం
త్వ మనఙ్గః కథ మక్షతా రతిః ? ॥ 9

అవ. : న చ మే కచ్చి ద్విచారః. కిం తు లోక శ్శోచ్యత ఇత్యాహ.

శ్లో॥ పరలోక నవప్రవాసినః
ప్రతిపత్స్యే పదవీ మహం తవ ।
విధినా జన ఏష వఞ్చిత స్త్వ
దధీనం ఖలు దేహినాం సుఖమ్ ॥ 10

ఓ మన్మధుడా! గోత్రస్థలితకాలమునందు (నన్ను మతియొక స్త్రీ పేరుతో పిలిచినప్పుడు) కోపించిన నేను నా మొలత్రాటితో నిన్ను కట్టిన విషయమును గుర్తుంచుకొనినావా? లేక నా కర్ణావతంసమైన (చెవికి అలంకారమైన) నల్లకలువతో నిన్ను కొట్టగా దానినుండి జారిన పుప్పొడితో నీ కళ్ళు మండిన విషయమును, ఆ దెబ్బను గుర్తుంచుకొంటివా? (నీకు నే నపప్పుడు వేసిన పై శిక్షలను గుర్తుంచు కొని, నేడు నా కగపడకుండ దూరమగు శిక్షను నీవు విధించినావా? అని భావము.) 8

(ఓ ప్రియురాలా!) నీవు నా హృదయములోనే నివసించియున్నావని నీవు చెప్పిన మాట కేవల ప్రియవాక్యము, అబద్ధము అని నే ననుకొనుచున్నాను. ఇది కేవలము ఇచ్చకపువాక్యము మాత్రమే. అట్లు కానిచో నీవు శరీర రహితుడవైనప్పుడు (భస్మీభూతుడవైనపుడు) నీ హృదయమునందుండు నేను అక్షతురాలినై (గాయపడని శరీరము కలదానినై) ఎట్లుండగలను? 9

**అవతారిక :** నా కేమియు దుఃఖములేదు. కాని లోకులకై విచారించుచున్నా ననుచున్నది.

క్రొత్తగా పరలోకమునకు వెళ్ళిన నీ మార్గమును, నేను అనుసరించి వచ్చుచున్నాను. కాని దైవముచే ఈ లోకపు జనులు వంచింపబడినారు కదా! దేహధారులయొక్క సుఖము నీ అధీనమున నున్నది కదా! (నీవు వీరిని విడిచి పరలోకమునకు వెళ్ళుటవలన మరి వీరు సౌఖ్యమును ఎట్లు పొందగలరు?) 10

శ్లో॥ రజనీతిమిరావగుణ్ఠితే
పురమార్గే ఘనశబ్దవిక్లబాః ।
వసతిం ప్రియ కామినాం ప్రియా
స్త్వదృతే ప్రాపయితుం క ఈశ్వరః ॥ 11

శ్లో॥ నయనా న్యరుణాని ఘూర్ణయ౯
వచనాని స్థలయ౯ పదేపదే ।
అసతి త్వయి వారుణీమదః
ప్రమదానా మధునా విడమ్బనా ॥ 12

శ్లో॥ అవగమ్య కథీకృతం వపుః
ప్రియబన్ధో స్తవ నిష్ఫలోదయా ।
బహులేఽపి గతే నిశాకర
స్తనుతాం దుఃఖ మనఙ్గ! మోక్ష్యతి ॥ 13

ఓ ప్రియుడా! రాత్రిపూట చీకటిచే ఆవరింపబడిన రాజమార్గమునందు, మేఘగర్జనలచే భయపడిన కాంతలను కాముకులయొక్క ఇంటికి చేర్చుటకు నీవు తప్ప ఇంకొక సమర్థు డెవ్వ డున్నాడు? (ఎవరును లేరు, అది నీకే సాధ్యము అని భావము.) 11

ప్రియులతో కలుపునట్టి నీవు, లేకుండుటచే స్త్రీలకండ్లు ఎఱ్ఱనై గిరగిర తిరుగుచుండుటయును, 1. ప్రతిమాటయందును పదములు తొట్రుపడుటయును, 2. మదవతులకు మద్యపానము వలన కలుగు కైపును ఇప్పుడు నటనమైపోవుచున్నవి. (యధార్థములు కాకపోవుచున్నవి. మన్మధుడు లేనిచో స్త్రీలలో కలుగు మదవిభ్రమము లన్నియును వ్యర్థములని భావము.) 12

ఓ అనంగుడా! (మన్మథుడా!) తనకు ప్రియస్నేహితుడవగు నీ శరీరము కథగా మాత్రమే మిగిలినదను (మరణించినదను) విషయమును తెలిసికొని, చంద్రుడు తన ఉదయమునకు ప్రయోజనము లేనివాడై, బహుళపక్షము వెళ్ళిపోయినను తన శరీరకార్శ్యమును (చిక్కిపోవు గుణమును) విడువకున్నాడు. (మన్మథుడు లేనిచో చంద్రోదయమైనను (పూర్ణిమ వచ్చినను) ప్రజలలో కామోద్దీపనము జరుగదని తలచి, ప్రియమిత్రుని వియోగముతో చంద్రుడు ఇంకను చిక్కియే ఉన్నాడని భావము. అమావాస్యతో బహుళ పక్షము పూర్తియగును ఆ మరునాటినుండి చంద్రుడు ఒక్కసారిగా పూర్ణిమనాటి వానివలె వృద్ధి చెందడు కదా! క్రమాభివృద్ధితో చిక్కియున్నట్లే కనబడుచున్నాడని కాళిదాసు చక్కని కల్పనమును చేసినాడు.) 13

శ్లో॥ హరిత్వారుణచారుబన్ధనః
కలపుంస్కోకిలశబ్దసూచితః ।
వద సంప్రతి కస్య బాణతాం
నవచూతప్రసవో గమిష్యతి ॥ 14

శ్లో॥ అలిపఙ్క్తి రనేకశ స్త్వయా
గుణకృత్యే ధనుషో నియోజితా ।
విరుతైః కరుణస్వనై రియం
గురుశోకా మనురోదితీవ మామ్ ॥ 15

శ్లో॥ ప్రతిపద్య మనోహరం వపుః
పున రప్యాదిశ తావ దుత్థితః ।
రతిదూతిపదేషు కోకిలా
మ్మధురాలాపనిసర్గపణ్డితామ్ ॥ 16

శ్లో॥ శిరసా ప్రణిత్య యాచితా
న్యుపగూఢాని సవేపథూని చ ।
సురతాని చ తాని తే రహః
స్మర! సంస్మృత్య న శాన్తి రస్తి మే ॥ 17

ఆకుపచ్చ ఎరుపురంగులతో కూడిన అందమైన తొడిమ కలదియును, అవ్యక్తమదురముగా కూయు గండుకోయిలల కూతలచేత సూచింప బడినదియును, అగు క్రొత్తమావిమొగ్గ, ఇక ఎవనికి బాణస్థానమును చెందునో చెప్పుము. (మావిమొగ్గ ఒక్క మన్మథునికే బాణము. ఆతడు మరణింపగా, మరొక మన్మథుడు లేకుండుటవలన ఇప్పుడా మావిమొగ్గ కొఱకై దుఃఖించుచున్నదే కాని, రతిదేవి తన కొఱకు దుఃఖించుటలేదను స్వారస్యమును కవి ఇందు ప్రతిపాదించినాడు. స్వార్థముకొఱకు దుఃఖించుట అనుచితము, పరోపకారము కొఱకై దుఃఖించుట ఉచితము అని ఇచ్చట కాళిదాసుని భావము.) 14

"నీచే పలుమార్లు నీ వింటికి గుణకృత్యముగా 1. మంచిపనులయందు 2. అల్లెత్రాడుగా (నారిగా) మేము కూర్చబడితిమి". అని ఈ తుమ్మెదల గుంపు దీనస్వరముగల నాదములతో గొప్ప దుఃఖమునందిన నా దుః ఖమును అనుకరించి, రోదించుచున్నవా అన్నట్లున్నది. 15

మఱియు, సుందరమగు నీ దేహమును (మరల) పొంది, (భస్మరాశి నుండి) లేచి, మధురముగా మాట్లాడుటయందు సహజ పాండిత్యముకల ఈ ఆడుకోకిలలకు రతిదూతిపదవిని (తార్పుడుకత్తె ఉద్యోగమును ఇమ్ము) (మదనదౌత్యపు ఉద్యోగమును మదనుడే ఈయవలెనని భావము.)16

ఓ మన్మథుడా! నీవు నా వద్ద సాష్టాంగపడి చేసిన ప్రార్థనలను, ఒళ్ళంతటిని కుదిపివేయు గాఢాలింగనములను, అనుభవింపబడిన నీ రహస్య రతిక్రీడలను, తలుచుకొనుచున్న నాకు (ప్రస్తుతము) శాంతి లేదు. 17

శ్లో॥ రచితం రతిపణ్డిత! త్వయా
స్వయ మఙ్గేషు మ మేద మార్తవమ్ ।
ధ్రియతే కుసుమప్రసాధనం
తవ త చ్చారువపు ర్న దృశ్యతే ॥ 18

శ్లో॥ విబుధై రసి యస్య దారుణై
రసమాప్తే పరికర్మణి స్మృతః ।
త మిమం కురు దక్షిణేతరం
చరణం నిర్మితరాగ మేహి మే ॥ 19

శ్లో॥ అహ మేత్య పతఙ్గవర్త్మనా
పునరఙ్కాశ్రయణీ భవామి తే ।
చతురై స్సురకామినీజనైః
ప్రియ! యావ న్న విలోభ్యసే దివి ॥ 20

శ్లో॥ మదనేన వినాకృతా రతిః
క్షణమాత్రం కిల జీవితేతి మే ।
వచనీయ మిదం వ్యవస్థితం
రమణ! త్వా మనుయామి యద్యపి ॥ 21

రతిక్రీడలో ఆరితేరినవాడా! (పండితుడా) నీవు నా అవయవములయందు స్వయముగా అలంకరించిన వసంతర్తుసంబంధమైన పుష్పాలంకారము ఇదుగో నా శరీరము పై (ఇంకను) ధరించియే యున్నాను. కాని ఈ అలంకారమును చేసిన నీ సుందరమైన శరీరము మాత్రమే ఇప్పుడు కానరాకున్నది. 18

క్రూరకర్ములైన (తన భర్తను వెనుకాడకుండ చంపు పనిలో నియోగించినారు కనుక అని అర్ధము) విబుధులు = 1. దేవతలు. (2. వి+బుధ; బుధ = జ్ఞానము, తెలివి. వి = లేనివారు. పచ్చని కాపురమును భగ్గు మనిపించరా దను జ్ఞానము లేనివా రగుటచే దేవతలు విబుధులని సార్ధకముగా ప్రయోగించినాడు.) నా ఎడమకాలి అలంకారము (పారాణి) పూర్తి కాకుండగనే నిన్ను (తమ కార్యసాధనకై దేవతలు) పిలిచిరి. ఆ నా ఈ ఎడమకాలిని పారాణితో ఇప్పు డలంకరించుటకు నీవు తిరిగి రమ్మని పిలుచుచున్నది. (అకాలమరణము సూచించుటకు పూసిన పారాణి ఆరకముందే, పసుపుబట్టలు తీయకముందే మరణించి రనుట లోకసహజము కదా. ఆ వాక్యమును స్మరించి, కవి ఇట్లు వ్రాసియుందును.) 19

ప్రియుడా! స్వర్గమునందు జాణలగు అప్సరోబృందములు నిన్ను మోహింపజేసి, వశపఱచుకొనునంతటిలోపుననే నేను మిడుతమార్గము ననుసరించి (అగ్నిలో దూకి, సహగమనమును చేసి) నీ వద్దకు వచ్చి, మరల నీ తొడపై కూర్చొందును. 20

ఓ మనోహరుడా! నేను ని న్ననుసరించి వచ్చినప్పటికిని "రతిదేవి మన్మధుడు లేకున్నను క్షణకాలము జీవించియుండెనట." అను నింద నాకు వచ్చిపడినది. 21

శ్లో॥ క్రియతాం కథ మన్త్యమణ్డనం
పరలోకాన్తరితస్య తే మయా ।
సమమేవ గతో౽స్యతర్కితాం
గతి మజ్గేన చ జీవితేన చ ॥ 22

శ్లో॥ ఋజుతాం నయతః స్మరామి తే
శర ముత్సజ్గనిషణ్ణధన్వినః ।
మధురా సహ సస్మితాం కథాం
నయనోపాన్తవిలోకితం చ యత్ ॥ 23

శ్లో॥ క్వ ను తే హృదయజ్గమ స్సఖా?
కుసుమాయోజితకార్ముకో మధుః ।
న ఖలూగ్రరుషా పినాకినా
గమిత స్సో౽పి సుహృద్గతాం గతిమ్ ॥ 24

శ్లో॥ అథ తైః పరిదేవితాక్షరై
ర్హృదయే దిగ్ధశరై రివాహతః ।
రతి మభ్యుపపత్తు మాతురాం
మధురాత్మాన మదర్శయ త్పురః ॥ 25

## వసన్తంప్రతి రతేః సదయవచనమ్

శ్లో॥ త మవేక్ష్య రురోద సా భృశం
స్తనసంబాధ మురో జఘాన చ ।
స్వజనస్య హి దుఃఖ మగ్రతో
వివృతద్వార మివోపజాయతే ॥ 26

పరలోకమునకు చేరిన నీకు, కడపటి అలంకారమును ఎట్లు చేయుదును? ఎందువలన ననగా నీవు నీ శరీరముతోను, జీవితముతోను కూడకలిసి ఊహింపరాని దశకు చేరుకొంటివి. (అలంకరించుటకు ఆధారభూత మగు శరీరము లేదని భావము.) 22

నీ బాణమును తిన్నగానగునట్లు చేయుచున్న (పదునుపెట్టుచున్న) వింటిని తొడపై నుంచుకొనిన, వసంతునితో నవ్వుచు మాట్లాడుచున్న నిన్నును, క్రీగంటి చూపులతో నన్ను చూచుచున్న నినున్నను, (నీ చేష్టలను) స్మరించుచున్నాను. 23

నీ ఇష్టసఖుడును, పూవిలుకాడును అగు వసంతుడు ఎక్కడ ఉన్నాడు? తీక్ష్ణమైన కోపముగల హరునిచే అతడు కూడ తన చెలికాడగు మన్మథుని గతిని చేరలేదుగదా! 24

ఇట్లా రతిదేవి దుఃఖించిన తరువాత ఆమె దీనాలాపములచే విషపుబాణముతో హృదయమునందు కొట్టబడినవానివలె బాధపడుచు విపన్నురాలైన రతిదేవిని అనుగ్రహించుకొఅకై ఓదార్చుటకు తనను ఆమె ఎదుట వసంతుడు, సాక్షాత్కరింపజేసెను. (ప్రత్యక్షమయ్యె నని భావము) 25

## వసంతునిగూర్చి రతిదేవి పలికిన దీనవచనములు

ఆ రతిదేవి వసంతుని చూచి మిక్కిలి ఏడ్చెను. స్తనములకు నొప్పి కలుగునట్లుగా (గట్టిగా) రొమ్మును కొట్టుకొనెను. ఏలయనగా దూరమేగిన తనవారిని చూడగోరినప్పుడు కలుగు దుఃఖము, స్వ జను లెదురుపడినప్పుడు ద్వారమును తెరిచికొని వచ్చినట్లు ప్రబలముగా వెలుబడును కదా!. 26

శ్లో॥ ఇతి చైన మువాచ దుఃఖితా
సుహృదః పశ్య వసన్త! కిం స్థితమ్ ।
తదిదం కణశో వికీర్యతే
పవనై ర్భస్మ కపోతకర్బురమ్ ॥ 27

శ్లో॥ అయి! సమ్ప్రతి దేహి దర్శనం
స్మర! పర్యుత్సుక ఏష మాధవః ।
దయితా స్వనవస్థితం నృణాం
న ఖలు ప్రేమ చలం సుహృజ్జనే ॥ 28

అవ. : ఈదృశాః సుహృదః కతి న సన్తీ త్యాశఙ్క్య న కోఽపీ త్యాహ.

శ్లో॥ అమునా నను పార్శ్వవర్తినా
జగదాజ్ఞాం ససురాసురం తవ ।
బిసతన్తుగుణస్య కారితం
ధనుషః పేలవపుష్పపత్త్రిణః ॥ 29

శ్లో॥ గత ఏవ న తే నివర్తతే
స సఖా దీప ఇవానిలాహతః ।
అహ మస్య దశేవ పశ్య మా
మవిషహ్యవ్యసనేన ధూమితామ్ ॥ 30

దుఃఖితురాలగు ఆ రతిదేవి దుఃఖితయై వసంతునితో ఇట్టనెను. "ఓ వసంతుడా! ఇచ్చట ఏమైనదో చూడుము. పావురమువలె చిత్రవర్ణముగల, గాలికి కణకణముగా వెదజల్లబడుచున్న, ఈ నీ స్నేహితుని శరీరపుభస్మమును చూడుము. 27

ఓ మన్మథుడా! నీ దర్శనమునకై ఈ వసంతుడు వేడుకపడుచున్నాడు. కనుక దర్శనము నిమ్ము. మనుష్యులకు ప్రియురాండ్రయందు ప్రేమ అస్థిరముగా ఉండును. కాని ఆ ప్రేమ స్నేహితులయందు స్థిరముగా ఉండును కదా! 28

అవతారిక : ఇట్టి మిత్రు లెందరు లేరని శంకించుకొని, ఒక్కడును లే డనుచున్నాడు.

ఓ మన్మధుడా! తామరతూండ్లనుండి వచ్చు సన్ననిదారమే వింటినారిగా కల, పూవుటమ్ములు కల, నీ ధనస్సునకు ఇతరులే కాదు సురాసురులతో కూడిన జగత్తంతయు నీ యాజ్ఞకు లొంగినదిగా ఎవనిచే చేయబడినదో అట్టి నీ ప్రభావమునకు కారణమగు వసంతునికైనను నీ దర్శనము నిమ్ము. (ఇతనికి కూడ దర్శన మీయకుండుట నీకు తగదని భావము.)29

30. ఓ వసంతుడా! నీ స్నేహితుడగు వసంతుడు గాలి తాకిడిచే ఆర్పబడిన దీపమువలె పోనే పోయినాడు. ఇక తిరిగి రాడు. నేను ఈ మన్మథునియొక్క (దీపముయొక్క) వత్తివలె ఉన్నాను. భరింపరాని దుఃఖముచే పుట్టిన పొగకల నన్ను చూడుము. (రతిదేవి వత్తికాగా, ఆమె దుఃఖమే పొగ, మన్మధుని మరణమే ఆరిపోవుట అని భావము.) 30

శ్లో॥ విధినా కృత మర్ధవైశసం నను
మాం కామవధే విముఞ్చతా ।
అనపాయిని సంశ్రయద్రుమే
గజభగ్నే పతనాయ వల్లరీ ? ॥ 31

అవ. : అధునా అనన్తరకర్తవ్యం ప్రార్థయతే.

శ్లో॥ తదిదం క్రియతా మనన్తరం
భవతా బన్ధుజనప్రయోజనమ్ ।
విధురాం జ్వలనాతిసర్జనా
న్నను మాం ప్రాపయ పత్యు రన్తికమ్ ॥ 32

అవ. : కర్తవ్య శ్చాయ మర్థః స్త్రీణా మిత్యాహ.

శ్లో॥ శశినా సహ యాతి కౌముదీ
సహ మేఘేన తటి త్ప్రలీయతే ।
ప్రమదాః పతివర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనైరపి ॥ 33

ఓ వసంతుడా! మన్మధుని చంపుచు నన్ను విడిచిన దైవము నన్ను (అర్ధవైశసం) సగము చంపినది. (భార్యాభర్త లిరువురు ఒకటే ఆకృతికలవారు అను అభిప్రాయముచే నా భర్త అయిన మన్మధుని చంపుటవలన మిగిలిన సగమైన నన్ను కూడ చంపకయే చంపినట్లైనది అని భావము) ఎట్లనగా అపాయములేదని నమ్మి ,ఒకలత ఒక పెద్ద వృక్షమును ఆశ్రయించినది. అట్లాశ్రయము నిచ్చిన వృక్షము నొక్కదానినే ఏనుగు పెల్లకించి పడవేసినచో తీగను వేరుగా పెల్లకించి పడత్రోయవలెనా? అక్కరలేదు కదా! (ఇచ్చట దైవమే ఏనుగు. ఆశ్రయవృక్షమే మన్మథుడు. దానిని నమ్మి, చుట్టుకొనిన తీగయే రతిదేవియని భావింపవలెను.) 31

**అవతారిక :** ఇప్పుడు అనంతర కర్తవ్యమును ప్రార్థించుచున్నది.

(ఎట్లైనను చావు తప్పదు కనుక) అందువలన బంధువులు చేయవలసిన సహాయకార్యక్రమమును నీవు చేయుదువు గాక! నా కొఱకై చితిని పేర్చి, నిప్పంటించి, నన్ను నా భర్తవద్దకు చేర్చుము. 32

**అవతారిక :** ఈ పని స్త్రీల కొఱకై చేయదగినదని చెప్పుచున్నది.

వెన్నెల–చంద్రునితో పాటే పోవుచున్నది. మెఱుపు–మేఘముతో పాటే నశించుచున్నది. అట్లే స్త్రీలు–భర్త వెళ్ళిన మార్గమునే అనుసరింతురు. అని (అచేతనులకు) అవివేకులకు కూడ తెలియును కదా! (వివేకవంతురాలనైన నా విషయమునందు వేరుగా చెప్పనేల?) 33

శ్లో॥ అమునైవ కషాయితస్తనీ
సుభగేన ప్రియగాత్రభస్మనా ।
నవపల్లవసంస్తరే యథా
రచయిష్యామి తనుం విభావసౌ ॥ 34

శ్లో॥ కుసుమాస్తరణే సహాయతాం బహుశ
స్సౌమ్య! గత స్త్వ మావయోః ।
కురు సమ్ప్రతి తావ దాశు మే
ప్రణిపాతాఞ్జలియాచిత శ్చితామ్ ॥ 35

శ్లో॥ తదను జ్వలనం మదర్పితం
త్వరయే ర్దక్షిణవాతవీజనైః ।
విదితం ఖలుతే యథా స్మరః
క్షణమ ప్యుత్సహతే న మాం వినా ॥ 36

శ్లో॥ ఇతి చాపి విధాయ దీయతాం
సలిల స్యాఞ్జలి రేక ఏవ నౌ ।
అవిభజ్య పరత్ర తం మయా
సహితః పాస్యతి తే స బాన్ధవః ॥ 37

శ్లో॥ పరలోకవిధౌ చ మాధవ!
స్మర ముద్దిశ్య విలోలపల్లవాః ।
నివపేః సహకారమఞ్జరీః
ప్రియచూతప్రసవో హి తే సఖా ॥ 38

అందమైన, ఈ ఎదుటనున్న, ప్రియుని మేని బూడిదతో రంగుమారిన స్తనములు కలదాననై, క్రొత్త చిగురాకులతో ఏర్పఱచిన ప్రక్క మీదనున్న దానివలె పరుండి, శరీరమును అగ్నిదేవునకు సమర్పింతును. 34

ఓ సౌమ్యుడా! (మంచివాడా!) నీవు (పూర్వము రతి మన్మదులను పేర్లుగల) మా ఇరువురకును పలుమార్లు పూలపాన్పును పరుచు విషయమునందు తోడ్పడితివి. ఇప్పుడు నమస్కారపూర్వకముగా దోయిలించి వేడుకొనుచున్నాను. నాకు చితిని పేర్చిపెట్టుము. 35

చితిపేర్చుట పూర్తి అయిన తరువాత నా చితికంటించిన అగ్నిదేవుని దక్షిణవాతముల (మలయవాయువుల) ప్రసారముచేత బాగుగా త్వరగా ప్రజ్వలింపజేయుము. తొందర ఎందుకందువా? మన్మథుడు నన్ను విడిచి క్షణకాలమైనను సంతోషముగా నుండలేడను విషయము నీకు తెలియును కదా! 36

ఇంతేకాదు ఇట్లుచేసి, మా ఇరువురకును కలిపి, ఒకే ఒక జలాంజలిని (తర్పణమును) ఇమ్ము. ఆ తర్పణమును నీ చెలికాడైన మన్మథుడు పరలోకమునందు నాతో కలిసి, వేరు చేసి పంచుకొనకుండ త్రాగగలడు. 37

ఇంతేకాదు. వసంతుడా! పిండోదకాదిపారలౌకికక్రియలయందు మన్మథుని కొఱకై నీవు, కదులుచున్న చిగుళ్ళుకల, మావిపూగుత్తులను సమర్పించుము. ఏలయనగా నీ స్నేహితుడగు మన్మథునకు మావిపూగుత్తులనిన ఇష్టముకదా! 38

శ్లో॥ ఇతి దేహవిముక్తయే స్థితాం
రతి మాకాశభవా సరస్వతీ ।
శఫరీం హ్రదశోషవిక్లబాం
ప్రథమావృష్టి రివాన్వకమ్పయత్ ॥ 39

శ్లో॥ కుసుమాయుధపత్ని! దుర్లభ
స్తవ భర్తా న చిరా ద్భవిష్యతి ।
శృణు యేన స కర్మణా గత
శ్శలభత్వం హరలోచనార్చిషి ॥ 40

అవ. : తదేవ కర్మోపాచష్టే.

శ్లో॥ అభిలాష ముదీరితేన్ద్రియః
స్వసుతాయా మకరో త్ప్రజాపతిః ।
అథ తేన నిగృహ్య విక్రియా
మభిశప్తః ఫల మేత దన్వభూత్ ॥ 41

అవ. : శాపావధిరపి తేనైవోక్త ఇత్యాహ శ్లోకద్వయేన.

శ్లో॥ పరిణేష్యతి పార్వతీం యదా
తపసా తత్ప్రవణీకృతో హరః ।
ఉపలబ్ధసుఖ స్తదా స్మరం
వపుషా స్వేన నియోజయిష్యతి ॥ 42

ఇట్లు దేహత్యాగమునకు నిశ్చయించుకొనిన రతిదేవితో ఆకాశవాణి (అశరీరవాక్కు), మడుగు ఎండుటవలన తల్లడపడు బేడిసచేపను, తొలకరి వానవలె, అనుగ్రహించుచు పలికెను. (ఆకాశవాణి ఆమె నూరడించి పల్కెనని భావము.) **39**

ఓ రతిదేవీ! నీ భర్తయగు మన్మథుడు చిరకాలమువరకు దుర్లభుడు కాడు. (త్వరలోనే పునర్జీవితు డగునని భావము.) ఏ కర్మచేత శివుని కంటిమంటలో అతడు శలభ(మిడుత)మైపోయెనో వినుము. **40**

**అవతారిక :** మన్మథుడొనర్చిన కర్మమునే చెప్పుచున్నాడు.

మన్మథుని చేత ప్రేరేపింపబడిన ఇంద్రియములుకలవాడై (కామోద్దీపితుడై) బ్రహ్మ, తన కుమార్తెయగు సరస్వతీ దేవియందు కామోద్రిక్తు డయ్యెను. ఆ బ్రహ్మ తన ఇంద్రియములను నిగ్రహించుకొని, పిమ్మట మన్మథుని శపించెను. ఆ శాపఫలముగనే నీ భర్త ఈ హరకోపాగ్నిలో ఆహుతి అయిపోయినాడు. **41**

**అవతారిక :** ఆ బ్రహ్మయే శాపావధినికూడ సూచించినాడని రెండు శ్లోకములలో చెప్పుచున్నాడు.

ధర్ముడను ప్రజాపతిచే ప్రార్థింపబడిన ఆ బ్రహ్మ, "తపస్సు కారణముగా పార్వతిని వివాహమాడుటకు అంగీకరించి, శివుడు ఆమెను వివాహమాడినప్పుడు ఆమెవలన దాంపత్యసుఖమునంది, శివుడు మన్మథునికి ఆతని శరీరమును ప్రసాదించును." **42**

శ్లో॥ ఇతి చాహ స ధర్మయాచితః
స్మరశాపావధిదాం సరస్వతీమ్ ।
అశనే రమృతస్య చోభయో
ర్వశిన శ్చామ్బుధరాశ్చ యోనయః ॥ 43

## ప్రియసఙ్గమాశ్వాసనాత్ రతిమరణబుద్ధి నివారణమ్

శ్లో॥ తదిదం పరిరక్ష శోభనే!
భవితవ్యప్రియసఙ్గమం వపుః ।
రవిపీతజలా తపాత్యయే
పున రోఘేన హి యుజ్యతే నదీ ॥ 44

శ్లో॥ ఇత్థం రతేః కిమపిభూత మదృశ్యరూపం
మన్దీచకార మరణవ్యవసాయబుద్ధిమ్ ।
త త్ప్రత్యయాచ్చ కుసుమాయుధబన్ధు రేనా
మాశ్వాసయత్ సుచరితార్థపదై ర్వచోభిః ॥ 45

శ్లో॥ అథ మనదవధూ రుపప్లవాన్తం
వ్యసనకృశా పరిపాలయామ్బభూవ ।
శశిన ఇవ దివాతనస్య లేఖా
కిరణపరిక్షయధూసరా ప్రదోషమ్ ॥ 46

ఇట్లు మన్మదునకు శాపావసానమును కలిగించిన వాక్కును ఆ బ్రహ్మ చెప్పెను. (కోపించినవానికి శాంతి ఎట్లు కలిగెను? అను అనుమానమును తీర్చుటకు "జితేంద్రియులు మేఘములవంటివారు. కనుకనే పిడుగువంటి శాపమును, జలములను బోలు శాపవిమోచనమును (చల్లని అనుగ్రహమును) కలిగియుందురు." అన్నాడు. (జితేంద్రియులగు బ్రహ్మవంటివారు నిగ్రహానుగ్రహ సమర్థులని భావము. 43

## ప్రియుని కలియు నవకాశమున్నదని రతిదేవినోదార్చి, ఆమె మరణప్రయత్నమును మాన్పుట.

ఓ కల్యాణీ! (ఆకాశవాణి వచనమే రతిదేవికి వైధవ్యమును తప్పించి కల్యాణిని చేసినదని భావము) ఆ కారణమువలన కాబోవు నీ భర్తృ సంగమమునకై నీ శరీరమును కాపాడుకొనుము. సూర్యతాపముచే ఎండిన నీరుగల నది, వేసవికాలము పూర్తి కాగానే (వర్షాకాలమునందు) మరల ప్రవాహముతో ఉప్పొంగును కదా! 44

ఈ విధముగా అదృశ్యరూపముననున్న ఒక ప్రాణి, రతిదేవియొక్క మరణ నిశ్చయమును నివారించెను. వసంతుడు కూడ ఆ ప్రాణియందలి విశ్వాసముతో మంచి చరితార్థములైన పదములుగల మాటలతో ఆమె నోదార్చెను. 45

పిమ్మట పగటియందు కళావిహీనమైన చంద్రకళ రాత్రిరాకకై ఎట్లెదురు చూచుచుండునో అట్లు వ్యసనముచే కృశించిన రతిదేవి, తన ఆపదయొక్క అవసానకాలమునకై నిరీక్షించుచుండెను. (ఈ శ్లోకము పుష్పితాగ్రా వృత్తమునందు కూర్చబడినది.) 46

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"రతివిలాపవర్ణనమ్" నామ చతుర్థః సర్గః

-o0o-



మన్మథవిరహంతో విలపించుచున్న రతిదేవి. (శ్లోకము 1)

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "రతివిలాపవర్ణనము" అను పేరుగల నాల్గవ
సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-



అభయమిస్తున్న శివుడు. శ్లోకము 42

# కుమారసమ్భవమ్

## "తపఃఫలోదయో" నామ

## పఞ్చమః సర్గః

భగ్నమనోరథయా పార్వత్యా స్వ రూపగర్హణమ్

శ్లో॥ తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ ।
నినిన్ద రూపం హృదయేన పార్వతీ
ప్రియేషు సౌభాగ్యఫలా హి చారుతా ॥ 1

శ్లో॥ ఇయేష సా కర్తు మవన్ధ్యరూపతాం
సమాధి మాస్థాయ తపోభి రాత్మనః ।
అవాప్యతే వా కథ మన్యథా ద్వయం
తథావిధం ప్రేమ పతిశ్చ తాదృశః ॥ 2

# కుమారసంభవము

## "తపఃఫలోదయము" అను ఐదవసర్గము

### భగ్నమనోథ అయిన పార్వతి తన సౌందర్యమును నిందించుకొనుట

పార్వతీదేవి ఆ విధముగా తన కళ్ళ ఎదుటనే మన్మథుని దగ్ధము చేసిన శివునిచే భగ్నమనోరథ అయి, మనసార తన శరీరపుటందమును నిందించుకొనెను. భర్తల అభిమానమును పొందుటయే సౌందర్యము యొక్క ఫలము కదా! (అట్లుకానినాడు ఆ సౌందర్యము వ్యర్థమని భావము. ఈ సర్గలోని శ్లోకములు వంశస్థవృత్తములో కూర్పబడినవి.) **1**

2. ఆ పార్వతీదేవి ఏకాగ్రమైన మనస్సుతో వివిధతపస్సులచే తన రూపమును సఫలము చేసికొనదలచెను. అట్లుకానిచో, అట్టి అర్ధశరీరము నిచ్చు అనురాగమును, అంతటి పతియును (మృత్యుంజయుడు) వేరొకచో టెట్లు లభించును? (లభింపరని భావము.) **2**

శ్లో॥ నిశమ్య చైనాం తపసే కృతోద్యమాం
సుతాం గిరీశ ప్రతిసక్తమానసామ్ ।
ఉవాచ మేనా పరిరభ్య వక్షసా
నివారయన్తీ మహతో మునివ్రతాత్ ॥ 3

అవ. : సామాన్యనిషేధ ముక్త్వా విశేషనిషేధ మాహ.

శ్లో॥ మనీషితాః సన్తి గృహేషు దేవతా
స్తపః క్వ వత్సే! క్వ చ తావకం వపుః ?
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం న పునః పతత్రిణః ॥ 4

శ్లో॥ ఇతి ధ్రువేచ్ఛా మనుశాసతీ సుతాం
శశాక మేనా న నియన్తు ముద్యమాత్ ।
క ఈప్సితార్థస్థిరనిశ్చయం మనః
పయశ్చ నిమ్నాభిముఖం ప్రతీపయేత్ ॥ 5

ఆ మేనాదేవి, శివునియందు దృఢముగా లగ్నమైన మనస్సుగల, తపస్సు చేయుటకై ప్రయత్నించుచున్న, తన కుమార్తెను గూర్చి విని, ఆ పార్వతీదేవిని ప్రేమతో హృదయమార కౌగిలించుకొని, తపః ప్రయత్నమునుండి నివారించుచు ఇట్లనెను. 3

అవతారిక : సామాన్యమగు నిషేధవాక్యమును ఇంతకు మున్ను చెప్పి, విశేష నిషేధవాక్యమును ఇప్పుడు చెప్పుచున్నాడు.

అమ్మాయీ! కోరికను నెఱవేర్చు దేవతలు మన ఇండ్లలోనే ఉన్నారు కదా! నీ మెత్తని శరీర మెక్కడ? కఠోరమగు తప స్సెక్కడ? (ఈ రెంటికిని పొంతన లే దనుట ఇందలి భావము.) సుకుమారమైన దిరెసెనపువ్వు తుమ్మెద కాలిబరువును ఓర్చుకొనును గాని, కఠినమగు పక్షి కాలిబరువును ఓర్చుకొనగలదా? (ఓర్చుకొనలేదని భావము. సుకుమారమగుటవలన నీ శరీరము, దివ్యభోగముల ననుభవించుటకే తగినదిగాని, దారుణమైన తపఃక్లేశము నందుటకు తగని దని మేనాదేవి, ఉపదేశముయొక్క సారాంశము.) 4

ఈ విధముగా ఉపదేశమును చేయుచు, మేనాదేవి, (తపస్సు చేయుటకే) స్థిరముగా నిశ్చయించుకొనిన తన కుమార్తెను, ఆమె ప్రయత్నమునుండి వారించుటకు సమర్థురాలు కాకపోయెను. (అది యుక్తమే.) కోరుకొనిన కోర్కెను సాధించుటకు నిశ్చయించుకొనిన మనస్సును, పల్లము పైపునకు ప్రవహించుచున్న ప్రవాహమును, ఎవడు మళ్ళింపగలడు? (ఎవడును మళ్ళింపలేడని భావము.) 5

## తపశ్చరణోద్యతాయాః పార్వత్యాః వర్ణనమ్

శ్లో॥ కదాచి దాసన్న సఖీముఖేన సా
మనోరథజ్ఞం పితరం మనస్వినీ ।
అయాచ తారణ్యనివాస మాత్మనః
ఫలోదయాన్తాయ తపఃసమాధయే ॥ 6

శ్లో॥ అథానురూపాభినివేశతోషిణా
కృతాభ్యనుజ్ఞా గురుణా గరీయసా ।
ప్రజాసు పశ్చాత్ ప్రథితం తదాఖ్యయా
జగామ గౌరీశిఖరం శిఖణ్డిమత్ ॥ 7

శ్లో॥ విముచ్య సా హార మహార్యనిశ్చయా
విలోలయష్టిప్రవిలుప్తచన్దనమ్ ।
బబన్ధ బాలారుణబభ్రు వల్కలం
పయోధరోత్సేధవిశీర్ణసంహతి ॥ 8

శ్లో॥ యథా ప్రసిద్ధై ర్మధురం శిరోరుహై
ర్జటాభి రప్యేవ మభూ త్తదాననమ్ ।
న షట్పదశ్రేణిభిరేవ పఙ్కజం
సశైవలాసఙ్గమపి ప్రకాశతే ॥ 9

## తపస్సుచేయ నుద్యమించిన పార్వతీవర్ణనము

ఒకనాడు, జితేంద్రియురాలైన పార్వతీదేవి, తన కోరికనుగూర్చి తెలిసికొనిన, తండ్రియగు హిమవంతుని నుండి "అరణ్యవాసము చేయుచు, తన కోరిక ఫలించువరకు తపస్సు చేసికొనుటకై" అనుమతిని తన ఇష్టసఖురాలి ద్వారా కోరెను. 6

ఆ తరువాత పార్వతీదేవి ఆమెయొక్క తగిన పట్టుదలచేత సంతోషించిన, మిక్కిలి పూజ్యుడగు తండ్రిచేత అనుమతింపబడినదై, తన తపస్సిద్ధియైన పిమ్మట ప్రజ లందరు ఆమె పేరుతోనే "గౌరీశిఖరము" అని పిలిచిన, ప్రసిద్ధమైన, నెమళ్ళుకల, ప్రదేశమునకు తపస్సు చేయుటకై వెళ్ళెను. 7

అడ్డుపెట్ట శక్యముకాని నిశ్చయముకల ఆ పార్వతి, కదులుచున్న పేరులచే గంధమును తుడిచివేయుచున్న ముత్యములహారమును (తపస్సు చేయుటకొరకై) తీసివైచి, బాలసూర్యునివలె కావిరంగుకలదియును, స్తనములఉన్నతిచే శిథిలమైనఅల్లికగలదియును (పెగులుచున్నదియును) అగు) నారబట్టను కట్టుకొనెను. 8

ఆ పార్వతీదేవియొక్క ముఖము తపస్సునకు ముందు అందమైన జుట్టుచేత ఎట్లు మధురముగా (సుందరముగా) కనబడినదో, అట్లే తపస్సు కొరకై జుట్టునలంకరించుకొనక, జడలను కట్టించుకొన్నను అంతే అందముగా ఉన్నది. ఇట్లుండుట న్యాయమే. కమలము శోభించునది కేవలము తుమ్మెదల చేతనే కాదు. అది నాచుతో కూడియున్నను సుందరముగనే ప్రకాశించును కదా! 9

## పార్వతీతపోవర్ణనమ్

శ్లో॥ ప్రతిక్షణం సా కృతరోమవిక్రియాం
వ్రతాయ మౌఞ్జీం త్రిగుణాం బభార యామ్ ।
అకారి తత్పూర్వనిబద్ధయా తయా
సరాగ మస్యా రశనాగుణాస్పదమ్ ॥ 10

శ్లో॥ విసృష్టరాగా ధధరా న్నివర్తితః
స్తనాఙ్గరాగారుణితాచ్చ కన్దుకాత్ ।
కుశాఙ్కురాదానపరిక్షతాఙ్గులిః
కృతోఽక్షసూత్రప్రణయీ తయా కరః ॥ 11

శ్లో॥ మహార్హశయ్యాపరివర్తనచ్యుతైః
స్వ కేశపుష్పై రపి యా స్మ దూయతే ।
అశేత సా బాహులతోపధాయినీ
నిషేదుషీ స్థణ్డిల ఏవ కేవలే ॥ 12

శ్లో॥ పున ర్గ్రహీతుం నియమస్థయా తయా
ద్వయేఽపి నిక్షేప ఇవార్పితం ద్వయమ్ ।
లతాసు తన్వీషు విలాసచేష్టితం
విలోలదృష్టం హరిణాఙ్గనాసు చ ॥ 13

## పార్వతి చేసిన తపోవర్ణనము

ఆ గౌరీదేవి, ప్రతి నిముషముననను గగుర్పాటును కలిగించు, మూడుపేటలుకల, ఏ ముంజత్రాటిని తపోనియమానుసారము ధరించెనో, అదే మొదటిసారిగా కట్టుకొనబడిన, ఆ ముంజత్రాటిచే ఆమె మొలత్రాడుకట్టుకొనుప్రదేశము (నడుము) ఎఱ్ఱపరుపబడినది. (కందిపోవునట్లు చేసినదని భావము.) 10

ఆ పార్వతి, తపస్సుచేయుటకు ముందు రంగువేసికొనిన క్రిందిపెదవి నుండియు, స్తనములపై అలముకొనిన మైపూతచేత ఎఱ్ఱబడిన బంతియుండియు తన ఎఱ్ఱని చేతిని మరల్చి, ప్రస్తుతము దర్భలను కోయుటవలన వేళ్ళనుకోసుకొనుటయందును, అక్షసూత్రమును (జపమాలను) పట్టుకొనుటయందును ఇష్టముకలదిగా చేసినది. (అనగా బాల్యక్రీడలను, అలంకారమును మాని, తపస్తత్పరురాలై యున్నదని భావము.) 11

తపస్సుచేయుటకుముందు, అమూల్యములైన ప్రక్కలపై దొర్లుచు, తన జడనుండి రాలిన పూవులచేతనే ఒత్తుకొని, ఏ పార్వతి బాధింపబడినదో, ఆమె ఇప్పుడు (తపోనియమకారణముగా) తీగలవంటి సన్నని తన చేతులనే దిండుగా ఉంచుకొని, కేవలము కటికనేలపై పండుకొనుచున్నది. 12

వ్రతనియమమునందున్న ఆ పార్వతి, మరల తీసికొనుటకై రెంటిని రెండింటియందు నిక్షేపముగా ఉంచినదేమో అన్నట్లుగా 1.సన్నని తీగలయందు తన శృంగార చేష్టను, 2.చంచలమగు చూపును ఆడులేడి కన్నులయందును దాచియుంచినది. 13

శ్లో॥ అతన్ద్రితా సా స్వయమేవ వృక్షకా౯
ఘటస్తనప్రసవణై ర్వ్యవర్ధయత్ ।
గుహో౽పి యేషాం ప్రథమాప్తజన్మనాం
న పుత్త్రవాత్సల్య మపాకరిష్యతి ॥ 14

శ్లో॥ అరణ్యబీజాఞ్జలిదానలాలితా
స్తథా చ తస్యాం హరిణా విశశ్వసుః ।
యథా తదీయై ర్నయనైః కుతూహలాత్
పుర స్సఖీనా మమిమీత లోచనే ॥ 15

శ్లో॥ కృతాభిషేకాం హుతజాతవేదసం
త్వగుత్తరాసఙ్గవతీ మధీతినీమ్ ।
దిదృక్షవ స్తా మృషయో౽భ్యపాగమ
న్న ధర్మవృద్ధేషు వయ స్సమీక్ష్యతే ॥ 16

శ్లో॥ విరోధిసత్త్వోజ్ఝితపూర్వమత్సరం
ద్రుమై రభీష్టప్రసవార్చితాతిథి ।
నవోటజాభ్యన్తరసమ్భృతానలం
తపోవనం తచ్చ బభూవ పావనమ్ ॥ 17

ఆ పార్వతీదేవి మిక్కిలి శ్రద్ధగా తనంతటతనే స్తనములవంటి ఘటముల నుండి స్రవించిన నీటితో ఆశ్రమములోని చిన్ని చెట్లను పోషించి పెద్ద చేసెను. తనకంటె ముందుగా పుట్టిన, ఈ చెట్లపై పార్వతికి గల సహజప్రేమను కుమారస్వామి కూడ మరలింపలేకపోయెను. **14**

నెవ్వరిధాన్యమును దోసిళ్ళతో పెట్టి, లాలింపబడిన లేళ్ళు, ఆమెపట్ల ఎంత విశ్వాసమును పెంచుకొనినవనగా, ఆమె తన కళ్ళను, స్నేహితు రాండ్రందఱి ఎదుట, వాని కళ్ళతో రాచుకొనుచు కొలుచునప్పుడు కూడ అవి భయపడక, తమకెట్టి ప్రమాదము జరుగదని అట్లే నిలిచియున్నవి. (అందఱిఎదుట అంత దగ్గరకు వచ్చినను బెదరకుండుట వాని విశ్వాసమునకు నిదర్శనము.) **15**

స్నానము చేసిన, హోమమును పూర్తిచేసిన, నారచీరలనే ఉత్తరీయముగ ధరించిన, స్తుతిపాఠాదులను చేయుచున్న, ఆ పార్వతిని చూడగోరి (వయోవృద్ధులైన) ఋషులు వచ్చెడివారు. (వయసు తక్కువగల ఆమెను పెద్ద వయస్సువారు చూడవచ్చుటేమి? అను అనుమానమును తీర్చుటకు సమాధాన మిది.) ధర్మాచరణమునందు పెద్దలగువారి విషయమునందు వయస్తారతమ్యము పరిగణింపబడదు కదా! **16**

ఆ ఆశ్రమమునందు సహజవిరోధముగల జంతువులు తమకు పూర్వము నుండి (తరతరములుగా) ఉన్న జాతిమాత్సర్యమును విడిచినవి. చెట్లు కోరిన పుష్పములను ఫలములను కోరినంతగా ఇచ్చి, అచ్చటికి వచ్చిన అతిథులను గౌరవించుచున్నవి. క్రొత్త పర్ణశాలలయందు హోమాది కార్యక్రమమువలన అగ్ని బాగుగా ప్రజ్వరిల్లుచున్నది. (ఆ తపోవనము, 1. అహింసాగుణమువలనను, 2. అతిథిసత్కారమువలనను, 3. అగ్నిని ఆరాధించుటవలనను జగత్పావనమైనది అని భావము.) **17**

## పార్వతీదుశ్చరతపోవర్ణనమ్

శ్లో॥ యదా ఫలం పూర్వతస్సమాధినా
న తావతా లభ్య మమంస్త కాంక్షితమ్ ।
తదా ఽనపేక్ష్య స్వశరీరమార్దవం
తపో మహత్ సా చరితుం ప్రచక్రమే ॥ 18

శ్లో॥ క్లమం యయౌ కన్దుకలీలయాఽపి యా
తయా మునీనాం చరితం వ్యగాహ్యత ।
ధ్రువం వపుః కాఞ్చనపద్మనిర్మితం
మృదు ప్రకృత్యా చ ససారమేవ చ ॥ 19

## గ్రీష్మే తపశ్చర్యా

శ్లో॥ శుచౌ చతుర్ణాం జ్వలతాం హవిర్భుజాం
శుచిస్మితా మధ్యగతా సుమధ్యమా
విజిత్య నేత్రప్రతిఘాతినీం ప్రభా
మనన్యదృష్టి స్సవితార మైక్షత ॥ 20

శ్లో॥ తథా ఽతితప్తం సవితు ర్గభస్తిభి
ర్ముఖం తదీయం కమలశ్రియం దధౌ ।
అపాఙ్గయోః కేవల మస్య దీర్ఘయో
శ్శనైః శనై శ్శ్యామికయా కృతం పదమ్ ॥ 21

## పార్వతియొక్క దుశ్చరతపోవర్ణనము

ఆ పార్వతీదేవి ఇంతవరకు పాటించిన పూర్వనియమములతో తన కోరిక పొందశక్యముకాదని ఎప్పుడు తలచెనో, అప్పుడే తన శరీరపు మృదుత్వమును లెక్కచేయక, మహత్తపః = ఇంకను కఠోరనియమములు గల ఘోరతపస్సును చేయనారంభించెను. 18

ఏ గౌరీదేవి తపః ప్రారంభమునకుముందు బంతితో ఆడుటచేత కూడ (చెండాడుటచేత కూడ) అలిసిపోయెడిదో, ఆమెయే ఇప్పుడు మహామునులకు మాత్రమే సాధ్యమగు దుశ్చర తపశ్చర్యను చేయనారంభించినది. నిజముగా ఆమె శరీరము బంగారు తామరపూవుతో నిర్మింపబడినది. ఏలయన అది, పద్మస్వభావముచే మృదువైనను, (బంగరుస్వభావముతో) కఠినమై తపఃక్లేశమును ఓర్చుకొనగలుగుచున్నది. 19

## వేసవికాలమున చేసిన తపస్సు

వేసవికాలమునందు స్వచ్ఛముగా మందహాసము చేయుచు, అందమైన నడుముగల ఆ గౌరీదేవి చతురగ్నికుండముల మధ్యన ఉండి, కనులను మిఱుమిట్లుగొలుపు సూర్యతేజస్సును జయించి, ఇతర దృష్టిలేనిదై, (కనులార్పకుండ) సూర్యుని చూచెను. 20

సూర్యకిరణములచేత ఆ విధముగా మిక్కిలి తపింపజేయబడినదై, ఆ గౌరీదేవియొక్క ముఖము కమలములకాంతిని పొందెను. (కాని అతాపముచే పొడవగు ఆమె క్రీగన్నులయందు మాత్రము నెమ్మది నెమ్మదిగా నల్లదనము చోటుచేసికొన్నది. (సూర్యతాపముచే క్రీగన్నులు నల్లపడినవని భావము.) 21

శ్లో॥ అయాచితోపస్థిత మమ్బు కేవలం
రసాత్మక స్యోడుపతేశ్చ రశ్మయః ।
బభూవ తస్యాః కిల పారణావిధి
ర్న వృక్షవృత్తివ్యతిరిక్తసాధనః ॥ 22

## వర్షాయాం తపశ్చర్యా

శ్లో॥ నికామతప్తా వివిధేన వహ్నినా
నభశ్చరే ణేన్ధనసమ్భృతేన సా ।
తపాత్యయే వారిభి రుక్షితా నవై
ర్భువా సహోష్మాణ మముఞ్చ దూర్ధ్వగమ్ ॥ 23

శ్లో॥ స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః
పయోధరోత్సేధనిపాతచూర్ణితాః ।
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే
చిరేణ నాభిం ప్రథమోదబిన్దవః ॥ 24

తాను అడుగకుండగనే స్వయముగా లభించిన నీరును (వర్షపునీరు), అమృతాంశుడగు చంద్రునియొక్క కిరణములును మాత్రమే ఆమెకు ఆహారమైనవి. ఈ ఆహారవిధానము వృక్షముల జీవనవిధానమునకంటె వేరైనది కాదు.(వృక్షములవంటి జీవనవిధానమునే ఆశ్రయించినదని భావము.) 22

## వర్షాకాలమున చేసిన తపస్సు

వివిధములైన అనగా ఆకాశమునందు తిరుగు సూర్యాగ్నిచేతను, కఱ్ఱలను మధించుటచే పుట్టిన హోమాగ్నులచేతను (పంచాగ్నులచే) బాగుగా పరితపింపజేయబడినదై ఆ పార్వతీదేవి గ్రీష్మర్తువుయొక్క చివరక్రొత్త నీటిచుక్కలచే తడుపబడి, భూమితో పాటుగా ఆవిరిని పైకి విడిచెను. 23

తొలినీటిచుక్కలు పార్వతీదేవియొక్క కనురెప్పల యందు క్షణకాలముండి, (ఇట్లనుటచే ఆ కనురెప్పల సాంద్రత్వము (దట్టపుతనము) నున్నగా జార్చుగుణము వ్యక్తము చేయబడినది.) అచ్చటినుండి క్రింది పెదవిని కొట్టుచు జారి, (పెదవిని కొట్టుట అనుటతో దాని మార్దవగుణము తెలుపబడినది.) అచ్చటినుండి స్తనములపై పడుటచే శిథిలములై (అనుటతో ఆ స్తనముల కాఠిన్యము వ్యక్తమగుచున్నది.) మరల అచ్చటినుండి వళులలో (కడుపు ముడతలలో తొట్రుపడుచు, (అనుటచే వాని ఎత్తుపల్లములు వ్యక్తముచేయబడినవి.) చిరకాలమునకు బొడ్డును చేరినవి. అచ్చట అగుటవలన (బొడ్డు యొక్క లోతుదనము సూచింపబడినది.) 24

శ్లో॥ శిలాశయాం తా మనికేతవాసినీం
నిరన్తరా స్వన్తరవాతవృష్టిషు ।
వ్యలోకయ న్నున్మిషితై స్తటిన్మయై
ర్మహాతపస్సాక్ష్య ఇవ స్థితాః క్షపాః ॥ 25

హేమన్తే తపశ్చర్యా

శ్లో॥ నినాయ సాఽత్యన్తహిమోత్కిరానిలాః
సహస్యరాత్రీ రుదవాసతత్పరా ।
పరస్పరాక్రన్దిని చక్రవాకయోః
పురో వియుక్తే మిథునే కృపావతీ ॥ 26

ఎడతెరిపి లేక, నడుమనడుమ గాలులతోకూడిన వానలయందు ఇంటిలో నివసింపనిదియును, రాతిపై పరున్నదియును అగు ఆ పార్వతీదేవియొక్క మహాతపస్సునకు సాక్షులుగా ఉన్నట్టి రాత్రులు, మెఱుపులను చూపులతో చూచినవో అన్నట్లున్నది.

"ఆదిత్య చంద్రా వనలో ఉనలశ్చ ద్యౌ ర్భూమి రాపో హృదయం యమశ్చ, అహశ్చ రాత్రిశ్చ ఉభేచ సంధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్".
అను ప్రమాణవాక్యముప్రకారము మానవుడు చేయుపనులను, ఆతని చరితమును 1. సూర్యుడు, 2. చంద్రుడు, 3. అగ్ని, 4. వాయువు, 5. ఆకాశము, 6. భూమి, 7. నీరు, 8. హృదయము, 9. యముడు, 10. పగలు, 11. రాత్రి, 12. ఉభయసంధ్యలు, 13. ధర్మము అనువారు తెలిసికొనుచుందురు. అనుటవలన పార్వతి తపస్సునకు రాత్రులు సాక్షులైనవని కాళిదాసు చెప్పినాడు.

(శర ద్వసంతకాలములయందు ప్రకృతి సుఖకరముగా ఉండుటవలనను పార్వతి తపశ్చర్యకు కష్టమును కలిగించు లక్షణములు లేకుండుట వలనను ఆ రెండు ఋతువులలో ఆమె చేసిన తపశ్చర్యను కాళిదాసు ప్రత్యేకముగా వర్ణించియుండకపోవచ్చును.) 25

## హేమంతఋతువున పార్వతి చేసిన తపస్సు

ఆ పార్వతీదేవి, మిక్కిలి మంచును చిమ్మునట్టి, చల్లని గాలులు వీచునట్టి పుష్యమాసపు రాత్రులను, (మెడలోతు) నీటియందు నివసింప నుత్సుకురాలై (వియోగదుఃఖమును భరింపలేక) ఒండొరులను పిలుచు కొనుచు తన ఎదుట, జంటనెడబాసియున్న చక్రవాకపక్షులమిథునము నందు దయకలదై గడిపెను. 26

శ్లో॥ ముఖేన సా పద్మసుగన్ధినా నిశి
ప్రవేపమానాధరపత్త్రశోభినా ।
తుషారవృష్టిక్షతపద్మసమ్పదాం
సరోజసన్ధాన మివాకరో దపామ్ ॥ 27

శ్లో॥ స్వయంవిశీర్ణద్రుమపర్ణవృత్తితా
పరా హి కాష్ఠా తపస స్తయా పునః ।
తద ప్యపాకీర్ణ మతః ప్రియంవదాం
వద న్త్యపర్ణేతి చ తాం పురావిదః ॥ 28

శ్లో॥ మృణాలికాపేలవ మేవమాదిభి
ర్వ్రతైః స్వ మఙ్గం గ్లపయ న్త్యహర్నిశమ్ ।
తపశ్శరీరైః కఠినై రుపార్జితం
తపస్వినాం దూర మధశ్చకార సా ॥ 29

## వటు పార్వత్యోః సమ్భాషణమ్

శ్లో॥ అథాజినాషాఢధరః ప్రగల్భవా
గ్జ్వలన్నివ బ్రహ్మమయేన తేజసా ।
వివేశ కశ్చి జ్జటిల స్తపోవనం
శరీరబద్ధః ప్రథమాశ్రమో యథా ॥ 30

ఆ/పార్వతి, రాత్రిపూట, పద్మమువలె సువాసన కలదియును, మిక్కిలి వణుకుచున్న క్రిందిపెదవి అను తామరరేకుచే ప్రకాశించునదియును అగు ముఖముతో, మంచుకురియుటచే నశించిన పద్మసంపదకల నీళ్ళకు, తామరపూవులుకలశోభను చేకూర్చినట్లుండెను. (తన నిః శ్వాసముల సుగంధమును నీటికి పట్టించి, ముఖమునే తామరపూవుగా చేసి, ఆ నీటికి తామరపూవులున్న శోభను చేకూర్చెనని భావము.) 27

తమంతట తాము రాలిన, చెట్లఆకులే తనకు ఆహారముగా చేసికొనుట, తపోధనులకు అత్యుత్తమవిధి అని యందురు. కాని, పార్వతి ఎండుటాకులను తిను విధినికూడ మానివేసినది. అందువలననే అందరితో ప్రియముగా మాట్లాడు ఆ పార్వతిని పురాణ విషయముల నెఱింగినవారు 'అపర్ణ' అని పిలువసాగిరి. 28

తామరతూడువలె మెత్తనైన తన శరీరమును, ఇట్టి అగ్నిమధ్య నిలుచుట, నీటిలో నిలుచుట, స్థలములో నిలుచుట మొదలగు కఠోర వ్రతములతో రాత్రింబవళ్ళు కృశింపచేయుచు, ఆ పార్వతీదేవి, దృఢమగు శరీరముతో పురుషులైన తపశ్శాలురు సంపాదించుకొనిన తపస్సును మిక్కిలి క్రిందుచేసెను. 29

## బ్రహ్మచారి కుశలప్రశ్నలు వేయుట

పిమ్మట నల్లలేడితోలును, మోదుగ దండమును ధరించి, ప్రౌఢముగా మాట్లాడనేర్చిన, దివ్యమగు బ్రహ్మవర్చస్సుతో వెలుగుచున్నవాడువలె ఉన్న ఒక జటాధారి (బ్రహ్మచారి), రూపుదాల్చిన బ్రహ్మచర్యాశ్రమమో అనునట్లు ఉన్నవాడై,పార్వతీదేవి తపస్సుచేసికొనుచున్న ఆశ్రమములోనికి వచ్చెను. 30

శ్లో॥ త మాతిథేయీ బహుమానపూర్వయా
సపర్యయా ప్రత్యుదియాయ పార్వతీ ।
భవన్తి సామ్యేఽపి నివిష్టచేతసాం
వపుర్విశేషే ష్వతిగౌరవాః క్రియాః ॥ 31

శ్లో॥ విధిప్రయుక్తాం పరిగృహ్య సత్క్రియాం
పరిశ్రమం నామ వినీయ చ క్షణమ్ ।
ఉమాం స పశ్యన్ ఋజునైవ చక్షుషా
ప్రచక్రమే వక్తు మనుజ్ఝితక్రమః ॥ 32

శ్లో॥ అపి క్రియార్థం సులభం సమిత్కుశం ?
జలాన్యపి స్నానవిధిక్షమాణి తే ? ।
అపి స్వశక్త్యా తపసి ప్రవర్తసే ?
శరీర మాద్యం ఖలు ధర్మసాధనమ్ ॥ 33

అతిధులయం దిష్టురాలగు పార్వతీదేవి ఆ బ్రహ్మచారికి బహుమాన పూర్వకమగు సపర్యతో, పూజతో ఎదురేగి స్వాగతించెను. తమతో సమాన స్థాయియందున్న వారు, తమవద్దకు వచ్చినవారు స్థిరచిత్తులై, విశిష్టవ్యక్తులైనపుడు, వారియందు మిక్కిలి గౌరవముతో ప్రవర్తించుట సహజమే కదా! 31

ఆ బ్రహ్మచారి తనకు శాస్త్రోక్తముగా సమర్పింపబడిన, అర్ఘ్యపాద్యాది సత్కారమును స్వీకరించి, (నడిచివచ్చుట వలన కలిగిన) ఆయాసమును తీర్చుకొనినట్లు క్షణకాలము నటించి, పార్వతీదేవిని, తిన్నని (విలాసరహితమైన) చూపుతో చూచుచు, మర్యాదాభంగమును, సంప్రదాయభంగమును కాకుండా ఇట్లు మాట్లాడనారంభించెను. 32

నీ హోమము కొరకు సమిధలును (ఎండిన రావిపుల్లలు మొదలగునవి) దర్భలును నీవు కష్టపడనక్కరలేకుండ దొరుకుచున్నవా? నీకు స్నానము చేయుటకు తగినట్లు నీళ్ళు ఉన్నవా? నీ శక్తికొలది తపస్సును ఆచరించుచున్నావా? ఏలయనగా శరీరమే ధర్మసాధనములలో మొదటిది (ముఖ్యమైనది) కదా! ("ధర్మస్తు, కాయేన, వాచా, బుద్ధ్యా ధనాదినా చ బహుభిః సాధ్యతే. తేషు వపు రేవ ముఖ్యసాధనమ్. సతి దేహే ధర్మార్థకామమోక్ష లక్షణ శ్చతుర్వర్గః సాధ్యతే. అత ఏవ సతత మాత్మా ఏవ గోపాయీత" ఇతి శ్రుతిః. శరీరము, వాక్కు, బుద్ధి, ధనము, తదితర బహు అవయవములచేత ధర్మము, సాధింపబడుచున్నది. ధర్మసాధనకు పైన పేర్కొనబడిన అవయవము లన్నింటిలోను శరీరమే ముఖ్య సాధనము. శరీరమున్నప్పుడే ధర్మార్థ కామమోక్షములను పురుషార్థ చతుర్వర్గము సాధింపబడును. కనుక శరీరమును రక్షించుకొనవలెను అను శ్రుతివాక్య మీ శ్లోకమున ప్రతిపాదింపబడినది. 33

శ్లో॥ అపి త్వదావర్జితవారిసంభృతం
ప్రవాల మాపా మనుబన్ధి వీరుధామ్? ।
చిరోజ్ఝితాలక్తకపాటలేన తే
తులాం య దారోహతి దన్తవాససా ॥ 34

శ్లో॥ అపి ప్రసన్నం హరిణేషు తే మనః?
కరస్థదర్భప్రణయాపహారిషు ।
య ఉత్పలాక్షి! ప్రచలై ర్విలోచనై
స్తవాక్షిసాదృశ్య మివ ప్రయుఞ్జతే ॥ 35

శ్లో॥ య దుచ్యతే పార్వతి! పాపవృత్తయే
న రూప మి త్యవ్యభిచారి త ద్వచః ।
తథా హి తే శీల ముదారదర్శనే!
తపస్వినామ ప్యుపదేశతాం గతమ్ ॥ 36

శ్లో॥ వికీర్ణసప్తర్షిబలిప్రహాసిభి
స్తథా న గాఙ్గై స్సలిలై ర్దివశ్చ్యుతైః ।
యథా త్వదీయై శ్చరితై రనావిలై
ర్మహీధరః పావిత ఏష సాన్వయః ॥ 37

శ్లో॥ అనేన ధర్మ స్సవిశేష మద్య మే
త్రివర్గసారః ప్రతిభాతి భావిని ।
త్వయా మనోనిర్విషయార్థకామయా
యదేక ఏవ ప్రతిగృహ్య సేవ్యతే ॥ 38

చాలాకాలమునుండి లత్తుకద్రవము పూయకుండుటవలన పాటల (తెలుపుతో కూడిన ఎరుపురంగుగల) నీ క్రిందిపెదవితో సాటి రాగలిగిన (పోల్చదగిన ) చిగురాకులు, నీవు స్వయముగా నీరు పోసి పెంచిన ఈ లతలమీద ఒకటి తరువాత మఱొకటిగా వచ్చి పెరుగుచున్నవా? 34

నల్లకలువను బోలిన సుందరములైన కన్నులుకలదానా! ఏ లేళ్ళు తమ బెదురు కళ్ళతో నీ నేత్ర సౌందర్యపు సాధర్మ్యమును పొంచుచున్నట్లున్నవో, ఏ లేళ్ళు నీపైగల ప్రేమతో నీ చేతిలో పూజార్థ ముంచుకొనిన దర్భలను అపహరించి తినుచున్నవో, వానిపై నీ మనస్సు దయతో కూడియున్నదా! (తపస్వినులకు అమాయకులపై అసలు ఆగ్రహము తగదని భావము.) 35

ఓ పార్వతీ! 'రూపసౌందర్యము పాపవ్యాపారములను ఆచరింపదు' అని పెద్దలు చెప్పిన మాట నీ విషయములో పరమసత్యమైనది. ఏలయన ఓ ఆయతాక్షీ! (జ్ఞానాధికురాలా!) నీయొక్క సద్వ్యవహారమే (శీలమే) తపశ్శాలురకు కూడ మార్గదర్శక మైనది కదా! 36

నీ నిష్కల్మషములైన చరితముచేత పవిత్రుడైనట్లుగా 1. ఈ హిమాలయ పర్వతము, సప్తర్షులు తమ పూజలకై, పువ్వులను వెదజల్లుటచే నవ్వుచున్నట్లున్న, పవిత్రములైన పూజాకుసుమములచేతను, 2. ఆకాశము నుండి జాలువారిన గంగానది నీటిచేతను, పవిత్రుడు కాలేదు. (నీ చరితములు నిర్మలములని భావము.) 37

భావినీ! (మంచి అభిప్రాయములు కలదానా!) ఏ కారణమువలన అర్థకామములకు విషయము కాకుండ, నీ మనస్సుతో నీవు ధర్మము నొక్కదానినే స్వీకరించి సేవించున్నావో అందువలన పురుషార్థములలో ధర్మమను పురుషార్థ మొక్కటే విశిష్టమైనదని నాకు ఇప్పుడు తోచుచున్నది.

శ్లో॥ ప్రయుక్తసత్కారవిశేష మాత్మనా
న మాం పరం సమ్ప్రతిపత్తు మర్హసి ।
యత స్సతాం సన్నతగాత్రి సఙ్గతం
మనీషిభి స్సాప్తపదీన ముచ్యతే ॥ 39

## బ్రహ్మచారిణః సమ్భాషణమ్

శ్లో॥ అతో ఽత్ర కిఞ్చి ద్భవతీం బహుక్షమాం
ద్విజాతిభావా దుపపన్నచాపలః ।
అయం జనః ప్రష్టుమనా స్తపోధనే
న చే ద్రహస్యం ప్రతివక్తు మర్హసి ॥ 40

అవ. : ప్రష్టవ్య మాహ.

శ్లో॥ కులే ప్రసూతిః ప్రథమస్య వేధస
స్త్రిలోకసౌన్దర్య మివోదితం వపుః ।
అమృగ్య మైశ్వర్యసుఖం నవం వయ
స్తపఃఫలం స్యా త్కి మతః పరం వద? ॥ 41

శ్లో॥ భవ త్యనిష్టా దపి నామ దుస్సహా
న్మనస్వినీనాం ప్రతిపత్తి రీదృశీ ।
విచారమార్గ ప్రహితేన చేతసా
న దృశ్యతే తచ్చ కృశోదరి! త్వయి ॥ 42

38

నీ వింత విశేషముగా సత్కరించిన నన్ను, పరపురుషునిగా భావించుట నీకు తగదు. ఎందువలననగా వినయముతో వంగినశరీరముకలదానా! సత్పురుషులయొక్క స్నేహము సాప్తపదీనము. 1. ఏడు మాటలతో దృఢపడునది 2. ఏడు అడుగులు కలిసి వేయుటతో దృఢపడునది అని విద్వాంసులు చెప్పుచుందురు కదా! 39

## బ్రహ్మచారి సంభాషించుట

ఓ తపోధనురాలా! స్నేహధర్మమువలన మిక్కిలి శాంతస్వభావురాలవగు నిన్ను బ్రాహ్మణచాపల్యముచే కొంచెము ప్రశ్నించెదను. రహస్య మేమియును లేకున్నచో నాకు సమాధానము నీయగలవు. 40

**అవతారిక :** అడుగవలసినదానిని చెప్పుచున్నాడు.

హిరణ్యగర్భునియొక్క వంశములో పుట్టితివి. ముల్లోకములయందలి సౌందర్యమును ఒక్కచోటికి చేర్చినంతటి అందముకలది నీ శరీరము. నీకున్న సంపదవలని సుఖమా- వెదుకనక్కర లేనంతటిది. ఇక వయస్సా- నూతనమైన యౌవనము. నీవు చేయుచున్న తపస్సునకు ఫలము ఇంతకుమించిన దేముండును? నీవే చెప్పుము. 41

ఓ కృశోదరీ! భర్తమున్నగు వారివలన కలుగు అప్రియములకు ప్రతీకార మొనర్చుటకై (వానినుండి బయట పడుటకై) ధీరురాండ్రైన స్త్రీలు ఇట్టి ప్రవృత్తిని (తపస్సు చేయుట మొదలగు లక్షణమును) కలిగియుందురు. కాని నేను ఎంతగా ఆలోచించినను అట్టి అప్రియము నిన్ను చేరనట్లుగనే నాకు కనబడుచున్నది. (మఱి శరీరమును కష్టపెట్టు ఈ తపశ్చర్యకు ప్రయోజనమేమి? అని అడుగుచున్నాడని భావము.) 42

శ్లో॥ అలభ్యశోకాభిభవేయ మాకృతి
ర్విమాననా సుభ్రు! కుతః పితు ర్గృహే ।
పరాభిమర్శో న తవాస్తి కః కరం
ప్రసారయేత్ పన్నగరత్నసూచయే ॥ 43

శ్లో॥ కి మి త్యపా స్యాభరణాని యౌవనే
ధృతం త్వయా వార్ధకశోభి వల్కలమ్? ।
వద ప్రదోషే స్ఫుటచన్ద్రతారకా
విభావరీ య ద్యరుణాయ కల్పతే? ॥ 44

శ్లో॥ దివం యది ప్రార్థయసే వృథా శ్రమః
పితుః ప్రదేశా స్తవ దేవభూమయః ।
అథోపయన్తార మలం సమాధినా
న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్ ॥ 45

శ్లో॥ నివేదితం నిఃశ్వసితేన సోష్మణా
మన స్తు మే సంశయమేవ గాహతే ।
న దృశ్యతే ప్రార్థయితవ్య ఏవ తే
భవిష్యతి ప్రార్థితదుర్లభః కథమ్? ॥ 46

ఓ అందమైన కనుబొమలుకలదానా! ఈ నీ సౌందర్యము భర్త మొదలగు వారిచే దుఃఖపెట్టబడు అవమానముల నందరానిది. (ఎవరును అవమానింపలేరని భావము.) నీ తండ్రి ఇంటిలో నీకు తిరస్కార మెక్కడిది? (ఇతరులనుండి తిరస్కారము కూడ నీకు లేదు.) ఏలయన, పాముతలపైనున్న మణిశలాకను గ్రహించుటకు ఎవడు తన చేతిని ముందుకు చాచును? (ఎవడును చాచడని భావము.) **43**

ఓ పార్వతీదేవీ! యౌవనకాలమునందే నీవు నీ రత్నాద్యాభరణములను విడిచిపెట్టి వార్ధక్యమునందు (ముసలితనములో) ప్రకాశించు నార బట్టలను ఏల కట్టుకొంటివి? సాయం సంధ్యాసమయములయందు ప్రస్ఫుటముగా కనిపించు, నక్షత్రములు, చంద్రుడు కల రాత్రి, సూర్యోదయమునకు కల్పింపబడినదా? (తగునా?) నీవే చెప్పుము. **44**

45. పార్వతీ! నీవు స్వర్గలోక నివాసమునే కోరుకొనెదవా? ఈ తపఃక్లేశము నందుట వ్యర్థము. ఏలయనగా నీ తండ్రియొక్క ప్రదేశము లన్నియును దేవభూములే కదా. (స్వర్గసీమలే కదా) (అచ్చటనే ఉండి, దానికై తపస్సు చేయుట, కష్టపడుట వ్యర్థమని భావము) అట్లుకాక వరుని తపఃఫలముగా ప్రార్థించుచున్నావా? ఇక చేసిన తపస్సు చాలును. అదియును వ్యర్థమే. ఏలయన రత్నమును కావలసినవాడే వెదుకుకొనునుకాని, ఎచ్చటను రత్నమే "నన్నెవరు స్వీకరింతురా?" అని వెదుకుకొనదు కదా! (స్త్రీరత్నభూతు రాలవైన నిన్ను ఆ వరుడు వెదకి వేసారవలెను. కాని అతనికై నీవు శ్రమింపనక్కరలేదని భావము.) **45**

నీ వేడి నిట్టూర్పుచేతనే నీ మనసులోని (వరునికై తపస్సు అనుమాట) మాట అర్థమయిపోయినది. అయినను నా మనస్సు సందేహించుచునే ఉన్నది. నీకై నీవు కోరదగిన (తాహతుకల) వాడే ఎవడును ఉండడు. అట్టిచో నీవు కోరుకొనినను దొరకని, (దర్లభుడైన) వాడు ఎవడుండును? (ఎవరు ఉండరని భావము.) **46**

అవ.: అథ పతిప్రార్థనామేవ సిద్ధవ త్కృ త్వాహ.

శ్లో॥ అహో స్థిరః కో౽పి తవేప్సితో యువా
చిరాయ కర్ణోత్పలశూన్యతాం గతే ।
ఉపేక్షతే యః శ్లథలమ్బినీ ర్జటాః
కపోలదేశే కలమాగ్రపిఙ్గలాః ॥ 47

శ్లో॥ మునివ్రతై స్త్వా మతిమాత్రకర్శితాం
దివాకరాప్లుష్టవిభూషణాస్పదామ్ ।
శశాఙ్కలేఖా మివ పశ్యతో దివా
సచేతసః కస్య మనో న దూయతే ॥ 48

శ్లో॥ అవైమి సౌభాగ్యమదేన వఞ్చితం
తవ ప్రియం య శ్చతురావలోకినః ।
కరోతి లక్ష్యం చిర మస్య చక్షుషో
న వక్త్ర మాత్మీయ మరాలపక్ష్మణః ॥ 49

శ్లో॥ కియ చ్చిరం శ్రామ్యసి గౌరి! విద్యతే
మమాపి పూర్వాశ్రమసఞ్చితం తపః ।
తదర్ధభాగేన లభస్వ కాంక్షితం
వరం త మిచ్ఛామి చ సాధు వేదితుమ్ ॥ 50

అవతారిక : పతిప్రార్థనకొఱకే తపస్సు అని సిద్ధాంతీకరించి, చెప్పుచున్నాడు.

నీవు కోరుకొనునట్టి ఆ యువకుడెవరోగాని చాల కఠినుడనుట చిత్రముగా ఉన్నది. ఏలయనగా అతడు చిరకాలమునుండి కర్ణోత్పలములను ధరింపని (నల్లకలువలను ధరింపని) నీ చెక్కిళ్ళపై భాగముమీదికి, ముడి వీడి వ్రేలాడుచున్న, వరివెులకలవలె పసుపురంగుగల జడలను చూచి కూడ, ఉపేక్ష వహించుచున్నాడు కదా! (ఏ మాత్రము జాలికలవాడైనను వెంటనే, ఆమెను వివాహమాడి కేశసంస్కారము చేయించి, ముఖమునకు సౌందర్యమును చేకూర్చెడివాడు. అది జరుగలేదు కనుక ఆతడు కఠినుడని సిద్ధాంతము చేసినాడు.) **47**

చాంద్రాయణాది వ్రతములచేత మిక్కిలి కృశించిన, సూర్యతాపముచే కమలిన ఆభరణస్థానములు కలదియును, పగటిపూట నిస్తేజమయిన చంద్రలేఖవలె నిన్ను చూచుచున్న చైతన్యముగల ఎవని మనసు వ్యాకులము కాదు? వ్యాకులమయి తీరునని భావము. **48**

అందమైనచూపులతోడి, వంకరయైన కనురెప్పలుగల విలాసవంత ములైన నీ నేత్రములకు, చిరకాలము తన ముఖమును కనిపింపనీయని ఆ నీ ప్రియుడు తన సౌందర్యగర్వముచే రాబోవు సంపదను పోగొట్టుకొనుచున్నాడని తలచెదను. **49**

ఓ గౌరీ! ఎంతకాలము తపస్సు చేయుచు కష్టపడెదవు? నేను కూడ బ్రహ్మచర్యాశ్రమమునందు తపస్సును ప్రోగుచేసి యుంచితిని. దానిలో సగభాగమును (నీ కిత్తును.) దానితో నీ కోర్కెను పొందుము. ఇంతకు ఆ వరుడెవరో నేను బాగుగా తెలిసికొనగోరుచున్నాను. **50**

## పార్వత్యా ప్రత్యుత్తరీకరణే సఖీంప్రతి నిర్దేశనమ్

శ్లో॥ ఇతి ప్రవి శ్యాభిహితా ద్విజన్మనా
మనోగతం సా న శశాక శంసితుమ్ ।
అథో వయస్యాం పరిపార్శ్వవర్తినీం
వివర్తితానఞ్జననేత్ర మైక్షత ॥ 51

శ్లో॥ సఖీ తదీయా త మువాచ వర్ణినం
నిబోధ సాధో తవ చేత్ కుతూహలమ్ ।
యదర్థ మమ్భోజ మివోష్ణవారణం
కృతం తపస్సాధన మేతయా వపుః ॥ 52

శ్లో॥ ఇయం మహేన్ద్రప్రభృతీ నధిశ్రియ
శ్చతుర్దిగీశా నవమత్య మానినీ ।
అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతి మాప్తు మిచ్ఛతి ॥ 53

శ్లో॥ అసహ్యహుంకారనివర్తితః పురా
పురారి మప్రాప్తముఖ శ్శిలీముఖః ।
ఇమాం హృది వ్యాయతపాత మక్షిణో
ద్విశీర్ణమూర్తే రపి పుష్పధన్వనః ॥ 54

## సమాధాన మిమ్మని, తన చెలికత్తెను పార్వతి ఆజ్ఞాపించుట

ఆశ్రమములోనికి ప్రవేశించి, ఈ విధముగా ఆ బ్రహ్మచారి అడుగగనే తన మనసులోని మాటను పార్వతి, సిగ్గుచే సమాధానము చెప్పజాలక పోయెను. అప్పు డామె తన ప్రక్కనే ఉన్న చెలికత్తెను, తపోనియమమున కాటుకపెట్టుకొనని కన్నులను త్రిప్పుచు "నీవు చెప్పవే" అని సంజ్ఞ చేయుచు చూచెను. 51

ఆ పార్వతీదేవియొక్క చెలికత్తె ఆ బ్రహ్మచారితో ఇట్లనెను. "ఓ సాధువా! (విద్వాంసుడా!) నీకు వినగోరికయున్నచో, ఎండనుండి రక్షణమును పొందగోరినవాడు తామరపూవును గొడుగుగా (సాధనముగా) చేసికొనినట్లు ఈమె, భర్తను పొందుటకై, తన శరీరమును ఎందుకు తపఃసాధనముగా చేసికొన్నదో తెలిసికొనుము. 52

(శచీదేవి మొదలగు దిక్పాలుర భార్యలను మించియుండవలెను అను ఆశయము కల) ఈ అభిమానవంతురాలగు పార్వతీదేవి, అధికైశ్వర్యముగల ఇంద్రుడు మొదలగు నలుగురు దిక్పాలకులను తిరస్కరించి, మన్మథుని అణిచినందువలన సౌందర్యముచే వంచింప శక్యము కానివాడును, పినాకము అను విల్లును చేతితో పట్టుకొనిన వాడును అగు శివుని భర్తగా పొందగోరుచున్నది. (ఈ శ్లోకమునందు "సంకల్పావస్థ" సూచింపబడినది.) 53

పూర్వము మన్మథు డీశ్వరునిపై ప్రయోగించిన బాణము, శివు డొనర్చిన భయంకరమైన హుంకారముచేత మరలింపబడినదై, దానికొనయైనను శివుని తాకలేక మరలినదై, దానిని ప్రయోగించిన మన్మథుడు భస్మీభూతుడైను తన దివ్యశక్తి వలనను, భగవత్సంకల్పబలమువలనను,

శ్లో॥ తదాప్రభృ త్యున్మదనా పితు ర్గృహే
లలాటికాచన్దనధూసరాలకా ।
న జాతు బాలా లభతే స్మ నిర్వృతిం
తుషారసఙ్ఘాతశిలాతలేష్వపి ॥ 55

శ్లో॥ ఉపాత్తవర్ణే చరితే పినాకిన
స్సబాష్పకణ్ఠస్ఖలితైః పదై రియమ్ ।
అనేకశః కిన్నరరాజకన్యకా
వనాన్తసఙ్గీతసఖీ రరోదయత్ ॥ 56

శ్లో॥ త్రిభాగశేషాసు నిశాసు చ క్షణం
నిమీల్య నేత్రే సహసా వ్యబుధ్యత ।
క్వ నీలకణ్ఠ! వ్రజసీ త్యలక్ష్య వా
గసత్యకణ్ఠార్పితబాహుబన్ధనా ॥ 57

ఆ బాణము నేడీ పార్వతి హృదయములోనికి గాఢముగా గుచ్చుకొనినది. (ఈ శ్లోకమునందు 'చక్షుఃప్రీతి, మనస్సంగము' అను రెండు మదనావస్థలు తెలుపబడినది.) 54

అప్పటినుండి ఈ పార్వతి, తండ్రి యింటియందు మిక్కిలి ప్రేమపరవశురాలై, చుక్కబొట్టుగా పెట్టుకొనిన గంధము మీద పొరలి, బూడిదరంగుగా మారిన ముంగురులు కలదై, ఈ చిన్నది, మంచు దట్టముగా పేర్కొని, శిలలుగా మారిన హిమశిలలమీద పరుండికూడ ఏ ఒక్క క్షణమును (విరహతాపము తగ్గి) సుఖము నందలేదు. (ఈ శ్లోకమునందు "అరతి, లేక విద్వేషావస్థ" చూపబడినవి. ఇది 12 మదనావస్థలలో "జాగర" మను అవస్థను సూచించును.) 55

శివుని చరిత్రమును స్వీకరించి, వర్ణములుగా పాడుట ప్రారంభింపగనే ఈమె గద్గదస్వరముతో కన్నీటితోకూడిన మాటలతో వనమధ్యము నందున్న సంగీతపు చెలికత్తెలగు కిన్నరరాజకన్యకలను బహువిధముల తనతోబాటు ఏడిపించెను. (ఇందు "మూర్ఛ" అను మదనావస్థ వివరింపబడినది.) 56

ఇంతేకాదు. రాత్రిలో మూడుపాళ్ళుగడిచిపోగా, ఇంకను మిగిలిన తెల్లవారుఝాముకాలమునందు అంతవరకు నిద్రపట్టక, అప్పుడే క్షణకాలము కన్నులు మూసికొని, "ఓ నీలకంఠుడా! ఎక్కడికి పోవుచున్నావు?" అని కనిపించని ఈశ్వరుని పిలుచుచు, నిజముకాని, (కలలోని) శివునికంఠమును కౌగిలించుకొనుచు వెంటనే మేల్కొనెను. (ఈ శ్లోకమునందు "జాగరము, ఉన్మాదము" అను రెండు మదనావస్థలు సూచింపబడినవి.) 57

శ్లో॥ యదా బుధైః సర్వగత స్త్వ ముచ్యసే
న వేత్సి భావస్థ మిమం కథం జనమ్ ।
ఇతి స్వహస్తోల్లిఖితశ్చ ముగ్ధయా
రహ స్యుపాలభ్యత చన్ద్రశేఖరః ॥ 58

శ్లో॥ యదా చ తస్యాధిగమే జగత్పతే
రపశ్య దన్యం న విధిం విచిన్వతీ ।
తదా సహాస్మాభి రనుజ్ఞయా గురో
రియం ప్రపన్నా తపసే తపోవనమ్ ॥ 59

శ్లో॥ ద్రుమేషు సఖ్యా కృతజన్మసు స్వయం
ఫలం తపస్సాక్షిషు దృష్ట మేష్వపి ।
న చ ప్రరోహాభిముఖో౽పి దృశ్యతే
మనోరథో౽స్యా శ్శశిమౌలిసంశ్రయః ॥ 60

శ్లో॥ న వేద్మి స ప్రార్థితదుర్లభః కదా
సఖీభి రస్రోత్తరమీక్షితా మిమామ్ ।
తపఃకృశా మభ్యుపపత్స్యతే సఖీం
వృషేవ సీతాం తదవగ్రహక్షతామ్ ॥ 61

శ్లో॥ అగూఢసద్భావ మితీఙ్గితజ్ఞయా
నివేదితో నైష్ఠికసున్దర స్తయా ।
అయీదమేవం పరిహాస ఇ త్యుమా
మపృచ్ఛ దవ్యఞ్జితహర్షలక్షణః ॥ 62

జ్ఞానులందరు నిన్ను "సర్వాంతర్యామివి, సర్వత్ర ఉండువాడవు, అందురు కదా! అట్టిచో నీ యం దనురాగము గల నన్నేల గుర్తింపలేకున్నావు?" అనుచు తాను స్వయముగా గీచిన చిత్రపటములోనున్న శివుని ఆ అమాయకురాలు ఏకాంతమున నిందింపసాగినది. (ఇందు "లజ్జాత్యాగ" మను మదనావస్థ వివరింపబడినది.) 58

అంతేకాదు ఈ పార్వతీదేవి జగత్ప్రభువగు శివుని పొందుటకు మఱియొక ఉపాయమును గాంచలేక అప్పుడు తండ్రియగు హిమవంతుని అనుమతిని పొంది, చెలులమైన మాతోకూడి, తపస్సు చేసికొనుటకై, ఈ తపోవనము నాశ్రయించినది. 59

మా స్నేహితురాలగు పార్వతి స్వయముగా నాటినబీజములు నేడు (ఆమె చేయుచున్న తపస్సునకు సాక్షులై, పెరిగి, పుష్పించి, ఫలించుచున్నవి. కాని, హరునిపైనున్న 'అభిలాష' అను బీజము మాత్రము కనీసము మొలకెత్తనైనను లేదు. ఫలము సంగతి వేఱుగా చెప్పుట కేమున్నది? 60

తపస్సుచే కృశించినదగుటచేత దుఃఖ పూర్వకముగా మాచే చూడబడుచున్న ఈ మా చెలికత్తెను, ప్రార్థించినను దుర్లభుడగు శివుడు, అవగ్రహము (వానలేమి) అను దోషముచే ఎండిన, నాగేటిచాలును (సీతను) సురేంద్రుడువలె, ఎన్నడనుగ్రహించునో నాకు తెలియుట లేదు. 61

పార్వతీహృదయజ్ఞురాలగు ఆ చెలి మాటలను విని, జీవితాంతము బ్రహ్మచర్యము నవలంబించు ఆ సుందరుడగు బ్రహ్మచారి (నైష్ఠికసుందరుడు) తన మనస్సులో కలిగిన సంతోషమును ప్రకటింపక, "పార్వతీ! ఈ నీ చెలికత్తె చెప్పినదంతయు నిజమా? పరిహాసమా?" అని పార్వతిని ప్రశ్నించెను. 62

శ్లో॥ అథాగ్రహస్తే ముకులీకృతాఙ్గులౌ
సమర్పయన్తీ స్ఫటికాక్షమాలికామ్ ।
కథఞ్చి దద్రే స్తనయా మితాక్షరం
చిరవ్యవస్థాపితవా గభాషత ॥ 63

శ్లో॥ యథా శ్రుతం వేదవిదాంవర! త్వయా
జనో౽య ముచ్చైఃపదలఙ్ఘనోత్సుకః ।
తపః కి లేదం త దవాప్తిసాధనం
మనోరథానా మగతి ర్న విద్యతే! ॥ 64

## శివ స్తవ పాణిగ్రహణే౽ననురూప ఇతి ప్రతిపాదనమ్

శ్లో॥ అథాహ వర్ణీ విదితో మహేశ్వర
స్తదర్థినీ త్వం పునరేవ వర్తసే ।
అమఙ్గలాభ్యాసరతిం విచిన్త్య తం
తవానువృత్తిం న చ కర్తు ముత్సహే ॥ 65

శ్లో॥ అవస్తునిర్బన్ధపరే! కథం ను తే
కరో౽య మాముక్తవివాహకౌతుకః ।
కరేణ శమ్భో ర్వలయీకృతాహినా
సహిష్యతే తత్ప్రథమావలమ్బనమ్ ॥ 66

ఆ తరువాత పార్వతీదేవి మొగ్గ అకారము ఏర్పడునట్లుగా వేళ్ళు ముడిచిన ముంజేతియందు తావళమును (జపమాలను) ఉంచుకొనుచు చిరకాలముగా మాటలను నిగ్రహించుకొనియుండి, (ఇప్పుడు మాటాడ నుత్సహించినదై) సిగ్గుతో అతికష్టముమీద పరిమితాక్షరములు కల మాటను పల్కెను. 63

"వేదవేత్తలలో శ్రేష్ఠుడా! నీవు మా చెలినుండి విన్నది సత్యమే. ఈ జనము (నేను) ఉన్నతస్థానము నందుకొనుటకు ఉత్సాహపడుచున్నాను. ఆగొప్ప పదవి నందుకొనుటకు ఈ తపస్సే సాధనమట! ఏమైనను కోర్కెలకు చేరరాని విషయము ఉండదు కదా! (కనుక నా ఆశచే నేనిట్లు తపస్సు చేయుచున్నానని భావము.) 64

## నీ పాణిగ్రహమునకు శివుడు తగడని ప్రతిపాదించుట

తరువాత బ్రహ్మచారి ఇట్లనెను. "శివుని నే నెఱుగుదును. అయన నీకు దర్శనమీయక (నీ సమక్షముననే మన్మథుని భస్మము చేసి) ఇట్లు ని న్నవమానించినను, నీవుమాత్ర మాయననే కోరుకొనుచున్నావు" ఆయన అలవాట్లన్నియు అమంగళములైనవే. కనుక నీ వాతనిని కోరుకొనుటను నే నంగీకరింపలేకున్నాను. 65

కానివస్తువునందు (తుచ్ఛవస్తువునందు) దానినే పొందవలెనను పట్టుదల కలదానా! శుభప్రదమైన వివాహకంకణమును ధరించిన ఈ నీ చేయి, పామునే కంకణముగా చుట్టుకొనిన శివుని చేతితో, అదే మొదటిసారిగా పట్టుకొనుటను (ఎవరైనను) ఎట్లు సహింతురు? (ఈ సంబంధము అసహ్యముగా ఉండునని భావము.) 66

శ్లో॥ త్వమేవ తావ త్పరిచిన్తయ స్వయం
కదాచి దేతే యది యోగ మర్హతః ।
వధూదుకూలం కలహంసలక్షణం
గజాజినం శోణితబిన్దువర్షి చ ॥ 67

శ్లో॥ చతుష్కపుష్పప్రకరావకీర్ణయోః
పరోఽపి కో నామ తవానుమన్యతే ।
అలక్తకాఙ్కాని పదాని పాదయో
ర్వికీర్ణకేశాసు పరేతభూమిషు ॥ 68

శ్లో॥ అయుక్తరూపం కి మతఃపరం వద
త్రినేత్రవక్షః సులభం తవాపి యత్ ।
స్తనద్వయేఽస్మి౯ హరిచన్దనాస్పదే
పదం చితాభస్మరజః కరిష్యతి ॥ 69

67. హంసల గుర్తులుగల, పెళ్ళికుమార్తె యొక్క (నీ) పట్టుచీరయును, నెత్తుటి బొట్లను వర్షించుచున్న ఏనుగుతోలు అగు నీ వరుని వస్త్రమును అను ఈ రెండును ఎప్పుడైనను కలిసియుండుటకు తగినవా? అను విషయమును నీవే స్వయముగా నీ ఇష్టము వచ్చినంతకాలము బాగుగా ఆలోచించుకొనుము. (మీ వివాహమైనచో నీ పట్టుచీరకొంగునకు ఆతని ఏనుగుతోలు అంచును కలిపి బ్రహ్మముడి వేయుదురు గదా! ఈ రెండును ఒండొంటితో కలిసియుండుటకు తగవని భావము.) 67

చతుష్క (మండువా ఇళ్ళు) గృహములలో పుష్పరాశులపై నడిచిన నీ పాదములు పారాణిచే అలంకరింపబడినవై, మీ ఇంటియందు (రాజభవనమునందు) సంచరించుచుండును. ఆ పాదములే శివుని వివాహము చేసికొనిన తరువాత, అతని ఇంటికి వెళ్ళినప్పుడు, చనిపోయినవాడికై కర్మలు చేయువారు తీయించుకొనిన జుట్టుపై శ్మశానములో నడువవలసియుండును. ఎంతటి శత్రువైనను నీవు శ్మశానమునందు విహరించుట కనుమతింపదనగా, నా వంటి అభిమాని ఈ వివాహమున కెట్లు అంగీకరించును? (అంగీకరింపదని భావము.) 68

శివునియొక్క వక్షఃస్థలము ఆలింగనముచేసుకొనుటకై సులభముగా దొరకును. కాని, అంతకంటె అయోగ్యత మఱెచ్చట నుండునో నీవే చెప్పుము. ఏలయనగా ఆ వివాహానంతరము అతడు ని న్నాలింగనము చేసికొనినపుడు సుగంధభరితమైన, పరమ పవిత్రమైన, హరిచందనమును పూసికొనిన, నీ స్తనములపై, పీనుగును కాల్చిన బూడిద, అచ్చట స్థానము నందును. (అంటుకొనును) (ఎక్కడి హరిచందనము? ఎచ్చటి చితాభస్మము? ఈ రెంటికి పొంతన లేదని భావము.) 69

శ్లో॥ ఇయం చ తేఽన్యా పురతో విడమ్బనా
య దూఢయా వారణరాజహార్యయా ।
విలోక్య వృద్ధోక్ష మధిష్ఠితం త్వయా
మహాజనః స్మేరముఖో భవిష్యతి ॥ 70

శ్లో॥ ద్వయం గతం సమ్ప్రతి శోచనీయతాం
సమాగమప్రార్థనయా పినాకినః ।
కలా చ సా కాన్తిమతీ కలావత
స్త్వ మస్య లోకస్య చ నేత్రకౌముదీ ॥ 71

శ్లో॥ వపు ర్విరూపాక్ష మలక్ష్యజన్మతా
దిగమ్బరత్వేన నివేదితం వసు ।
వరేషు య ద్బాలమృగాక్షి మృగ్యతే
తదస్తి కిం వ్యస్తమపి త్రిలోచనే ? ॥ 72

శ్లో॥ నివర్త యాస్మా దసదీప్సితా న్మనః
క్వ తద్విధ స్త్వం క్వ చ పుణ్యలక్షణా ।
అపేక్ష్యతే సాధుజనేన వైదికీ
శ్మశానశూలస్య న యూపసత్క్రియా ॥ 73

మఱియొక నగుబాటు కూడ ముందుగనే నీ కగును. గజరాజుపై ఊరేగవలసిన నీవు, భర్త ఇంటిలో ముసిలి ఎద్దును ఎక్కి ఊరేగుచుండగా, చూచిన మహాజనులందరును నిన్ను పరిహసింతురు. 70

ఈశ్వరుని చేరుకొనవలెనను ప్రార్థనచేత ఇప్పుడు రెండు వస్తువుల విషయమై అందరును విచారింపవలసిన పరిస్థితి ఏర్పడినది. అవి - 1. ఇదివఱకే ఆయన శిరస్సును ఆశ్రయించిన, కాంతిమంతమయిన చంద్రకళ. 2. దానికి తోడుగా నేడు జగజ్జనుల కన్నుల కన్నిటికిని వెన్నెల వలె ముదమును గూర్చు, పార్వతి అను పేరు గల నీవును. (నికృష్టుని (తనకంటె తక్కువవానిని) ఆశ్రయించుటవలన 1.చంద్రకళ, 2.పార్వతిలను గూర్చి, విచారింపవలసి వచ్చినదని భావము.) 71

అతని రూపమా? ఎగుడుదిగుడు కన్నులతో విరూపమైనది. (అందములేదు.) అతని జన్మ సమయ మేదో, తల్లిదండ్రు లెవరో, కుల మేదో తెలియదు. (వయస్సు, కులము తెలియదు.) అతడు దిగంబరుడు, ధనహీనుడు అని తెలియుచున్నది. లేడిపిల్లవంటి అందమైన కన్నులు కలదానా! సాధారణముగా లోకములో నంతట వరునివిషయములో ఏ ఏ అంశములను పరిశీలించి చూచుదురో ఆ లక్షణములలో ఒక్కటైనను అతనిలో ఉన్నదా? (లేదే? మఱి ఏమి చూచి, అతనిని వివాహము చేసికొనదలచితివి? అని ప్రశ్నించుచున్నాడు.) 72

ఈ చెడ్డకోరికనుండి మనస్సును మరల్చుకొనుము. అట్టి అమంగళాభ్యాసములుగల ఆ శివు డెక్కడ? పుణ్యలక్షణములుకల నీ వెక్కడ? ఎంతటి సాధువైనను, యజ్ఞములో పశువును కట్టుట కుపయోగించు స్తంభమునకు (యూపమునకు) చేయు వేదోక్తమైన సంస్కారమును శ్మశానములో కొఱతవేయు స్తంభమునకు చేయుదురా? (చేయరని భావము.) 73

## ఆక్షిప్తదూషణానాం పార్వత్యా పరిహరణమ్

శ్లో॥ ఇతి ద్విజాతౌ ప్రతికూలవాదిని
ప్రవేపమానాధరలక్ష్యకోపయా ।
వికుఞ్చితభ్రూలత మాహితే తయా
విలోచనే తిర్యగుపాన్తలోహితే ॥ 74

శ్లో॥ ఉవాచ చైనం పరమార్థతో హరం
న వేత్సి నూనం యత ఏవ మాత్థ మామ్ ।
ఆలోకసామాన్య మచిన్త్య హేతుకం
ద్విషన్తి మన్దా శ్చరితం మహాత్మనామ్ ॥ 75

అవ. : సమ్ప్రతి 'అమఙ్గలాభ్యాసరతిమ్' ఇత్యాద్యుక్తం దూషణజాతం 'విపద్' ఇత్యాదిభిః షడ్భిః శ్లోకైః పరిహర్తు మారభతే.

శ్లో॥ విపత్ప్రతీకారపరేణ మఙ్గలం
నిషేవ్యతే భూతిసముత్సుకేన వా ।
జగచ్ఛరణ్యస్య నిరాశిషః సతః
కి మేభి రాశోపహతాత్మవృత్తిభిః ॥ 76

## బ్రహ్మచారి చేసిన శివదూషణమును పార్వతి ఖండించుట

ఇట్లు తన అభీష్టమునకు వ్యతిరేకముగా బ్రహ్మచారి చెప్పగా, బాగుగా వణుకుచున్న క్రింది పెదవిచేత తన కోపమును ప్రదర్శించు, ఆ పార్వతీదేవి యొక్క కనుబొమలు బాగుగా వంచబడినవి. 2. కళ్ళకొన లెఱ్ఱబారినవి. 3. కళ్ళు అడ్డముగా తిప్పబడినవి. (ఈ మూడు లక్షణములును ఇష్టములేని మాటను వినుటవలన కలుగునని భావము.) **74**

పార్వతీదేవి బ్రహ్మచారితో "నిజముగా ఈశ్వరుని తత్త్వమును నీ వెఱుగవు. అందువలననే నాతో ఇట్లు మాట్లాడితివి. అవివేకులగువారు లోకసామాన్యము కానట్టియు, కారణము నూహింపలేనట్టియు చరిత్రలు గల మహాత్ములను ద్వేషించెదరు" అని చెప్పెను. **75**

**అవతారిక :** ఇప్పుడు "శివుడు అమంగళాభ్యాసరతుడు" మొదలగు దూషణములకు ఇటనుండి "విపత్" మొదలగు ఆరు శ్లోకములలో సమాధానము నిచ్చుచున్నాడు.

వచ్చిన ఆపదకు ప్రతీకారము చేయదలచుకొనినవాడుగాని, ఐశ్వర్యమును పొంద నుత్సహించువాడుగాని, మంగళమును (గంధమాల్యాదికమును, సేవించును. (కోరుకొనును.) లోకరక్షకుడైన, ఏ కోర్కెలు లేనట్టి శివునికి, ఆశచే కొట్టబడిన చిత్తవృత్తి గలవియగు ఈ మంగళములతో పని ఏముండును? (ఉండదని భావము. కనుకనే శివుడు మంగళసిద్ధికై పాటుపడడని భావము.) **76**

శ్లో॥ అకిఞ్చనః సన్ ప్రభవ స్స సమ్పదాం
త్రిలోకనాథః పితృసద్మగోచరః ।
స భీమరూపః శివ ఇ త్యుదీర్యతే
న సన్తి యథార్థ్యవిదః పినాకినః ॥ 77

అవ. : దేవస్య లౌకిక మలౌకికం చ ప్రసాధనం నాస్తీ త్యాశయే నాహ.

శ్లో॥ విభూషణోద్భాసి పినద్ధభోగి వా
గజాజినాలమ్బి దుకూలధారి వా ।
కపాలి వా స్యా దథ వేన్దుశేఖరం
న విశ్వమూర్తే రవధ్యార్యతే వపుః ॥ 78

శ్లో॥ తదఙ్గసంసర్గ మవాప్య కల్పతే
ధ్రువం చితాభస్మరజో విశుద్ధయే ।
తథా హి నృత్యాభినయక్రియాచ్యుతం
విలిప్యతే మౌలిభి రమ్బరౌకసామ్ ॥ 79

అవ. : యదుక్తం 'దిగమ్బరత్వేన నివేదితం వసు' 'ఇయం చ
తేఽన్యా పురతో విడమ్బనా' ఇత్యాది చ, తత్రోత్తర మాహ.

ఆ శివుడు అకించనుడు (ఏమియులేని దరిద్రుడు) అయియుండియు అతడు సమస్త సంపదలకు పుట్టుక స్థానమైనవాడు. (కారణము) శ్మశానమునందు కనిపించువాడైనను ముల్లోకములకు నాయకుడైనవాడు. ఆతడు భయంకరమైన ఆకారము కలవాడయ్యును శివుడు (సౌమ్య స్వరూపుడు) అని పిలువబడుచున్నాడు. కనుక శివునియొక్క యథార్థ తత్త్వమును తెలిసినవా డెవడును లేడు. 77

**అవతారిక:** ఆ శివునకు ప్రపంచములో లౌకికమును (ధరింపదగిన), అలౌకికమును (ధరింపదగని) భూషణములు లేవనుచున్నాడు.

విశ్వమూర్తి (లోకస్వరూపుడగు) శివునియొక్క శరీరము, నగలచే ప్రకాశించునది యగును. పాములచే చుట్టబడినదియైనను కావచ్చును. ఏనుగుతోలును ధరించినదియగును. పట్టుపుట్టములను కట్టినది యైనను కావచ్చును. పుఱ్ఱెను ధరించినది కావచ్చును. లేదా చంద్రుని తలపై అలంకరించుకొని వెలుగొందునదియైనను కావచ్చును. కాని అది ఇట్టిది, అట్టిది అని నిర్ధారణచేసిచెప్పుటకు వీలు లేనిది. 78

ఆ శివుని శరీరముతో సంపర్కమునుపొంది, చితిలోని బూడిదకణములు నిజముగా పవిత్రతను పొంది, అందుకొనినవారికి పవిత్రతను కలిగించుచున్నవి. అందువలననే ఆ స్వామి తాండవనృత్యము చేసినప్పుడు, ఆతని శరీరమునుండిరాలి, పడిన ఆ భస్మమును, 'పవిత్రమైనది, తమ్ము పవిత్రులను చేయునది' అని తలచి, తమతమ తలలపై, (కిరీటములపై) దేవతలు పూసికొనుచున్నారు. 79

**అవతారిక :** "దిగంబరత్వేన నివేదితం వసు" "ఇయం చ తేఽన్యా" అను శ్లోకములకు సమాధాన మిది.

శ్లో॥ అసమ్పద స్తస్య వృషేణ గచ్ఛతః ।
ప్రభిన్నదిగ్వారణవాహనో వృషా ।
కరోతి పాదా వుపుగమ్య మౌలినా
వినిద్రమన్దారరజోఽరుణాఙ్గులీ ॥ 80

అవ. : య దుక్తమ్ 'అలక్ష్యజన్మతా' ఇతి తత్రోత్తర మాహ.

శ్లో॥ వివక్షతా దోష మపి చ్యుతాత్మనా
త్వ యైక మీశంప్రతి సాధు భాషితమ్ ।
య మామన న్త్యాత్మభువోఽపి కారణం
కథం స లక్ష్యప్రభవో భవిష్యతి? ॥ 81

శ్లో॥ అలం వివాదేన యథా శ్రుత స్త్వయా
తథావిధ స్తావ దశేష మస్తు సః ।
మమాత్ర భావైకరసం మనః స్థితం
న కామవృత్తి ర్వచనీయ మీక్షతే ॥ 82

సంపద లేక, ఎద్దుపై ప్రయాణముచేయు శివునియొక్క పాదములకు, మదమును స్రవించు ఐరావతము అను పేరుగల దిగ్గజమే వాహనముగా గల దేవేంద్రుడు, దగ్గరకు చేరి, నమస్కరించి, తన కిరీటమునందలి "మందారము" అను పేరుగల కల్పవృక్షపు పుష్పపరాగముతో శివుని కాలివేళ్ళను ఎఱ్ఱబాఱ చేయుచున్నాడు. (అనగా సంపన్నుడైన దేవేంద్రుడు సంపద్రహితుడైన శివుని కాళ్ళకు శిరసా నమస్కరించుచున్నాడని భావము.) 80

అవతారిక : "అలక్ష్యజన్మతా" అను శ్లోకమునందు చెప్పబడిన లోపమునకు సమాధానము నిచ్చుచున్నాడు.

"పుట్టుక తెలియనివాడు శివుడు" అని నీవు నిందించుటకై చెప్పినను ఈ ఒకమాటను సత్యముగా పలికితివి. ఏలయనగా, స్వయంభువుడగు బ్రహ్మకు కూడ మూలకారణమని ఎవరిని అందురో, అట్టి శివుని జన్మ నీ కెట్లు తెలియును? 81

అట్లు కాకున్నను, ఈ వివాద మింతటితో చాలును. ఆయనను గూర్చి నీ వెట్లు వింటివో ఆత డట్టివాడే యగుగాక! కాని నా మనస్సు మాత్రము ఆతనియందే శృంగారరసప్రధానమై, ఆయన ప్రేమనే కోరుకొనుచున్నది. నా యిష్టమునకు నీ యడ్డ మేమున్నది? (స్వేచ్ఛావిహారియగువాడు, త న్నెవ రేమందురో, లోకులకు తన నడత నచ్చునో లేదో అని ఆలోచింపక) తనకు వచ్చు నిందను కూడ పరిగణింపక యథేచ్ఛముగా ప్రవర్తించును కదా! 82

శ్లో॥ నివార్యతా మాలి! కిమప్యయం వటుః
పున ర్వివక్షుః స్ఫురితోత్తరాధరః ।
న కేవలం యో మహతో ౨పభాషతే
శృణోతి తస్మాదపి య స్స పాపభాక్ ॥ 83

## నిజరూపమాస్థితం శివ మాలోక్య, పార్వత్యాః ఆనన్దః

శ్లో॥ ఇతో గమిష్యా మ్యథ వేతి వాదినీ
చచాల బాలా స్తనభిన్నవల్కలా ।
స్వరూప మాస్థాయ చ తాం కృతస్మితః
సమాలలమ్బే వృషరాజకేతనః ॥ 84

శ్లో॥ తం వీక్ష్య వేపథుమతీ సరసాఙ్గయష్టి
ర్నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహన్తీ ।
మార్గాచలవ్యయతికరాకులితేవ సిన్ధుః
శైలాధిరాజతనయా న యయౌ న తస్థౌ ॥ 85

ఓ చెలీ! క్రింద పెదవిని కదుల్చుచు ఈ బ్రహ్మచారి మరల ఏదో చెప్పగోరుచున్నాడు. (కావున) ఈతని ప్రయత్నమును మాన్పింపుము. ఎవడు గొప్పవారిని నిందించునో వా డొక్కడే కాక ఆ నిందను ఎవడు వినునో వాడుకూడ పాపమును పొందును. ఈ విషయమునందు స్మృతి వాక్య మిట్లున్నది.

"గురోః ప్రాప్తః పరీవాదః న శ్రోతవ్యః కథఞ్చన
తత్ర కర్ణౌ పిధాతవ్యౌ గంతవ్యం వా తతో ఽ న్యతః॥

గురువును అవమానించు మాటలను ఎట్టి పరిస్థితిలోను వినరాదు. తప్పక వినవలసిన పరిస్థితి ఏర్పడినచో చెవులను మూసికొనవలెను. లేదా అచ్చటినుండి మఱియొక ప్రదేశమునకు వెళ్ళిపోవలెను అని ఈ స్మృతి వాక్యమున కర్థము. 83

## నిజరూపమును ధరించిన బ్రహ్మచారిని (శివుని) చూచి, పార్వతి ఆనందించుట.

అట్లుకాదేని, ఇచ్చటినుండి వెళ్ళిపోయెదను. అని పల్కుచు స్తనములపైనున్న నారబట్ట జారునట్లుగా ఆ బాల (పార్వతి) అచ్చటినుండి కదిలెను. అప్పుడు వృషభధ్వజుడగు శివుడు నిజరూపమును ధరించి నవ్వుచు ఆమెను పట్టుకొనెను. 84

ఆయనను చూచి వణుకుచు చెమటతో తడిసిన శరీరము కలదై, ముందుకు వేయుటకై ఎత్తిన ఒక కాలిని, అట్లే ఎత్తి ఉంచి, పర్వత రాజకుమార్తెయగు ఆ పార్వతీదేవి, తోవలో కొండ అడ్డుటచే తొట్రుపడు నదివలె ముందుకు సాగనులేకపోయినది. అట్లని నిలిచియు నుండలేకపోయినది. (ఇది వసంతతిలకావృత్తమునందు కూర్పబడినది.)
85

శ్లో॥ అద్య ప్రభృ త్యవనతాఙ్గి! తవాస్మి దాసః
క్రీత స్తపోభి రితి వాదిని చన్ద్రమౌలౌ ।
అహ్నాయ సా నియమజం క్లమ ముత్ససర్జ
క్లేశః ఫలేన హి పున ర్నవతాం విధత్తే ॥ 86

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"తపఃఫలోదయో"నామ పఞ్చమః సర్గః

-౦0౦-



పార్వతీతపశ్చర్య శ్లోకము 8

"(వినయము చేతను, స్త్రీత్వము చేతను) వంగిన శరీరముకలదానా! ఈ క్షణమునుండి నీ తపస్సులచే కొనబడి, నీ సేవకుడ నైపోయితిని." ఈ విధముగా చంద్రుని, తలపై ఆభరణముగా ధరించిన శివుడు మాట్లాడుచుండగా ఆ పార్వతీదేవి తపోనియమపాలనమువలన కలిగిన కష్టమును (శ్రమను) శీఘ్రముగా విడిచిపెట్టెను. పడిన కష్టము, దాని ఫలితము నందుటచేత తిరిగి క్రొత్తదనమును (శ్రమలేనితనమును) కలిగించును కదా! (కష్టమునకు తగిన ఫలితమును పొందినపుడు కష్టపు శ్రమ తొలగిపోయి పూర్వమువలె ఉత్సాహము చిగురించి, ఆ వ్యక్తి నూతన వ్యక్తివలె కనబడుట లోకసహజము. ఈ విషయమునే కాళిదాసు పార్వతివిషయమున ఈ శ్లోకమునందు నిరూపించినాడు.

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "తపఃఫలోదయము" అను పేరుగల ఐదవ
సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-



పార్వతిని చేపట్టెదనని అభయమునిచ్చుట. శ్లోకము 86

# కుమారసమ్భవమ్
## "ఉమాప్రదానం" నామ
## షష్ఠః సర్గః

శ్లో॥ అథ విశ్వాత్మనే గౌరీ
సన్దిదేశ మిథః సఖీమ్ ।
దాతా మే భూభృతాంనాథః
ప్రమాణీక్రియతా మితి ॥ 1

శ్లో॥ తయా వ్యాహృతసన్దేశా
సా బభౌ నిభృతా ప్రియే ।
చూతయష్టి రివాభ్యాశే
మధౌ పరభృతోన్ముఖీ ॥ 2

### హిమాద్రిం కన్యాయాచనార్థం శివేన మునిస్మరణం

శ్లో॥ స తథేతి ప్రతిజ్ఞాయ
విసృజ్య కథ మప్యుమామ్ ।
ఋషీన్ జ్యోతిర్మయాన్
సప్త సస్మార స్మరశాసనః ॥ 3

# కుమారసంభవము

## "ఉమాప్రదానము" అను
## ఆరవసర్గము

పిమ్మట ఆ గౌరీదేవి విశ్వాత్ముడగు (లోకస్వరూపముగల) ఆ శివునికి రహస్యముగా తన చెలికత్తె ద్వారా ఇట్లు సందేశమును పంపించెను. "పర్వతరాజగు హిమవంతుడు నా యొక్క దాతగా నీ వంగీకరింపుము." (తండ్రిద్వారా నన్ను పొందుము అని భావము. ఈ సర్గములోని శ్లోకములు అనుష్టుప్ ఛందస్సులో కూర్చబడినవి.) 1

ఆ ప్రియసఖిద్వారా శివునకు సందేశమును పంపి, ఆయన యందత్యంతాసక్తురాలై వసంతమున నిశ్చలముగా ఆడుకోయిల ద్వారా పలుకుచున్న మావికొమ్మవలె అతని సమీపమున ఆమెయు ప్రకాశించెను. 2

### కన్య నిమ్మని హిమవంతు నడుగుటకై శివుడు సప్తర్షులను స్మరించుట.

మన్మథుని శాసించిన శివుడు, అట్లే అని చెప్పి, పార్వతిని అతి కష్టము మీద విడిచి, తేజః స్వరూపులైన సప్తర్షులను స్మరించెను. 3

శ్లో॥ తే ప్రభామణ్డలై ర్వ్యోమ
ద్యోతయన్త స్తపోధనాః ।
సారున్ధతీకా స్సపది
ప్రాదురాస న్పురః ప్రభోః ॥ 4

అవ. : ఇతః పరం షడ్భిః శ్లోకై స్తానేవ మునీ న్వర్ణయతి.

శ్లో॥ ఆప్లుతా స్తీరమన్దార
కుసుమోత్కిరవీచిషు ।
వ్యోమగఙ్గాప్రవాహేషు
దిఙ్నాగమదగన్ధిషు ॥ 5

శ్లో॥ ముక్తాయజ్ఞోపవీతాని
బిభ్రతో హేమవల్కలాః ।
రత్నాక్షసూత్రాః ప్రవ్రజ్యాం
కల్పవృక్షా ఇవాశ్రితాః ॥ 6

శ్లో॥ అధఃప్రస్థాపితాశ్వేన
సమావర్జితకేతునా ।
సహస్రరశ్మినా సాక్షాత్
సప్రణామ ముదీక్షితాః ॥ 7

శ్లో॥ ఆసక్తబాహులతయా సార్ధ
ముద్ధృతయా భువా ।
మహావరాహదంష్ట్రాయాం
విశ్రాన్తాః ప్రలయాపది ॥ 8

తపస్సే ధనముగాగల ఆ ఋషులు తమ కాంతిమండలములచే ఆకాశమునంతటిని ప్రకాశింపచేయుచు, అరుంధతీదేవితో కూడినవారై, వెంటనే ఈశ్వరుని ఎదుట ప్రత్యక్షమైరి. 4

అవతారిక : ఇచ్చటినుండి ఆరు శ్లోకములలో ఆ మునులనే వర్ణించుచున్నాడు.

ఒడ్డునందు మొలచిన మందారవృక్షములయొక్క పుష్పములను విరజిమ్ముచున్న అలలు కలదియును, దిగ్గజముల మదముచే వాసన కలదియును, అగు ఆకాశగంగాప్రవాహములయందు స్నానము చేసినవారై, సాక్షాత్కరించిరి. 5

ముత్యముల జందెములను, బంగారు నారచీరలను, రత్నములతో నిర్మింపబడిన జపమాలలను ధరించి, ప్రవ్రజ్య (వానప్రస్థాశ్రమమును ఆశ్రయించి) కల్పవృక్షములవలె నున్నవారై (సాక్షాత్కరించిరి.) 6

గుబ్బములను బయలుదేరదీసి, జెండాను కొంచెము వంచిన, ముఖమును పైకెత్తి చూచుచున్న, సూర్యునిచే స్వయముగా నమస్కరింపబడుచున్న ఋషులు (సాక్షాత్కరించిరి.) 7

ప్రళయము అను ఆపత్కాల సమయమునందు తీగవంటి తన సన్నని బాహువులను తగిలించి, తనను పట్టుకొనిన భూమండలమును వరాహరూపముతో ఉద్ధరించిన, శ్రీవరాహమూర్తియొక్క కోరయందు విశ్రాంతిని తీసికొనెడు ఆ సప్తర్షులు (ప్రత్యక్షమైరి) (మహాప్రళయకాలము నందు కూడ నశింపనివారని దీని భావము.) 8

శ్లో॥ సర్గశేషప్రణయనా
ద్విశ్వయోనే రనన్తరమ్ ।
పురాతనాః పురావిద్భి
ర్ధాతార ఇతి కీర్తితాః ॥ 9

శ్లో॥ ప్రాక్తనానాం విశుద్ధానాం
పరిపాక ముపేయుషామ్ ।
తపసా ముపభుఞ్జానాః
ఫలాన్యపి తపస్వినః ॥ 10

శ్లో॥ తేషాం మధ్యగతా సాధ్వీ
పత్యుః పాదార్పితేక్షణా ।
సాక్షాదివ తపః సిద్ధి
ర్బభాసే బహ్వారున్ధతీ ॥ 11

శ్లో॥ తా మగౌరవభేదేన
మునీం శ్చాపశ్య దీశ్వరః ।
స్త్రీ పుమా ని త్యనాస్థైషా
వృత్తం హి మహితం సతామ్ ॥ 12

శ్లో॥ తద్దర్శనా దభూ చ్ఛమ్భో
ర్భూయాః దారార్థ మాదరః ।
క్రియాణాం ఖలు ధర్మ్యాణాం
సత్పత్న్యో మూలకారణమ్ ॥ 13

ప్రపంచోత్పత్తికి కారణుడగు బ్రహ్మకు తరువాత, సృష్టిలో మిగిలిన భాగములను పూర్తిచేయుటవలన వ్యాసుడు మొదలగు పురావేత్తలచే "ప్రాచీనులగు బ్రహ్మలు" అని కొనియాడబడిన, (ఋషులు ప్రత్యక్షమైరి.)9

క్రిందటి జన్మలకు సంబంధించిన, నిర్మలములైన, పరిపక్వసిద్ధినొందిన, తపఃఫలమును అనుభవించునట్టి తపస్వులును అగు (ఋషులు ప్రత్యక్షమైరి.) 10

వారి నడుమనుండి, భర్తయొక్క పాదములయందే తన చూపులను లగ్నము చేసి, అరుంధతీదేవి సాక్షాత్తుగా వారి తపఃసిద్ధి దేవతవలె ప్రకాశించెను. 11

శివు డామునులను, పతివ్రతయగు అరుంధతిని, గౌరవభేదము లేకుండ సమాన గౌరవముతో చూచెను. ఎందు చేతననగా ఉత్తములవృత్తము (వ్యాపారము) స్త్రీపురుషవివిక్ష లేనంత గొప్పది కదా! 12

శివునకు అరుంధతిని చూడగనే భార్యను తెచ్చుకొనవలెనను కోరిక ఎక్కువయ్యెను. ఏలయనగా పతివ్రతలగు భార్యలు ధర్మయుక్తములగు కార్యక్రమములను నిర్వర్తించు విషయములో ముఖ్యకారణము లగుదురు కదా! 13

శ్లో॥ ధర్మేణాపి పదం శర్వే
కారితే పార్వతీం ప్రతి ।
పూర్వాపరాధభీతస్య కామ
స్యోచ్ఛ్వసితం మనః ॥ 14

## మునిభి రుపస్థాయ శివస్తవనమ్

శ్లో॥ అథ తే మునయః సర్వే
మానయిత్వా జగద్గురుమ్ ।
ఇద మూచు రనూచానాః
ప్రీతికణ్టకితత్వచః ॥ 15

శ్లో॥ య ద్బ్రహ్మ సమ్య గామ్నాతం
య దగ్నౌ విధినా హుతమ్ ।
యచ్చ తప్తం తప స్తస్య
విపక్వం ఫల మద్య నః ॥ 16

శ్లో॥ య దధ్యక్షేణ జగతాం
వయ మారోపితా స్త్వయా ।
మనోరథ స్యావిషయం
మనోవిషయ మాత్మనః ॥ 17

శ్లో॥ యస్య చేతసి వర్తేథాః
స తావ త్కృతినాం వరః ।
కిం పున ర్బ్రహ్మయోనే
ర్య స్తవ చేతసి వర్తతే ॥ 18

(భార్యను (గ్రహింపవలెను అను) ధర్మముచే శివుడు పార్వతిని గూర్చి తన మనసులో స్థానమును ఏర్పరుచుకొనగానే ఇంతకుముందు చేసిన తప్పిదమునకు వెఅచిన మన్మదునిచిత్తము కూడ తిరిగి (బ్రతుకుటకు అవకాశముకల్గెనని తెప్పరిల్లినది. 14

## సప్తఋషులు సమీపించి శివుని స్తుతించుట

ఆ పిమ్మట ఆ సాంగవేదజ్ఞులైన ఋషులు, సంతోషముతో గగుర్పొడిచిన శరీరము కలవారై, లోకగురువగు హరునితో ఇట్లు పలికిరి. 15

మేము వేదములను సమ్యక్ = నియమపూర్వకముగా అభ్యసించి నందుకును, విధిపూర్వకముగా హోమములు చేసినందుకును, తపస్సు చేసినందుకును మా కర్మలు నేడు ఫలించినవి. 16

జగత్తు అంతటికి (ప్రభువగు నీవు ఊహింపని రీతిలో మమ్ము నీ మనస్సులోనికెక్కించుకొని, నీ సేవకువయోగ వడునట్లుగా తలచుకొంటివి. ఇది మా భాగ్యము. 17

ఎవనియొక్క చిత్తమునందు, నీ వుందువో వాడే కదా పుణ్యాత్ములలో (కృతార్థులలో) (శ్రేష్ఠుడు. వేదములకు కారణమైన నీ మనస్సులో ఎవడుండునో వాడు ధన్యుడని వేరుగా చెప్పనేల? 18

శ్లో॥ సత్య మర్కా చ్చ సోమా చ్చ
పర మధ్యాస్మహే పదమ్ ।
అద్య తూచ్చైస్తరం తాభ్యాం
స్మరణానుగ్రహో త్తవ ॥ 19

శ్లో॥ త్వ త్సమ్భావిత మాత్మానం
బహుమన్యామహే వయమ్ ।
ప్రాయః ప్రత్యయ మాధత్తే
స్వగుణే షూత్తమాదరః ॥ 20

శ్లో॥ యా నః ప్రీతి ర్విరూపాక్ష!
త్వ దనుధ్యానసమ్భవా ।
సా కి మావేద్యతే తుభ్య
మన్తరాత్మాఽసి దేహినామ్ ॥ 21

శ్లో॥ సాక్షా ద్దృష్టోఽసి న పున
ర్విద్మ స్త్వాం వయ మఞ్జసా ।
ప్రసీద కథయాఽఽత్మానం
న ధియాం పథి వర్తసే ॥ 22

అవ. : తాత్త్వికం రూపం తావ దస్తామ్. న దృశ్యమానమపి రూపం తత్త్వతో రూపయితుం శక్య మిత్యాహ.

మేము సహజముగనే ఇప్పుడు సూర్యచంద్రులకంటె ఎత్తైన స్థానమున (సప్తర్షి మండలమునందు) ఉన్నాము. ఇప్పుడు మమ్ము నీవు స్మరించుట అను అనుగ్రహముచే మునుపటికంటె ఉన్నతమైన పదవిని అధిరోహించితిమి. 19

నీచే గౌరవింపబడిన మమ్ము (మా ఆత్మలను) మేము గొప్పగా భావించుకొనుచున్నాము. ఏలయనగా గొప్పవారు చూపిన ఆదరణము, తమ గుణములయందు (ప్రాణులకు) తరచుగా విశ్వాసమును కలిగించును. 20

ఓ పరమేశ్వరుడా! నీవు (మమ్ము) స్మరించుటచే (మాకు) కలిగిన సంతోషమును నీకు, నేరుగా (మేము స్వయముగా) చెప్పు టెందుకు? జీవులందరికి నీవు అంతరాత్మవు గదా (మా మనస్సులలోనే ఉన్న నీకు మా మనస్సులయందలి ఆనందమును చెప్పనక్కరలే దని భావము.)21

నేడు నీవు ప్రత్యక్షముగా (మా కనులారా) చూడబడితివి. అయినను నీ తత్త్వమును మేము (సరిగా) తెలియకున్నాము అనుగ్రహించి నీ స్వరూపమును చెప్పుము. నీవు కేవలము బుద్ధి గోచరుడవు కావు కదా! (బుద్ధ్యతీతుడవని భావము.) 22

**అవతారిక :** నీ తాత్త్వికరూపము మాట నటుంచుము. ఈ కనబడుచున్న రూపమునుకూడ తత్త్వతః నిర్ణయించుటకు శక్యము కాకున్నదని చెప్పుచున్నాడు.

శ్లో॥ కిం యేన సృజసి వ్యక్త ముత
యేన భిభర్షి తత్ ।
అథ విశ్వస్య సంహర్తా
భాగః కతమ ఏష తే? ॥ 23

అవ. : నను హర ఇత్యేవం నిశ్చయా త్కథ మయం సంశయ స్తత్రాహ.

శ్లో॥ అథవా సుమహ త్యేషా
ప్రార్థనా దేవ! తిష్ఠతు ।
చిన్తితోపస్థితాం స్తావ
చ్ఛాధి నః కరవామ కిమ్? ॥ 24

పరమేశ్వరః ఋషీన్ ప్రత్యాహ

శ్లో॥ అథ మౌలిగతస్యేన్దో
ర్విశదై ర్దశనాంశుభిః ।
ఉపచిన్వ౯ ప్రభాం తన్వీం
ప్రత్యాహ పరమేశ్వరః ॥ 25

శ్లో॥ విదితం వో యథా స్వార్థా న
మే కాశ్చిత్ ప్రవృత్తయః ।
నను మూర్తిభి రష్టాభి
రిత్థంభూతోఽస్మి సూచితః ॥ 26

ఈ నీ యొక్క భాగములో ఏ భాగముతో వ్యక్తం = పైకి కనిపించు ఈ ప్రపంచమును సృష్టింతువో, నీవు అదియా? లేక దేనితో ప్రపంచమును పోషింతువో ఆ భాగమా నీవు? అది కానపుడు ఏ భాగముతో ఈ ప్రపంచమును సంహరింతువో ఆ భాగమా? (నీవు సృష్టి చేయు హిరణ్యగర్భుడవా! పోషించు విష్ణువువా? లేక సంహరించు రుద్రుడవా? ఇంతకు నీ యథార్ధ తత్త్వము, నిజరూపము ఏది? అని ఋషులు ప్రశ్నించిరని భావము) 23

అవతారిక : నీవు నిశ్చయముగా హరుడవే కదా! మరల ఈ సందేహమేమి? అను శంకకు సమాధానమును చెప్పుచున్నాడు.

అట్లు కాని ఎడల ఓ ప్రభువా! నీ నిజరూపను తెలియజేయుటకై మేము చేసిన ఈ గొప్ప ప్రార్ధనను అట్లుండనిమ్ము. నీవు తలవగానే నిన్ను చేరిన మేము, నీకు ఏమి చేయవలెనో మమ్ము ఆజ్ఞాపింపుము. 24

## పరమేశ్వరుడు సప్తఋషులతో మాట్లాడుట

పిమ్మట శివుడు, తన శిరస్సుపైనున్న చంద్రునియొక్క సూక్ష్మమైన కాంతిని, తన స్వచ్ఛమగు దంతకాంతులతో అభివృద్ధి పరచుచు ఇట్లు సమాధానమును చెప్పెను. 25

ఓ మునులారా! నేను చేయు పనులేవియును నా స్వార్ధము కొఱకు కావు అని మీ కందఱకును తెలియును కదా! నేను నా అష్టమూర్తులతో ఇట్టివాడనైతినని సూచింపబడినది కదా! 26

## హిమాచలం ప్రతికన్యాయాచనానుజ్ఞాపనమ్

శ్లో॥ సోఽహం తృష్ణాతురై ర్వృష్టిం
విద్యుత్వా నివ చాతకైః ।
అరివిప్రకృతై ర్దేవైః
ప్రసూతింప్రతి యాచితః ॥ 27

శ్లో॥ అత ఆహర్తు మిచ్ఛామి
పార్వతీ మాత్మజన్మనే ।
ఉత్పత్తయే హవిర్భోక్తు
ర్యజమాన ఇవారణిమ్ ॥ 28

శ్లో॥ తా మస్మదర్థే యుష్మాభి
ర్యాచితవ్యో హిమాలయః ।
విక్రియాయై న కల్పన్తే
సమ్బన్ధాః సదనుష్ఠితాః ॥ 29

అవ. : నచాహం లౌల్యాత్ స్త్రియ మిచ్ఛామి. కిన్తు దేవోపకారాయ. యద్యేవం నిఖిల దేవేషు విద్యమానేషు హిమగిరేః శిలాభూతస్య కన్యాపరిణయేచ్ఛా కథ మిత్యుక్తే, స ఏవ మే శ్లాఘ్య సమ్బన్ధో అత్రభవాన్ హిమవా నిత్యాహ.

శ్లో॥ ఉన్నతేన స్థితిమతా ధుర
ముద్వహతా భువః ।
తేన యోజితసమ్బన్ధం
విత్త మామ ప్యవఞ్చితమ్ ॥ 30



సప్తర్షులతో శివుడు మాట్లాడుట. శ్లోకం 29.

## హిమవంతునినుండి కన్యాయాచనమునకై అనుజ్ఞ నిచ్చుట

(స్వార్థలేశము కూడ లేని) నేను, దాహముచే తొందరగల చాతకపక్షులు వర్షముకొఱకై, మేఘములను కోరినట్లు, శత్రువులచే (తారకాది రాక్షసులచే) పీడింపబడిన దేవతలు, సంతానార్థము నన్ను యాచించినారు. 27

ఆ దేవతల ప్రార్థనవలన, పుత్రోత్పత్తికై, యజ్ఞము చేయువాడు, యాగాగ్ని ఉత్పత్తి కొఱకు, అగ్నిని పుట్టించు అరణి అను ఖదిర వృక్షపు చెక్కలను తెచ్చునట్లు, నాకు కుమారుడు కలుగుటకై పార్వతీదేవిని మీరు తేవలెనని కోరుచున్నాను. 28

పార్వతిని మా కిమ్మని మీరు హిమవంతుని అడుగవలయును, ఏలయన, మీవంటి పెద్దలు కూర్చిన సంబంధములకు విఘటనము, (విడిపోవుట) అను విఘ్న ముండదు. 29

**అవతారిక** : నేను లోలత్వమువలన స్త్రీని (భార్యను) కోరుటలేదు. కాని దేవోపకారము కొఱకే నా ఈ కోరిక. అట్లయినచో సమస్తదేవతలు ఉండగా శిలారూపుడైన, హిమగిరియొక్క కుమార్తెనే వివాహమాడవలెనను ఈ కోర్కె ఏమి? అను సందేహముకలుగగా, పూజ్యుడైన ఆ హిమవంతుడే నాకు ప్రశస్తబంధువు కాదగినవాడని చెప్పుచున్నాడు.

ఉన్నతుడును, నిలుకడ కలవాడును, భూభారమును మోయువాడును అగు ఆ హిమవంతునితో ఏర్పడిన చుట్టరికమువలన నన్ను మోసపోని వానినిగాకూడ తెలిసికొనుడు. 30

అవ. : తర్హి స కింవాచ్య ఇత్యాశం క్యాహ.

శ్లో॥ ఏవం వాచ్య స్స కన్యార్థ
మితి వో నోపదిశ్యతే ।
భవత్ప్రణీత మాచార
మామనన్తి హి సాధవః ॥ 31

శ్లో॥ ఆర్యాప్యరున్ధతీ తత్ర
వ్యాపారం కర్తు మర్హతి ।
ప్రాయేణైవంవిధే కార్యే
పురన్ధ్రీణాం ప్రగల్భతా ॥ 32

శ్లో॥ తత్ ప్రయా తౌషధిప్రస్థం
సిద్ధయే హిమవత్పురమ్ ।
మహాకోశీప్రపాతే ఽస్మి
సఙ్గమః పున రేవ నః ॥ 33

శ్లో॥ తస్మి న్సంయమినా మాద్యే
జాతే పరిణయోన్ముఖే ।
జహుః పరిగ్రహవ్రీడాం
ప్రాజాపత్యా స్తపస్వినః ॥ 34

శ్లో॥ తతః పరమ మిత్యుక్త్వా
ప్రతస్థే మునిమణ్డలమ్ ।
భగవానపి సమ్ప్రాప్తః
ప్రథమోద్దిష్ట మాస్పదమ్ ॥ 35

అవతారిక : అయినచో ఆ హిమవంతునకేమి చెప్పవలెనో చెప్పుచున్నాడు.

కన్యాదానమునకై మీరా హిమవంతునితో ఇట్లు మాట్లాడవలె నని నేను మీకు ఉపదేశింపను. ఏలయనగా సజ్జనులు (ఋషులు) మీచే రచింపబడిన ఆచారమునే (విధినే) నేర్చుకొని ఆచరింతురు కదా! 31

పూజ్యురాలగు అరుంధతి కూడ వివాహ విషయమునందు వ్యాపారమును (సాహాయ్యమును) చేయుటకు, తగియున్నది. తరచుగా ఇట్టి వైవాహిక విషయములయందు స్త్రీలకు ప్రౌఢిమ (చాకచక్యము) ఉండును. 32

కనుక మీరు "ఓషధిప్రస్థము" అను పేరుగల హిమవంతుని రాజధానికి కార్యసిద్ధికై బయలుదేరుడు. ఈ మహాకోశీనది ఒడ్డుననే మనము మరల కలిసికొందుము గాక. 33

యోగులలో అగ్రగణ్యుడగు ఆ శివుడు వివాహమునకు అభిముఖుడు కాగా, బ్రహ్మపుత్రులగు ఆ సప్తర్షులు తాము భార్యలను స్వీకరించుట వలన తమకు కలిగిన సిగ్గును విడిచిపెట్టిరి. 34

తరువాత ఆ మునీశ్వరుల సమూహము, "మంచిది" అని చెప్పి (ఓషధిప్రస్థ పురమునకు) బయలుదేరెను. ఈశ్వరుడు కూడ మొదట అనుకొనిన ప్రదేశమునకు (మహాకోశీనది ఒడ్డునకు) చేరుకొనెను. 35

శ్లో॥ తే చాకాశ మసిశ్యామ
ముత్పత్య పరమర్షయః ।
ఆసేదు రోషధిప్రస్థం
మనసా సమరంహసః ॥ 36

## ఓషధిప్రస్థవర్ణనమ్

అవ. : ఇతఃపరం దశభిః శ్లోకైః ఓషధిప్రస్థమేవ వర్ణయతి.

శ్లో॥ అలకా మతివాహ్యైవ
వసతిం వసుసమ్పదామ్ ।
స్వర్గాభిష్యన్దవమనం
కృత్వే వోపనివేశితమ్ ॥ 37

శ్లో॥ గఙ్గాస్రోతఃపరిక్షిప్తం
వప్రాన్తర్జ్వలితౌషధి ।
బృహన్మణిశిలాసాలం
గుప్తావపి మనోహరమ్ ॥ 38

శ్లో॥ జితసింహభయా నాగా
యత్రాశ్వా బిలయోనయః ।
యక్షాః కింపురుషాః పౌరా
యోషితో వనదేవతాః ॥ 39

మనస్సుతో సమానమగు వేగముగల ఆ మహర్షులు కత్తివలె నల్లనగు ఆకాశము మీది కెగిరి, ఓషధిప్రస్థపురమును చేరిరి. **36**

## ఓషధిప్రస్థవర్ణనము

అవతారిక : ఇటనుండి పదిశ్లోకములలో ఓషధిప్రస్థమునే వర్ణించుచున్నాడు.

ధనసంపదలకు ఉనికి యగు అలకానగరమును మోసికొనిపోయి, ఈ పురములోపెట్టినారో అన్నట్లును, స్వర్గములో ఎక్కువైన జీవులు ఇచ్చట ప్రవేశపెట్టబడిరో అన్నట్టులును ఉన్న, ఓషధిప్రస్థమును చూచిరి. **37**

గంగాప్రవాహములచేత చుట్టబడినదియును, ప్రాకారపు నడుమ ప్రకాశించుచున్న ఓషధులుకలదియును, గొప్ప విలువైన మణులతో నిర్మింపబడిన ప్రాకారము కలదియును, ప్రాకారముచే ఆవరింపబడికూడ అందముగానున్నదియును అగు ఓషధిప్రస్థపురమును చేరిరి. **38**

ఏ పురములో, ఏనుగులు సింహములవలని భయమును గెలిచినవో, గుఱ్ఱములు భూవివరములనుండి పుట్టినవో, పురజనులు యక్షులు, కింపురుషులో, స్త్రీలు వనదేవతలో, అట్టిది ఓషధిప్రస్థము. **39**



శ్లో॥ శిఖరాసక్త మేఘానాం
వ్యజ్యన్తే యత్ర వేశ్మనామ్ ।
అనుగర్జితసన్దిగ్ధాః
కరణై ర్మురజస్వనాః ॥ 40

శ్లో॥ యత్ర కల్పద్రుమైరేవ
విలోలవిటపాంశుకైః ।
గృహయన్త్రపతాకాశ్రీ
రపౌరాదరనిర్మితా ॥ 41

శ్లో॥ యత్ర స్ఫటికహర్మ్యేషు
నక్త మాపానభూమిషు ।
జ్యోతిషాం ప్రతిబిమ్బాని
ప్రాప్నువ న్త్యుపహారతామ్ ॥ 42

శ్లో॥ యత్రౌషధిప్రకాశేన
నక్తం దర్శితసఞ్చరాః ।
అనభిజ్ఞా స్తమిస్రాణాం
దుర్దినే ష్వభిసారికాః ॥ 43

శ్లో॥ యౌవనాన్తం వయో యస్మి
న్నాన్తకః కుసుమాయుధాత్ ।
రతిఖేదసముత్పన్నా
నిద్రా సంజ్ఞావిపర్యయః ॥ 44

ఏ పురమున సౌదాగ్రభాగములను మేఘములు తగులుచున్నవో, అట్టి మేడలలో మద్దెల ధ్వనులకును మేఘముల ఉఱుములకును భేదము తెలియక, విచారించిచూడగా హస్తతాడనవిశేషములచే భేదము తెలియక, ఇట్టి ప్రతిధ్వనిగలవి, ఉఱుములు కాదని స్పష్టమగుచున్నది. (అనగా అచ్చటి మేడలు మేఘమండలమంతటి ఎత్తైనవి అని భావము.) 40

ఆ పురమునందు పౌరులప్రయత్నము లేకయే కల్పకృక్షముల కొమ్మలనుండి వ్రేలాడుచుఎగురు బట్టలే జెండా లగుచున్నవి. (అనగా ఆ పురమునందలి కల్పవృక్షములు ప్రజ లేవి కోరిన వానిని (వస్త్రములను, మణులను, పతాకలను, బంగారమును, ఫలములను, భక్ష్య భోజ్యాదులను, కోరిన కోర్కెలను అన్నింటిని ఇచ్చుచున్నవని భావము.)41

ఏ పురమున రాత్రియందు స్ఫటికపు, మేడలయందు, పానభూముల యందు (మధుశాలలయందు) నక్షత్రముల ప్రతిబింబములు, ముత్యములు, హారములు, పుష్పహారములు మొదలగు కానుక లగుచున్నవో అట్టిది ఓషధిప్రస్థపురము. 42

ఏ పురమున మేఘములు కమ్మి, చీకటిగా ఉన్న రోజులలో, రాత్రులయందు ఓషధుల కాంతులచే మార్గము చూపింపబడినవారై, పరపురుషుల ఇండ్ల కేగు జారిణులు, చీకటి అనగా ఏమో తెలియనివారై (ఎల్లప్పుడు వెలుతురులోనే సంచరించుచుందురో) అది ఓషధిప్రస్థపురము. 43

ఏ పట్టణమునందు యౌవనముకంటె చివరివయస్సు లేదో, మన్మథుని కంటె యముడు లేడో, రతిఖేదమువలన పుట్టిన నిద్దురయే చైతన్యము నశింపచేయునో, అది ఓషధిప్రస్థపురము. (అనగా అచ్చటివారు నిత్యయౌవనులు, మదనబాధ తప్ప మరణబాధ లేనివారు, రతిశ్రమము తప్ప చైతన్యమును నశింపచేయు ఇతరశ్రమలేనివారు అని భావము.)44

శ్లో॥ భ్రూభేదిభి స్సకమ్పోష్ఠై
ర్లలితాఙ్గులితర్జనైః ।
యత్ర కోపైః కృతాః స్త్రీణా
మాప్రసాదార్థినః ప్రియాః ॥ 45

శ్లో॥ సన్తానకతరుచ్ఛాయా
సుప్తవిద్యాధరాధ్వగమ్ ।
యస్య చోపవనం బాహ్యం
గన్ధవద్గన్ధమాదనమ్ ॥ 46

శ్లో॥ అథ తే మునయో దివ్యాః
ప్రేక్ష్య హైమవతం పురమ్ ।
స్వర్గాభిసన్ధిసుకృతం
వఞ్చనా మివ మేనిరే ॥ 47

## హిమవతోగృహే అవతీర్ణానాం సప్తర్షీణాం వర్ణనమ్

శ్లో॥ తే సద్మని గిరే ర్వేగా
దున్ముఖద్వాఃస్థవీక్షితాః ।
అవతేరు ర్జటాభారై
ర్లిఖితానలనిశ్చలైః ॥ 48

ఏ పురమునందు కనుబొమలను ముడివేసిన, క్రింది పెదవులు అదురుచున్న, మృదువైన వ్రేళ్ళతో బెదిరించుచున్న, ప్రియురాండ్రయొక్క కోపములచేత ప్రియులు అనుగ్రహమును పొందువరకు బ్రతిమిలాడు నట్లు (ప్రేమార్థులుగా) చేయబడిరో అట్టి జనముకలది ఈ పురము. 45

ఆ పురములో సంతానమను కల్పవృక్షముల నీడక్రింద విద్యాధరులు అను బాటసారులు నిద్రించుచుందురు. ఆ పురమునకు బయటనున్న ఉద్యానవనము (పూలతోట) సువాసనగల గంధమాదనపర్వతము. 46

అంతట ఆ దివ్యులైన సప్తర్షులు, హిమవంతుని రాజధానియగు ఓషధిప్రస్థ పట్టణమును చూచి, స్వర్గమును పొందుటకై (వేదోక్తవిధానమున) తా మాచరించిన పుణ్యమును మోసమైనదానినిగా భావించిరి. ("ఈ పురమునందే స్వర్గసౌఖ్యము లన్నియు నున్నవి. దీనిని చేరుటకు తపస్సు గాని, పుణ్యముగాని అక్కరలేదు." అట్టిచో మేము స్వర్గసుఖము నందుకొనవలెనని చేసిన పుణ్యమంతయు వేదము చేసిన మోసముగా భావించిరని భావము.) 47

## హిమవంతుని ఇంటిలో దిగిన సప్తర్షులవర్ణనము

చిత్తరువులో వ్రాయబడిన అగ్నులవలె నిశ్చలములగు జడలుగల ఆ మునులను, హిమవంతుని ద్వారపాలకులు ఆశ్చర్యముతో మోములెత్తి చూచుచుండగ, హిమవంతుని ఇంట వారు వేగముగా దిగిరి. 48

శ్లో॥ గగనా దవతీర్ణా సా
యథావృద్ధపురస్సరా ।
తోయాన్తర్భాస్కరాలీవ
రేజే మునిపరమ్పరా ॥ 49

## హిమవద్దత్తః స్వాగతసత్కారః

శ్లో॥ తా నర్ఘ్యా నర్ఘ్య మాదాయ
దూరాత్ ప్రత్యుద్యయౌ గిరిః ।
నమయ≡ సారగురుభిః
పాదన్యాసై ర్వసున్ధరామ్ ॥ 50

అవ. : సమ్ప్రతి హిమవన్తమేవ జఙ్గమస్థావరరూప
ద్వయసాధారణై ర్విశేషణై ర్విశినష్టి.

శ్లో॥ ధాతుతామ్రాధరః ప్రాంశు
ర్దేవదారుబృహద్భుజః ।
ప్రకృత్యైవ శిలోరస్కః
సువ్యక్తో హిమవానితి ॥ 51

శ్లో॥ విధిప్రయుక్తసత్కారైః
స్వయం మార్గస్య దర్శకః ।
స తై రాక్రమయామాస
శుద్ధాన్తం శుద్ధకర్మభిః ॥ 52

ఆకాశమునుండి పెద్దవాడు ముందుగా, చిన్నవారు వరుసలో వెనుకగా ఉండునట్లు దిగిన, ఆ మునిపరంపర (వరుస) నీటి అలలపై ప్రతి బింబించిన సూర్యబింబముల వరుసవలె ప్రకాశించెను. (అలలు ఒకదాని వెనుక ఒకటిగా వచ్చుచుండగా మొదటి అలలలో పెద్దదిగా తరువాతి అలలలో వరుసగా చిన్నవిగా సూర్యబింబములు కనపడును కదా. అట్లే ఈ ఋషులు సూర్యసమతేజస్కులై వరుసగా అవతరించిరని భావము. )49

## హిమవంతు డొనర్చిన స్వాగత సత్కారము

హిమవంతుడు పూజాద్రవ్యములను తీసికొని, బలముచే మిక్కిలి బరువైన తన అడుగులతో భూమినిక్రుంగజేయుచు, పూజ్యులగు ఆ మునులకు స్వాగతము చెప్పుటకై దూరమునుండియే ఎదురువెళ్ళెను. 50

అవతారిక : జంగమస్థావరాత్మక రూపద్వయమునకును సాధారణములగు విశేషణములచే ఇప్పుడు హిమవంతునే వర్ణించుచున్నాడు.

పర్వతముపైనుండు ధాతువులనెడి ఎఱ్ఱని పెదవికలవాడును, మిక్కిలి ఎత్తైనవాడును, దేవదారువృక్షములనెడు పొడుగాటి భుజములు కలవాడును, స్వభావముగనే శిలలు అను పెద్ద వక్షఃస్థలము కలవాడు అగుటచేతను ఇతడు హిమవంతుడు అని స్పష్టమగుచున్నది. 51

శాస్త్రోక్తప్రకారము స్వాగతసత్కారముల నొందినవారును, పవిత్రమగు ఆచరణము కలిగినవారును అగు ఆ మునులకు హిమవంతుడే స్వయముగా దారి చూపుచు తన అంతఃపురములోనికి తీసికొని వెళ్ళెను. 52

శ్లో॥ తత్ర వేత్రాసనాసీనాङ
కృతాసనపరిగ్రహః ।
ఇత్యువా చేశ్వరాङ వాచం
ప్రాఞ్జలి ర్భూధరేశ్వరః ॥ 53

శ్లో॥ అపమేఘోదయం వర్ష
మదృష్టకుసుమం ఫలమ్ ।
అతర్కితోపపన్నం వో
దర్శనం ప్రతిభాతి మే ॥ 54

మునిదర్శనా దుత్కర్షాతిశయప్రాప్తి ద్యోతనమ్

శ్లో॥ మూఢం బుద్ధ మివాత్మానం
హైమీభూత మివాయసమ్ ।
భూమే ర్దివ మివారూఢం
మన్యే భవదనుగ్రహాత్ ॥ 55

శ్లో॥ అద్య ప్రభృతి భూతానా
మధిగమ్యోఽస్మి శుద్ధయే ।
యదధ్యాసిత మర్హద్భి స్త
ద్ధి తీర్థం ప్రచక్షతే ॥ 56

శ్లో॥ అవైమి పూత మాత్మానం
ద్వయేనైవ ద్విజోత్తమాః ।
మూర్ధ్ని గఙ్గాప్రపాతేన
ధౌతపాదామ్భసా చ వః ॥ 57

ఆ అంతఃపురమునందు పేము ఆసనములపై కూర్చొనియున్న ఈశ్వరులగు మునులతోబాటు తను కూడ ఆసనముపై కూర్చొని హిమవంతుడు అంజలి ఘటించి, ఇట్లు పలికెను. 53

ఊహింపకుండగనే లభించిన మీ దర్శనము, 1. మేఘములు లేకయే పడిన వానవలెను, 2. పూవు ముందుగా కనబడని ఫలము వలెను నాకు తోచుచున్నది. 54

## మునిదర్శనమువలన తనకు కలిగిన హర్షాతిశయమును హిమవంతుడు ప్రకటించుట

మీ అనుగ్రహమువలన 1.తెలివితక్కువవాడు జ్ఞాని అయినట్లును, 2. ఇనుము బంగారము అయినట్లును, 3. భూమినుండి స్వర్గమును అధిష్ఠించినవానిగను నన్ను, తలచుచున్నాను. 55

ఇది మొదలుకొని ప్రాణుల పవిత్రతకొఱకు పొందదగినవాడనైతిని. ఏలయనగా ఎక్కడ సత్పురుషులు నివసింతురో అది పుణ్యతీర్థ మగునని పెద్దలు చెప్పుచుందురు కదా! 56

ఓ బ్రహ్మణశ్రేష్ఠులారా! 1. నా తలపైనున్న గంగా ప్రవాహముచేతను 2. మీ కాళ్ళను కడిగిన పాదతీర్థముచేతను ఈ రెండింటి చేతను నేను పవిత్రుడనైనట్లుగ తెలిసికొనుచున్నాను. 57

శ్లో॥ జఙ్గమం ప్రైష్యభావే వః
స్థావరం చరణాఙ్కితమ్ ।
విభక్తానుగ్రహం మన్యే
ద్విరూప మపి మే వపుః ॥ 58

శ్లో॥ భవత్సంభావనోత్థాయ
పరితోషాయ మూర్ఛతే ।
అపి వ్యాప్తదిగన్తాని
నాఙ్గాని ప్రభవన్తి మే ॥ 59

శ్లో॥ న కేవలం దరీసంస్థం
భాస్వతాం దర్శనేన వః ।
అన్తర్గత మపాస్తం మే
రజసోఽపి పరం తమః ॥ 60

శ్లో॥ కర్తవ్యం వో న పశ్యామి
స్యా చ్చేత్ కిం నోపపద్యతే ।
మన్యే మత్పావనాయైవ
ప్రస్థానం భవతా మిహ ॥ 61

శ్లో॥ తథాఽపి తావత్ కస్మింశ్చి
దాజ్ఞాం మే దాతు మర్హథ ।
వినియోగప్రసాదా హి
కిఙ్కరాః ప్రభవిష్ణుషు ॥ 62

ఓ మునులారా! 1. నా జంగమాత్మకమయిన శరీరము మీ యొక్క దాస భావము వలనను, 2. నా స్థావరమైన పర్వతశరీరము మీ పాదములచే చిహ్నితమగుటవలనను, జంగమస్థావరాత్మకములగు నా రెండు శరీరములును మీ అనుగ్రహమును విభజించుకొని పంచుకొన్నవని నే ననుకొనుచున్నాను. **58**

నా అంగములు దిగంతములవరకు వ్యాపించి యున్నను, మీ అనుగ్రహము వలన విస్తరించిన నా సంతోషమును ఇముడ్చుకొనజాల కున్నవి. **59**

తేజోరూపులగు (మాన్యులగు) మీయొక్క దర్శనముచేత కేవలము నా గుహలలో మాత్రమే దాగియున్న చీకటియే తొలగింపబడుట కాదు. నా మనస్సులో నున్న రజోగుణ భిన్నమైన తమః=అజ్ఞానము కూడ పారద్రోలబడినది. **60**

మీకు నేను చేయవలసిన పని ఏదియు నుండదు. ఉన్నచో అది మీ ప్రభావమువలననే సిద్ధింపకపోదు. నన్ను పవిత్రుని చేయుటకే మీ రిచ్చుటికి వచ్చినారని నేను తలచుచున్నాను. **61**

'మీకు కోర్కె లేకున్నను,' ఏదో ఒక పనిని సాధించు విషయములో నా కాజ్ఞ నిండు. తమ నుపయోగించుకొనుట అనునదే ప్రభువులు, సేవకులకు ఇవ్వవలసిన అనుగ్రహప్రసాదము కదా! **62**

శ్లో॥ ఏతే వయ మమీ దారాః
కన్యేయం కులజీవితమ్ ।
బ్రూత యేనాత్ర వః కార్య
మనాస్థా బాహ్యవస్తుషు ॥ 63

శ్లో॥ ఇత్యూచివాం స్త మేవార్థం
గుహాముఖవిసర్పిణా ।
ద్విరివ ప్రతిశబ్దేన
వ్యాజహార హిమాలయః ॥ 64

శ్లో॥ అథాఙ్గిరస మగ్రణ్య
ముదాహరణవస్తుషు ।
ఋషయో నోదయామాసుః
ప్రత్యువాచ స భూధరమ్ ॥ 65

## అంగిరసః సంభాషణమ్

శ్లో॥ ఉపపన్న మిదం సర్వ
మతః పర మపి త్వయి ।
మనసః శిఖరాణాం చ
సదృశీ తే సమున్నతిః ॥ 66

శ్లో॥ స్థానే త్వాం స్థావరాత్మానం
విష్ణు మాహు స్తథా హి తే ।
చరాచరాణాం భూతానాం
కుక్షి రాధారతాం గతః ॥ 67

ఇదిగో! మేము పర్వతరాజులము. ఈమె నా భార్య. ఈ కన్య నా వంశమునకు ప్రాణము. మీకు కావలసిన కార్యము మా ఇందరిలో ఎవరివలన జరుగవలెనో చెప్పుడు. బాహ్యవస్తువులగు బంగారము, రత్నములు మొదలగు వానిపై ఆశ మీకు ఉండదు కదా! 63

ఇట్లు పలికిన హిమవంతుడు, గుహలయొక్క ముఖములయందు వ్యాపించిన ప్రతిధ్వనిచేత ఆ మొదట చెప్పిన అర్థమునే దార్ఢ్యసిద్ధికొరకు రెండు సార్లు చెప్పినాడో అన్నట్లుండెను. 64

పిమ్మట కథాప్రసంగము అను విషయమునందు నేర్పరియగు అంగిరసుడను మునిని (హిమవంతునితో మాట్లాడుటకు) ఆ ఋషులు, ప్రేరేపించిరి. ఆ అంగిరసుడు ఆ పర్వతరాజుకు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 65

## అంగిరసుని సంభాషణము

ఈ చెప్పిన దంతయును, ఇంతకంటె అధికమును కూడ నీ విషయమున తగియున్నది. నీ మనస్సుయొక్కయు, శిఖరములయొక్కయు, ఔన్నత్యము (ఎత్తుదనము) సమానమైనది. 66

నిన్ను స్థావర స్వరూపము గల ఆ విష్ణువు అని చెప్పుచున్నారు. అది యుక్తమే. అట్లే నీ పొట్ట స్థావరజంగమాత్మకములగు జీవు లన్నింటికి (పంచమహాభూతములకు) ఆధారమైనది. 67

శ్లో॥ గా మధాస్యత్ కథం నాగో
మృణాలమృదుభిః ఫణైః? ।
ఆ రసాతలమూలాత్ త్వ
మవాలమ్బిష్యథా న చేత్ ॥ 68

## హిమవతోజగత్పావనత్వవర్ణనమ్

శ్లో॥ అచ్ఛిన్నామలసన్తానాః
సముద్రోర్మ్యనివారితాః ।
పునన్తి లోకాన్ పుణ్యత్వాత్
కీర్తయ స్సరితశ్చ తే ॥ 69

శ్లో॥ యథైవ శ్లాఘ్యతే గఙ్గా
పాదేన పరమేష్ఠినః ।
ప్రభవేణ ద్వితీయేన
తథై వోచ్ఛ్రిరసా త్వయా ॥ 70

శ్లో॥ తిర్య గూర్ధ్వ మధస్తా చ్చ
వ్యాపకో మహిమా హరేః ।
త్రివిక్రమోద్యత స్యాసీత్
స తు స్వాభావిక స్తవ ॥ 71

శ్లో॥ యజ్ఞభాగభుజాం మధ్యే
పద మాతస్థుషా త్వయా ।
ఉచ్చై ర్హిరణ్మయం శృఙ్గం
సుమేరో ర్వితథీకృతమ్ ॥ 72

పాతాళలోకపర్యంతము నీవు భూమిని ధరింపవేని తామరతూండ్లవలె మృదువులగు తన పడగలచే శేషుడు, భూమిని ఎట్లు ధరించును? **68**

## హిమవంతుని జగత్పావనత్వవర్ణనము

ఎడతెగని, నిర్మలములైన, ప్రబంధములను, ప్రవాహములను కలిగి, సముద్రతరంగములచే వారింప శక్యముగాని, నీ కీర్తులును, సరిత్తులును (నదులును) స్వయం పవిత్రము లగుటవలన లోకముల నన్నింటిని పవిత్రము చేయుచున్నవి. **69**

తన పుట్టువునకు కారణమగు శ్రీవిష్ణుమూర్తియొక్క పాదములచే గంగానది ఎట్లు కొనియాడబడుచున్నదో, అట్లే తన పుట్టువునకు రెండవ కారణమైన, ఉన్నతమైన శిరస్సుగల, నీచే గంగానది ప్రశంసింపబడుచున్నది. **70**

అడ్డముగను, మీదికిని, క్రిందికిని, వ్యాపించిన సామర్థ్యము (వామనావతారమున) మూడడుగులు వేయవలసివచ్చిన త్రివిక్రమ రూపమునందు మాత్రమే ఉండెడిది. కాని నీకు ఆ సామర్థ్యము సర్వకాల సర్వావస్థలయందును ఉండుచు స్వాభావికమైయున్నది. **71**

యజ్ఞభాగములను భుజించు దేవతలనడుమన స్థానమును పొందిన నీవు (నీ ఔన్నత్యముచే) మేరు పర్వతముయొక్క ఉన్నతమైన బంగారు శిఖరపు ప్రాధాన్యమును వ్యర్థముగా చేసితివి. **72**

శ్లో॥ కాఠిన్యం స్థావరే కాయే
భవతా సర్వ మర్పితమ్ ।
ఇదం తు తే భక్తినమ్రం
సతా మారాధనం వపుః ॥ 73

శ్లో॥ త దాగమనకార్యం నః
శృణు. కార్యం తవైవ తత్ ।
శ్రేయసా ముపదేశా త్తు
వయ మత్రాంశభాగినః ॥ 74

## వరస్యశ్రేష్ఠత్వవివరణమ్

శ్లో॥ అణిమాదిగుణోపేత
మస్పృష్టపురుషాన్తరమ్ ।
శబ్ద మీశ్వర ఇత్యుచ్చైః
సార్ధచన్ద్రం భిభర్తి యః ॥ 75

శ్లో॥ కలితాన్యోన్యసామర్థ్యైః
పృథివ్యాదిభి రాత్మభిః ।
యేనేదం ధ్రియతే విశ్వం
ధుర్యై ర్యాన మివాధ్వని ॥ 76

శ్లో॥ యోగినో యం విచిన్వన్తి
క్షేత్రాభ్యన్తరవర్తినమ్ ।
అనావృత్తిభయం యస్య
పద మాహు ర్మనీషిణః ॥ 77

నీవు కాఠిన్యము నంతటిని నీ స్థావరశరీరమునందు (పర్వత రూపమున) ఉంచితివి. సత్పురుషులకు పూజాసాధనమగు ఈ నీ జంగముశరీరము (దేవతాత్మ శరీరము) కాఠిన్యరహితమై, భక్తిచే వంగి, వినయమును ప్రదర్శించుచున్నది. 73

అందువలన మా రాకకు ప్రయోజనమును వినుము. ఆ పని నీవు చేయవలసినదే! మేమైతే కళ్యాణగుణములబోధవలన, (ఈ పనివలన నీకు కలుగబోవు శ్రేయస్సును ఉపదేశించుటవలన) ఈ పనిలో భాగస్వాములము మాత్రమే! 74

## వరుడయిన శివుని గొప్పతనము వివరించుట

అణిమాది గుణములతో కూడినదియును, ఇతర పురుషులను స్మరింపనిదియును, గొప్పదియును అగు "ఈశ్వర" అను శబ్దమును, అర్ధచంద్రుని, ఎవడు భరించుచున్నాడో అతడే మేము చెప్పబోవు వరుడు. 75

ఎవడు, ఒప్పుచున్న, పరస్పరసామర్థ్యము గల, భూమి మొదలగు అష్టమూర్తులచే, ఈ బాహ్యప్రపంచమును, మార్గమునందు బండిని, గుఱ్ఱములవలె వహించుచున్నాడో (అతడే మేము చెప్పబోవు వరుడు.) 76

అధ్యాత్మవేత్తలు, శరీరములోనున్నట్టి, ఎవనిని వెదుకుచుందురో, విద్వాంసులు మరల సంసారమువలని భయము లేనిదానినిగా, ఎవని యొక్క స్థానమును చెప్పెదరో (అతడే మేము ప్రతిపాదింపబోవు వరుడు.) 77

## మహేశ్వర సన్దేశనివేదనమ్

శ్లో॥ స తే దుహితరం సాక్షాత్
సాక్షీ విశ్వస్య కర్మణామ్ ।
వృణుతే వరదః శమ్భు
రస్మత్సఙ్క్రామితైః పదైః ॥ 78

శ్లో॥ త మర్థ మివ భారత్యా
సుతయా యోక్తు మర్హసి ।
అశోచ్యా హి పితుః కన్యా
సద్భర్తృప్రతిపాదితా ॥ 79

శ్లో॥ యావ న్త్యేతాని భూతాని
స్థావరాణి చరాణి చ ।
మాతరం కల్పయ న్త్వేనా
మీశో హి జగతః పితా ॥ 80

శ్లో॥ ప్రణమ్య శితికణ్ఠాయ
విబుధా స్తదనన్తరమ్ ।
చరణౌ రఞ్జయ న్త్వస్యా
శ్చూడామణిమరీచిభిః ॥ 81

శ్లో॥ ఉమా వధూ ర్భవా\u0D3D దాతా
యాచితార ఇమే వయమ్ ।
వర శ్శంభు రలం హ్యేష
త్వత్కులోద్భూతయే విధిః ॥ 82

## మహేశ్వరునియొక్క సందేశమును నివేదించుట

ప్రపంచముయొక్క కర్మలకు సాక్షియును (చూచువాడును) వరముల నిచ్చువాడును అగు ఆ శివుడు, మాయందుంచిన వాక్యములద్వారా (మేము చెప్పబోవు మాటలద్వారా) నీ కుమార్తెను ప్రత్యక్షముగా (తన కిచ్చుటకై) అడుగుచున్నాడు. 78

అందువలన వాక్కుతో అర్థమును వలె, నీ కుమార్తెతో అతనిని కలుపుము. ఎందువలన అనగా మంచిభర్తకు అర్పింపబడిన కన్య, తండ్రికి దుఃఖమును సమకూర్పదు కదా! 79

స్థావర జంగములయిన ప్రాణు లన్నియును, ఈ, నీ కుమార్తెను తల్లిగా చేసికొందురుగాక! ఎందువలన అనగా ఆ ఈశ్వరుడు సర్వజగత్తుకు తండ్రి. 80

దేవతలు ఈశ్వరునకు మ్రొక్కి ఆ తరువాత ఈమెయొక్క పాదములను తమ శిరోరత్నములకాంతులచే రంజింపచేయుదురు గాక.(రంగు వేయుదురుగాక.) 81

ఉమాదేవి (పార్వతి) పెండ్లికుమార్తె. నీవు కన్యాదాతవు. ఇదుగో మేము కన్యనడుగ వచ్చినవారము. పెండ్లికొడుకు శంభుడు. ఈ విధి నీ కులాభివృద్ధికి చాలును కదా! 82

శ్లో॥ అస్తోతు స్తూయమానస్య
వన్ద్య స్యానన్యవన్దినః ।
సుతాసమ్బన్ధవిధినా భవ
విశ్వగురో ర్గురుః ॥ 83

శ్లో॥ ఏవం వాదిని దేవర్షౌ
పార్శ్వే పితు రధోముఖీ ।
లీలాకమలపత్రాణి
గణయామాస పార్వతీ ॥ 84

## హిమవతః కన్యాదానకల్పః

శ్లో॥ శైల స్సమ్పూర్ణకామోఽపి
మేనాముఖ ముదైక్షత ।
ప్రాయేణ గృహిణీనేత్రాః
కన్యార్థేషు కుటుమ్బినః ॥ 85

శ్లో॥ మేనే మేనా పి తత్ సర్వం
పత్యుః కార్య మభీప్సితమ్ ।
భవ న్త్యవ్యభిచారిణ్యో
భర్తురిష్టే ప్రతివ్రతాః ॥ 86

(తా నితరులను) స్తుతింపనివాడై, ఇతరులచే తాను స్తుతింపబడువాడును, తా నితరులకు మ్రొక్కకుండ ఇతరులచేత మొక్కబడుచున్నవాడును, జగములన్నింటికి తండ్రియైన ఆ శివునికి, ఈ పుత్రికనిచ్చి వివాహసంబంధము ఏర్పరుచుకొనుటవలన నీవు విశ్వగురువునకు గురువువు (పెద్దవాడవు, గౌరవింపదగిన వాడవు.) కమ్ము. 83

అంగిరసమహర్షి ఇట్లు పలుకగా, పార్వతీదేవి తండ్రికి ప్రక్క భాగమున సిగ్గుతో తలవంచుకొని నిలిచి, తన చేతనున్న లీలా కమలపు రేకులను లెక్కపెట్టసాగెను. 84

## హిమవంతుడు కన్యాదానముచేయ సంకల్పించుట

హిమవంతుడు తన కోర్కె నెరవేరినవాడైయుండియు, తన భార్యయగు మేనాదేవి ముఖములోనికి చూచెను. ఏల యనగా తఱచుగా, గృహస్థులు, తమ కుమార్తెల వివాహాది శుభకార్యములను జరిపింపవలసి వచ్చినపుడు భార్యయే కన్నుగా గలవా రగుదురు కదా! (భార్యతో సంప్రదించి కార్యాచరణమునకు దిగుదురని భావము.) 85

మేనాదేవి కూడ భర్త కిష్టమగు ఆ కార్యము నంతటిని ఇష్టముతో అంగీకరించెను. పవిత్రలగు స్త్రీలు, తమ భర్త కిష్టమయిన పనియందు ఆయనను వ్యతిరేకించకుండ ఉందురు. 86

శ్లో॥ ఇద మత్రోత్తరం న్యాయ్య
మితి బుద్ధ్వా విమృశ్య సః ।
ఆదదే వచసా మన్తే
మఙ్గలాలఙ్కృతాం సుతామ్ ॥ 87

శ్లో॥ ఏహి విశ్వాత్మనే వత్సే!
భిక్షాఽసి పరికల్పితా ।
అర్థినో మునయః, ప్రాప్తం
గృహమేధిఫలం మయా ॥ 88

శ్లో॥ ఏతావ దుక్త్వా తనయా
మృషీ నాహ మహీధరః ।
ఇయం నమతి వః సర్వాన్
త్రిలోచనవధూ రితి ॥ 89

శ్లో॥ ఈప్సితార్థ క్రియోదారం
తేఽభినన్ద్య గిరే ర్వచః ।
ఆశీర్భి రేధయామాసుః
పురఃపాకాభి రమ్బికామ్ ॥ 90

శ్లో॥ తాం ప్రణామాదరస్రస్త
జామ్బూనదవతంసకామ్ ।
అఙ్క మారోపయామాస
లజ్జమానా మరున్ధతీ ॥ 91

అంగిరసుని మాటలు పూర్తి అయిన తరువాత ఈ విషయమున ఈ ప్రత్యుత్తరము న్యాయమైనదని బుద్ధిచే యోచించి, ఆ హిమవంతుడు మంగళమగునట్లుగా అలంకరించుకొనిన కుమార్తెను చేతితో పట్టుకొనెను. 87

అమ్మాయీ! రమ్ము ప్రపంచరూపుడగు శివునికి నీవు భిక్షగా నిశ్చయింపబడినావు. నిన్ను యాచించుటకు వచ్చినవారు సప్తర్షులు. గృహస్థునైనందుకు ప్రయోజనము నేను పొందితిని. (కృతార్థుడనైతిని.) 88

హిమవంతుడు తనకూతురికి ఇంతమాత్రము చెప్పి "ముక్కంటియొక్క భార్య మీకందఱకు నమస్కరించుచున్నది" అని ఋషులతో అనెను. 89

ఆ ఋషులు ఇష్టార్థాచరణమువలన గొప్పవియగు ఆ హిమవంతుని మాటలను అంగీకరించి, వెంటనే ఫలించునట్టి ఆశీస్సులతో గౌరీదేవిని అభివృద్ధిపరచిరి. 90

నమస్కారముచేయుటచే జారిన బంగారు కుండలములు కర్ణావతంసములు కలదియును, సిగ్గుపడుచున్నట్టిదియును అగు ఆ గౌరీదేవిని, అరుంధతీదేవి తన తొడపైకి ఎక్కించుకొనెను. 91

శ్లో॥ తన్మాతరం చాశ్రుముఖీం
దుహితృస్నేహవిక్లబామ్ ।
వర స్యానన్యపూర్వస్య
విశోకా మకరో ద్గుణైః ॥ 92

వివాహతిథిం నిశ్చిత్య మునీనాం స్వస్థానగమనమ్

శ్లో॥ వైవాహికీం తిథిం పృష్టా
స్తత్ క్షణం హరబన్ధునా ।
తే త్ర్యహా దూర్ధ్వ మాఖ్యాయ
చేరు శ్చీరపరిగ్రహాః ॥ 93

శ్లో॥ తే హిమాలయ మామన్త్ర్య
పునః ప్రాప్య చ శూలినమ్ ।
సిద్ధం చాస్మై నివేద్యార్థం
తద్విసృష్టాః ఖ ముద్యయుః ॥ 94

అవ. : భగవాన్ పశుపతి స్త్ర్యహమాత్రవిలమ్బమపి
సోఢుం న శశాక తదౌత్సుక్యా దిత్యాహ.

శ్లో॥ పశుపతిరపి తా న్యహాని కృచ్ఛ్రా
దగమయ దద్రిసుతాసమాగమోత్కః ।
క మపర మవశం న విప్రకుర్యు
ర్విభు మపి తం యదమీ స్పృశన్తి భావాః ॥ 95

కుమార్తెయందుగల అనురాగముచే పరవశురాలును, కన్నీటిని విడుచు చున్నట్టిదియును అగు ఆ గౌరీదేవి తల్లియగు మేనాదేవిని, ఓదార్చుచు "నీ కుమార్తె కాపురము సవతిలేని కాపురమనియును, అతడు మృత్యుంజయుడనియును" ఆమె అల్లుని గుణములను అరుంధతి ప్రశంసించెను. **92**

## వివాహలగ్నతిథిని నిర్ణయించి, మునులు స్వస్థానమునకేగుట

నారచీరలే బట్టలుగాగల ఆ మునులు కాబోవు శివునిచుట్టమగు హిమవంతునిచే పెండ్లిముహూర్తమును గూర్చి అప్పుడే అడగబడినవారై "మూడు రోజులతరువాత" అని చెప్పి బయలుదేరిరి. **93**

పార్వతీదేవి సమాగమమునందు వేడ్కగల శివుడు ఆ మూడురోజులను అతి కష్టముగా గడిపెను. ఈ ప్రేమభావములు విభులైన పరమేశ్వరునే బాధించినవన్నచో ఏ ఇతరుని బాధింపవు? (అందరిని బాధించునని భావము.) **94**

అవతారిక : భగవంతుడైన పశుపతి మూడురోజులమాత్రపు ఆలస్యమునుకూడ ఆమెను పొందవలెనను ఔత్సుక్యముతో సహింపలేకపోయెనని చెప్పుచున్నాడు.

పర్వతరాజపుత్రిని కలిసుకొనుటయం దుత్కంఠాభరితుడైన పశుపతి (శివుడు) కూడా ముహూర్తమునకు పెట్టిన (గడువవలసిన) ఆ మూడు రోజులను అతి కష్టమముమీద గడిపెను. ఈ ప్రియాసగమమువలననే ఊరటకలిగించు భావములు సమర్థుడైన (జితేంద్రియుడైన) పరమేశ్వరునే

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"ఉమాప్రదానం"నామ షష్ఠః సర్గః
-౦0౦-



కన్యాదానమున కంగీకరించిన మేనాహిమవంతులు. శ్లోకము 88

కలవరపరచినవన్నచో ఇక ఇంద్రియనిగ్రహములేని, ఈశ్వరునికంటె భిన్నుడైన ఏ ఇతరుని మనస్సును కలవరపెట్టవు? అందరిని కలవర పరచునని భావము. (ఈ శ్లోకము పుష్పితాగ్రావృతమునందు కూర్ప బడినది.) **95**

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను మహాకావ్యమునందు "ఉమాప్రదానము" అను పేరుగల ఆరవ సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-



వధువు-పార్వతి.
శ్లోకము **89**

# కుమారసమ్భవమ్

## “ఉమాపరిణయో”నామ

## సప్తమః సర్గః

శ్లో॥ అథౌషధీనా మధిపస్య వృద్ధౌ
తిథౌ చ జామిత్రగుణాన్వితాయామ్ ।
సమేతబన్ధు ర్హిమవా న్సుతాయా
వివాహదీక్షావిధి మన్వతిష్ఠత్ ॥ 1

### సర్వేషా ముమాయా మతిస్నేహత్వమ్

శ్లో॥ వైవాహికైః కౌతుకసంవిధానైః
గృహే గృహే వ్యగ్ర పురన్ధ్రివర్గమ్ ।
ఆసీ త్పురం సానుమతోఽనురాగా
దన్తఃపురం చైకకులోపమేయమ్ ॥ 2



పార్వతీపరిణయము. శ్లోకము 78

# కుమారసంభవము

## "ఉమాపరిణయము" అను

## ఏడవ సర్గము

వివాహముహూర్తమునకు సప్తర్షులు పెట్టిన గడువగు మూడురోజుల తరువాత హిమవంతుడు, చంద్రుడు దినదినాభివృద్ధిగాంచు శుక్లపక్షమునందు (చౌలోపనయన, గోదాన, వివాహాదిశుభకర్మలు, శుక్ల పక్షమునందు చేయదగినవని అశ్వలాయన గృహ్యసూత్రమునందు చెప్పబడినది.) జామిత్ర గుణాన్వితమైన తిథియందు (జాతకచక్రమునందు లగ్నమునుండి 7వ స్థానమును జామిత్రస్థాన మందురు. ఆ స్థానము శుద్ధమైయున్నచో వివాహము శుభప్రద మగునని వసిష్ఠాది మహర్షులు ముహూర్తమును నిర్ణయించియుందురు.) బంధువులందరితో కూడినవాడై తన కుమార్తెయగు పార్వతికి, వివాహదీక్షావిధిని నిర్వహించెను. (ఈ సర్గములోని శ్లోకములు వంశస్థవృత్తమునందు కూర్పబడినవి.) 1

### అందరికి ఉమ మీదగల అతిస్నేహప్రవృత్తి

అందరికి హిమవంతునిపై గల అభిమానమువలన ప్రతి ఇంటియందును, వివాహమునకు సంబంధించిన కౌతుకసంవిధానములను, (శుభప్రాప్తిని కలిగించు మంగళద్రవ్యములను) చేతబట్టుకొని, గృహిణులు హడావిడిగా నుండిరి. అందువలన ఆ హిమవంతునియొక్క పట్టణపు బాహ్యప్రదేశమును ఓషధిప్రస్థపురములోని అంతఃపురమును ఒకేఇంటితో పోల్చబడదగిన వయ్యెను. (అనగా హిమవంతునిమీది అభిమానముతో వీరు, వారు అనక ఇంటిలోని వారు, ఊరిలోనివారు అను భేదములేక అందఱు ఒకే కుటుంబములోని

శ్లో॥ సంతానకాకీర్ణమహాపథం త
చ్చీనాంశుకైః కల్పితకేతుమాలమ్ ।
భాసోజ్జ్వలత్కాఞ్చనతోరణానాం
స్థానాన్తరం స్వర్గ ఇవా బభాసే ॥ 3

శ్లో॥ ఏకైవ సత్యామపి పుత్రపఙ్క్తౌ
చిరస్య దృష్టేవ మృతోత్థితేవ ।
ఆసన్నపాణిగ్రహణేతి పిత్రో
రుమా విశేషోచ్ఛ్వసితం బభూవ ॥ 4

శ్లో॥ అఙ్కా ద్యయా వఙ్క ముదీరితాశీ
స్సా మణ్డనా న్మణ్డన మన్వభుఙ్క్త ।
సమ్బన్ధిభిన్నోఽపి గిరేః కులస్య
స్నేహ స్తదేకాయతనం జగామ ॥ 5

సభ్యులవలె వైవాహిక శుభకార్యమును నిర్వహింపసాగిరని భావము. దీనివలన హిమవంతునకు ప్రజలయందుగల అభిమానము సూచింపబడినది. ఇచ్చట దేనికిని లోటు లేదని కూడ చెప్పబడినది.) 2

హిమవంతుని పురమగు ఓషధిప్రస్థమునందలి రాజమార్గములు సంతానమను కల్పవృక్షముల పూవులతో పఱుపబడినవి. అచ్చట జెండా చీనాంశుకములతో (సన్నని పట్టుబట్టలతో) కల్పింపబడినది. అచ్చట స్వయంప్రకాశముతో వెలుగొందు బంగారు తోరణములు ఏర్పరుపబడినవి. వీటన్నింటివలన ఆ పురము మేరుపర్వతశిఖరముపై కాక మఱొక పర్వతశిఖరముపైన (హిమాద్రిపైన) ఉన్న స్వర్గమేనేమో అన్నట్లున్నది. 3

మేనాహిమవంతులకు పుత్రపంక్తి (మైనాకుడు అను ఇతర సంతానమున్నను) చాలకాలమునుండి కన్పడకపోయి, ఇప్పుడే కనపడినట్లును, మరణించి మరల లేచివచ్చినదో అన్నట్లును, ఉన్న ఉమాదేవి ఒక్కతెయే సంతానమైనట్లు అనిపించుచు, వివాహముహూర్తము దగ్గరపడుచున్నకొలది (ఇక భర్తగారింటికి వెళ్ళిపోవునేమో అను కారణము వలన, ఆ కన్య, తన తల్లితండ్రులకు ప్రాణభూతురా లైపోయినది. (పురుష సంతానముకంటె ఉమ అధిక ప్రేమాస్పదురా లయ్యెనని భావము.) 4

ఆ పార్వతీదేవి, పెద్దల ఆశీస్సుల నందుకొనుచు, ఒకరి ఒడిలోనుండి మఱియొకరి ఒడిలోనికి పయనించెను. ఒక అలంకారము తరువాత మరియొక అలంకారము నొంది ఒప్పారెను. (అప్పుడు బంధువు లందరు ఆమె మీదగల ప్రేమతో ఒక్కొక్కరు తమతమ ఒడిలో కూర్చుండబెట్టుకొని వివిధాలంకారములను అలంకరించిరని భావము.) ఆమె,వాస్తవమునకు తమ సంతానము కాకపోయినను హిమవంతుని వంశముపైగల ప్రేమచేత ఒకే కుటుంబమునకు చెందినవారివలె బంధువులందరు భిన్నత్వమునుచూపరైరి. (బంధువులందఱు తమతమ సంతానముపై కంటె ఈమె యందధిక వాత్సల్యమును ప్రదర్శించిరని భావము.) 5

శ్లో॥ మైత్రే ముహూర్తే శశలాఞ్ఛనేన
యోగం గతా సూత్తరఫల్గునీషు ।
తస్యా శ్శరీరే ప్రతికర్మ చక్రు ర్బన్ధు
స్త్రియో యాః పతిపుత్రవత్యః ॥ 6

అవ. : ప్రతికర్మప్రకారమేవ ప్రపఞ్చయతి.

శ్లో॥ సా గౌరసిద్ధార్థనివేశవద్భి
ర్దూర్వాప్రవాలైః ప్రతిభిన్నశోభమ్ ।
నిర్నాభికౌశేయ ముపాత్తబాణ
మభ్యఙ్గనేపథ్య మలఞ్చకార ॥ 7

శ్లో॥ బభౌ చ సమ్పర్క ముపేత్య బాలా
నవేన దీక్షావిధిసాయకేన ।
కరేణ భానో ర్బహులావసానే
సంధుష్యమాణేవ శశాఙ్కలేఖా ॥ 8

శ్లో॥ తాం లోధ్రకల్కేన హృతాఙ్గతైలా
మాశ్యానకాలేయకృతాఙ్గరాగామ్ ।
వాసో వసానా మభిషేకయోగ్యం
నార్య శ్చతుష్కాభిముఖం వ్యనైషుః ॥ 9

ఉత్తరఫల్గుణనక్షత్రము చంద్రునితో కలిసియున్న, మిత్రుడు దేవతగాగల "మైత్రము" అను శుభముహూర్తమునందు (ఉదయ ముహూర్తమునుండి మూడవ ముహూర్తము నందు) భర్తయును, పిల్లలును, బ్రతికియున్న, బంధువులైన ముత్తైదువులు, ఆ పార్వతికి పెండ్లికూతురి అలంకారమును చేయనారంభించిరి. 6

**అవతారిక :** ఆ చేసిన అలంకారమును వివరించుచున్నాడు.

తెల్లఆవాలను వెదజల్లు విషయము నందారితేరిన, ముత్తైదువలైన బంధుస్త్రీల ద్వారా, లేతగరికపోచలచేత విశేషశోభనందుచు, బొడ్డుపైకి పట్టుబట్టను కట్టుకొని, "క్షత్రియయైన పెళ్ళికూతురు బాణమును పట్టుకొనవలెను." "శరః క్షత్రియయా గ్రాహ్యః" అను మనుస్మృతి వాక్యము ప్రకారము (3-44) బాణమును పట్టుకొని, ఆ గౌరి, తలంటి పోసుకొనుటకుతగిన వేషమును ధరించెను. (ఈ శ్లోకమునందు హిమవంతుడు క్షత్రియు డని ప్రతిపాదింప బడినది. శివుడు బ్రాహ్మణుడని వేదములు పేర్కొనినవి. కనుక ఈ గౌరీ కళ్యాణము బ్రాహ్మణక్షత్రియమిశ్రమమైన సంప్రదాయములో నిర్వహింపబడుచున్నదని సూచితమైనది. కాని ఇంకొక శ్లోకమునందు (36) శివుడు కూడ క్షత్రియుడే అని కాళిదాసు వర్ణించినాడు.) 7

మఱియును, కన్యయగు పార్వతి, క్షత్రియవివాహదీక్షావిధిప్రకారము చేతితో బాణమును పట్టుకొని, బహుళపక్షాంతమునందు (శుక్ల పక్షపు మొదట) సూర్యుని కిరణముచే పెంచబడిన చంద్రరేఖవలె ప్రకాశించెను. ("సలిమయే శశిని రవే ర్దీధతయో మూర్ఛితా స్తమౌ నైశం క్షపయన్తి" అను వాక్యమును బట్టి కాళిదాసీకల్పనను చేసియుండును.) 8

అభ్యంగనస్నానమునకై శరీరమునకు పూసికొనిన నూనెజిడ్డును, లొద్దుగపూల పుప్పొడితోపెట్టిన నలుగుపిండితో హరింపచేసికొని, కొంచెము ఎండిన పచ్చి పసుపుతో (నునుపుదనమునకు) మైపూతనుపెట్టుకొని, అభిషేకముచేయుటకు యోగ్యమైన స్నానశాటిని కప్పుకొనిన ఆ పార్వతిని, ముత్తైదువలు నాలుగు స్తంభములమధ్యనుండు స్నానపుమండపములోనికి తీసికొని వెళ్ళిరి. 9

## పార్వత్యాః కనకకలశతోయేన స్నపనమ్

శ్లో॥ విన్యస్తవైఢూర్యశిలాతలేఽస్మి
ఆబద్ధముక్తాఫలభక్తిచిత్రే ।
ఆవర్జితాష్టాపదకుమ్భతోయైః
సతూర్య మేనాం స్నపయామ్బభూవుః ॥ 10

శ్లో॥ సా మజ్గలస్నానవిశుద్ధగాత్రీ
గృహీతవత్యుద్గమనీయవస్త్రా ।
నిర్వృత్తపర్జన్యజలాభిషేకా
ప్రఫుల్లకాశా వసుధేవ రేజే ॥ 11

శ్లో॥ తస్మా త్ప్రదేశాచ్చ వితానవన్తం
యుక్తం మణిస్తమ్భచతుష్టయేన ।
పతివ్రతాభిః పరిగృహ్య నిన్యే
క్ళప్తాసనం కౌతుకవేదిమధ్యమ్ ॥ 12

## పార్వత్యాః వధూప్రసాధనమ్

శ్లో॥ తాం ప్రాజ్ముఖీం తత్ర నివేశ్య తన్వీం
క్షణం వ్యలమ్బన్త పురో నిషణ్ణాః ।
భూతార్థశోభాహ్రియమాణనేత్రాః
ప్రసాధనే సన్నిహితేపి నార్యః 13

శ్లో॥ ధూపోష్మణా త్యాజిత మార్ద్రభావం
కేశాన్త మన్తఃకుసుమం తదీయమ్ ।
పర్యాక్షిప త్కాచి దుదారబన్ధం
దూర్వావతా పాణ్డుమధూకదామ్నా ॥ 14

## పార్వతికి బంగరుకుండలలోని నీళ్ళతో స్నానముచేయించుట

మరకతమణులచే పరుపబడిన, భూమికల ముత్యములవరుసలచే కూర్పబడిన రంగవల్లులతో చిత్ర వర్ణముతో శోభిల్లు ఆ స్నానగృహమునందు, వంచిన బంగారు కుండలనుండి జాలువారునీటితో పార్వతీదేవిని వెంటనే స్నానమాడించిరి. 10

మంగళస్నానముచేత పవిత్రమైనశరీరముకల పార్వతి, ఉతికినవస్త్రమును ధరించినది. అప్పుడా పార్వతి వాన నీటితో బాగుగా తడిసిన, చక్కగా పూసిన, రెల్లుగల భూదేవివలె ప్రకాశించెను. 11

మఱియు, ఆ స్నానగృహమునుండి, చాందినీగల నాలుగుమణి స్తంభములతో కూడిన, ఆసనము వేయబడిన, అలంకారవేదిక మధ్యకు పార్వతిని పొదివి పట్టుకొని పతివ్రతలు అలంకరణము చేయుటకై తీసికొని వెళ్ళిరి. 12

## పార్వతిని వధువుగా అలంకరించుట

ఆమె నలంకరింపవచ్చిన స్త్రీలు, సుకుమారియును, సన్నదియును అగు పార్వతిని ఆ అలంకారవేదిక మధ్యన తూర్పు ముఖము చేసి కూర్చుండబెట్టి, ఆమె కెదురుగా కూర్చొనిరి. అలంకరింపవలసిన సామగ్రి అంతయు దగ్గరనే ఉన్నను ఆమెయొక్క స్వభావసిద్ధమైన సౌందర్యమును చూచి, సిగ్గుపడుచున్న కన్నులు కలవారై, క్షణకాలము అలంకరించుటలో ఆలస్యము చేసిరి. (సహజ సౌందర్యము గల ఈమె కింకను అలంకారములెందుకని మనస్సులో ఊహించుకొనుచు ఊరకుండిరని భావము.) 13

అలంకరించుటకు వచ్చిన స్త్రీలలో ఒకతె అగరుధూపపు వేడితో ఆమె కేశముల యందున్నతడిని ఇగిర్చినది. మఱియొకతె లోనపూలు గల ఆమె కేశపాశమును గరికతో కూడిన తెల్ల ఇప్పపూతీగతో అందమగు ముడి ఏర్పడునట్లుగా బంధించెను. 14

శ్లో॥ విన్యస్తశుక్లాగురు చక్రు రఙ్గం
గోరోచనాపత్త్రవిభక్త మస్యాః ।
సా చక్రవాకాఙ్కిత సైకతాయా
స్త్రిస్రోతసః కాన్తిమతీత్య తస్థౌ ॥ 15

శ్లో॥ లగ్నద్విరేఫం పరిభూయ పద్మం
సమేఘలేశం శశినశ్చ బిమ్బమ్ ।
తదాననశ్రీ రలకైః ప్రసిద్ధై
శ్చిచ్ఛేద సాదృశ్యకథాప్రసఙ్గమ్ ॥ 16

శ్లో॥ కర్ణార్పితో లోధ్రకషాయరూక్షే
గోరోచనాక్షేపనితాన్తగౌరే ।
తస్యాః కపోలే పరభాగలాభా
ద్బబన్ధ చక్షూంషి యవప్రరోహః ॥ 17

శ్లో॥ రేఖావిభక్త స్సువిభక్తగాత్ర్యాః
కిఞ్చిన్మధూచ్ఛిష్టవిమృష్టరాగః ।
కామ ప్యభిఖ్యాం స్ఫురితై రపుష్య
దాసన్నలావణ్యఫలో ఽధరోష్ఠః ॥ 18

పార్వతియొక్క శరీరమును గోరోచనమును సుగంధద్రవ్యపురసముతో అలంకరింపబడిన మకరికాపత్రరేఖలుకలదానినిగా కొందరు చేసిరి. అట్లలంకరింపబడిన ఆ గౌరీదేవి చక్రవాక పక్షులతో అంకితమైన ఇసుకతిన్నెలు గల గంగానదియొక్క సౌందర్యమును మించియుండెను. (చక్రవాకపక్షులు గోరోచనమువలె పచ్చనివి. పార్వతి గంగవలె తెల్లనిది. కనుక ఈ పోలిక కుదిరినది.) 15

ముంగురులతోకూడిన ఆమె ముఖసౌందర్యము తుమ్మెదలతో కూడిన పద్మసౌందర్యమును, మేఘరేఖతోకూడిన చంద్రబింబముయొక్క సౌందర్యమును తిరస్కరించి, పద్మమును, చంద్రుని ఆమె ముఖముతో పోల్చుప్రసంగమును ఖండించినది. (ఆమె ముఖముతో పోల్చిచెప్పబడుటకు పద్మమును, పనికిరాదు. చంద్రుడును పనికిరాదని భావము.) 16

ఆ పార్వతియొక్క చెవిలో కర్ణావతంసముగా ఉంచబడిన యవాంకురము (వరిచిగురు) లొద్దుగపుప్పొడిపూతతో పూయబడి విశదమై, గోరోచనపు పూతతో ఎర్రనైన ఆమె చెక్కిళ్ళనుండి వ్రేలాడుచు, వర్ణోత్కర్షమును పొంది, అందరి కన్నులను ఆకర్షించుచున్నది. (గోరోచనముచే ఎర్రనైన చెక్కిళ్ళపై తెల్లని వరిచిగురు, వర్ణబేధముచే వర్ణోత్కర్షమునొంది, చూపరుల దృష్టి నాకర్షించుచున్న దని భావము. 17

కొంచెపు మైనపుపూతతో అతినిర్మలముగాచేయబడిన ఎర్రదనము కలదియును, (నిగనిగలాడునదియును) సౌందర్యమునకు ఫలమైన భర్తయొక్క చుంబనాది భాగ్యము నందుటకు తగుసమయము సమీపించినదియును, మధ్యన కనపడు లేఖ (గీత) తో క్రింది, పై పెదవులు విభజింపబడినదియును అగు, సమవిభక్త గతియైన (సుందరియైన) పార్వతియొక్క క్రిందిపెదవి, (రాబోవు శుభమును సూచించు) కంపములతో (అదురులతో) అనిర్వచనీయమైన శోభను పోషించెను. 18

శ్లో॥ పత్యు శ్శిరశ్చన్ద్రకలా మనేన
స్పృశేతిసఖ్యా పరిహాసపూర్వమ్ ।
సా రఞ్జయిత్వా చరణౌ కృతాశీ
ర్మాల్యేన తాం నిర్వచనం జఘాన ॥ 19

శ్లో॥ తస్యా స్సుజాతోత్పలపత్త్రకాన్తే
ప్రసాధికాభి ర్నయనే నిరీక్ష్య ।
న చక్షుషోః కాన్తివిశేషబుద్ధ్యా
కాలాఞ్జనం మఙ్గళ మిత్యుపాత్తమ్ ॥ 20

శ్లో॥ సా సమ్భవద్భిః కుసుమై ర్లతేవ
జ్యోతిర్భి రుద్యద్భిరివ త్రియామా ।
సరి ద్విహఙ్గై రివ లీయమానై
రాముచ్యమానాభరణా చకాశే ॥ 21

లత్తుకరసముతో రెండుకాళ్ళను అలంకరించినను, "భర్తను తన్నుటకు ఒకకాలినే ఉపయోగింతురు" అను ఔచిత్యమును పాటించుచు ఎడమ కాలిని చూపుచు పరిహాసపూర్వకముగా "దీనితో నీ భర్తయొక్క శిరశ్చంద్ర కళను (=1. తలపైనున్న చంద్రలేఖను 2.సురత విశేషమును, తాకుము" అని ఆమె సఖి ఆశీర్వదించెను. అప్పుడా పార్వతి మౌనముగా "విహితము" అను శృంగారానుభావమును ప్రదర్శించుచు తనను అలంకరించిన, ఆశీర్వదించిన చెలికత్తెను పూలదండతో మౌనముగా కొట్టెను. (సమయము వచ్చినప్పుడు ఏది చెప్పవలెనో, దేనిని చేయవలెనో, దానిని "విహితము" అను శృంగారానుభావము అందురు.) **19**

పార్వతియొక్క కన్నులు చక్కని ఉత్పలముల రేకులవలె సహజసుందరము లగుటను చూచి, అలంకరించుచున్న చెలికత్తెలు, వీనికింకను శోభను తేవలెనని నల్లని కాటుకను అలంకరింపలేదు. (సహజ సుందరములైన కన్నులకు కాటుక పెట్టుటద్వారా ఇంకను అలంకారాడంబరము లెందుకు? అని భావించిరని భావము.) కాని అది శుభప్రదమైన ద్రవ్యము కదా అని మాత్రమే కన్నులకు కాటుకను పెట్టిరి. (ఆమె కన్నులకు కాటుక అలంకారము కాదని భావము.) **20**

ఆభరణములను ధరించుచున్న గౌరీదేవి, పూయుచున్న పూవులతో లతవలెను (ఈ ఉపమానముచేత లతలు వివిధవర్ణములపూలను ధరించినట్లు ఈమె వివిధ వర్ణములుగల నవరత్నాభరణములను ధరించినదని సూచింపబడినది.) ఉదయించుచున్న తారకలతో రాత్రివలెను (ఈ ఉపమానముచేత ఆమె తారకలవలె వెలుగొందు ముత్యములఆభరణములను ధరించినదని సూచింపబడినది.) ఆశ్రయించియున్న (కూర్చొనియున్న) చక్రవాకపక్షులతో నదివలెను, (ఈ ఉపమానముచేత పచ్చనిచక్రవాకములుఅనుటచే ఆమె సువర్ణాభరణములను ధరించినదని సూచింపబడినది) ప్రకాశించెను. **21**

శ్లో॥ ఆత్మాన మాలోక్య చ శోభమాన
మాదర్శబిమ్బే స్తిమితాయతాక్షీ ।
హరోపయానే త్వరితా బభూవ
స్త్రీణాం ప్రియాలోకఫలోహి వేషః ॥ 22

శ్లో॥ అథాఙ్గులిభ్యాం హరితాల మార్ద్రం
మాఙ్గల్య మాదాయ మనశ్శిలాం చ ।
కర్ణావసక్తామలదన్తపత్త్రం మాతా
తదీయం ముఖ మున్నమయ్య ॥ 23

శ్లో॥ ఉమా స్తనోద్భేద మనుప్రవృద్ధో
మనోరథో యః ప్రథమం బభూవ ।
త మేవ మేనా దుహితుః కథఞ్చి
దుద్వాహదీక్షాతిలకం చకార ॥ 24

శ్లో॥ బబన్ధ చాస్రాకులదృష్టి రస్యాః
స్థానాన్తరే కల్పితసన్నివేశమ్ ।
ధాత్ర్యఙ్గులీభిః ప్రతిసార్యమాణ
మూర్ణామయం కౌతుకహస్తసూత్రమ్ ॥ 25

శ్లో॥ క్షీరోదవేలేవ సఫేనపుఞ్జా
పర్యాప్తచన్ద్రేణ శర త్త్రియామా ।
నవం నవక్షౌమనివాసినీ సా
భూయో బభౌ దర్పణ మాదధానా ॥ 26

మఱియును. ఆ గౌరీదేవి చక్కగా అలంకరింపబడిన తనముఖపు ప్రతిబింబ మును పెద్ద కళ్ళు చేసుకొని, అద్దములో ఆదరముతో నిశ్చలముగా చూచుకొని, శివుని పొందుటకు త్వరపడసాగినది. ఏలయనగా అలంకరింప బడిన స్త్రీలయొక్క సుందరవేషమునకు ఫలము భర్తను చూచుటయే కదా! 22

అలంకారము పూర్తియయిన తరువాత, తడిగాఉన్న మాంగల్యప్రదమైన హరితాళము అను పచ్చని వర్ణద్రవ్యవిశేషమును, మనఃశిల .అనుధాతు విశేషమును చూపుడువేలు, మధ్యవేలు అను రెండు వేళ్ళతో తీసికొని, చెవుల నుండి వ్రేలాడుచున్న, నిర్మలమైన, దంతపత్రములు అను కర్ణాభరణములను ధరించిన, పార్వతియొక్క ముఖమును పైకెత్తి పార్వతియొక్క తల్లియగు మేనాదేవి, కళ్యాణతిలకమును దిద్దెను. 23

ఉమాదేవికి స్తనములు పొటమరించినదిమొదలుకొని (యౌవనారంభమునుండి) ఆమె మనస్సులో పెరిగిన "శివుని పొందవలెనను" కోరిక మొట్టమొదటి కోరిక అయ్యెను. ఇప్పుడు మేనాదేవి ఆ వివాహదీక్షకు సంబంధించిన కళ్యాణ తిలకమును (తన కన్నులనుండి ఆనందబాష్పములు రాలి, చూపు మందగింపగా) అతికష్టముమీద రచించెను. 24

మేక మొదలగు జంతువుల కేశములతో నిర్మితమైన, వివాహదీక్షాహస్త సూత్రమును మేనాదేవి పార్వతియొక్క చేతికి కట్టబోగా, ఆనందబాష్పములచే ఆమె దృష్టి వ్యాకులమైనది. కట్టవలసిన ప్రదేశమునందుకాక మఱియొక ప్రదేశమునందు కట్టబోవుచున్న మేనాదేవి చేతిని, సరియగు ప్రదేశమునకు తన వేళ్ళతో దాది జరుపగా, ఆమె ఆ వివాహదీక్షా సూత్రమును పార్వతియొక్క చేతికి కట్టినది. 25

తెల్లని కొత్తవస్త్రమును కట్టుకొని, అద్దమును పట్టుకొని, అందులో చూచుకొనుచు, నురగతోకూడిన పాలసముద్రపు చెలియలికట్టవలెను, పూర్ణచంద్రుడుకల శరత్కాలపు రాత్రివలెను ఆ పార్వతీదేవి మిక్కిలి ప్రకాశించెను. 26

శ్లో॥ తా మర్చితాభ్యః కులదేవతాభ్యః
కులప్రతిష్ఠాం ప్రణమయ్య మాతా ।
అకారయ త్కారయితవ్యదక్షా
క్రమేణ పాదగ్రహణం సతీనామ్ ॥ 27

శ్లో॥ అఖణ్డితం ప్రేమ లభస్వ పత్యు
రి త్యుచ్యతే తాభి రుమా స్మ నమ్రా ।
తయా తు తస్యార్ధశరీరభాజా
పశ్చాత్కృతా స్నిగ్ధజనాశిషోఽపి ॥ 28

## శివాగమనప్రతీక్షోత్కం హిమవదవస్థానమ్

శ్లో॥ ఇచ్ఛా విభూత్యో రనురూప మద్రి
స్తస్యాః కృతీ కృత్య మశేషయిత్వా ।
సభ్య స్సభాయాం సుహృదాస్థితాయాం
తస్థౌ వృషాఙ్కాగమనప్రతీక్షః ॥ 29

శ్లో॥ తావ ద్వవస్యాపి కుబేరశైలే
తత్పూర్వపాణిగ్రహణానురూపమ్ ।
ప్రసాధనం మాతృభి రాదృతాభి
ర్న్యస్తం పురస్తా త్పురశాసనస్య ॥ 30

శ్లో॥ తద్గౌరవా న్మఙ్గలమణ్డనశ్రీః
సా పస్పృశే కేవల మీశ్వరేణ ।
స ఏవ వేషః పరిణేతు రిష్టం
భావాన్తరం తస్య విభోః ప్రపేదే ॥ 31

చేయవలసిన పనులకు తగిన ఉపదేశముల నిచ్చుటయందు కుశలురాలైన, పార్వతియొక్క తల్లియగు మేనాదేవి, తన కులమున కాలంబనభూతురాలైన, ఆ గౌరీదేవిచేత పూజింపబడిన, గృహదేవతల కందఱికి ప్రణామమును చేయించెను. తరువాత పతివ్రతలైన ముత్తయిదువలకందరికి వందన మాచరింపజేసెను. 27

నమస్కరించిన ఆమెను ఆ ముత్తైదువ లందఱు "భర్తయగు ఆ శివునియొక్క అఖండమైన ప్రేమను పొందుము" అని ఆశీర్వదించిరి. (కాని) ఆ పార్వతి అనంతరకాలమునందు ఆ శివునియొక్క శరీరములో సగభాగమును పొంది, ఇష్టులైన బంధుజను లిచ్చిన ఆశీర్వచనమును అధఃకరించెను. 28

## శివాగమనమునకై ఉత్కంఠపడు హిమవంతునిస్థితి

కుశలుడును, సంస్కారవంతుడును అగు హిమవంతుడు, తన ఉత్సాహము నకును, సంపదకును, తగినట్లుగా కుమార్తెకు చేయవలసిన మంగళకార్యముల నన్నింటిని పూర్తిచేసి, బంధుజను లందఱును నిండియున్న తన రాజసభలో ఉండి వృషభధ్వజుడైన శివుని రాకకై ఎదురు చూచుచుండెను. 29

ఇచ్చట పెండ్లికూతురగు పార్వతికి వివాహవేషమును, వేయునంతలో అదే సమయమునకు కుబేరుని కొండయగు కైలాసమునందు, అదే మొట్టమొదటిదగు వివాహమునకు తగినఅలంకారసామగ్రిని, సగౌరవముగా వరుడగు శివుని ముందు బ్రాహ్మీ మొదలగు సప్తమాతృకలు ఉంచిరి. 30

తన నలంకరించుటకై తెచ్చిన అలంకారసామగ్రి నంతటిని ఆ శివుడు, బ్రాహ్మీ మొదలగు అష్టమాతృకలమీది గౌరవముతో కేవలము తాకెను. (అంతేకాని ధరింపలేదని భావము) కాని ఆ దేవునియొక్క స్వాభావికమైన వేషమే (భస్మము, కపాలము మొదలగువానితో కూడిన వేషము) వరున కిష్టమగునట్లుగా మఱియొకరూపమును పొందెను. (పెండ్లికొడుకగుటకు నూతనవేషమును

అవ. : భావాన్తరాపత్తి మేవాహ.

శ్లో॥ బభూవ భస్మైవ సితాఙ్గరాగః
కపాలమేవా మలశేఖరశ్రీః ।
ఉపాన్తభాగేషు చ రోచనాఙ్కో
గజాజినస్యైవ దుకూలభావః ॥ 32

శ్లో॥ శఙ్ఖాన్తరద్యోతి విలోచనం
య దన్తర్నివిష్టామలపిఙ్గతారమ్ ।
సాన్నిధ్యపక్షే హరితాలమయ్యా
స్తదేవ జాతం తిలకక్రియాయాః ॥ 33

శ్లో॥ యథాప్రదేశం భుజగేశ్వరాణాం
కరిష్యతా మాభరణాన్తరత్వమ్ ।
శరీరమాత్రం వికృతిం ప్రపేదే
తథైవ తస్థుః ఫణరత్నశోభాః ॥ 34

శ్లో॥ దివాపి నిష్ఠ్యూతమరీచిభాసా
బాల్యాదనావిష్కృతలాఞ్ఛనేన ।
చన్ద్రేణ నిత్యం ప్రతిభిన్నమౌళే
శ్చూడామణేః కిం గ్రహణం హరస్య ॥ 35

ధరించినచో శివుని అవ్యయత్వమునకు భంగమువాటిల్లును కనుక పాత రూపమే కొత్తగా మారినదని కాళిదాసు చెప్పినాడు.) 31

అవతారిక : ఏవస్తువు ఎట్లు భావాంతరము నందనో చెప్పుచున్నాడు.

పూర్వము శివుని శరీరముపైనుండు విభూతిపూతయే నేటి పెండ్లికొడుకునకు శుభగంధానులేపనమైనది. పూర్వపు కపాలమే ఇప్పుడు పవిత్రమైన శిరోభూషణమైనది. పూర్వపు ఏనుగుతోలే ప్రస్తుతము కలహంసల అంచులుగల కొత్త పట్టుపంచె అయినది. 32

పూర్వము నుదుటిపై ప్రకాశించు పసుపుపచ్చని కనుపాపగల అగ్ని నేత్రమే నేడు హరితాలవర్ణద్రవ్యవిశేషము మధ్యగాగల కళ్యాణతిలకమై పోయినది. 33

పూర్వము, మణికట్టు మొదలగు సర్వావయవముల యందుండెడు సర్పరాజుల శరీరములే నేడు కంకణములు మొదలగు ఆభరణములుగా మారిపోయినవి. ఆయా పాముల పడగలపైనుండు రత్నకాంతులు మాత్ర మట్లే పూర్వమువలెనే ఉండిపోయినవి. 34

పగటిపూటకూడ కిరణములను ప్రసరింపజేయుచున్న, బాల్యావస్థ కనుక (చంద్రలేఖ కనుక) తనయందు మచ్చని వెలువరింపని చంద్రుడే. తలపై ఉండగా, కిరణములను ప్రసరింపచేయుచు వెలుగొందు మఱియొక చూడామణి ఎందుకు? అని భావించి, ఆ బాలచంద్రుడే చూడామణి అయిపోయినాడు. 35

శ్లో॥ ఇ త్యద్భుతైక ప్రభవః ప్రభావా
త్ప్రసిద్ధ నైపథ్యవిధే ర్విధాతా ।
ఆత్మాన మాసన్నగణోపనీతే
ఖడ్గే నిషక్తప్రతిమం దదర్శ ॥ 36

## సగణస్య హరస్య హిమవత్ప్రస్థానమ్

శ్లో॥ స గోపతిం నన్దిభుజావలమ్బీ
శార్దూలచర్మాన్తరితోరుపృష్ఠమ్ ।
తద్భక్తిసంక్షిప్తబృహత్ప్రమాణ
మారుహ్య కైలాస మివ ప్రతస్థే ॥ 37

శ్లో॥ తం మాతరో దేవ మనువ్రజన్త్యః
స్వవాహనక్షోభచలావతంసాః ।
ముఖైః ప్రభామణ్డల రేణుగౌరైః
పద్మాకరం చక్రు రివాన్తరిక్షమ్ ॥ 38

శ్లో॥ తాసాం చ పశ్చా త్కనకప్రభాణాం
కాళీకపాలాభరణా చకాశే ।
బలాకినీ నీలపయోదరాజీ
దూరం పురఃక్షిప్త శతహ్రదేవ ॥ 39

శ్లో॥ తతో గణై శ్శూలభృతః పురోగై
రుదీరితో మఙ్గలతూర్యఘోషః ।
విమానశృఙ్గాణ్యవగాహమాన
శ్శశంస సేవావసరం సురేభ్యః ॥ 40

ఈ విధముగా శివుడు తన దివ్య ప్రభావసామర్థ్యముచేత సుప్రసిద్ధమైన అలంకారమును స్వయముగా సమకూర్చుకొని, అందువలననే సర్వాశ్చర్యములకును, మూలకారణుడైన, తనకు దగ్గఱనున్న ప్రమథగణములు తెచ్చిన ఖడ్గములో ప్రతిబింబించిన తన రూపసౌందర్యమును చూచుకొనెను. (ఖడ్గములో ప్రతిబింబమును చూచుకొనుట వీరక్షత్రియపురుషుల ఆచారము అని భావము.)36

## ప్రమథగణసహితుడై శివుడు హిమవన్నగరమునకు బయలుదేరుట

ఆ దేవుడైన శివుడు నందీశ్వరుని భుజమును పట్టుకొని, పెద్ద పులిచర్మముచేత కప్పబడిన విశాలమైన వీపుభాగము గలదియును, శివునిమీది భక్తితో తన పెద్ద ఆకారమును ముడిచి చిన్నగా చేసినదియును, అగు గోపతిని (నందిని) కైలాసపర్వతము నెక్కిన ట్లధిరోహించి (కళ్యాణవేదికకు) బయలుదేరెను. 37

(చక్కగా అలంకరించుకొని వివాహమునకై బయలుదేరిన) ఆ దేవుని అనుసరించుచు తమ తమ వాహనముల కదలికవలన కదులుచున్న కుండలములు కలవారైన ఆ సప్తమాతృకలు, తమ దివ్యతేజోమండలమే రేణువులుగా గల ముఖకమలములతో ఆకాశమును పద్మాకరముగా మార్చివేసిరి. 38

బంగారురంగు తేజస్సుతో విరాజిల్లు ఆ సప్తమాతృకలకు వెనుక, కపాలములనే ఆభరణములుగా ధరించిన కాళికాదేవి పయనించుచు, ముందుభాగమున చాలా దూరము మెరుపులు మెఱియుచున్న మేఘపంక్తి వలె ప్రకాశించెను. 39

ఆ తరువాత శివునకు ముందుగా నడుచు ప్రమథగణములు మంగళవాద్యఘోషను చేసిరి. ఆ శబ్దము విమానశృంగములోనికి ప్రవేశించి "శివుని సేవించుటకు తగిన సమయము ఇదే" అని దేవతలకు చెప్పెను. (ఆ మంగళవాద్యఘోషను విని దేవతలందఱును శివుని చూచి, సేవింపవచ్చిరని భావము.) 40

## సురాదిసేవావర్ణనమ్

అవ. : సురాణాం సేవాప్రకారమే వాహ.

శ్లో॥ ఉపాదదే తస్య సహస్రరశ్మి
స్త్వష్ట్రా నవం నిర్మిత మాతపత్రమ్ ।
స తద్దుకూలా దవిదూరమౌలి
ర్బభౌ పతద్గఙ్గ ఇవోత్తమాఙ్గే ॥ 41

శ్లో॥ మూర్తే చ గఙ్గాయమునే తదానీం
సచామరే దేవ మసేవిషాతామ్ ।
సముద్రగా రూపవిపర్యయేఽపి
స హంసపాతే ఇవ లక్ష్యమాణే ॥ 42

శ్లో॥ త మభ్య గచ్ఛ త్ప్రథమో విధాతా
శ్రీవత్సలక్ష్మా పురుషశ్చ సాక్షాత్ ।
జయేతి వాచా మహిమాన మస్య
సంవర్ధయన్తౌ హవిషేవ వహ్నిమ్ ॥ 43

అవ. : న చానుచిత మేత దుక్త మిత్యాహ.

శ్లో॥ ఏకైవ మూర్తి ర్బిభిదే త్రిధాసా
సామాన్య మేషాం ప్రథమావరత్వమ్ ।
విష్ణో ర్హర స్తస్య హరిః కదాచి
ద్వేధా స్తయో స్తావపి ధాతు రాద్యౌ ॥ 44

## దేవతలు మొదలగువారు హరుని సేవించుట

**అవతారిక:** దేవతలు శివుని సేవించిన విధానమును చెప్పుచున్నాడు.

ఆ శివునకు, విశ్వకర్మ నిర్మించిన, కొత్తగొడుగును సూర్యుడు సమర్పించెను. ఆ గొడుగుయొక్క ప్రక్కనుండి వ్రేలాడు పట్టుబట్టకు దగ్గరలోనే తలకలవాడై, ఆ శివుడు, తన తలపైనుండి ఆకాశగంగను క్రిందికి విడుచుచున్నాడో అన్నట్లు ప్రకాశించెను. **41**

సముద్రమువైపునకు దూసుకొనిపోవు నదీరూపము లేకున్నను, తాము విసురుచున్న తెల్లని చామరములు, గంగాయమునల జలముపై ఎగిరెడు హంసలవలె కనపడుచుండగా, ఆ గంగాయమునానదులు, నదీదేవతాత్మకమైన స్త్రీ రూపమును ధరించి, వరునకు చామరసేవ చేసినవి. **42**

ఆద్యబ్రహ్మ యగు చతుర్ముఖుడును, శ్రీవత్సమను పుట్టుమచ్చ గుర్తుగాగల శ్రీ మహావిష్ణువును, హవిస్సుతో అగ్నిని వృద్ధిపొందించునట్లు జయశబ్దములతో ఈశ్వరుని మహిమను పెంచిరి. **43**

**అవతారిక:** చెప్పిన మాట అనుచితము కాదని చెప్పుచున్నాడు.

అసలు ఉన్నది ఒక్కటే రూపము. అదే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాత్మకముగా విభజింపబడి, భిన్నమైనది. (ఈ భేదము ఉపాధికి సంబంధించినదే కాని వాస్తవము కాదని భావము) కనుక ఈ ముగ్గురిలో ఎక్కువ, తక్కువ అను భావము సామాన్యమైనది. తమ తమ సంకల్ప ప్రభావము చేతనే అందఱును పెద్దవారు కాగలరు. అందఱును చిన్నవారు కాగలరు. అందువలననే ఒకొక్కసారి విష్ణువునకంటె హరుడు (శివుడు) ఆద్యు డగును. మరొక్కసారి శివునికంటె

శ్లో॥ తం లోకపాలాః పురుహూతముఖ్యాః
శ్రీలక్షణోత్సర్గ వినీతవేషాః ।
దృష్టిప్రదానే కృతనన్దిసంజ్ఞా
స్తద్దర్శితాః ప్రాఞ్జలయః ప్రణేముః ॥ 45

శ్లో॥ కమ్పేన మూర్ధ్న శ్శతపత్రయోనిం
వాచా హరిం, వృత్రహణం స్మితేన ।
ఆలోకమాత్రేణ సురా నశేషాన్
సమ్భావయామాస యథాప్రధానమ్ ॥ 46

## వివాహే మునిభిః శివస్య జయజయకారః

శ్లో॥ తస్మై జయాశీ స్ససృజే పురస్తా
త్సపర్షిభి స్తాన్ స్మితపూర్వ మాహ ।
వివాహయజ్ఞే వితతే ఽత్ర యూయ
మధ్వర్యవః పూర్వవృతా మయేతి ॥ 47

శ్లో॥ విశ్వావసు ప్రాగ్రహరైః ప్రవీణైః
సజ్గీయమాన త్రిపురావదానః ।
అధ్వాన మధ్వాన్త వికారలఙ్ఘ్య
స్తతార తారాధిప ఖణ్డధారీ ॥ 48

హరి ఆద్యు డగును. ఇంకొకసారి హరిహరులకంటె బ్రహ్మ ఆద్యు డగును. వేతొకసారి హరిహరులు కూడ బ్రహ్మకంటె ఆద్యులు. (ఈ విధముగా ఈ ముగ్గురిలో పౌర్వాపర్యము (ఎవరు ముందు ఎవరు వెనుక అను విషయము) నిర్ణయింపనలవికాదని భావము.) 44

ఇంద్రుడు మొదలగు లోకపాలురు, తమ ఐశ్వర్యమునకు చిహ్నములైన, ఛత్ర, చామర వాహనాదులను విడిచిపెట్టి, వినయపూర్వకమైన వేషముతో తమకు దర్శనము నిప్పింపుమని ద్వారపాలకుడయిన నందీశ్వరుని ప్రార్థించి, అతని ద్వారా శివుని దర్శించి, ఆ శివునకు అంజలిఘటించి, నమస్కరించిరి. 45

ఆ శివుడు, పద్మోద్భవుడైన బ్రహ్మను తలయూచుట చేతను, హరిని మాటచేతను, ఇంద్రుని నవ్వుచేతను, తక్కిన దేవతలనందఱిని తన చూపుతోను, యథాప్రధానముగా (వారివారి ప్రాధాన్యమునుబట్టి) గౌరవించెను. 46

## వివాహమునందు మునులు శివునకు జయజయనాదములు చేయుట

ఆ శివున కెదుట నిలబడి, సప్తర్షులు "జయ" శబ్దమును పలికిరి. నవ్వుచు శివుడు, వారితో ఇట్లనెను. "ఈ విస్తృతమైన వివాహయజ్ఞమునందు యజుర్వేద తంత్రమును నడుపువారుగా ఉండుటకై ఇంతకు పూర్వమే మిమ్ము కోరితిని కదా! 47

(దేవగాయకుడగు) విశ్వావసువు మొదలగు సుప్రసిద్ధగాయకులు శివుడు పూర్వము చేసిన త్రిపురదహనవృత్తాంతమును చక్కగా పాడుచుండగా రాగమోహాదులకు లొంగని చంద్రమౌళి (శివుడు), ఓషధిప్రస్థపురమునకై బయలుదేరెను. (రాగాదులకు లొంగనివానికి ఈ వివాహమేమి అను అనుమానమురాగా ఈ వివాహము శివలీలలలో ఒకటి అని చెప్పుకొనవలెనని భావము.) 48

శ్లో॥ ఖే ఖేలగామీ త మువాహ వాహ
స్సశబ్దచామీకరకిఙ్కిణీకః ।
తటాభిఘాతాదివ లగ్నపఙ్కే
ధున్వన్ ముహుః ప్రోతఘనే విషాణే ॥ 49

శ్లో॥ స ప్రాప దప్రాప్త పరాభియోగం
నగేన్ద్రగుప్తం నగరం ముహూర్తాత్ ।
పురో విలగ్నై ర్హరదృష్టిపాతై
స్సువర్ణ సూత్రై రివ కృష్యమాణః ॥ 50

శ్లో॥ తస్యోపకణ్ఠే ఘననీలకణ్ఠః
కుతూహలాదున్ముఖ పౌరదృష్టః ।
స్వబాణ చిహ్నా దవతీర్య మార్గా
దాసన్న భూపృష్ఠ మియాయ దేవః ॥ 51

శ్లో॥ త మృద్ధిమ ద్బన్ధుజనాధిరూఢై
ర్బృన్దై ర్గజానాం గిరిచక్రవర్తీ ।
ప్రత్యుజ్జగామాగమనప్రతీతః
ప్రఫుల్లవృక్షైః కటకై రివ స్వైః ॥ 52

ఆకాశమార్గమునందు సవిలాసముగా పయనించువాడును, బంగరు మువ్వల సవ్వడి కలవాడును, అగు శివుని వాహనమగు నందీశ్వరుడు, వప్రక్రీడలో (శైలతటమును కొమ్ములతో అడ్డముగా కొట్టు క్రీడలో) మట్టి అంటుకొనిన తన కొమ్ములను ప్రోతఘనమునందు (వర్షించుచున్న మేఘమునందు) మాటి మాటికి విదిలించి, కడిగికొనుచు, శివుని వహించుచు ముందుకుసాగెను. (ఈ శ్లోకమునందు శబ్దాలంకార సామర్థ్యముచే వర్ణనమును, అతి సుందరముగా కాళిదాసు చేసినాడని విమర్శకు లందురు. "ఖే ఖేల గామీ" అను పదముచే ఎద్దులను నడిపించుటకు హే హే అను శబ్దానుకృతి సూచింపబడినది. "ఉవాహ వాహః" అను పదము ద్వారా దానిని ఆపుటకు బండి కట్టువాడు చేయు "ఆహా, ఆహా" అను శబ్దానుకృతి సూచింపబడినది.) **49**

ముందునకు ప్రసరించుచున్న శివునియొక్క చూపులు అను సువర్ణసూత్రముచే ముందుకు లాగబడుచున్నాడో అనునట్లు ఆనందీశ్వరుడు శత్రువుల తిరస్కారము నందనిదియును, హిమవంతునిచేత రక్షింపబడుచున్నదియును, అగు ఆ ఓషధిప్రస్థపురమును ముహూర్తకాలములో చేరెను. **50**

మేఘమువలె నల్లని కంఠముగల శివుడు, ఆ పురజనులందఱు కుతూహల ముతో తనను చూచుచుండగా, త్రిపురవిజయ సమయమునందు, తన బాణముల చిహ్నముగల ఆకాశమార్గమునుండి, ఆ ఓషధిప్రస్థపురమునకు దగ్గరనున్న నేలపైకి దిగెను. **51**

శివుని రాకతో సంతసించిన పర్వతరాజగు హిమవంతుడు, వస్త్రాలంకారాదులలో తనతో సమానులగు బంధుజనులెక్కిన ఏనుగులతో (ఇది జంగమరూపమును సూచించును.) కూడినవాడై, బాగుగా పూచిన వృక్షములుగల (స్థావర రూపముతో) తన కటకములతో (పర్వతాధఃప్రదేశములతో) కలిసి వచ్చినట్లు ఆ హరునకు స్వాగతము చెప్పుటకై ఎదురేగెను. **52**

శ్లో॥ వర్గా వుభౌ దేవమహీధరాణాం
ద్వారే పురస్యో ద్ఘటితాపిధానే ।
సమీయతు ర్దూర విసర్పి ఘోషౌ
భిన్నైకసేతూ పయసా మివౌఘౌ ॥ 53

శ్లో॥ హ్రీమా నభూ ద్భూమిధరో హరేణ
త్రైలోక్యవన్ద్యేన కృతప్రణామః ।
పూర్వం మహిమ్నా సహితస్య దూర
మావర్జితం నాత్మశిరో వివేద ॥ 54

హిమవన్నగరే శివస్యప్రవేశః -
పురసున్దరీణాం విలాసచేష్టాః.

శ్లో॥ స ప్రీతియోగా ద్వికసన్ముఖ శ్రీ
ర్జామాతు రగ్రేసరతా ముపేత్య ।
ప్రావేశయ న్మన్దిర మృద్ధ మేన
మాగుల్ఫకీర్ణాపణమార్గపుష్పమ్ ॥ 55

శ్లో॥ తస్మి న్ముహూర్తే పురసున్దరీణా
మీశాన సన్దర్శన లాలసానామ్ ।
ప్రాసాదమాలాసు బభూవు రిత్థం
త్యక్త్వా న్యకార్యాణి విచేష్టితాని ॥ 56

చాలా దూరము వరకు వినిపించునట్లుగా తూర్యఘోషకల ఆ దేవతలయొక్కయు, పర్వతరాజుయొక్కయు బృందములు రెండును ఓషధిప్రస్థపురపు నగరిద్వారము తెరువబడగానే, ఉన్న ఒకే వంతెన కూలిపోగా, వేగముగా ఒండొంటితో ఢీకొని ఒరుసుకొను రెండు ప్రవాహములవలె ఒకదానితో మఱియొకటి కలిసిపోయినవి. 53

త్రిలోకవంద్యుడైన శివుడు తనకు నమస్కరించుటవలన హిమవంతుడు సిగ్గుపడెను. (హిమవంతునకు ఈశ్వరుని మహిమ తెలిసినను శివుడు, నేడు అల్లుడుగా మామకు ఆచారప్రకారము చేసిన ప్రణామమును స్వీకరించుటకు సంకోచమెందుకు? అను అనుమానమును తీర్చుటకై సమాధానమును చెప్పుచున్నాడు). ఇంతకు పూర్వము హిమవంతుడు ఈశ్వరుని మహిమను తెలిసికొని, అతనికి ప్రణామము చేయుటకై దూరమునుండియే వంచిన తన తలను గుర్తింపడయ్యెను. (తాను పూర్వము చేసిన శివప్రణామమును మఱచి, అల్లుడుగా ఆచారమునకై శివుడు చేసిన ప్రణామమునకు సిగ్గుపడెనని భావము.) 54

## శివుడు హిమవన్నగరములోనికి ప్రవేశించుట - పురసుందరీమణుల విలాసచేష్టితములు

అల్లుని మీది ప్రేమచే వికసించిన ముఖశోభకలవాడైన హిమవంతుడు, అల్లునికి ముందు తాను నడుచుచు, చీలమండమునుగునంతటి లోతుగల, పూలను చల్లిన రాజవీధులద్వారా సర్వసమృద్ధమైన తన నగరములోనికి ప్రవేశపెట్టెను. 55

శివుడు ఓషధిప్రస్థపురములోనికి ప్రవేశించిన శుభముహూర్తమునందు ఈశ్వరుని చూడవలెనని ఉవ్విళ్ళూరుచున్న, ఇతర కార్యములను విడిచిపెట్టిన, పురస్త్రీల యొక్క విలాసచేష్టలు మేడలపైభాగమునందు ఇట్లు కనబడినవి. 56

అవ. : తాన్యేవాహ పఞ్చభిః శ్లోకైః

శ్లో॥ ఆలోకమార్గం సహసా వ్రజన్త్యా
కయాచి దుద్వేష్ట నవాన్తమాల్యః ।
బద్ధుం న సమ్భావిత ఏవ తావ
త్కరేణ రుద్ధోఽపి చ కేశపాశః ॥ 57

శ్లో॥ ప్రసాధికాలమ్బిత మగ్రపాద
మాక్షిప్య కాచి ద్ద్రవరాగమేవ ।
ఉత్సృష్టలీలాగతి రాగావాక్షా
దలక్తకాఙ్కాం పదవీం తతాన ॥ 58

శ్లో॥ విలోచనం దక్షిణ మఞ్జనేన
సమ్భావ్య తద్వఞ్చితవామనేత్రా ।
తథైవ వాతాయన సన్నికర్షం
యయౌ శలాకా మపరా వహన్తీ ॥ 59

శ్లో॥ జాలాన్తర ప్రేషిత దృష్టిరన్యా
ప్రస్థాన భిన్నాం న బబన్ధ నీవీమ్ ।
నాభిప్రవిష్టాభరణప్రభేణ
హస్తేన తస్థా వవలమ్బ్య వాసః ॥ 60

శ్లో॥ అర్ధాచితా సత్వర ముత్థితాయాః
పదే పదే దుర్నిమితే గళన్తీ ।
కస్యాశ్చి దాసీ ద్రశనా తదానీ
మఙ్గుష్ఠమూలార్పితసూత్రశేషా ॥ 61

అవతారిక: ఆ విలాసచేష్టలనే ఇచ్చటినుండి ఐదు శ్లోకములలో వివరించు చున్నాడు.

(పెండ్లికొడుకును చూచుటకు మార్గమైన) కిటికీ వద్దకు వేగముగా నడుచుచున్న ఒక స్త్రీ, త్వరగా నడుచుటవలన ఆమె జుట్టుముడి వీడి, దానినుండి పూలు జారిపోవుచుండగా, ఆ జుట్టును కిటికీ వద్దకు చేరువరకు చేతితో పట్టుకొనినదే కాని, ముడివేసికొనవలెనను ఆలోచన ఆమెకు రాలేదు. 57

మఱియొక స్త్రీ, తన పాదములకు లత్తుకద్రవమును (పారాణిని) చెలికత్తె పూయుచుండగా, సగము పారాణిని పూసిన తన పాదమును ఆమె చేతినుండి లాగికొని, (నెమ్మదియును, స్త్రీ సహజమును అగు) విలాస గమనమును మాని వేగముగా కిటికీ వద్దకు నడుచుచు, ఆ కిటికీ వరకు ఉన్న నేలనంతటిని తడిపారాణి గుర్తులు కలదిగా చేసెను. 58

మఱియొక స్త్రీ తన కుడికంటిని కాటుకతో అలంకరించుకొని, ఎడమకంటికి కాటుకను పెట్టుకొనకుండగనే (ఆ కన్నును కాటుకతో వంచించి) ఉన్నదున్నట్లుగా కాటుక పెట్టుకొను రత్నశలాకను అట్లే పట్టుకొని, కిటికీ వద్దకు వెళ్ళెను. 59

ఇంకొక స్త్రీ, కిటికీలోనికి దృష్టిని పఱపి, వేగముగా నడుచుటవలన జారిన కోకముడిని (నీవిని) మరల బిగించలేదు. కాని చేతికి ఉన్న మణితో పొదగబడిన, ఆభరణములనుండి వచ్చు కాంతులను, బొడ్డులోనికి ప్రవేశింపజేయు చేతితో, ఆ వస్త్రమును పట్టుకొని, కిటికీ వద్దకు నడిచెను. 60

వేఱొక స్త్రీ తన మొలతాటిలో రత్నములను సగముగ్రుచ్చి, వేగముగా లేచి నడచుటవలన అడుగడుగునకు ఆ గ్రుచ్చిన రత్నములు కూడ జాఱిపోవుచుండగా, ఆ మొలనూలుత్రాడు మాత్రమే ఆమె బొటనవ్రేలి మొదట జారకుండ నిలిచియుండెను. 61

శ్లో॥ తాసాం ముఖై రాసవగన్ధగర్భై
ర్వ్యాప్తాన్తరా స్సాన్ద్రకుతూహలానామ్ ।
విలోలనేత్ర భ్రమరై ర్గవాక్షా
స్సహస్రపత్త్రాభరణా ఇవాసన్ ॥ 62

శ్లో॥ తావత్పతాకాకుల మిన్దుమౌళి
రుత్తోరణం రాజపథం ప్రపేదే ।
ప్రాసాదశృఙ్గాణి దివాపి కుర్వన్
జ్యోత్స్నాభిషేకద్విగుణద్యుతీని ॥ 63

శ్లో॥ త మేకదృశ్యం నయనైః పిబన్త్యో
నార్యో న జగ్ము ర్విషయాన్తరాణి ।
తథాహి శేషేన్ద్రియవృత్తి రాసాం
సర్వాత్మనా చక్షు రివ ప్రవిష్టా ॥ 64

## శివ మవలోక్య పురసున్దరీసల్లపనమ్

అవ. : అథ పౌరాఙ్గనావచనా న్యాహ.

శ్లో॥ స్థానే తపో దుశ్చర మేతదర్థ
మపర్ణయా పేలవయాపి తప్తమ్ ।
యా దాస్య మప్యస్య లభేత నారీ
సా స్యా త్కృతార్థా కిము తాఙ్కశయ్యా? ॥ 65

అప్పుడు (వరుని చూచుటయందు) సమధికోత్సాహముగల ఆ స్త్రీలయొక్క ముఖములే, పుష్పాసవపు వాసనలు గర్భమునందు (లోపల) గల, శతపత్రములుకాగా (వందరేకులుగల తామరపూలుకాగా), గాలికి కదులుచున్న నేత్రములే భ్రమరములు కాగా, ఆ కిటికీలు తామరపూలతో అలంకరింపబడినవో అన్నట్లున్నవి. 62

అప్పు డా చంద్రశేఖరుడు, పగటిపూట కూడ తన తలపైనున్న చంద్రుని వెన్నెలతో ఆ నగరమునందలి భవనములశిఖరములను అభిషేకించి, రెట్టింపు కాంతికలవానినిగా చేసి, పతాకములతో వ్యాపించియున్నదియును, ఎత్తుగా తోరణములు కట్టబడినదియును అగు రాజమార్గమును చేరెను. 63

ఒకే ఒక దర్శనీయుడైన ఆ స్వామిని, తమ కళ్ళతోనే ఆత్రముగా త్రాగి వేయుచు ఇతర విషయములను (ఇతర జ్ఞానేంద్రియములతో అనుభవింపదగిన విషయములనువినుట, వాసనచూచుట, స్పృశించుట, రుచిచూచుట అను పనులను) ఆ స్త్రీలు తెలిసికొనలేక తన్మయలైపోయిరి. ఆ స్త్రీల ఇతరేంద్రియ వ్యాపారములన్నియు వారి కంటిలోనికి ప్రవేశించినవేమో అన్నట్లుండెను. 64

## శివుని చూచిన పురసుందరీమణుల సంభాషణము

**అవతారిక:** తరువాత పౌరాంగనల మాటలను చెప్పుచున్నాడు.

మృదువైన శరీరము కలదైనను పార్వతి ఈ శివుని (భర్తగా పొందుట) కొఱకు దుశ్చరమైన తపస్సుచేయుట యుక్తమైనదే. ఎందువలన అనగా ఈ పరమేశ్వరునకు దాసి కాగలిగిన స్త్రీకూడ కృతార్థురాలే, అన్నచో ఎవతె ఈతని అంకమునే శయ్యగా చేసికొనజాలునో ఆమె కృతార్థురాలని వేరుగా చెప్పనేల? (పార్వతి కా భాగ్యము నేడు కలిగినది కనుక, ఆమె చేసిన తపస్సు కూడ సార్థకమైనదని భావము.) 65

శ్లో॥ పరస్పరేణ స్పృహణీయశోభం న చే
దిదం ద్వన్ద్వ మయోజయిష్యత్ ।
అస్మిన్ ద్వయే రూపవిధానయత్నః
పత్యుః ప్రజానాం వితథో ఽభవిష్యత్ ॥ 66

శ్లో॥ న నూన మారూఢరుషా శరీర
మనేన దగ్ధం కుసుమాయుధస్య ।
వ్రీడా దముం దేవ ముదీక్ష్య మన్యే
సన్యస్తదేహ స్స్వయమేవ కామః ॥ 67

శ్లో॥ అనేన సమ్బన్ధ ముపేత్య దిష్ట్యా
మనోరథప్రార్థిత ఈశ్వరేణ ।
మూర్ధాన మాలి క్షితిధారణోచ్చ
ముచ్చైస్తరం వక్ష్యతి శైలరాజః ॥ 68

శ్లో॥ ఇత్యోషధిప్రస్థవిలాసినీనాం
శృణ్వన్ కథాః శ్రోత్రసుఖా స్త్రినేత్రః ।
కేయూరచూర్ణీకృతలాజముష్టిం
హిమాలయ స్యాలయ మాససాద ॥ 69

శ్లో॥ త త్రావతీర్యాచ్యుతదత్తహస్త
శ్శరద్ఘనా ద్దీధితిమా నివోక్ష్ణః ।
క్రాన్తాని పూర్వం కమలాసనేన
కక్ష్యాన్తరా ణ్యద్రిపతే ర్వివేశ ॥ 70

అందరిచేత కోరబడదగిన సౌందర్యముకల ఈ జంటను ఒండొరులతో కూర్పకున్నచో బ్రహ్మ ఈ మిథునమునందు సమస్తసౌందర్యమును నిక్షేపించుటకు చేసిన ప్రయత్నము (ప్రయాసము) వ్యర్థమైపోయెడిది. 66

మిక్కిలి కోపించిన హరునిచేత మన్మథుని శరీరము నిజముగా దగ్ధము కాలేదు. ఆ మన్మథుడు శివుని సౌందర్యమును చూచి, తన వద్ద అంతటి సౌందర్యము లేదను భావముతో సిగ్గుచెంది, తనంతటతానే శరీరమును విడిచిపెట్టి యుండునని నా భావన. (జితేంద్రియుడైన శివునకు కోపము రాదని భావము.) 67

ఓ చెలియా! శైలరాజగు హిమవంతుడు, తాను కోరుకొనిన ఈశ్వరునితో సంబంధము నేర్పరచుకొని, భూభారనిర్వహణముచేతనే ఉన్నతమైన తన తలను ఇంకను ఉన్నతతరముగా చేసికొని మోయుచున్నాడు. 68

ఈ విధములైన, శ్రోత్రప్రియములైన, ఓషధిప్రస్థపు విలాసినీజను లాడు కథలను (మాటలను) ముక్కంటి వినుచు, తన కేయూరముల కాఠిన్యముచే, ఆ నగర విలాసినులు పిడికిళ్ళతో జల్లు పేలములను పిండి పిండిగా చేయుచు, హిమవంతుని రాజప్రాసాదమును చేరెను. 69

అచ్చట, ఆ హిమవంతుని ఇంటియందు, విష్ణువు చేయూత నందింపగా, తెల్లని, శరత్కాలపు మేఘమునుండి సూర్యునివలె, తన వాహనమగు వృషభము నుండి హరుడు దిగి, కమలాసనుడు (బ్రహ్మ) ముందు నడుచుచు మార్గమును చూపుచుండగా హిమవంతుని అంతఃపురములోని గదులలోనికి ప్రవేశించెను. 70

శ్లో॥ త మన్వ గిన్ద్రప్రముఖాశ్చ దేవా
స్సప్తర్షిపూర్వాః పరమర్షయశ్చ ।
గణాశ్చ గిర్యాలయ మభ్యగచ్ఛన్
ప్రశస్త మారమ్భ మివోత్తమార్థాః ॥ 71

శ్లో॥ తత్రేశ్వరో విష్టరభా గ్యథావ
త్సరత్నమర్ఘ్యం మధుమచ్చ గవ్యమ్ ।
నవే దుకూలే చ నగోపనీతం
ప్రత్యగ్రహీత్ సర్వ మమన్త్రవర్జమ్ ॥ 72

శ్లో॥ దూకూలవాసా స్స వధూసమీపం
నిన్యే వినీతై రవరోధదక్షైః ।
వేలాసమీపం స్ఫుటఫేనరాజి
ర్నవై రుదన్వా నివ చన్ద్రపాదైః ॥ 73

హరగౌరీవివాహః

శ్లో॥ తయా ప్రవృద్ధాననచన్ద్రకాన్త్యా
ప్రఫుల్లచక్షుఃకుముదః కుమార్యా ।
ప్రసన్నచేతస్సలిల శ్శివో ఽ భూ
త్సంసృజ్యమాన శ్శరదేవ లోకః ॥ 74

శ్లో॥ తయో స్సమాపత్తిషు కాతరాణి
కిఞ్చి ద్వ్యవస్థాపిత సంహృతాని ।
హ్రీయన్త్రణాం తత్క్షణ మన్వభూవ
న్నన్యోన్యలోలాని విలోచనాని ॥ 75

అమోఘమైన ఉపాయము, మహాప్రయోజనములతో కలసివచ్చునట్లు, ఆ శివుడు ఇంద్రుడు మొదలగు దేవతలను, సప్తర్షులను, ప్రమథగణములను, తన వెంటబెట్టుకొని, హిమవంతుని మందిరమునకు వచ్చెను. 71

ఆ హిమవంతుని మందిరమునందు ఈశ్వరుడు సుఖాసీనుడై, శాస్త్రోక్త ప్రకారము సమర్పింపబడిన రత్నసహితమైన అర్ఘ్యజలమును, తేనె, ఆవుపెరుగు కలిపిన మధుపర్కమును, క్రొత్త పట్టుబట్టలను, హిమవంతుడు తెచ్చిన సర్వోపచార ద్రవ్యములను మంత్రపూర్వకముగా స్వీకరించెను. 72

నురుగులవరుసలు స్పష్టముగా కనబడు సముద్రుడు, అప్పుడే ఉదయించుచున్న చంద్రకిరణములచేత చెలియలికట్టవద్దకు చేర్పబడినట్లు, కొత్త పట్టుబట్టలను కట్టుకొనిన ఆ శివుడు, వినయవిధేయతలుకలిగి, అంతఃపురవ్యవహారముల యం దారితేరిన పెద్దలచే, పెండ్లికుమార్తెయగు పార్వతిదగ్గరకు తీసికొని పోబడెను. 73

## హరగౌరీవివాహము

లోకము శరచ్చంద్రకాంతితో కూడినట్లు, ప్రవృద్ధమైన ఆననచంద్రకాంతిగల ఆ పెండ్లికూతురితో కూడిన పెండ్లికొడుకగు శివుడు, వికసించిన శరత్కాలపు కలువవంటి కన్నులు కలవాడును, శరత్కాలమున ప్రసన్నమయిన (తేటతేరిన స్వచ్ఛమైన నీటివంటి మనస్సుకలవాడును అయ్యెను. (పార్వతి శరత్కాలపు వెన్నెల కాగా: శివునికన్నులు కలువలవలె బాగుగా వికసించినవియును, శరత్తునందలి నీటివలె ఆతని మనస్సు కోపాదులనుండి తేటబడినదియును అయ్యెనని భావము.) 74

ఆ వధూవరులయొక్క చూపులు అనుకొనకుండ కలియుటవలన పిటీకితనమును పొందినవై, కొంచెముసేపు నిశ్చలములైనవి. తరువాత వెనుకకు మరల్పబడినవి. ఒకొరినొకరు చూచుటయం దాసక్తి కలిగియున్నవి. కాని సిగ్గువలన వెంటనే ముందుకు ప్రసరింపక సంకుచితములైనవి. 75

శ్లో॥ తస్యాః కరం శైలగురూపనీతం
జగ్రాహ తామ్రాఙ్గులి మష్టమూర్తిః ।
ఉమా తనౌ గూఢతనోః స్మరస్య
తచ్ఛఙ్కినః పూర్వమివ ప్రరోహమ్ ॥ 76

శ్లో॥ రోమోద్గమః ప్రాదురభూ దుమాయాం
స్విన్నాఙ్గులిః పుఙ్గవకేతు రాసీత్ ।
వృత్తి స్తయోః పాణిసమాగేన
సమం విభక్తేవ మనోభవస్య ॥ 77

శ్లో॥ ప్రయుక్త పాణిగ్రహణం య దన్య
ద్వధూవరం పుష్యతి కాన్తిమగ్ర్యామ్ ।
సాన్నిధ్యయోగా దనయో స్తదానీం
కిం కథ్యతే శ్రీ రుభయస్య తస్య? ॥ 78

ఈశ్వరునివలన భయపడిన, అందువలననే తన శరీరమును పార్వతియొక్క శరీరమునందు రహస్యముగా దాచుకొనిన, మన్మథశరీరముయొక్క ప్రథమాంకురమువలెనున్నదియును, శైలగురువు చేత 1. పర్వతరాజగు హిమవంతుని చేత 2. హిమవంతుని పురోహితునిచేత అందింపబడిన, ఎఱ్ఱని వేళ్ళుగలదియును అగు ఆ ఉమయొక్క పాణిని అష్టమూర్తియగు శివుడు గ్రహించెను. **76**

వధువగు ఉమాదేవికి ఒడలు పులకరించినది. వరుడగు వృషధ్వజుని చేతివేలికి చెమట పట్టినది. వారిరువురు పాణిగ్రహణము చేయుటవలన ఆ వధూవరులు ఇరువురకు సాత్వికవికారములు సమముగా కలిగెనో యన్నట్లుండెను. "నమ కన్యా తు ప్రథమసంగమే స్విన్న కరచరణాభవతి, పుమాంస్తు రోమాంచితో భవతి" ఇతి వాత్స్యాయనః. విపరీత మత్రోక్త మితిచేత్ నైష దోషః. ఏభి స్తయో ర్భావం పరీక్షేత ఇతి వాక్యశేషః" వధూవరుల మనోభావ వివరణమే కాని, సాత్విక భావములలో వీరి కిదే కలుగవలెనను నిశ్చిత నియమము లేదని ఈ వాక్యమునకు భావము.) **77**

సాధారణులైన ఇతర వధూవరులకే పాణిగ్రహణము జరిగినచో అది, వారికొక ప్రసిద్ధమైన శోభను తెచ్చిపెట్టును అన్నచో, ఈ ఉమాశంకరులు నేడు పాణిగ్రహణమును చేసికొన్నప్పుడు, వారిరువురును ఒక్కచోటనే దగ్గరగా ఉన్నప్పుడు, కళ్యాణశోభ సంపూర్ణముగా ఉండదా? (ఉండి తీరునని భావము) "వివాహసమయే గౌరీశివౌ వధూవరా వనుప్రవేశతామ్" ఇత్యాగమః. వివాహ కాలమునందు గౌరీశివులు వధూవరులలోనికి ప్రవేశించుదురు. అను ఆగమ వాక్యప్రకారము వధూవరుల కొక కళ్యాణశోభ వచ్చుట పరిపాటి. ఆ గౌరీ శివులే నేడు వధూవరులైనచో వారియం దా శోభ పుష్కలముగా ఉండునని భావము.) **78**

శ్లో॥ ప్రదక్షిణప్రక్రమణా త్కృశానో
రుదర్చిష స్తన్మిథునం చకాశే ।
మేరో రూపాన్తే ష్వివ వర్తమాన
మన్యోన్యసంసక్త మహ స్త్రియామమ్ ॥ 79

శ్లో॥ తౌ దమ్పతీ త్రిః పరిణీయ వహ్ని
మన్యోన్యసంస్పర్శనిమీలితాక్షౌ ।
స కారయామాస వధూం పురోధా
స్తస్మిన్ సమిద్ధార్చిషి లాజమోక్షమ్ ॥ 80

## వివాహే లాజహోమవర్ణనమ్

శ్లో॥ సా లాజధూమాఞ్జలి మిష్టగన్ధం
గురూపదేశా ద్వదనం నినాయ ।
కపోలసంస్పర్శిశిఖ స్స తస్యా
ముహూర్త కర్ణోత్పలతాం ప్రపేదే ॥ 81

శ్లో॥ తదీష దార్ద్రారుణగణ్డలేఖ
ముచ్ఛ్వాసి కాలాఞ్జనరాగ మక్ష్ణోః ।
వధూముఖం క్లాన్తయవావతంస
మాచార ధూమగ్రహణా ద్బభూవ ॥ 82

శ్లో॥ వధూం ద్విజః ప్రాహ తవైష
వత్సే! వహ్ని ర్వివాహప్రతి కర్మసాక్షీ ।
శివేన భర్త్రా సహధర్మచర్యా
కార్యా త్వయా ముక్తవిచారయేతి ॥ 83

మేరుపర్వతముచుట్టును ఒకదానివెనుక ఒకటిగా తిరుగు పగలు, రాత్రులవలె, ఆ మిదునము ఒకరివెనుక ఒకరు కలిసి, బాగుగా జ్వాలలతో వెలుగొందు అగ్నికి, ప్రదక్షిణము నాచరించి, ఆ జంట తేజరిల్లెను. 79

ఆ దంపతులచే మూడుసార్లు అగ్నికి ప్రదక్షిణమును చేయించి, ఒకరినొకరు తాకుటవలన కలిగిన స్పర్శసుఖముతో వారు కన్నులు మూసికొని యుండగా, ప్రదీప్తమైన జ్వాలలుకల ఆ అగ్నిహోత్రమునందు పురోహితుడు, పార్వతి చే లాజమోక్షమును (పేలాలతో హోమమును) చేయించెను. 80

## వివాహమునందు లాజహోమవర్ణనము

ఆ వధువు పురోహితుని ఉపదేశమువలన సువాసనగల ఆ ధూమాంజలిని తమ ముఖమువద్దకు చేర్చెను. అప్పుడా ధూమము క్షణకాలముపాటు ఆమెకు కర్ణోత్పల మయ్యెను. (పొగకు వ్యాపించుగుణముఉండుటచే ఎక్కువకాలము కర్ణోత్పలముగా నిలిచిపోలేకపోయినదని భావము.) 81

ఆ వధూముఖమున సంప్రదాయానుసారముగా పొగను ముఖమునకు తాకించుట వలన, ఆ ముఖము 1.కొంచెముగా చెమటతో తడిసి, ఎరుపెక్కిన గండపత్ర లేఖలు కలదియును, 2.కళ్ళకు పెట్టుకొనిన కాటుక కొంచెము పొంగినదియును, 3.చెవిలో పెట్టుకొనిన యవాంకురము వాడినదియును అయ్యెను. 82

ఆ తరువాత పురోహితుడు వధువుతో ఇట్లనెను. "ఓ అమ్మాయీ! ఈ అగ్నియే నీ వివాహమునకు సాక్షి. భర్తయగు శివునితో గూడి ఇతరాలోచనను రానీయకుండ ధర్మాచరణమును చేయుము." 83

శ్లో॥ ఆలోచనాన్తం శ్రవణే వితత్య
పీతం గురో స్త ద్వచనం భవాన్యా ।
నిదాఘకాలోల్బణతాపయేవ
మహేన్ద్రమమ్భః ప్రథమం పృథివ్యా ॥ 84

శ్లో॥ ధ్రువేణ భర్త్రా ధ్రువదర్శనాయ
ప్రయుజ్యమానా ప్రియదర్శనేన ।
సా దృష్ట ఇత్యానన మున్నమయ్య
హ్రీసన్నకణ్ఠీ కథమ ప్యువాచ ॥ 85

శ్లో॥ ఇత్థం విధిజ్ఞేన పురోహితేన
ప్రయుక్తపాణిగ్రహణోపచారౌ ।
ప్రణేమతు స్తౌ పితరౌ ప్రజానాం
పద్మాసనస్థాయ పితామహాయ ॥ 86

శ్లో॥ వధూ ర్విధాత్రా ప్రతినన్ద్యతే
స్మ కళ్యాణి వీరప్రసవా భవేతి ।
వాచస్పతి స్సన్నపి సోఽష్టమూర్తౌ
త్వా శాస్య చిన్తాస్తిమితో బభూవ ॥ 87

## వధూవరయో రార్ద్రాక్షతారోపణమ్

శ్లో॥ క్లృప్తోపచారాం చతురస్రవేదిం
తా వేత్య పశ్చా త్కనకాసనస్థౌ ।
జాయాపతీ లౌకిక మేషణీయ
మార్ద్రాక్షతారోపణ మన్వభూతామ్ ॥ 88

శివుని భార్యయగు పార్వతి కనులవరకుచెవులనునిక్కించి, గురువు చెప్పిన "సహధర్మచారిణి వగుము" అను మాటను ఎండాకాలపు మిక్కిలి వేడికి కాలియున్న భూమి, మొట్టమొదటి వాననీటిని ఆతురతో ఎట్లు త్రాగునో అంతటి శ్రద్ధతో వినెను. 84

ప్రియదర్శనుడను, శాశ్వతుడును అగు భర్తచేత "ధృవనక్షత్రమును చూడుము" అని ప్రేరేపింపబడినదై, సిగ్గుతో ఆ పెండ్లికూతురు తలయెత్తి "చూచితిని" అని అతికష్టముగా సన్ననికంఠముతో సమాధానమును చెప్పెను. 85

ఈ విధముగా వివాహప్రయోగమును తెలిసిన, హిమవంతుని పురోహితుని చేత, వివాహకర్మను పూర్తిచేయించుకొని, జగత్తునకు తల్లియు, తండ్రియునగు ఆ పార్వతీపరమేశ్వరులు, తరువాత పద్మాసనముపై కూర్చొనియున్న పితామహుడగు బ్రహ్మకు నమస్కరించిరి. 86

నమస్కరించిన ఆ వధువును బ్రహ్మదేవుడు ఇట్లాశీర్వదించెను. "కళ్యాణీ" "వీరుడైన పుత్రుని కనుము" ఆ బ్రహ్మ సరస్వతికి భర్త అయినను, అష్టమూర్తియగు శివుని ఆశీర్వదించుటయందు ఉత్సాహము, చూపలేరు. (నిరీహుడైన శివుని ఆశీర్వదించుటకేమియును లేనందున అతని నాశీర్వదించుట కుత్సాహింపలేదని భావము.) 87

## వధూవరులు తలంబ్రాలు పోసుకొనుట

ఆ దంపతులు, పెద్దలకు నమస్కరించిన తరువాత, పుష్పాదులతో చక్కగా అలంకరించిన చతురస్రవేదికపైకి వచ్చి, బంగారుసింహాసనముపై కూర్చుండి, ఆచారమైన, లోకప్రసిద్ధమైన ఆర్ద్రాక్షతారోపణమును (తలంబ్రాలు పోసుకొను వేడుకను) అనుభవించిరి. 88

శ్లో॥ పత్త్రాన్తలగ్నై ర్జలబిన్దుజాలై
రాకృష్టముక్తాఫలజాలశోభమ్ ।
తయో రుప ర్యాయతనాలదణ్డ
మాధత్త లక్ష్మీః కమలాతపత్రమ్ ॥ 89

శ్లో॥ ద్విధా ప్రయుక్తేన చ వాఙ్మయేన
సరస్వతీ తన్మిథునం నునావ ।
సంస్కారపూతేన వరం వరేణ్యం
వధూం సుఖగ్రాహ్య నిబన్ధనేన ॥ 90

శ్లో॥ తౌ సంధిషు వ్యఞ్జిత వృత్తిభేదం
రసాన్తరేషు ప్రతిబద్ధరాగమ్ ।
అపశ్యతా మప్సరసాం ముహూర్తం
ప్రయోగమాద్యం లలితాఙ్గహారమ్ ॥ 91

శ్లో॥ దేవా స్తదన్తే హర మూఢభార్యం
కిరీటబద్ధాఞ్జలయో నిపత్య ।
శాపావసానే ప్రతిపన్నమూర్తే
ర్యయాచిరే పంచశరస్య సేవామ్ ॥ 92

ఆ వధూవరులకు, రేకులకొనలనుండి జాలువారుచున్న జలబిందుసమూహము చేత, ఛత్రపుటంచులకు వ్రేలాడు ముత్యపుసరములశోభను అపహరించు నట్టిదియును, పొడుగాటి పద్మనాళమే దండముగాగలదియును అగు కమలము అను గొడుగును దంపతులపై లక్ష్మీదేవి పట్టుకొనియుండెను. 89

ఆ తరువాత వాగ్దేవియగు సరస్వతి, సంస్కృత, ప్రాకృత భాషల రూపముతో రెండు విధములుగా ఉచ్చరింపబడిన శబ్దజాలముతో ఆ మిధునమును (శివపార్వతులను) స్తుతించెను. అదెట్లనగా శాస్త్రవ్యుత్పత్తిచే ప్రకృతి, ప్రత్యయ విభాగముచే పవిత్రమైన సంస్కృతభాషతో స్తుతి పాత్రుడగు, వరుడైన శివుని స్తుతించెను. సుబోధమైన రచనగల ప్రాకృతభాషాశబ్దజాలముతో వధువైన పార్వతిని స్తుతించెను. 90

ఆ దంపతులు ముఖసంధినుండి నిర్వహణసంధివరకుగల పంచసంధులయందు, కౌశిక్యాది వృత్తులు రసానుగుణముగా ప్రకటింపబడిన వృత్తివిశేషములు కలదియును, శృంగారాది రసభేదములయందు ఏ రసమునం దేరాగము విహితమైనదో తదనుసారముగా వసంత లలితాది రాగములు కలదియును, మధురమైన అంగవిక్షేపణములు కలదియును, ఊర్వశి మొదలగు అప్సరసలచేత ప్రదర్శింపబడినదియును అగు రూపకమును, ముహూర్తకాలముపాటు తిలకించిరి. 91

ఆ నాట్యప్రదర్శనానంతరము భార్యను పరిగ్రహించిన శివుని సమీపించి, అంజలి జోడించి దానిని తమ కిరీటములకు తగిలించుచు ప్రణమిల్లి, పార్వతీవివాహమే అంతముగాగల శాపమునుండి మన్మథునకు శాపవిముక్తిని కలిగించి, అతని సేవను స్వీకరింపవలసినదిగా ఇంద్రాది దేవతలు శివుని ప్రార్థించిరి. 92

శ్లో॥ తస్యానుమేనే భగవాన్ విమన్యు
ర్వ్యాపార మాత్మన్యపి సాయకానామ్ ।
కాలప్రయుక్తా ఖలు కార్యవిద్భి
ర్విజ్ఞాపనా భర్తృషు సిద్ధి మేతి ॥ 93

## సపార్వతీకస్య శివస్య కౌతుకాగారప్రవేశనమ్

శ్లో॥ అథ విబుధగణాం స్తా నిన్దుమౌలి ర్విసృజ్య
క్షితిధరపతికన్యా మాదధానః కరేణ ।
కనక కలశయుక్తం భక్తిశోభాసనాథం
క్షితివిరచితశయ్యం కౌతుకాగార మాగాత్ ॥ 94

శ్లో॥ నవపరిణయలజ్జాభూషణాం తత్రగౌరీం
వదనమపహరన్తీం తత్కృతాక్షేప మీశః ।
అపి శయనసఖీభ్యో దత్తవాచం కథం చి
త్ప్రమథముఖవికారై ర్హాసయామాస గూఢమ్ ॥ 95

ఇతి మహాకవి శ్రీకాళిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"ఉమాపరిణయో"నామ సప్తమః సర్గః

-౦0౦-

కోపము పోయిన, భగవంతుడైన, ఈశ్వరుడు తనమీద కూడ మన్మథుని బాణములు ప్రసరించుటకు అంగీకరించెను. అది ఉచితమే కదా! కార్యజ్ఞులైన, కాలజ్ఞులైనవారు తమ ప్రభువులవద్ద సకాలములో చేసిన విజ్ఞాపన సఫలమగును కదా! 93

## పార్వతితోకూడిన శివుడు శయ్యాగృహములోనికి ప్రవేశించుట

ఆ తరువాత ఇందుమౌళియగు ఆ పరమేశ్వరుడు దేవగణములను వీడ్కొని, పర్వతరాజకుమార్తెను చేతితో పట్టుకొని, బంగారు పూర్ణకలశములు కలదియును, పూలమాలలు మొదలగు అలంకారములశోభతో కూడినదియును, భూమిపై ఏర్పరిచిన పుష్పశయనము కలదియును అగు శయ్యాగృహములోనికి ప్రవేశించెను. (ఈ శ్లోకమునుండి శ్లోకములు మాలినీవృత్తమునందు కూర్పబడినవి.) 94

ఆ శయనగృహములో ఈశ్వరుడు, క్రొత్తగా వివాహమగుటవలన కలిగిన సిగ్గే ఆభరణముగా కలదియును, అందువలననే శివునిచేత తనవద్దకు లాగబడి పైకెత్తబడిన ముఖమును అడ్డముగా త్రిప్పుకొనుచున్నదియును (ఈ చేష్ట లజ్జ అను భావమును సూచించుచున్నది.) నర్మసఖులకు కూడ (తన ప్రక్కపై తనతో పాటు పడుకొనునంతటి దగ్గరి స్నేహితురాండ్రు) అతి కష్టముమీద సమాధానము నిచ్చుచున్నదియును అగు గౌరిని, హాసదైవములును, తమ పారిషదులును అగు భృంగిరిటి మొదలగువారి ముఖవికారములను ప్రదర్శించుటద్వారా గూఢముగా నవ్వించెను. (నవ్వించుట మొదలగు ఉపాయములతో ఆమె సిగ్గును పోగొట్టజూచెను అని భావము) 95

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "ఉమాపరిణయము" అను పేరుగల ఏడవ
సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-

# కుమారసమ్భవమ్

## "ఉమాసురతవర్ణనమ్" నామ

## అష్టమః సర్గః



శివగౌరీకల్యాణము - కన్యాదాత విష్ణువు. శ్లోకము 1.

# కుమారసంభవము

## "ఉమాసురతవర్ణనము" అను
## ఎనిమిదవ సర్గము

గమనిక : కుమారసంభవకావ్యములోని ఏడవ సర్గము వరకే మల్లినాధసూరి వ్యాఖ్యానమును రచించినట్లును, ఎనిమిదవసర్గము నుండి "శ్రీపర్వణీకర" అను ఇంటి పేరుగల శ్రీ లక్ష్మణభట్టాత్మజసతీగర్భసంభవ శ్రీ సీతారామ కవివరుడనగు నేను రచించితి ననియును సీతారామకవి పేర్కొనినాడు. కాని కొన్ని ప్రతులు కాళిదాసుని కుమారసంభవపు అష్టమసర్గమునకు కూడా శ్రీ మల్లినాధుని వ్యాఖ్యాన మున్నదని ప్రకటించినవి శ్రీ మల్లినాదుని పేరు గల మరియొకరెవరో దీనిని రచించియుందురని పలువురి అభిప్రాయము పైగా నిర్ణయసాగర్‌ప్రెస్, బొంబాయి వారు క్రీ శ 1955 లో ప్రచురించిన కుమార సంభవపు 14వ సంస్కరణము(Ed t on)లో గ్రంధాంతమున మల్లినాధసూరి రచించిన అష్టమసర్గమును వ్యాఖ్యానసహితముగా ప్రచురించిరి. సర్గాదియందు లఘుటిప్పణిలో "ఇది అన్య కృతమని నిర్ణయించిరి సర్గాంతమునందలి గద్యలో విచిత్రముగా "ఇతి శ్రీ పర్వణీ కరోపనామక శ్రీ లక్ష్మణభట్టాత్మజసతీగర్భ సంభవ, శ్రీ సీతారామకవి విరచితయా, సంజీవినీ సమాహ్వాయా వ్యాఖ్యాయా సమేతః శ్రీ కాళిదాసకృతౌ, కుమారసంభవవే మహాకవ్యే, "ఉమాసురతవర్ణనం నామాష్టమః సర్గః" అని ముద్రింపబడియున్నది. సప్తమసర్గము తరువాతి వరుస క్రమములో వేసిన అష్టమసర్గాంతమునందు కూడా ఇట్లేయున్నది కనుక శ్రీ సీతారామకవి వ్యాఖ్యానుసారముగనే ఇక అనువాదము సాగును

## నవపరిణీత వరవధ్వోః ప్రణయచేష్టావర్ణనమ్

అవ. : నవపరిణీత గిరిజారహఃకేలి మపి వివర్ణయిషు స్తత్రభవాన్ కాలిదాసోఽష్టమం సర్గ మారభతే.

శ్లో॥ పాణిపీడనవిధే రనన్తరం
శైలరాజదుహితు ర్హరమ్ప్రతి ।
భావసాధ్వసపరిగ్రహా దభూ
త్కామదోహదసుఖం మనోహరమ్ ॥ 1

అవ. : ఇదానీం లక్షణరీత్యా నవోఢత్వమేవ దశభిః ప్రపఞ్చయతి.

శ్లో॥ వ్యాహృతా ప్రతివచో న సన్దధే
గన్తు మైచ్ఛ దవలమ్బితాంశుకా ।
సేవతేస్మ శయనం పరాఙ్ముఖీ
సా తథాఽపి రతయే పినాకినః ॥ 2

## నూతనవధూవరుల ప్రణయచేష్టావర్ణనము

**అవతారిక:** నూతనవధూరువరుల ప్రణయకేళిని వర్ణింపదలచి, కాళిదాస మహాకవి ఈ అష్టమసర్గమును ఆరంభించుచున్నాడు.

వివాహానంతరము, పార్వతికి హరుని గూర్చి భావసాధ్వసపరిగ్రహమువలన (భావ = కామము, సాధ్వస = భయము) చిత్తాకర్షకమైన కామదోహదము జరిగినది. (కామము పెరిగినదని భావము.) దోహదము అనగా అకాలమున వృక్షములయొక్క పూలను అభివృద్ధిపరచుప్రకియ అని అర్థము. (ఇచ్చట పార్వతికి కామదోహదము జరిగినది. వరుడగు హరునకుకూడ పార్వతీ సాన్నిధ్యమువలన ఇట్టి సాధ్వసభావము కలిగినదని యూహింపవలెను. నాయికానాయకులు మొట్టమొదటిసారిగా ఒండొరులకు సమీపమున ఉండి, చూచుకొనినపుడు ఒక లౌకికమైన, అనిర్వాచ్యమైన సుఖము ఆవిర్భవించును. ఆ సుఖప్రాప్తియే మదనోద్దీపక మగునని రససిద్ధాంతవేత్త లందురు. కొత్తగా వివాహము చేసుకొనిన, వధువైన, గౌరిని చూడగనే ప్రత్యక్తసాధ్వససుఖ మావిర్భవించినది. దీనినే రసమునకు అనుభావము అందురు. (ఈ సర్గములోని శ్లోకములు "రథోద్ధతా" వృత్తమునందు కూర్పబడినవి.) 1

**అవతారిక:** ఇప్పుడు రససిద్ధాంతలక్షణముననుసరించి, పార్వతియొక్క క్రొత్త పెళ్ళికూతురిలక్షణములనే ఇక పది శ్లోకములలో నిరూపించుచున్నాడు.

ప్రియుడైన శివునిచే అడుగబడియును ఆ పార్వతి సమాధానము నీయకున్నది, వరుడు ఆమె వస్త్రమును పట్టుకొనగనే అచ్చటినుండి పోగోరినది. భర్తకు పెడమోముపెట్టి శయ్యపై పడుకొనియున్నది. ఇట్లా నూతన వధువగు పార్వతి, తనపట్ల ప్రతికూలముగా ప్రవర్తించుచున్నను శివునకు సంతోషమునే కల్గించినది. (ఆమె తన ముగ్ధత్వమును ప్రదర్శించుటవలన శివుని కానందమును కల్గించినదని భావము.) 2

శ్లో॥ కైతవేన శయితే కుతూహలా
త్పార్వతీ ప్రతిముఖం నిపాతితమ్ ।
చక్షు రున్మిషతి సస్మితం ప్రియే
విద్యుతాహత మివ న్యమీలయత్ ॥ 3

శ్లో। నాభిదేశనిహిత స్సకమ్పయా
శఙ్కరస్య రురుధే కర స్తయా
తద్దుకూల మథ చాభవ త్స్వయం
దూర ముచ్ఛ్వసిత నీవిబన్ధనమ్ ॥ 4

శ్లో॥ ఏవ మాలి! నిగృహీతసాధ్వసం
శఙ్కరో రహసి సేవ్యతా మితి ।
సా సఖీభి రుపదిష్ట మాకులా
నాస్మర త్ప్రముఖవర్తిని ప్రియే ॥ 5

శ్లో॥ అప్య వస్తుని కథాప్రవృత్తయే
ప్రశ్నతత్పర మనఙ్గశాసనమ్ ।
వీక్షితేన పరివీక్ష్య పార్వతీ
మూర్ధకమ్పమయ ముత్తరం దదౌ ॥ 6

శ్లో॥ శూలినః కరతలద్వయేన సా
సన్నిరుధ్య నయనే హృతాంశుకా ।
తస్య పశ్యతి లలాటలోచనే
మోఘయత్నవిధురా రహస్య భూత్ ॥ 7

పార్వతి ఏమి చేయునో పరీక్షింపగోరి, శివుడు దొంగనిద్రపోగా "ఇతడు నిజముగా నిద్రించినాడో? లేదో?" అని పరీక్షింపగోరిన పార్వతి, ప్రియుని ముఖములోనికి పరిశీలనగా చూడసాగినది. ఇంతలో నవ్వుచు శివుడు కనులను తెరువగానే విద్యుత్తుచే కొట్టబడినదానివలె వెంటనే ఆమె కనులను మూసివేసుకొన్నది. 3

ఆమె కోకముడిని విడిపించుటకై శివుడు తన చేతిని ఆమె బొడ్డువద్ద వేయగనే ఆమె భయముతో వణకుచు అతని చేతిని ముందుకు సాగకుండ అడ్డుకొన్నది. ఇంతలో పార్వతికి కలిగిన సాధ్వసభావకారణముగా (కంగారువలన) ఆ కోక ముడి శివుని ప్రయత్నము అక్కరలేకుండగనే తనంత తానుఁగా మిక్కిలి జారిపోయినది. 4

"ఓ పార్వతీ! చెలీ! ఏకాంతమునం దున్నప్పుడు నీ భయమును విడిచిపెట్టి శంకరుని ఈ విధముగా సేవింపుము." అని తన చెలికత్తెలు చేసిన ఉపదేశమును ప్రియుడు ఎదురుగా ఉన్నపుడు కంగారుతో మరచిపోయినది. (గుర్తుంచు కొనలేదు.) 5

మన్మథుని శాసించిన, తన ప్రియుడగు శివుడు 'నన్ను చూచి' సిగ్గుపడుచున్న ఈమెచే ఎట్లయినను మాట్లాడించవలెనను ప్రయత్నములో "ఎంతటి అలభ్యమగు పదార్థమునైనను అడుగు"మని ప్రశ్నింప నుత్సహించుచున్నట్లు పార్వతి ఊహించి, తన చూపును భర్తచూపులతో కలిపి, అంతలో సిగ్గుతో "నాకేమియు అక్కరలేదు" అని అర్థము వచ్చునట్లుగా తలను అడ్డముగా ఆడించి, ఆ తల కదలికనే సమాధానముగా ఇచ్చెను. 6

ఏకాంతమున రతిక్రీడకై శివుడు ఆమె వస్త్రమును లాగివేయగా ఆమె సిగ్గుతో శివుని రెండు కన్నులను తన రెండు చేతులతో కప్పివేసినది. అయినను ఆతడు తన మూడవ కంటితో ఆమెయొక్క శరీరసౌందర్యమును చూచుచుండగా తన ప్రయత్నమంతయు వ్యర్థమైపోయినందుకు మిక్కిలి దుఃఖించెను. (ఇష్టమైనవారి వద్ద మూడవకన్ను అగ్నిని కురిపింపదని భావము.) 7

శ్లో॥ చుమ్బనే ష్వధరదానవర్జితం
స్విన్నహస్త మదయోపగూహనమ్ ।
క్లిష్టమన్మథమపి ప్రియం
ప్రభో ర్దుర్లభప్రతికృతం వధూరతమ్ ॥ 8

శ్లో॥ యన్ముఖగ్రహణ మక్షతాధరం
దాన మవ్రణపదం నఖస్య యత్ ।
య ద్రతం చ సదయం ప్రియస్య
త త్పార్వతీవిషహతే స్మ నేతరత్ ॥ 9

ప్రభాతే పార్వత్యా సఖీజనంప్రతి సవ్రీహకవర్తనమ్

శ్లో॥ రాత్రివృత్త మనయోక్తు ముద్యతం
సా విభాతసమయే సఖీజనమ్ ।
నాకరో దపకుతూహలం హ్రియా
శంసితుం చ హృదయేన తత్పరే ॥ 10

శ్లో॥ దర్పణే చ పరిభోగదర్శినీ
పృష్ఠతః ప్రణయినో నిషేదుషః ।
ప్రేక్ష్య బిమ్బ మనుబిమ్బ మాత్మనః
కాని కాని న చకార లజ్జయా? ॥ 11

శ్లో॥ నీలకణ్ఠపరిభుక్తయౌవనాం
తాం విలోక్య జననీ సమాశ్వసత్ ।
భర్తృవల్లభతయా హి మానసీం
మాతు రస్యతి శుచం వధూజనః ॥ 12

ముద్దుపెట్టుకొనునప్పుడు భర్తచే క్రిందిపెదవిని కొరకబడనిదియును, పయోధరములపై నెమ్మదిగా కదులుచున్న చెమటపట్టిన శివుని చేతులు కలదియును, దయలేకుండ గాఢముగా కౌగిలించుకొనబడినదియును అందువలననే శివునకు సంతోషము కల్గింపక మన్మథుని కష్టపెట్టునట్టిదియును, రసాభాసయగునేమో, అను భయముతో, ప్రతీకారము (ప్రతికృతి) లేనిదియును, అగు ఆ నూతనవదూసురతము ప్రభువగు శివున కిష్టమైనదే అయినది. 8

తన పెదవులను గాయపరుపకుండ భర్త ముద్దుపెట్టుకొనుటను, గాయపరచని గోటిగిచ్చులును గల, తన ప్రియుడగు శివుని రతిక్రీడను మాత్రమే పార్వతి సహించెను కాని తదితరమగు మొరటుసరసమును సహింపలేదు 9

## పార్వతి ప్రభాతకాలమునందు చెలికత్తెలవద్ద సిగ్గుతో ప్రవర్తించుట

సఖీజనులు ఉదయముననే పార్వతి వద్దకు రాగా, ఆమె సిగ్గుచే వారి జిజ్ఞాసా కుతూహలమును శమింపజేయలేదు కాని ఆమె మనస్సు మాత్రము విషయము నవగతపరచుటకు త్వరపడినది (సిగ్గుచేత చెలికత్తెలకు సమాధానము నీయలేదని భావము ) 10

మరియు పార్వతి రాత్రి అంకితములైన పరిభోగచిహ్నములను అద్దమునందు చూచుకొనుచు వెనుకనే ఉన్న ప్రియుడైన హరునియొక్క ముఖప్రతిబింబమును తన ప్రతిబింబపు సమీపమున, ఉండుటను చూచి, సిగ్గుతో ఏఏ శృంగార చేష్టావికారములను చేయలేదు? (అన్ని చేష్టలను చేసినదని భావము ) 11

నీలకంఠునిచే అనుభవింపబడిన యౌవనముగల పార్వతిని, తల్లియగు మేనాదేవి చూచి, ఊరడిల్లెను. (సంతసించెనని భావము) వధూజనము (పెండ్లికుమార్తెలు) తాము తమ భర్తకు ప్రీతిపాత్రలై, తమ తల్లులకు తమ కాపురమును గూర్చి కలుగు మనోవేదనను దూరము చేయుదురు కదా! (కుమార్తెలందు వారివారి భర్తలకు ప్రసాదము కలిగినచో అదే ఆయా తల్లులకు ఆనందకారణ మగునని భావము. ) 12

శ్లో॥ వాసరాణి కతిచి త్కథఇచ్చన
స్థాణునా రత మకారి చానయా ।
జ్ఞాత మన్మథరసా శనై శ్శనై స్సా
మమోచ రతిదుఃఖశీలతామ్ ॥ 13

## శివేశయోః రతిచేష్టావర్ణనమ్

శ్లో॥ సస్వజే ప్రియ మురో నిపీడనం
ప్రార్థితం ముఖ మనేన నాహరత్ ।
మేఖలాప్రణయలోలతాజ్గతం
హస్త మస్య శిథిలం రురోధ సా ॥ 14

శ్లో॥ భావసూచిత మదృష్టవిప్రియం
దార్ఢ్యభాక్ క్షణవియోగకాతరమ్ ।
కైశ్చిదేవ దివసై స్తథా తయోః
ప్రేమరూఢ మితరేతరాశ్రయమ్ ॥ 15

శ్లో॥ తం యథా ౽౽త్మసదృశం వరం
వధూ రన్వరజ్యత వర స్తథైవ తాం ।
సాగరా దనపగాహి జాహ్నవీ
సో౽పి తన్ముఖరసైకవృత్తిభాక్ ॥ 16

శ్లో॥ శిష్యతాం నిధువనోపదేశిన
శ్శంకరస్య రహసి ప్రపన్నయా ।
శిక్షితం యువతి నైపుణం
తయా య త్తదేవ గురుదక్షిణీకృతమ్ ॥ 17

కొన్ని రోజులపాటు పార్వతి శివునితో కలిసియుండియు, సురతమున కనుకూలమైన ఇష్టము కలుగనందున, శివుడు బలవంతముగా సురతసుఖము ననుభవించెను కాని నెమ్మది నెమ్మదిగా రతిసుఖపురుచిమరిగినదై, రతికార్యమునందు కలుగుదుఃఖమును విడిచివైచి, (పరిగణింపక) స్వయముగా అతనికి ఆనందమును కూర్చసాగినది 13

## శివాశివుల రతిచేష్టావర్ణనము

తన స్తనములకు పీడకలుగునంతటి గాఢముగా ఆ పార్వతి వరుని కౌగిలించుకొనెను చుంబించుటకై భర్త ప్రార్థింపగా అతనికి తన ముఖమును ప్రక్కకు త్రిప్పుకొనలేదు కాని శివుడు నెమ్మదిగా తన చేతిని ఆమె ఒడ్డాణము పైకి ప్రసరింప చేయుచుండగా పూర్వమువలె వేగముగా లాగివేయలేదు కాని దానిని సున్నితముగా అడ్డగించినది 14

స్వగతత్త్వాభివ్యంజక చేష్టావిశేషముతో సూచితమైన, ఔదాసీన్యము లేని, దృఢత్వమును పొందిన క్షణకాలము పాటైనను వియోగమును భరింపలేనంత పిరికితనముకల, సఖులకు కూడ తెలియని, ఆ శివపార్వతుల యొక్క ప్రేమ, కొద్ది దినములలోనే పరస్పరనిష్ఠమైనది, (ఒకరి ప్రేమ, మరియొకరి ప్రేమతో పెనవేసుకొని వారిరువురిని ఆశ్రయించుకొనియున్నది.) 15

సముద్రునితో కలిసిన గంగ, అతనిని విడిచి ఎట్లుండదో, అట్లే ఆ సముద్రుడు కూడ ఆ గంగయొక్క ముఖరసమును ఆస్వాదించుటే పనిగా పెట్టుకొనెను వధువైన పార్వతి ఆత్మసదృశుడైన ఆ వరుని అనుసరించి రంజింపచేసినట్లే ఆ వరుడు కూడ పార్వతిని రంజింపజేసెను. 16

శిష్యురాలై ప్రపన్నురాలైన ఆ పార్వతి, రహస్యముగా ముల్లోకములయందలి విలాసినీమణులలో ఉన్న రతికౌశలము నంతటిని సురతవిషయము నుపదేశించు శివునినుండి నేర్చుకొనినది ఆ సురతనైపుణ్యమునే ఆమె తన గురువగు శివునకు గురుదక్షిణగా సమర్పించినది 17

శ్లో॥ దష్టముక్త మధరోష్ఠ మమ్బికా
వేదనావిధుతపాణిపల్లవా ।
శీతలేన నిరవాపయత్క్షణం
మౌలిచన్ద్రశకలేన శూలినః ॥ 18

అవ. : ప్రియానురాగవ్యఞ్జకచేష్టా మాహ.

శ్లో॥ చుమ్బనా దలకచూర్ణదూషితం
శఙ్కరోఽపి నయనం లలాటజమ్ ।
ఉచ్ఛ్వస త్కమలగన్ధయే దదౌ
పార్వతీవదనగన్ధవాహినే ॥ 19

శ్లో॥ ఏవ మిన్ద్రియసుఖస్య వర్త్తన
స్సేవనా దనుగృహీతమన్మథః ।
శైలరాజభవనే సహోమయా
మాసమాత్ర మవస ద్వృషధ్వజః ॥ 20

## హిమాలయాజ్ఞా మాదాయ పర్వతే విహారః

శ్లో॥ సోఽనుమాన్య హిమవన్త మాత్మభూ
రాత్మజావిరహదుఃఖఖేదితమ్ ।
తత్ర తత్ర విజహార సమ్పత
న్నప్రమేయగతినా కకుద్మతా ॥ 21

అధరమును చుంబించు విషయమునందు క్రింది పెదవిని శివుడు కొరికి వదలగా అంబిక బాధతో చిగురాకువంటి చేతులను విదుల్చుచు ఆ బాధను శివుని తలపైనుండు చల్లని చంద్రకళాస్పర్శద్వారా తొలగించుకొని సుఖించినది 18

అవతారిక: ప్రియానురాగ వ్యంజకమైన ఒక చేష్టను చెప్పుచున్నాడు

పార్వతి తన కేశముల నలంకరించుకొనుటకై జల్లుకొనిన చూర్ణవిశేషము, శివు డామె ముఖమును చుంబించినపుడు ఆతని నుదుటి కంటిలో ఆ పొడిపడి, బాధింపసాగినది. ఆమె పద్మినీజాతిస్త్రీ అగుటవలన, వికసించుచున్న తామరపూవువంటి సువాసనగల ఆమె నోటినుండి వచ్చు గాలి కొఱకై ఆ శివుడు తన మూడవ కన్నును సమర్పించెను. (నోటితో ఊదుటవలన కంటిలోని నలక బయటపడి బాధ తగ్గునని శివునియూహ ఇట్టి ఉపచారము లోకసాధారణమైనదే కదా 19

ఈ విధముగా శివుడు ఇంద్రియ సుఖదాయకమగు భోగపరాయణ వృత్తితో కాపురముండుటవలన పూర్వము రతీదేవికి ఇచ్చిన మాట ప్రకారము మన్మధునకు ఆతని శరీరము నిచ్చి యనుగ్రహించి, ఆ హిమవద్భవనమునందు పార్వతితో కూడి వృషభధ్వజుడు ఒక నెలకాలము సుఖముల ననుభవించుచు నివసించెను. 20

## హిమవంతుని ఆజ్ఞను పొంది, పర్వతముపై విహరించుట.

తన కుమార్తె అత్తవారింటికి వెళ్ళుచున్నదని దుఃఖించుచున్న ఆ హిమవంతుడను మామగారినుండి అనుజ్ఞను స్వీకరించి, స్వయంభువు అయిన ఆ శివుడు నిరాఘాటమైన నడకగల, తన వాహనమైన నంది నెక్కి ఆ పర్వత ప్రాంతముల యందు విహరించెను. 21

శ్లో॥ మేరు మేత్య మరుదాశువాహనః
పార్వతీస్తనపురస్కృతాన్ కృతీ ।
హేమపల్లవవిభఙ్గసంస్తరా
మన్వభూ త్సురతమర్దనక్షమాన్ ॥ 22

శ్లో॥ పద్మనాభవలయాఙ్కితాశ్మసు
ప్రాప్తవ త్స్వమృతవిప్రుషో నవాః ।
మన్దరస్య కటకేషు చావస
త్పార్వతీవదనపద్మషట్పదః ॥ 23

శ్లో॥ రావణధ్వనితభీతయా తయా
కణ్ఠసక్తదృఢబాహుబన్ధనః ।
ఏకపిఙ్గళగిరౌ జగద్గురు
ర్నిర్వివేశ విశదా శ్శశిప్రభాః ॥ 24

శ్లో॥ తస్య జాతు మలయస్థలీరతే
ర్ధూతచన్దనలతః ప్రియాక్లమమ్ ।
ఆచచామ సలవఙ్గకేసర
శ్చాటుకార ఇవ దక్షిణానిల ః ॥ 25

వాయువేగముతో సంచరించు వృషభమే వాహనముగా గల, కుశలుడైన శివుడు సుమేరుపర్వతప్రాంతమునకు వచ్చి, పార్వతీదేవియొక్క స్తనములచే గౌరవింపబడినదియును, సురతక్రీడయందలి మర్దనముల పీడనమున కోర్చుకొనజాలినదియును బంగరుచిగురాకుల ముక్కలతో పరచబడినదియును అగు పల్లవశయనముపై పరుండి (రాత్రులయందు) సురతసుఖము ననుభవించెను. (వల్లవ భంగములు సుకుమారములైనను అవి బంగారుపల్లవములుకనుక సురతపీడనము నోర్చుకొనగలిగినవని భావము )22

పార్వతీదేవి ముఖము అను పద్మమునకు తుమ్మెదయైన, అందలి మకరందమును త్రావగోరి దానిచుట్టునే పరిభ్రమించుచు, ఆ హరుడు, పద్మనాభుడగు శ్రీ మహావిష్ణువుయొక్క చరణములచే గుర్తులు వేయబడినవియును, సముద్రమధనకార్యమునందు ఈ కొండ కవ్వ మగుట వలన, కొత్త అమృత బిందువులను పొందినవియును, అగు శిలలు కల ఆ మందరపర్వతపు పీఠభాగమునందు నివసించెను 23

(ఉత్పత్తి, స్థితి లయములను, మూడు కర్మలకు గుణభేదములచేత వానికి కారకుడగుట వలన) జగత్తులకన్నింటికి నియంతయగు శివుడు, రావణు డను ప్రసిద్ధరాక్షసు డొనర్చిన సింహనాదముచేత భయపడినపార్వతి, గట్టిగా తన బాహువులతో అతనిమెడను బంధింపగా (ఆలింగనము చేసికొనగా) సంతసించి, స్వచ్ఛమైన శరచ్చంద్రుని వెన్నెలను కుబేరుని కొండయగు కైలాసగిరియందు సుఖముగా అనుభవించెను. 24

ఒకసారి ఆ శివుడు మలయపర్వతప్రాంతములయందు సురతక్రీడను జరుపుచుండగా, గాలికి కుదుపబడిన చందనవృక్షపుకొమ్మలు గలదియును, లవంగలతల పుప్పొడికాడల సుగంధముతో కూడినదియును అగు మలయానిలము, చాటుకారునివలె (తీయనిమాటలను చెప్పువానివలె) పార్వతియొక్క రతిక్లేశమును హరించివేసెను. 25

శ్లో॥ హేమతామరసతాడితప్రియా
తత్కరామ్బువినిమీలితేక్షణా ।
సా వ్యగాహత తరఙ్గిణీ ముమా
మీనపఙ్క్తిపునరుక్తమేఖలా ॥ 26

శ్లో॥ తాం పులోమతనయాలకోచితైః
పారిజాతకుసుమైః ప్రసాధయన్ ।
నన్దనే చిర మయుగ్మలోచన
స్సస్పృహం సురవధూభిరీక్షితః ॥ 27

## గన్ధమాదనప్రాన్తవిహారః

శ్లో॥ ఇ త్యభౌమ మనుభూయ శఙ్కరః
పార్థివం చ దయితాసఖ స్సుఖమ్ ।
లోహితాయతి కదాచి దాతపే
గన్ధమాదనగిరిం వ్యగాహత ॥ 28

శ్లో॥ తత్ర కాఞ్చనశిలాతలాశ్రయో
నేత్రగమ్య మవలోక్య భాస్కరమ్ ।
దక్షిణేతర భుజవ్యపాశ్రయాం
వ్యాజహార సహధర్మచారిణీమ్ ॥ 29

శ్లో॥ పద్మకాన్తి మరుణ త్రిభాగయో
స్సంక్రమయ్య తవ నేత్రయో రివ ।
సంక్షయే జగదివ ప్రజేశ్వరః
స్సంహర త్యహ రసా వహర్పతిః ॥ 30

పరిహాసము కొరకై ఆ పార్వతి నదిగట్టున పుట్టిన, ఎఱ్ఱని మెట్టతామరపూవుతో శివుని కొట్టెను అతడు తన తామరపూవులవంటి సుందరములైన, చేతులతో నదిలోని నీటిని ఎత్తి ఆమె కనులపైకి చల్లెను ఆనీటి జల్లుతో ఆమె కనులు మూసికొనిపోయినవి తర్వాత పార్వతి జలక్రీడకై ఆనదిలోనికి దిగగానే అందలి చేపలు ఆమెకు రెండవ మేఖలను (మొలనూలిని) కల్పించినవి. 26

ఇంద్రుని పూదోటయగు నందనవనమునందు, ఇంద్రుని భార్యయగు శచీదేవి యొక్క కేశముల యం దలంకరించుకొనదగిన పారిజాతాది కల్పవృక్షముల యొక్క పూలతో త్రిలోచనుడైన ఆ శివుడు, పార్వతి నలంకరించుచు అట్లే దేవతాస్త్రీలచేత సస్పృహముగా చూడబడుచున్నవాడై, చిరకాలము నివసించెను. 27

## గంధమాదనప్రాంతమున విహరించుట

శంకరుడు ఈ విదముగా దివ్యములైన, భౌతికములైన, సుఖముల నన్నిటిని, ప్రియురాలితో కూడినవాడై అనుభవించి, సూర్యుడు ఎర్రబారిన, ఒకానొక సమయమునందు (సాయంసమయమునందు అని భావింపవచ్చును.) గంధమాదన పర్వతప్రాంతమునందలి ఉద్యానవనములోనికి క్రీడార్థము ప్రవేశించెను. 28

ఆ గంధమాదనవనమునందు ఆ శివుడు, సూర్యుడు (అస్తమించుచుండుట వలన అల్పతేజోవంతుడగుటచే) మామూలు కళ్ళతో చూడబడదగినయట్లుండగా చూచి బంగారు శిలపై కూర్చున్నవాడై, తన కెడమ వైపున ఉన్న సహధర్మచారిణియగు పార్వతిని చూచి, ఇట్లు పలికెను 29

ఓ ప్రియురాలా! బ్రహ్మదేవుడు ప్రళయకాలమునందు జగత్తును ఉపసంహరించునట్లు ఈ సూర్యుడు మూడు భాగములు ఎర్రగాగల నీ నేత్రపద్మములయొక్క ఎర్రదనమును పద్మమునకు సంక్రమింపజేసి, సంధ్యాసమయమునందు ఈ పగటిని ఉపసంహరించుచున్నాడు. (ఈ శ్లోకమునుండి కాళిదాసు ఈ సర్గమునందు ప్రకృతివర్ణనము నారంభించు

శ్లో॥ శీకరవ్యతికరం మరీచిభి
ర్దూరయ త్యవవనతే వివస్వతి ।
ఇన్ద్రచాపపరివేషశూన్యతాం
నిర్ఝరా స్తవ పితు ర్వ్రజన్త్యమీ ॥ 31

శ్లో ॥ దష్టతామరస కేసరస్రజోః
క్రన్దతో ర్విపరివృత్త కణ్ఠయోః ।
నిఘ్నయో స్సరసి చక్రవాకయో
రల్ప మన్తర మనల్పతాం గతమ్ ॥ 32

శ్లో॥ స్థాన మాహ్నిక మపాస్య దన్తిన
స్సల్లకీవిటపభఙ్గ వాసితమ్ ।
అవిభాతచరణాయ గృహ్ణతే
వారి వారిరుహబద్ధషట్పదమ్ ॥ 33

శ్లో॥ పశ్య పశ్చిమదిగన్తలమ్బినా
నిర్మితం మితకథే వివస్వతా ।
దీర్ఘయా ప్రతిమయా సరోమ్భసాం
తాపనీయమివ సేతుబన్ధనమ్ ॥ 34

చున్నాడు ఈ వర్ణనము సంస్కృత సాహిత్యమునం దద్వితీయమైనది ఈ వర్ణనము కాళిదాసుని కల్పనా చాతుర్యమునకును, వైవిధ్యమునకును, భావసౌందర్యమునకును గీటురాయి 30

ఓ ప్రియురాలా! సూర్యు దస్తమింపగనే (క్రుంకుచుండగా) అతని కిరణములతో, సెలయేటి నీటితుంపరలకు సంబంధము దూరము అగుచుండెను అందువలన ఎదుటనున్న, ఈ నీ తండ్రియగు హిమవంతునినుండి జాలువారుచున్న సెలయేళ్లకు ఇంద్రచాపములచేత చుట్టబడియుండు అవకాశము లేకపోవు చున్నది 31

ప్రియా! పద్మకేసరములమాలలను కొరుకుచున్నవియును, మెడలను ఒకదానికొకటి పెడమొగముచేసిపెట్టినవియును, పరస్పరాధీనములైనవియును, దుఃఖముతో అరుచుచున్నవియును, చెరువులో ఎదురెదురుగా ఉన్నవియు నగు, చక్రవాకమిదునముయొక్క అల్పమైన విరహవ్యధ కాలము గడుచుచున్నకొలది (రాత్రియగుచున్నకొలది) అనల్పము కాసాగినది. (పెరుగ జొచ్చినది అని భావము ) 32

ఓ ప్రియురాలా సల్లకీ(అందుగు) చెట్టు క్రింద, చెట్టుకొమ్ములయొక్క ఖండములతో వాసనగల, పగటిపూట నివసించు స్థానమును, విడిచిపెట్టి, ఉదయమునుండి చేయవలసిన సాంధ్యకృత్యమును (ఆచమనమును) చేయుటకై తుమ్మెదలు బంధింపబడిన పద్మములుకల జలమున్న ప్రాంతమునందలి నీటిని ఏనుగులు గ్రహించుచున్నవి. 33

ఓ మితభాషిణీ! ఇటు చూడుము అస్తమయ సమయమునందు పడమటి కొండనుండి క్రిందికి దిగుచున్నట్లు, సూర్యుడు తన దీర్ఘతరమైన ప్రతిబింబమును సరిగా చెరువునందలి నీటిపై పడునట్లుగా చేయగా, పొడుగైన సన్నని ఆ ప్రతిబింబము చెఱువునీటిలో సూర్యుడు తాపనీయ=1. సూర్యునకు సంబంధించిన, 2 బంగరువంతెనను నిర్మించినాడో అన్నట్లున్నది (ఈ సర్గమునందలి రసవత్తరములైన కల్పనలలో ఇది యొకటి యని భావుకు లందురు.) 34

శ్లో॥ ఉత్తరన్తి వినికీర్య పల్వలం
గాఢపఙ్కమతివాహితాతపాః ।
దంష్ట్రిణో వనవరాహయూథపా
దష్టభఙ్గురబిసాఙ్కురా ఇవ ॥ 35

శ్లో॥ ఏష వృక్షశిఖరే కృతాస్పదో
జాతరూపరసగౌరమణ్డలమ్ ।
క్షీయమాణ మహ రత్యయాతపం
పీవరోరు! పిబతీవ బర్హిణః ॥ 36

శ్లో॥ పూర్వభాగతిమిరప్రవృత్తిభి
ర్వ్యక్తపఙ్క మివ జాత మేకతః ।
ఖం హృతాతపజలం వివస్వతా
భాతి కిఞ్చిదివ శోషవ త్సరః ॥ 37

శ్లో॥ ఆవసద్భి రుటజాఙ్గణం మృగై
ర్మూలసేకసరసైశ్చవృక్షకైః ।
ఆశ్రమాః ప్రవిశ దగ్ర్యధేనవో
బిభ్రతి శ్రియ ముదీరితాగ్నయః ॥ 38

శ్లో॥ బద్ధకోశ మపి తిష్ఠతి క్షణం
సావశేషవివరం కుశేశయమ్ ।
షట్పదాయ వసతిం గ్రహీష్యతే
ప్రీతిపూర్వ మివ దాతు మన్తరమ్ ॥ 39

పార్వతీ! తాము దిగుటవలన లోతైన బురదగల చిన్న నీటిపడియలను, చిమ్మి, చిమ్మివైచుచు, ఎండవలనకలిగిన తాపమును ఉపశమింపజేసికొని, ప్రబలములైన, తెల్లనై వంకర తిరిగిన, కోరలుగల, మహా వనవరాహయూథపతులు, భంగమగునట్టి శీలముగల (మృదువైన) తామరతూండ్లను తిని, వచ్చుచున్నవో అన్నట్లు, చెరువునుండి పైకి వచ్చుచున్నవి. 35

లావైన తొడలుకలదానా! చెట్టుపై ఎదురుగానున్న ఈ నెమలి, బంగరు నీరువలె పసుపుపచ్చనిపింఛముకలదై, పగటి చివరిభాగమగు సంధ్యాసమయము నందలి పచ్చని ఎండను (తగ్గుచున్న సూర్యకాంతిని) త్రాగుచున్నదో అన్నట్లున్నది. 36

సూర్యుడు తన ప్రతాపముచేత చెఱువులోని నీటినంతటిని ఆవిరియగునట్లు చేయగా, అందడుగున ఉండిన నల్లని బురద పైకి కనబడునట్లు, నల్లని చీకటి కనబడుచుండగా, బురద కనబడుచున్న, నీరులేని చెరువువలె ప్రస్తుతము ఆకాశము, తూర్పుదిక్కున కనబడుచున్నది. 37

1. పర్ణశాలయొక్క ప్రాంగణములోనికి ప్రవేశించుచున్న (నివసించుచున్న) మృగములతోను, 2. మొదళ్ళయందు నీరుపోయుటచేత తడిసినమొదళ్ళుకల బాలవృక్షములతోను, 3. (సాయంకాల మగుటవలన) మేతమేసి ఆశ్రమములోనికి తిరిగి ప్రవేశించుచున్న శ్రేష్ఠములైన గోవులతోను, సాయంకాలపు హోమముల కొరకై బాగుగా ప్రజ్వలింప చేయబడిన గార్హపత్యాది అగ్నిహోత్రములుకల, ఋషులయొక్క నివాసస్థలములగు ఆశ్రమము లన్నియును శోభిల్లుచున్నవి. 38

(సాయంకాలమగుట వలన) పద్మము ముకుళించుకుపోవుచున్నను, అందు నివసింపగోరు తుమ్మెదకు ఇష్టపూర్వకముగానే నివాసస్థలమును ఇచ్చుట కిష్టపడుచున్నదేమో అన్నట్లు క్షణకాలము తన కోశవివరమును (మొగ్గ రంధ్రమును) మూయక, మిగిల్చియుండెను (సాయంకాలమగుచున్నను పద్మము పూర్తిగా ముకుళించుకొని పోకుండుటకు కారణము ఇందు వివరింపబడినది కథకును ఈ వర్ణనముకును సంబంధము లేకున్నను, వర్ణనసౌందర్య మిందున్నది. 39

శ్లో॥ దూర మగ్రపరిమేయరశ్మినా
వారుణీది గరుణేన భానునా ।
భాతి కేసరవతేవ మణ్డితా
బన్ధుజీవతిలకేన కన్యకా ॥ 40

శ్లో॥ సామభి స్సహచరా స్సహస్రశ
స్స్యన్దనాశ్వహృదయఙ్గమస్వనైః ।
భాను మగ్నిపరికీర్ణతేజసం
సంస్తువన్తి కిరణోష్మపాయినః ॥ 41

శ్లో॥ సోఽయ మానతశిరోధరై ర్హయైః
కర్ణచామరవిఘట్టితేక్షణైః ।
సన్నిధాయ దివసం మహోదధా
వస్తమేతి యుగభుగ్నకేసరైః ॥ 42

శ్లో॥ ఖం ప్రసుప్త మివ సంస్థితే రవౌ
తేజసో మహత ఈదృశీ గతిః ।
తత్ప్రకాశయతి యావ దుత్థితం
మీలనాయ ఖలు తావత శ్చ్యుతమ్ ॥ 43

ఓ ప్రియురాలా! ఈ ఎదురుగా కనబడుచున్న సూర్యుడు సాయంకాల మగుట వలన, తన కిరణముల సంఖ్య తగ్గి, లెక్కింపబడదగినన్ని కిరణములను దూరముగా ప్రసరింపజేయుచు, ఎర్రబడి, పశ్చిమ దిశయం దస్తమించుచుండగా, ఎర్రని కిరణములను ప్రసరింపజేయు ఆ సూర్యబింబము విరిసిన కేసరములుగల, మంకెనపూవు అను బొట్టును ఆ పశ్చిమదిగంగన పెట్టుకొనిన దేమో అన్నట్లున్నది 40

సూర్యకిరణములయందలి వేడిని మాత్రమే త్రాగి, జీవించువారును, వేలకొలది మంది కలిసిఉండువారును, సూర్యునికి సహచరులైనవారును అగు వాలఖిల్యాది ఋషీశ్వరులు సాయంకాలమగుటవలన, తన తేజస్సును అగ్నియందుంచిన సూర్యుని రధాశ్వముల కర్ణముల కింపైన (మనోహరమైన) స్వరముతో (స్వనముతో) అతనిని సామవేదమంత్రములచే స్తోత్రమును చేయసాగిరి. 41

పగటిని సముద్రమునందుంచి, మెడనువంచుటవలననే కర్ణచామరములచేత మూసుకొనిపోయిన కన్నులుకలవియును, మెడపై నుండు కాడిచేత నలుగగొట్టబడిన జూలుకలవియును, అగు అశ్వములను వాహనముగా చేసికొని ఆ సూర్యుడు అస్తాచలమునకు పయనించుచున్నాడు. 42

సూర్యుడు అస్తమింపగానే, ఆకాశము నిద్రపోయినదో అన్నట్లయినది మహా తేజస్సునకు కూడ ఇట్టి గతి పట్టినది ఆ తేజస్సు, ఉదయించిఉన్నంతసేపు లోకములకు వెలుగునిచ్చుటకు ఉపయోగపడును అదే అస్తమించినపుడు లోకములను సంకోచింపజేయుటకు, (చీకటి పడుటకు) ఉపయోగపడును. (ఎచ్చట వెలుగుండునో ఆ ప్రదేశము దీప్తిమంతముగా ఉండును. ఎచ్చటినుండి ఆ వెలుగు అస్తమించునో ఆ ప్రదేశము వెలుగొందదు అని భావము ) 43

## పార్వతీమ్ప్రతి శివేన సన్ధ్యానురాగవర్ణనమ్

శ్లో॥ సన్ధ్యయా ప్యనుగతం రవే ర్వపు
ర్వన్ద్య మస్తశిఖరే సమర్పితమ్ ।
యేన పూర్వ ముదయే పురస్కృతా
నానుయాస్యతి కథం త మాపది ॥ 44

శ్లో॥ రక్తపీతకపిశాః పయోముచాం
కోటయః కుటిలకేశి! భా న్త్యమూః ।
ద్రక్ష్యసి త్వ మితి సన్ధ్యయానయా
వర్తికాభి రివ సాధువర్తితాః ॥ 45

శ్లో॥ సింహకేసరసటాసు భూభృతాం
పల్లవప్రసవిషు ద్రుమేషు చ ।
పశ్య ధాతుశిఖరేషు భానునా
సంవిభక్త మివ సాన్ధ్య మాతపమ్ ॥ 46

శ్లో॥ అద్రిరాజతనయే! తపస్వినః
పావనామ్బురచితాఞ్జలిక్రియాః ।
బ్రహ్మగూఢ మభిసన్ధ్య మాదృతా
శ్శుద్ధయే విధివిదో గృణన్త్యమీ ॥ 47

## తనకుగల సంధ్యానురాగమునుగూర్చి శివుడు పార్వతికి వర్ణించి చెప్పుట

సంధ్యాదేవి కూడ, సూర్యు డస్తమింపగనే ఆ సూర్యుని శరీరము ననుసరించి వెళ్ళెను ఉదయకాలమునందు సూర్యుడు ఏ సంధ్యను తనకు ముందుంచుకొని ఆమెను గౌరవించెనో, ఇప్పుడా సూర్యుని ఉనికికే ఆపద వచ్చెను కనుక అతనిని, ఆమె అనుసరింపక ఎట్లుండగలదు? (పతివ్రత కనుక భర్తకు ఆపద వచ్చినపుడు తప్పక అతనిని అనుసరించి తీరునని భావము ) 44

ఓ అరాళకుంతలా! (వంకరలు తిరిగిన జుట్టుకలదానా!) మన ఎదుటనున్న ఈ ఎఱ్ఱని, పసుపుపచ్చని కపిశాది (పసుపుమీరిన ఎరుపు, వివిధ వర్ణములు కల) మేఘముల అంచులు, వానిని నీవు చూతువేమో అను కారణముగా సంధ్యాదేవి, కుంచెతో చక్కగా రంగులతో (ఆకాశమును) అలంకరించినదో యన్నట్లు ప్రకాశించుచున్నవి. 45

పార్వతీ! పర్వతప్రాంతములయందు విహరించు సింహముయొక్క పుష్పకేసరములవంటి జూలుమీదను చక్కగా చిగురించుచున్న చెట్లమీదను, అట్లే గైరికాది ధాతువులతోకూడిన పర్వతశిఖరములమీదను సంధ్యా సమయపు ఎఱ్ఱని ఎండ సూర్యునిచే సమముగా విభజింపబడి, పంచబడినదో అన్నట్లున్నది. చూడుము (సూర్యాస్తమయవర్ణన మిం దున్నది.) 46

ఓ హిమగిరిసుతా! శాస్త్రవిధినితెలిసిన తపస్వులగు ఈ బ్రాహ్మణులు, సంధ్యా వందనమును, జపమును పూర్తిచేసికొని, పవిత్రమైన జలముతో అర్ఘ్య ప్రదానమునుగావించి, ఆత్మశుద్ధి కొరకై, మిక్కిలి గౌరవముతో రహస్యమైన గాయత్రీమంత్రమును సంధ్యాసమయమునందు భక్తితో ఆత్మశుద్ధికై జపించుచున్నారు.

47

శ్లో॥ త న్ముహూర్త మనుమన్తు మర్హసి
ప్రస్తుతాయ నియమాయ మా మపి ।
త్వా వినోదనిపుణ స్సఖీజనో
వల్గువాదిని! వినోదయిష్యతి ॥ 48

శ్లో॥ నిర్విభుజ్య దశనచ్ఛదం తతో
వాచి భర్తు రవధీరణాపరా ।
శైలరాజతనయా సమీపగా
మాలలాప విజయా మహేతుకమ్ ॥ 49

శ్లో॥ ఈశ్వరోఽపి దివసాత్యయోచితం
మన్త్రపూర్వ మనుతస్థితవాన్ విధిమ్ ।
పార్వతీ మవచనా మసూయయా
ప్రత్యుపేత్య పున రాహ సస్మితమ్ ॥ 50

శ్లో॥ ముఞ్చ కోప మనిమిత్తకోపనే!
సన్ధ్యయా ప్రణమితోఽస్మి నాన్యయా ।
కిం న వేత్సి? సహధర్మచారిణం
చక్రవాకసమవృత్తి మాత్మనః ॥ 51

ఓ. మధురభాషిణీ. గడుచుచున్న (అరంభమైన) ఈ సంధ్యాసమయవిధిని నిర్వర్తించుటకై, నన్ను కూడ క్షణకాల మనుమతింపుము. ఈలోగా వినోదింపచేయుటలో ఆరితేరిన నీ సఖీజనులు, నిన్ను వినోదింపజేతురు 48

ఆ తరువాత గిరిరాజసుతయగు పార్వతి పెదవిని వంకరగా తిప్పి భర్తయగు శివుని మాటను తిరస్కరించుటయందాసక్తురాలై, (వినినను విననట్లు నటించుచు) తనకు దగ్గర నున్న చెలికత్తెయగు విజయతో కారణము లేకుండగనే (అనవసరముగా) ఇట్లు మాట్లాడసాగెను 49

"ఈశ్వరుడు కూడ సాయం సంధ్యా సమయమునందు చేయతగిన సంధ్యావిధిని మంత్రపూర్వకముగా అనుష్ఠించి, "నన్ను విడిచి వెళ్ళినా'దను అసూయా భావమును ప్రదర్శించుచున్న పార్వతి వద్దకు వచ్చి, శివుడు నవ్వుచు ఇట్లనెను 50

అకారణముగాకోపించుదానా! కోపమును మానుము. సంధ్యావందన విధిలో నాకు సంధ్యాదేవి ప్రణమిల్లినది. అంతేకాని మరెవరును నాకు ప్రణమిల్ల లేదు. (నేను సంధ్యావశుడను మాత్రమే అయితిని కాని ఏ ఇతరులకును వశుడను కాలేదు అని భావము ) నీ సహధర్మచారినగు నేను (సంధ్యావందనమును చేసికొనుటకు వెళ్ళునపుడు) చక్రవాకపక్షితో సమానమైన ప్రవృత్తి కలవాడనని నీకు తెలియదా? (ఈ కొద్దిపాటికాలపు విరహమువలన నీ కెట్లు ఒళ్ళు చెమట పట్టినదో నాకును అట్లే చెమట పట్టినది క్షణకాలము కూడ భార్యాభర్తలలో ఒకరినొకరు విడువకుండుటయే చక్రవాకవృత్తి ) 51

శ్లో॥ నిర్మితేషు పితృషు స్వయంభువా
యా తను స్సుతను! పూర్వ ముజ్ఝితా ।
సేయ మస్త ముదయం చ సేవ్యతే
తేన మానిని! మ మాత్ర గౌరవమ్ ॥ 52

శ్లో॥ తా మిమాం తిమిరవృత్తిపీడితాం
శైలరాజతనయే! ఽధునా స్థితామ్ ।
ఏకత స్తట తమాలమాలినీం
పశ్య ధాతురసనిమ్నగామివ ॥ 53

శ్లో॥ సాంధ్య మస్తమితశేష మాతపం
రక్తలేఖ మపరా బిభర్తి దిక్ ।
సామ్పరాయవసుధా సశోణితం
మణ్డలాగ్ర మివ తిర్య గుజ్ఝితమ్ ॥ 54

శ్లో॥ యామినీ దివససన్ధిసమ్భవే
తేజసి వ్యవహితే సుమేరుణా ।
ఏత దన్ధతమసం నిరఙ్కుశం
దిక్షు దీర్ఘనయనే! విజృమ్భతే ॥ 55

ఓ అందమైన శరీరము కలదానా! బ్రహ్మదేవుడు పూర్వము అగ్నిష్వాత్తాదులగు పితృదేవతలను సృష్టించిన తరువాత, తన శరీరమును విడిచివైచెను ఆ శరీరమే సంధ్యాదేవి అయినది (అందువలననే ఆ శరీరమునకు "బ్రాహ్మీ" అని కూడ పేరున్నది ఈ బ్రాహ్మి, లేక సంధ్యాదేవి బ్రహ్మకు కుమార్తెయని కొందరందురు ఈ విషయము భవిష్యత్ పురాణమునందు విపులముగా వివరింపబడినది (ప్రస్తావింపబడినది ) అందుచేతనే అందరు పవిత్రురాలైన ఈ సంధ్యాదేవిని ఉదయాస్తమయ కాలములయందు ఉపాసించుచుందురు. మానినీ! కనుకనే నాకు సంధ్యాదేవిపై ఆదరభావ మేర్పడినది 52

ప్రస్తుతము తిమిర(చీకటి) వృత్తిచేత పీడింపబడినదియును, భూమిపైకి దిగి తాకుచున్నదో యన్నట్లున్నదియును, అగు ఈ సంధ్యను ఒకగట్టున తమాలమాలగల (చీకటిచెట్లవరుసగల) ధాతురసముల నదివలెనున్న దానిని చూడుము (తూర్పువైపున పెరిగిన చీకటి తమాలమాలవలెను పడమటివైపున ఉన్న ఎర్రదనము ధాతురసపునదివలెను ఉన్నదని భావము.) 53

సూర్యు డస్తమించుటచేత కొంచెముగా మిగిలిన సంధ్యాకాలపు రాగరేఖ(ఎర్రని గీత), యుద్ధభూమియందు అడ్డముగా పడవేసిన నెత్తురుతో కూడిన కత్తి అంచువలె, కనబడుచుండగా పడమటిదిక్కు ఎర్రని ఎండను ధరించియున్నది 54

ఓ పెద్దకనులుకలదానా గడచిపోయిన పగటికిని, రాబోవుచున్న రాత్రికిని, మధ్యనున్న ఈ సంధ్యాకాలపు వెలుగు సుమేరుపర్వతముచేత కప్పబడినదై, ఎదురుగా ఉన్న, అడ్డు అపు లేని, గాఢాంధకారము దిక్కులయం దంతట విజృంభించుచున్నది (ఆ అంధకారమునందు సంధ్యాకాలముకూడ మరుగున పడిపోయినది ) 55

శ్లో॥ నోర్ధ్వ మీక్షణగతి ర్న చా ప్యధో
నాభితో న పురతో న పృష్ఠతః ।
లోక ఏష తిమిరౌఘవేష్టితో
గర్భవాస ఇవ వర్తతే నిశి ॥ 56

శ్లో॥ శుద్ధ మావిల మవస్థితం చలం వక్ర
మార్జవగుణాన్వితం చ యత్ ।
సర్వమేవ తమసా సమీకృతం
ధిఙ్మహత్వ మసతాం హృతాన్తరమ్ ॥ 57

శ్లో॥ నూన మున్నమతి యజ్వనాంపతిః
శార్వరస్య తమసో నిషిద్ధయే ।
పుణ్డరీకముఖి! పూర్వదిఙ్ముఖం
కైతకై రివ రజోభి రాహతమ్ ॥ 58

## చన్ద్రోదయవర్ణనమ్

శ్లో॥ మన్దరాన్తరితమూర్తినా నిశా
లక్ష్యతే శశభృతా సతారకా ।
త్వం మయా ప్రియసఖీ సమాగతా
శ్రోష్యతేవ వచనాని పృష్ఠతః ॥ 59

రాత్రియందు గాఢమైన చీకటిప్రవాహముచే చుట్టుముట్టబడిన ఈ లోకము, మాతృగర్భమందున్నదో అన్నట్లున్నడి పై భాగమును కాని, క్రింది భాగమును కాని కుడి ఎడమ మొదలగు అన్నివైపులనుగాని ముందుకుగాని, వెనుకకుగాని గర్భస్థుడైన ప్రాణి చూడలేదు కదా. అట్లే ఈ లోకమున చీకటి కమ్మియుండుట వలనను ఏదిక్కునందును ఏమియును కనబడకున్నదని ఉత్ప్రేక్ష ఈ శ్లోకమునందు చెప్పబడినది 56

నిర్మలమైన, మలినమైన, చలమైన, అచలమైన, వంకరయైన, తిన్ననైన, వస్తుగుణములన్నియును చీకటిచే సమముగా, భేదరహితములుగా చేయబడినవి ఈ చీకటి ప్రభావమువలన లోకములో నెచ్చటను, ఎట్టి భేదమును కనబడుటలేదు. వస్తువుల మధ్యనున్న ఉచ్చనీచాది భేదములను తొలగించి, అర్హతానర్హతను గమనింపక, అందరిని సమానముగాచేయు ఈ చీకటియొక్క మహత్వము నిజముగా నిందింపదగియున్నది. 57

ఓ పద్మముఖీ! నిజముగా ఈ యాగకర్తలనాయకుడైన చంద్రుడు, రాత్రి భాగమునందు వ్యాపించిన, చీకటిని, మరలించుటకు ఉదయించుచున్నాడు. అందువలననే మొగలిపూలపరాగముతో కప్పబడియున్నట్లున్న ఈ తూర్పుదిక్కుయొక్క ముఖమును చూడుము. 58

## చంద్రోదయవర్ణనము

పార్వతికి వెనుకదాగియుండి, ఆమె తన చెలికత్తెలతో మాట్లాడుచున్న మాటలను వినుచున్న శివునకు రాత్రిపూట మందరపర్వతమునకువెనుక తన బింబమును మరుగుపరచిన చంద్రునితో పోలిక చెప్పబడినది. పార్వతి రాత్రితోను, చెలికత్తెలు నక్షత్రములతోను, శివుడు చంద్రునితోను ఇచ్చట పోల్చబడినారు. (అప్పుడే చంద్రోదయ మగుచున్నదని భావము.) 59

శ్లో॥ రుద్ధనిర్గమన మాదినక్షయా
త్పూర్వదృష్ట తనుచన్ద్రికాస్మితమ్
ఏత దుద్గిరతి రాత్రి నోదితా
దిగ్రహస్య మివ చన్ద్రమణ్డలమ్ ॥ 60

శ్లో॥ పశ్యపక్వఫలినీఫలత్విషా
బిమ్బలాఞ్ఛిత వియత్సరోమ్భసా ।
విప్రకృష్ట వివరం హిమాంశునా
చక్రవాకమిధునం విడమ్బ్యతే ॥ 61

శ్లో॥ శక్య మోషధిపతే ర్నవోదయా
కర్ణపూరరచనాకృతే తవ ।
అప్రగల్భయవసూచికోమలా
శ్ఛేత్తు మగ్రనఖసంపుటైః కరాః ॥ 62

పగటిపూట అంతయు కనబడని ఈ చంద్రమండలము ఇప్పుడు తూర్పుదిక్కున సాకారమై ఉదయించుచున్నది. అది వెన్నెలను వ్యాపింపజేయుచు రాత్రియను నాయికయొక్క ప్రేరణమువలన, ఆ తూర్పుదిక్కు అను సవతియొక్క చిఱునవ్వు రూపమునసుండు దిగ్రహస్యమును ఆ చంద్రబింబము వెడలగ్రక్కుచున్నదో (వెలికితీసి ప్రకటించుచున్నాడో) అన్నట్లున్నది.

**60**

ఈ చంద్రుడు, ఇప్పుడు పక్వఫలినీఫలపు (1.నాగేటిచాలుకూర, 2. తతీగొట్టికూర) తీగవలె ఎఱ్ఱగా కనబడుచున్నాడు ఆతని ప్రతిబింబము చెఱువులోని నీటియందుకూడ ప్రతిబింబించుచున్నది అందువలన ఆకాశము నందలి చంద్రబింబమును జలములో ప్రతిబింబించిన చంద్రబింబమును, చక్రవాకి (ఆడు చక్రవాకము) చక్రవాక పక్షులజంట రాత్రియయినకారణముగా విరహమువలన ఒండొంటికి దూరమైనట్లు చంద్రబింబమును, చంద్ర ప్రతిబింబమును ఒకదానికొకటి దూరముగా కనబడుచున్నవి. (చెఱువులో ప్రతిబింబించిన చంద్రుని ఫలినీఫలమను భ్రాంతితో తినగోరుచు దానివైపునకు నడుచుచున్న చక్రవాకమిధునము అచ్చట ఫలినీఫలము లేనందువలన, భ్రాంతినివిడిచి, తినుటను మానివైచినదని భావము ) **61**

ఓ పార్వతీ కొత్తగా మొలకెత్తుచున్న యవాంకురములవలె కోమలములైన, ఓషధినాధుడైన చంద్రుని కిరణములు, నీవు కర్ణావతంసముగా చేసికొనుటకై మిక్కిలి పదునైన నీ గోటి కొనలతో త్రుంపదగియున్నవి (యవాంకురములవలె కోమలములైన చంద్రకిరణములను నీ గోటితో కోసి, కర్ణపూరముగా చేసికొనుటకుత్సహింపుమను శివుని అభిప్రాయము ఇందున్నది.) **62**

శ్లో॥ అఙ్గులీభి రివ కేశసఞ్చయం
సన్నిగృహ్య తిమిరం మరీచిభిః ।
కుట్మలీకృత సరోజలోచనం
చుమ్బతీవ రజనీముఖం శశీ ॥ 63

శ్లో॥ పశ్య పార్వతి! నవేన్దురశ్మిభి
ర్భిన్నసాన్ద్రతిమిరం నభస్తలమ్ ।
లక్ష్యతే ద్విరదభోగదూషితం
సమ్ప్రసాద మివ మానసంసరః ॥ 64

శ్లో॥ రక్తభావ మపహాయ చన్ద్రమా
జాత ఏష పరిశుద్ధమణ్డలః ।
విక్రియా న ఖలు కాలదోషజా
నిర్మలప్రకృతిషు స్థిరోదయా ॥ 65

శ్లో॥ ఉన్నతేషు శశినః ప్రభా స్థితా
నిమ్నసంశ్రయపరం నిశాతమః ।
నూన మాత్మసదృశీ ప్రకల్పితా
వేధసా హి గుణదోషయో ర్గతిః ॥ 66

ముకుళించుకొని పోయిన పద్మములే కన్నులుగా గల, రాత్రి అను స్త్రీ యొక్క ముఖమును, వేళ్ళవంటి కిరణములతో జుట్టువంటి, చీకటిని పట్టుకొని ఒకచోటికి చేర్చి చంద్రుడు ముద్దాడుచున్నాడో అన్నట్లున్నది చుంబన సమయమునందు తన ప్రియుదాలి జుట్టుపట్టుకొని ముద్దాడుటవలన కాముకుడు రసానుభూతిని ఎట్లు పొందునో, అట్లే చంద్రుడు కూడ రసానుభూతి నందుచున్నాడు అను సూచనచే ఇచ్చట సమాసోక్తి అలంకారము చెప్పబడినది **63**

ఓ పార్వతీ కొత్తగా ఉదయించిన చంద్రుని కిరణములచేత చీకటి విడిపోగా, ముందుగా ఏనుగుల స్నానాదులచే మలినమై, తరువాత, కాలక్రమమున, తేటపడిన మానససరోవరమువలె ఆకాశము కనబడుచున్నది, చూడుము **64**

ఈ చంద్రుడు తన బింబమునందలి రక్తభావమును (ఎఱ్ఱగా ఉండుటను) మాని, నిర్మలమైన (తెల్లని) మండలము కలవా దయ్యేను. నిర్మలమైన ప్రకృతి గల వస్తువులయందు కాలదోషమువలన కలిగిన మార్పు స్థిరముగా ఉండజాలదు గదా (అందువలననే ఉదయించుకాలమున ఎర్రగా ఉన్న చంద్రుడు కాలక్రమమున తెల్లనివా దయ్యేనని భావము ) **65**

వెన్నెల ఉన్నతమైన స్థలములయందు కన్పడుచున్నది. అట్లే రాత్రికి సంబంధించిన చీకటి నీచమైన (క్రింద క్రింద) ప్రదేశముల యందున్నది. నిజముగా బ్రహ్మదేవుడు, గుణదోషములయొక్క స్థితిని, వాని వాని స్వభావమును బట్టియే కల్పించినాడు (మంచిదగు వెన్నెలను (వెలుతురు) ఉన్నత ప్రదేశములందును, నీచమగు చీకటిని క్రింది ప్రదేశములయందును, బ్రహ్మ ఉంచినాడని భావము నీచస్వభావుడు నీచుడుగను, ఉన్నతస్వభావుడు ఉన్నతుడుగను ఉండుట సహజ మని భావము ) **66**

శ్లో॥ చన్ద్రపాదజనితప్రవృత్తిభిః
శ్చన్ద్రకాన్త జలబిన్దుభి ర్గిరిః ।
మేఖలాతరుషు నిద్రితా నమూ
న్బోధయ త్యసమయే శిఖణ్డినః ॥ 67

శ్లో। కల్పవృక్షశిఖరేషు సమ్ప్రతి
ప్రస్ఫురద్భి రివ పశ్య సున్దరి
హారయష్టిరచనా మివాంశుభిః
కర్తు మాగతకుతూహల శ్శశీ ॥ 68

శ్లో॥ ఉన్నతావనతభాగవత్తయా
చన్ద్రికా సతిమిరా గిరే రియమ్ ।
భక్తిభి ర్బహువిధాభి రర్పితా
భాతి భూతి రివ మత్తహస్తినః ॥ 69

శ్లో॥ ఏత దుచ్ఛ్వసితపీత మైన్దవం
వోఢు మక్షమ మివ ప్రభారసమ్ ।
ముక్తషట్పదవిరావ మఞ్జసా
భిద్యతే కుముద మానిబన్ధనాత్ ॥ 70

శ్లో॥ పశ్య కల్పతరులమ్బి శుభ్రయా
జ్యోత్స్నయా జనితరూపసంశయమ్ ।
మారుతే చలతి చణ్డికే! బలా
ద్వ్యజ్యతే విపరివృత్త మంశుకమ్ ॥ 71

పర్వతపాదమునందలి చెట్లపై నివసించుచున్న, చంద్రకిరణ స్పర్శచే కరిగి, క్రిందికి జారుచున్న చంద్రకాంతశిలల నీటి బిందువులచే, నెమళ్ళను ఈ కొండ అకాలమునందు మేల్కొలుపుచున్నది (తెల్లవారువేళకు లేవవలసిన నెమళ్ళను చంద్రకాంత శిలాజలబిందువులచేత అకాలమునందు మేల్కొపుచున్నాడని భావము ) 67

ఓ సుందరీ! ప్రస్తుతము చంద్రుడు, తన ప్రకాశించుచున్న కిరణములచేత ముత్యములహారమును ఏర్పాటుచేయుటకు (అలంకరించుటకు) ఉత్సాహపడుచున్నవాడై, కల్పవృక్షముయొక్క శిఖరములమీద నివసించు చున్నాడేమో అనిపించుచున్నది. చూడుము 68

ఈ పర్వతము ఎగుడుదిగుడుగా ఉండుటవలన, దీనిపై నల్లని చీకటిమచ్చలతో కలసియున్న ఈ వెన్నెల, నల్లని మత్తగజేంద్రవుశరీరముపై చిత్రించిన వివిధాలంకార రేఖలవలె మనోహరముగా కన్పడుచున్నది. 69

పొట్ట పగులునట్లుగా చంద్రునియొక్క కాంతిరసమును త్రాగి, దానిని పొట్టలో ఉంచుకొని, ఆ బరువును భరింపజాలనట్లు ఈ కలువపూవు తుమ్మెదలమోతను వెలువరించుచు వెంటనే చిరకాలము బద్ధస్థితిలో ఉండుటవలన ఇప్పుడు ఒక్కమారుగా విచ్చుకొనినది. (మామిడి మొదలగు ఫలరసములను అమితముగా త్రాగి, పొట్ట పగిలినవానివలె వెన్నెలరసమును అమితముగా త్రాగి, ఈ కలువ విచ్చుకొనినదని భావము ) 70

అతికోపస్వభావురాలా! కల్పవృక్షమునుండి వ్రేలాడు పట్టుబట్టపై స్వచ్ఛమైన, ప్రకాశమానమైన వెన్నెల పడుటచేత అది వెన్నెలయా లేక పట్టుబట్టయా అను భ్రమ కల్గినది. కాని గాలికి కదిలి మెలికలు తిరుగుట చేత మాత్రమే అది వస్త్రము అని స్పష్టముగా తెలిసినది 71

శ్లో॥ శక్య మఙ్గులిభి రుత్థితై రధ
శ్శాఖినాం పతితపుష్పపేశలైః ।
పత్రజర్జరశశిప్రభాలవై
రేభి రుత్కచయితుం తవాలకాన్ । 72

శ్లో॥ ఏష చారుముఖి! యోగతారయా
యుజ్యతే తరలబిమ్బయా శశీ ।
సాధ్వసా దుపగతప్రకమ్పయా
కన్య యేవ నవదీక్షయా వరః ॥ 73

శ్లో॥ పాకభిన్నశరకాణ్డగౌరయో
రుల్లసత్ప్రకృతిజ ప్రసాదయోః ।
రోహతీవ తవ గణ్డలేఖయో
శ్చన్ద్రబిమ్బనిహితాక్షి! చన్ద్రికా ॥ 74

శ్లో॥ లోహితార్కమణిభాజనార్పితం
కల్పవృక్షమధు భిభ్రతీ స్వయమ్ ।
త్వా మియం స్థితిమతీ ముపాగతా
గన్ధమాదనవనాధిదేవతా ॥ 75

శ్లో॥ ఆర్ద్రకేసరసుగన్ధి తే ముఖం
మత్తరక్తనయనం స్వభావతః ।
అత్ర లబ్ధవసతి ర్గుణాన్తరం
కిం విలాసిని! మధుః కరిష్యతి ॥ 76

మృదువైన వేళ్ళతో కోయబడిన, పుష్పములవలె కోమలములైన, చెట్ల ఆకుల మధ్యనుండి భూమిపైకి ముక్కలు, ముక్కలుగా పడిన, ఈ వెన్నెల కణముల చేత (నీ చెలికత్తెలు) నీ ముంగురులను పైకెత్తి కట్టుటకు శక్యమగుచున్నది 72

ఓ సుందరవదనా! కొత్తగా పెళ్ళిచేసికొనుటవలన సిగ్గుతో వణికిపోవునట్టి పెండ్లికుమార్తెతో కూడిన వరునివలె, చంచలమైన మండలముకల, తనకు తగిన, తారక అను భార్యతో ఈ చంద్రుడు కలిసియున్నాడు 73

చంద్రబింబముపై దృష్టిని నిలిపినదానా ముదిరి, వికసించిన రెల్లుకాడవలె, తెల్లనివియును, ప్రకాశించుచున్న చంద్రుని ప్రతిబింబము కలవియును అగు నీ చెక్కిళ్ళపైకి ఆ వెన్నెల ఎక్కుచున్నదో అన్నట్లున్నది 74

ఎఱ్ఱని సూర్యకాంతమణులతో నిర్మించిన మణికలశమునందుంచబడిన కల్పవృక్షములయొక్క తేనెను స్వయముగా పట్టుకొని, ఈ గంధమాదన వనాధిదేవత స్థిరురాలవగు నీ వద్దకు వచ్చినది చూడుము. (నీకు పుష్పాసనము నిచ్చుటకై వచ్చినదని భావము ) 75

ఓ విలాసినీ! నీలోనికి ప్రవేశించిన మదము ఇంకను నీలో ఏ క్రొత్త గుణమును తేగలదు? (తేలేదని భావము.) ఎందువలననగా త్రాగకమునుపే నీ ముఖము సహజముగా తడిగానున్న కేసరములుగల పొగడపూవువంటి వాసనను కలిగియున్నది అట్లే నీ కన్నులు మదించుటవలన ఎఱ్ఱబారియున్నవి. ఈ మదము నీపై ఏమి ప్రభావమును చూపగలదు?(మత్తు పదార్థమును స్వీకరించుటవలన కలిగెడు వాసనయును, కండ్లలో ఎఱ్రదనమును త్రాగక

శ్లో॥ మాన్యభక్తి రథవా సఖీజనః
సేవ్యతా మిద మనఙ్గదీపనమ్
ఇత్యుదార మభిధాయ శఙ్కర
స్తా మపాయయత పాన మమ్బికామ్ ॥ 77

శ్లో॥ పార్వతీ తదుపయోగసమ్భవాం
విక్రియా మపి సతాం మనోహరామ్ ।
అప్రతర్క్యవిధియోగనిర్మితా
మామ్రతేవ సహకారతాం యయౌ ॥ 78

శ్లో॥ తత్క్షణం విపరివర్తితహ్రియో
ర్నేష్యతో శ్శయన మిద్ధరాగయోః ।
సా బభూవ వశవర్తినీ ద్వయో
శ్శూలిన స్సువదనా మదస్య చ ॥ 79

శ్లో॥ ఘూర్ణమాననయనం స్ఖలత్పదం
స్వేదబిన్దు మదకారణస్మితమ్
ఆననేన నతు తావ దీశ్వరః
చక్షుషా చిర ముమాముఖం పపౌ ॥ 80

శ్లో॥ తాం విలమ్బి తపనీయమేఖలా
ముద్వహన్ జఘనభారదుర్వహామ్ ।
ధ్యానసమ్భృతవిభూతి రీశ్వరః
ప్రావిశ న్మణిశిలాగృహం రహః ॥ 81

ముందునుండియే నీలో సహజముగా ఉండుటవలన, త్రాగిన తరువాత వచ్చు లక్షణములెవ్వియును నీలో కాననగుటలేదు. అని భావము ) 76

నీపై గౌరవము, భక్తి కల నీ సఖీజనము కూడ కామోద్దీపకమైన ఈ మధువును సేవింతురుగాక. అని ఉదారముగా చెప్పి శంకరుడు అంబిక చేత ఆ మధువును త్రాగించెను 77

పార్వతి మధువును సేవించుటవలన కలిగిన మనోహరమైన, వికారమును పొంది, దుర్జ్ఞేయమైన అనుష్ఠానయోగముచేత మామిడిచెట్టు సుగంధభరితమైన, సహకారవృక్షముగా మారునట్లు, ప్రకాశించినది. (ఆమ్రమే అనుష్ఠాన విశేషమువలన సుగంధభరితమగు సహకారముగా మారునట. పార్వతి కూడ మదు సేవనమువలన గంధవతియును మనోజ్ఞయును అయినదని భావము.)78

మదిరను త్రాగినవెంటనే ఆ సముఖియగు పార్వతి, సిగ్గును కోల్పోయిన, అందువలననే అనురాగము పెరిగిన, రతిక్రీడకై ప్రక్కమీదికి తీసికొనివెళుచున్న శివునకును మదగుణమునకును ఇద్దరికిని లొంగిపోయినది 79

తిరుగుచున్న కన్నులుకల, తొట్రుపడుచున్న మాటలుకల చెమటబిందువులు కల, మదముకారణముగా నవ్వుచున్న, పార్వతియొక్క ముఖమును శివుడు చూడవలెనను దాహము తీరునంతవరకు కళ్ళతో త్రాగెనే కాని ముఖముతో త్రాగలేదు. (ముద్దాడలేదని భావము. ఆమెయొక్క మదపారవశ్యమును చూచి, సంతసించె నని భావము 80

ధ్యానము చేత సంపాదించుకొనిన ధ్యానముద్వారా సంపాదించుకొనిన ఉపభోగసాధనసంపత్తికల ఈశ్వరుడు, వ్రేలాడుచున్న బంగరు మొలనూలు కల, జఘనభారముచేత మోయరానంత బరువు కలిగిన, పార్వతిని ఎత్తుకొనుచు ఏకాంతముననున్న మణిశిలాగృహము లోనికి ప్రవేశించెను 81

శ్లో॥ తత్ర హంసధవలోత్తరచ్ఛదం
జాహ్నవీపులినచారుదర్శనమ్ ।
అధ్యశేత శయనం ప్రియాసఖః
శారదాభ్ర మివ రోహిణీపతిః ॥ 82

శ్లో॥ క్లిష్టకేశ మవలుప్తచన్దనం
వ్యత్యయార్పిత నఖం సమత్సరమ్ ।
తస్య తచ్ఛిదురమేఖలాగుణం
పార్వతీరత మభూ న్న తృప్తయే ॥ 83

శ్లో॥ కేవలం ప్రియతమాదయాళునా
జ్యోతిషా మవనతాసు పఙ్క్తిషు ।
తేన తత్ప్రతిగృహీత వక్షసా
నేత్రమీలనకుతూహలం కృతమ్ ॥ 84

శ్లో॥ స వ్యబుధ్యత బుధస్తవోచిత
శ్శాతకుమ్భకమలాకరై స్సమమ్ ।
మూర్ఛనా పరిగృహీతకైశికైః
కిన్నరై రుషసి గీతమఙ్గళైః ॥ 85

శ్లో॥ తౌ క్షణం శిథిలితోపగూహనౌ
దమ్పతీ చలితమానసోర్మయః ।
పద్మభేదపిశునాః సిషేవిరే
గన్ధమాదనవనాన్తమారుతాః ॥ 86

ఆ మణిగృహమునందు, హంసవలె తెల్లనైన దుప్పటికల, గంగలోని ఇసుక తిన్నెవలె అందముగా కనిపించు మంచమును, చంద్రుడు తెల్లని శరత్కాల మేఘముపైకెక్కినట్లు, పార్వతీ సహితుడై శివుడు అధిరోహించెను 82

రతిపారవశ్యము కారణముగా ఒండొరుల కేశపాశములను లాగుకొనుటవలన ముడివీడిన కేశపాశములు కలదియును, రాలి, తుడిచి వేయబడిన చందనము కలదియును, అస్థానమునందు ప్రయోగింపబడిన నఖక్షతములు కలదియును పరస్పరజయకాంక్షతో సాగిన ప్రణయకలహముకలదియును, తెగిన మొలత్రాడుకలదియును అగు పార్వతియొక్క రతిక్రీడ, కామోద్రేకము అధికమగుటవలన , ఆ శివునకు తృప్తిని కల్గింపలేకపోయినది. 83

రాత్రి తెల్లవారుచుండగా, నక్షత్రములు క్రిందికి దిగి అస్తమించువేళయందు పార్వతిచేత గాఢముగా కౌగిలించుకొనబడిన శివుడు, ఆమె మీద దయకలవాడై తన కన్నులను మూసుకొనుటయం దుత్సాహవంతు దయ్యెను (నిద్రింపగోరుట పార్వతినింకను శ్రమ పెట్టరాదను దయతోనే కాని, శక్తిహీనుడై మాత్రము కాదని భావము.) 84

పండితులు రచించిన స్తోత్రముల కర్తుడైన శివుడు, ప్రభాతకాలమునందు ఆరోహణావరోహణక్రమముతో కింపురుషులు వీణతీగలను మీటుచు మంగళగానము నాలపించుచుండగా, సువర్ణకమలములుకల చెరువులతో బాటుగా మేల్కొనెను. (తామరపువ్వులు వికసించి చెఱువులు మేల్కొనుటతోబాటు శివుడు కూడ తన పద్మనయనములను విప్పి మేల్కొనెనని భావము ) 85

క్షణకాలము కౌగిలింతను వదులుచేసిన ఆ దంపతులను (పార్వతీ పరమేశ్వరులను) మానససరోవరమునందలి అలలను కదిలించునట్టి, (ఈ విశేషణము చల్లదనమును సూచించును ) పద్మములవికాసమును సూచించునట్టి, (ఈ విశేషణమువలన సౌగంధ్యము సూచింపబడినది ) గంధమాదనవనప్రాంతమునందలి వాయువులు, సేవించినవి. 86

శ్లో॥ ఊరుమూలనఖమార్గరాజిభి
స్తత్క్షణం హృతవిలోచనో హరః
వాససః ప్రశిథిలస్య సంయమం
కుర్వతీం ప్రియతమా మవారయత్ ॥ 87

శ్లో॥ స ప్రజాగరకషాయలోచనం
గాఢదన్తపరితాడితాధరమ్ ।
ఆకులాలక మరంస్త రాగవా న్ప్రేక్ష్య
భిన్నతిలకం ప్రియాముఖమ్ ॥ 88

శ్లో॥ తేన భిన్న విషమోత్తరచ్ఛదం
మధ్యపిణ్డితవిసూత్రమేఖలమ్ ।
నిర్మలేఽపి శయనం నిశాత్యయే
నోజ్ఝితం చరణరాగలాఞ్ఛితమ్ ॥ 89

శ్లో॥ స ప్రియాముఖరసం దివానిశం
హర్షవృద్ధిజననం సిషేవిషుః ।
దర్శనప్రణయినా మదృశ్యతా
మాజగామ విజయా నివేదనాత్ ॥ 90

## శివసమ్భోగాతృప్తివర్ణనమ్

శ్లో॥ సమదివసనిశీథం సఙ్గిన స్తత్ర శమ్భో
శ్శత మగమ దృతూనాం సార్ధ మేకా నిశేవ ।
న తు సురతసుఖేభ్య శ్ఛిన్నతృష్ణో బభూవ
జ్వలన ఇవ సముద్రాన్తర్గత స్తజ్జలౌఘైః ॥ 91



సంభోగమువలన శివునకు తృప్తి కలుగలేదు. శ్లోకము 91.

ఊరుమూలములయందున్న నఖక్షతములను చూచు పారవశ్యమునందున్న శివుడు ప్రభాతకాలమునందు వదులైన తనచీరను పార్వతి సవరించుకొనబోవుచుండగా, ఆమెను నివారించెను 87

రాత్రియంతయు జాగరణముచేయించుటచేత ఎఱ్ఱబారిన కన్నులు కలదియును, గాడముగా శివుడు దంతములతో కొఱకుటవలన నొప్పి కలిగిన క్రింది పెదవి కలదియును, చెదరిన ముంగురులు కలదియును, చెరిగిన బొట్టు కలదియును అగు పార్వతియొక్క ముఖమును చూచి, ఆమెపై అనురాగము గల ఆ శివుడు ఆనందించెను 88

బాగుగా తెల్లవారినను ప్రక్కపైన వేసిన దుప్పటి చెదిరిపోయినను, దారము తెగి పెనవేసుకొని, ఉండచుట్టుకొనిపోయిన మొలనూలు ఒక ప్రక్కన పడినను కాలికి పూసికొనిన లత్తుకద్రవముచేత పక్క ఎఱ్ఱనైనను, ఆ శివుడు (సుఖార్ణవమగ్నుడై నందువలన) శయ్యను విడువకుండెను. 89

రాత్రనక, పగలనక హర్షవృద్ధిని కల్గించునట్టి, ప్రియురాలి అధరపానమును (ముఖరసపానమును) చేయగోరినవాడై, ఆ శివుడు, పార్వతియొక్క చెలికత్తెయగు విజయ శివదర్శనమునకై ద్వారమువద్ద వేచి ఉన్నవారిని గూర్చి తెలిపినను ఎవరికినీ తన దర్శనము నీయలేదు. (సర్వేతరవిషయములను విడిచిపెట్టి, తల్లయుడగుటయే ఈ అదర్శమునకు కారణమైయుండవచ్చును ) 90

## సంభోగమువలన శివునకు తృప్తికలుగలేదని వర్ణించుట

ఆ గంధమాదనపర్వతమునందు పార్వతిపైగల చిత్తసంగముచే రేబవళ్ళ కొలతకు, కొంచెమెక్కువయగు 100 ఋతువుల కాలమును శివుడు గడిపెను. అయినను సురతసుఖమునుండి ఆతనికి తృప్తి కలుగలేదు. సముద్రజలములలో నుండు బడబాగ్ని సముద్రపునీటితో తృప్తిపడనట్లే, శివుడుకూడ

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"ఉమాసురతవర్ణనమ్"నామ అష్టమః సర్గః
-o0o-



హిమవంతుని ఇంట కళ్యాణవేదిక. సర్గ 7 - శ్లో. 43

సురతసుఖమువలన తృప్తిపడలేదు (ఈ శ్లోకము మాలినీవృత్తమునందు కూర్పబడినది ) 91

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను మహాకావ్యమునందు 'ఉమాసురతవర్ణనము" అను పేరుగల ఎనిమిదవ సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము

-o0o-



హరగౌరీ కళ్యాణఫలము - కుమార సంభవము

# కుమారసమ్భవమ్

## "కైలాసగమనో"నామ

## నవమః సర్గః

### కపోతరూపేణాగ్ని ప్రవేశనమ్

శ్లో॥ తథావిధే ౽ నఙ్గరసప్రసఙ్గే
ముఖారవిన్దే మధుపః ప్రియాయాః ।
సమ్భోగవేశ్మ ప్రవిశన్త మన్త
ర్దదర్శ పారావత మేక మీశః ॥ 1

శ్లో॥ సుకాన్తకాన్తామణితానుకారం
కూజన్త మాఘూర్ణితరక్తనేత్రమ్ ।
ప్రస్ఫారితోన్నమ్రవినమ్రకణ్ఠం
ముహు ర్ముహు ర్న్యఞ్చితచారుపుచ్ఛమ్ ॥ 2

శ్లో॥ విశృఙ్ఖలం పక్షతియుగ్మ మీష
ద్దధాన మానన్దగతిం మదేన ।
శుభ్రాంశువర్ణం జటిలాగ్రపాద
మితస్తతో మణ్డలకై శ్చరన్తమ్ ॥ 3

# కుమారసంభవము

## "కైలాసగమనము" అను
## తొమ్మిదవ సర్గము

### కపోతరూపమున అగ్నిదేవుడు ప్రవేశించుట

ప్రియురాలగు పార్వతియొక్క ముఖకమలమునందు తుమ్మెదయైన శివుడు, పూర్వము చెప్పినట్లు శృంగారరసప్రవాహమునందుండగా తన సంభోగ గృహములోనికి ప్రవేశించుచున్న ఒక పావురమును చూచెను. (ఈ సర్గములోని శ్లోకములు ఉపజాతిఛందస్సులో కూర్పబడినవి ) 1

తన కాంతయొక్క మనోహరమయిన మణితమును (రతికూజితమును) అనుసరించుచున్నట్లుగా శబ్దముచేయుచున్న, తిరుగుచున్న, ఎర్రని కళ్ళుకల, బాగుబా చాచి, పైకెత్తి మరల క్రిందికి దించిన మెడకల, మాటిమాటికి తోకను ఆడించుచున్న (పావురమును శివుడు చూచెను.) 2

అడ్డు అపు లేకుండా తిరుగుచున్నదియును, (ఈ విశేషణము దానినింతవరకు ఎవ్వరును బంధింపనందున స్వేచ్ఛావిహారముకలది అని సూచించు చున్నది.) రెండు రెక్కలమొదళ్ళ నల్లార్చుచు తన అనందమును ప్రకటించుచున్నదియును, చంద్రునివలె తెల్లనైనదియును, ఈకలతో కూడిన ముంగాళ్ళుకలదియును, గుండ్రముగా ఇటునటు తిరుగుచున్నదియును అగు (పావురమును శివుడు చూచెను ) 3

శ్లో॥ రతిద్వితీయేన మనోభవేన
హ్రదా త్సుదాయాః ప్రవిగాహ్యమానాత్
తం వీక్ష్య ఫేనస్యచయం నవోత్థ
మివాభ్యనన్దత్ క్షణ మిన్దుమౌలిః ॥ 4

శ్లో॥ తస్యాకృతిం కా మపి వీక్ష్య దివ్యా
మన్తర్భవచ్ఛద్మవిహఙ్గ మగ్నిమ్ ।
విచిన్తయ న్సంవివిదే స దేవో
భ్రూభఙ్గభీమశ్చ రుషా బభూవ ॥ 5

శ్లో॥ స్వరూప మాస్థాయ తతో హుతాశ
స్త్రసన్వలత్కమ్పకృతాఞ్జలిః సన్ ।
ప్రవేపమానో నితరాం స్మరారి
మిదం వచో వ్యక్త మథాభ్యువాచ ॥ 6

శ్లో॥ అసి త్వ మేకో జగతా మధీశః
స్వర్గౌకసాం త్వం విపదో నిహంసి ।
తతః సురేన్ద్రప్రముఖాః ప్రభో! త్వా
ముపాసతే దైత్యవరై ర్విభూతాః ॥ 7

శ్లో॥ త్వయా ప్రియాప్రేమవశంవదేన
శతం వ్యతీయే సురతా దృతూనామ్ ।
రహః స్థితేన త్వదవీక్షణార్తో
దైన్యం పరం ప్రాప సురైః సురేన్ద్రః ॥ 8

తన భార్యయగు రతీదేవితో కూడి మన్మధుడు చిలికిన అమృతసముద్రము నుండి అప్పుడే వెడలిన నురుగుముద్దవలె నున్న ఆ పావురమును శివుడు చూచి క్షణకాలము దాని నభినందించెను 4

సకల ప్రాణులయం దతర్యామిగా ఉండు ఆ శివుడు, లోకోత్తరమయిన ఆ పావురపు అకారమును చూచి, మాయాకపోతరూపమును ధరించిన అగ్నిదేవునిగా దానిని తెలిసికొనెను. ఆ సమయమున వచ్చినందుకు కోపించి, శివుడు కనుబొమలను ముడివేసి భయంకరుడు అయ్యెను 5

ఇంతలో అగ్నిదేవుడు భయపడి, నిజరూపమున (అగ్నిదేవుడుగా) ప్రత్యక్షమై వణకుచు అంజలినిజోడించి, మదనాంతకుడగు శివునితో స్పష్టముగా ఇట్లనెను 6

ఓ ప్రభువా! ఈ జగత్తుల కన్నింటికి నీ ఒక్కడవే అధీశుడవు (నీకంటె జగత్పాలకుడు ఇంకొకడు లేడని అర్థము) అందువలననే ఇంద్రాది దేవతలకు వచ్చిన ఆపదలను తొలగించువాడవు నీవే! కనుక దేవేంద్రుడు మొదలగు ముఖ్యదేవతలు రాక్షసులచే బాధింపబడి, నిన్ను సేవించుచుందురు 7

పార్వతిమీది ప్రేమకారణముగా ఆమెకు వశపడిపోయి నీవు సురత సుఖానుభవమునకై ఏకాంతమునందుండగా వందఋతువులకాలము గడిచిపోయినది అందువల్ల దేవేంద్రుడు నీ దర్శనము లభింపక దేవతలతోకూడి చాల దైన్యము నందియున్నాడు. 8

శ్లో॥ త్వదీయసేవావసర ప్రతీక్షై
రభ్యర్థితః శక్రముఖైః సురై స్త్వామ్ ।
ఉపాగతో ఽ న్వేష్టు మహం విహఙ్గ
రూపేణ విద్వ న్సమయోచితేన ॥ 9

శ్లో॥ ఇతి ప్రభో! చేతసి సమ్ప్రధార్య
తన్నో ఽ పరాధం భగవన్ క్షమస్వ ।
పరాభిభూతా వద కిం క్షమన్తే
కాలాతిపాతం శరణార్థినో ఽ మీ? ॥ 10

## సుతసర్జనే అగ్న్యభ్యర్థనమ్

శ్లో॥ ప్రభో! ప్రసీ దాశు సృ జాత్మపుత్రం
యం ప్రాప్య సేనాన్య మసౌ సురేన్ద్రః ।
స్వర్లోకలక్ష్మీప్రభుతా మవాప్య
జగత్త్రయం పాతి తవ ప్రసాదాత్ ॥ 11

శ్లో॥ స శఙ్కర స్తా మితి జాతవేదో
విజ్ఞాపనా మర్థవతీం నిశమ్య ।
అభూ త్ప్రసన్నః పరితోషయన్తి
గీర్భి ర్గిరీశా రుచిరాభి రీశమ్ ॥ 12

శ్లో॥ ప్రసన్నచేతా మదనాన్తకారః స
తారకారే ర్జయినో భవాయ ।
శక్రస్య సేనాధిపతే ర్జయాయ
వ్యచిన్తయ చ్చేతసి భావి కిఞ్చిత్ ॥ 13

ఓ విద్వాంసుడా! (ఉచితానుచితజ్ఞుడా. అని భావము) నిన్ను సేవించునవసరమునకై ఎదురుచూచునట్టి ఇంద్రుడు మొదలగు దేవతల చేత ప్రార్థింపబడినవానినై, నేను నిన్ను వెదుకుటకై సమయోచితమయిన ఈ పావురమురూపమును దరించి నీ వద్దకు వచ్చితిని 9

ఓ భగవంతుడా! అందువలన నీవు నీ మనస్సులో బాగుగా ఆలోచించుకొని మా అపరాధమును క్షమింపుము ('ఇంద్రప్రేరితుడవై అసమయమునందు నీవు చేసిన అపరాధమును ఎట్లు సహింతును" అందువా! వినుము ) శత్రువుచే పరాభవింపబడిన ఈ ఇంద్రాదులు ఆలస్యమును ఎట్లు ఓర్చుకొనగలరు? నీవే చెప్పుము. (ఆర్తులయినవారు ఆలస్యమును ఓర్చుకొనలేరని భావము.) 10

## కుమారుని సృష్టింపుమని అగ్ని ప్రార్థించుట

ఓ భగవంతుడా! మాకు ప్రసన్నుడవు కమ్ము ఏ నీ కుమారుని సేనాపతిగా పొంది, దేవేంద్రుడు నీ అనుగ్రహమువలన స్వర్గలోకలక్ష్మియొక్క ఆధిపత్యమును పొంది, ముల్లోకములను పరిపాలింపగలడో అట్టి కుమారుని త్వరగా సృష్టింపుము 11

ఆ శంకరుడు ఈ విధమయిన, సార్ధకమయిన (సమయోచితమైన) అగ్నిదేవుని ప్రార్ధనను విని, ప్రసన్నుడయ్యెను. వాక్చాతుర్యము, పటుత్వము కలపురుషుడు ఇష్టములయిన మాటలతో తమ స్వామిని సంతోషపరచును కదా! 12

ప్రసన్నుడయిన ఆ మదనాంతకుడగు శివుడు, జయశీలుడయిన దేవేంద్రుడు అతని శత్రువులను గెలుచుటకొరకై తారకాసురునకు శత్రువై, అతనిని సంహరించు సామర్థ్యముగల కుమారుని సృష్టించుటకై భవిష్యద్విషయమును గూర్చి కొంచె మాలోచించెను. 13

శ్లో॥ యుగాన్తకాలాగ్ని మివా విషహ్యాం
పరిచ్యుతం మన్మథరఙ్గభఙ్గాత్
రతాన్తరేతః స హిరణ్యరేత
స్యదోర్ధ్వరేతా స్తదమోఘ మాధాత్ ॥ 14

శ్లో॥ అథోఽ ష్ణ బాష్పానిలదూషితాన్తం
విశుద్ధ మాదర్శ మివాత్మదేహమ్ ।
బభార భూమ్నా సహసా పురారి
రేతః పరిక్షేపకువర్ణ మగ్నిః ॥ 15

శ్లో॥ త్వం సర్వభక్షో భవ భీమకర్మా
కుష్ఠాభిభూతో ఽనల! ధూమగర్భః ।
ఇత్థం శశాపా ద్రిసుతా హుతాశం
రుష్టా రతానన్దసుఖస్య భఙ్గాత్ ॥ 16

శ్లో॥ దక్షస్య శాపేన శశీ క్షయీవ
ప్లుష్టో హిమేనేవ సరోజకోశః ।
వహ న్విరూపం వపు రుగ్రరేత
శ్చయేన వహ్నిః కిల నిర్జగామ ॥ 17

శ్లో॥ స పావకాలోకరుషా విలక్షాం
స్మరత్రపాస్మేరవినమ్రవక్త్రామ్ ।
వినోదయామాస గిరీన్ద్రపుత్రీం
శృఙ్గారగర్భై ర్మధురై ర్వచోభిః ॥ 18

అనంతరము ప్రళయకాలపు అగ్నివలె భరింపశక్యముగాని, కామక్రీడ భంగమయినందువలన స్ఖలించిన, సపలమయిన, సురతక్రీడాంతపు వీర్యమును శివుడు ఊర్ధ్వరేతస్కుడగుటవలన అగ్నియం దుంచెను 14

ఆ తరువాత నోటినుండి వెలువడిన వెచ్చనిగాలిచేత అద్దములోని మధ్యభాగము వివర్ణమగునట్లు, అగ్ని విశుద్ధమయిన దేహము కలవాడైనను వెంటనే శివునియొక్క రేతస్సు ఎక్కువగా తన మీద పడుటవలన కువర్ణభావమును (కాంతిహీనతను) పొందెను. 15

తన రతానందమునందలి సుఖమును భగ్నము చేసినందుకు కోపించిన పార్వతి 'ఓ అగ్నిదేవా నీవు 1. భక్ష్యాభక్ష్య పదార్థములనన్నింటిని తినువాడవు కమ్ము 2 భయానకమయిన కర్మలను చేయువానివి కమ్ము. 3. కుష్టురోగముతో బాధపడువాడవు కమ్ము 4. పొగ గర్భమునందు కలవానివి కమ్ము" అని శపించెను 16

(అప్పుడు) దక్షుని శాపముచేత క్షయరోగమునందిన చంద్రునివలెను, మంచుచేత శోభావిహీనము అయిన పద్మముకుళము వలెను అగ్నిదేవుడు తన శరీరము శివునియొక్కవీర్యము తనపై పడుటవలన తన రూపమునందలి తేజస్సును కోల్పోయి, (విరూపుడై) సంభోగ గృహమునుండి బయటకు వెడలెను. 17

అగ్నిదేవుడు చూచినాడను కోపముతో వికారమునొందిన శరీర శోభగలదియును, మదనావేశముతో సిగ్గుతో తలదించుకొనిన, నవ్వుచున్న ముఖముగల గిరిరాజకుమారిని(పార్వతిని) శృంగారగర్భితములగుట వలన మధురములయిన మాటలతో శివుడు వినోదపరచెను 18

## శివేన పార్వత్యాః ప్రసాదనమ్

శ్లో॥ హరో వికీర్ణం ఘనఘర్మతోయై
ర్నేత్రాఞ్జనాఙ్కం హృదయప్రియాయాః ।
ద్వితీయకౌపీనచలాఞ్చలేనా
హర న్ముఖేన్దో రకలఙ్కినో ఉ స్యాః ॥ 19

శ్లో॥ మన్దేన స్విన్నాఙ్గులినా కరేణ
కమ్ప్రేణ తస్యా వదనారవిన్దాత్ ।
పరామృశ న్ఘర్మజలం జహార
హరః సహేలం వ్యజనానిలేన ॥ 20

శ్లో॥ రతిశ్లథం తత్కబరీకలాప
మంసావస్తకం విగలత్ప్రసూనమ్ ।
స పారిజాతోద్భవపుష్పమయ్యా
స్రజా బబం ధామృతమూర్తిమౌలిః ॥ 21

శ్లో॥ కపోలపాల్యాం మృగనాభిచిత్ర
పాత్రావలీ మిన్దుముఖః సుముఖ్యాః ।
స్మరస్య సిద్ధస్య జగద్విమోహా
మన్త్రాక్షరశ్రేణి మివోల్లిలేఖ ॥ 22

శ్లో॥ రథస్య కర్ణావభి తన్ముఖస్య
తాటఙ్కచక్రద్వితయం న్యధా త్సః ।
జగజ్జిగీషు ర్విషమేషు రేష ధ్రువం
య మారోహతి పుష్పచాపః ॥ 23

## శివుడు పార్వతినోదార్చి అలంకరించుట

తన హృదయప్రియయఅయిన పార్వతియొక్క మచ్చలేని ముఖ చంద్రునికి పెద్ద చెమటచుక్కలచేత వ్యాప్తమయిన కళ్ళయొక్క కాటుకమచ్చను తన రెండవకౌపీనపు (యోగులు భుజముపైనుండి వేలాడ వేసుకొను వస్త్రము) అంచుతో శివుడు తుడిచివేయుచుండెను (మచ్చలేని ముఖచంద్రునకు కాటుకమచ్చ ఏర్పడుట అనౌచిత్యమని తలచి ఆ కాటుక మచ్చను తుడిచివేయుచాన్నాడని భావము.) 19

నెమ్మదిగా కదులుచున్న ఉదాశీనమయిన వణకుచున్నవేళ్లుగల చేతితో ఆ పార్వతియొక్క వదనారవిందమునుండి జారుచున్న చెమటను లీలగా విసనకర్రనుండివచ్చు గాలితో శివుడు తొలగించెను 20

రతిక్రీడయందు ముడివీడి, భుజములపై వ్రేలాడుచున్న పూలు క్రిందికి జారుచున్న, ఆ పార్వతియొక్క కేశపాశమును, పారిజాతమను పేరుకల కల్పవృక్షమునకు పూసిన పూలమాలతో చంద్రశేఖరుడయిన ఆ శివుడు మరల బంధించెను. 21

సుముఖి అగు పార్వతియొక్క బుగ్గలపై కస్తూరి అను పరిమళద్రవ్యముతో లిఖింపబడిన మకరికాపత్రరచనను, లోకసమ్మోహకమయిన మన్మథ మంత్రమునందలి అక్షరములవరుసఏమో అనునట్లు ఇందుముఖు డయిన శివుడు రచించెను 22

బేసి సంఖ్యగల (అయిదు) బాణములుగల మన్మదుడు పార్వతియొక్క ముఖరూపమయిన రథమునెక్కి, నిజముగా జగజ్జయమునకు బయలుదేరును. (పార్వతియొక్క సమ్మోహనమయిన ముఖము అను రథము నెక్కి మన్మథుడు లోకముల నన్నింటిని గెలుచుచున్నాడని భావము.) 23

శ్లో॥ తస్యాః స కణ్ఠే పిహితస్తనాగ్రాం
న్యధత్త ముక్తాఫలహారవల్లీమ్ ।
యా ప్రాప మేరుద్వితయస్య మూర్ధ్ని
స్థితస్య గఙ్గౌఘయుగస్య లక్ష్మీమ్ ॥ 24

శ్లో॥ నఖవ్రణశ్రేణివరే బబన్ధ
నితమ్బబిమ్బే రశనాకలాపమ్ ।
చలస్య చేతోమృగబన్ధనాయ
మనోభువః పాశ మివ స్మరారిః ॥ 25

శ్లో॥ భాలేక్షణాగ్నౌ స్వయ మఞ్జనం స
భఙ్క్త్వా దృశోః సాధు నివేశ్య తస్యాః ।
నవోత్పలాక్ష్యాః పులకోపగూఢే
కణ్ఠే వినీలేఽఙ్గులి ముజ్జఘర్ష ॥ 26

తన పేటల (హారమునందలి వరుసల) వ్యాప్తిచే స్తనాగ్రములను కప్పిన సన్నని ముత్యములహారమును ఆ శివుడు పార్వతి మెడలో అలంకరించెను. ఆ సన్నని ముత్యముల హారము రెండు మేరుపర్వతములపయినున్న రెండు గంగాప్రవాహములశోభను పొందెను. (స్తనద్వయము అను మేరుపర్వతము నుండి క్రిందికి జాలువారు రెండు గంగాప్రవాహముల వలె ఆ ముత్యముల హారము శోభిల్లినదని భావము. ఇందు అభూతోపమాలంకారము ఉన్నదని వ్యాఖ్యానములో చెప్పబడినది.) **24**

25. మదనాంతకుడగు శివుడు తానే కల్పించిన నఖక్షతములచేత శ్రేష్ఠమయిన, (మనోహరమయిన) ఆమె పిరుదులమీద మొలత్రాటిని అలంకరించెను. (బంధించెను.) అది చలించుచున్న మనస్సు అను లేడిని బంధించుటకు మన్మదుడు ప్రయోగించిన పాశమువలె నుండెను (మన్మధుడు శివుని మనస్సుఅనులేడిని మొలత్రాడు రూపములో ఉన్న వలతో కట్టివేసెను అందుకే శివుడు తన మనస్సును ఆమెపిరుదులవద్దనే కదలకుండ స్వయముగ కట్టుకొనెనని భావము.) **25**

ఆ శివుడు లలాటనేత్రమునందలి అగ్నియందు కాటుకను స్వయముగా పడవేసి, ఆ తరువాత క్రొత్తకలువవంటి కన్నులుకల పార్వతియొక్క కళ్ళకు బాగుగా తన వేలితో కాటుకను అలంకరించి, ఆ తరువాత పులకలతో నిండిన తన నల్లని కంఠముమీద ఆ కాటుక వేలిని రాచుకొనెను (శివుని లలాటలోచనము దీపమువలెనున్నది. కాటుక నలంకరింపదలిచినవా డెవడయినను తన వేలితో ముందుగా కాటుకను దీపముపై పడవేసి, ఆ తరువాత తన భార్యకన్నులకుపట్టించి, వేలికి మిగిలిన కాటుకను వదిలించికొనుటకై ఆ వేలిని ఎక్కడో ఒకచోట వ్రాయునట్లు, శివుడు కూడ తన పులకరించిన కంఠముపై రాసికొనెనని

శ్లో॥ అలక్తకం పాదసరోరుహాగ్రే
సరోరుహాక్ష్యాః కిల సన్నివేశ్య
స్వమౌలిగఙ్గా సలిలేన
హస్తారుణత్వ మక్షాలయ దిన్దుచూడః ॥ 27

శ్లో। భస్మానులిప్తే వపుషి స్వకీయే
సహేల మాదర్శతలం విమృజ్య ।
నేపథ్యలక్ష్మ్యాః పరిభావనార్థ
మదర్శయ న్జీవితవల్లభాం సః ॥ 28

శ్లో॥ ప్రియేణ దత్తే మణిదర్పణే సా
సమ్భోగచిహ్నం స్వ వపు ర్విభావ్య ।
త్రపావతీ తత్ర ఘనానురాగం
రోమాఞ్చ దమ్భేన బహి ర్బభార ॥ 29

శ్లో॥ నేపథ్యలక్ష్మీం దయితోపక్లృప్తాం
సస్మేర మాదర్శతలే విలోక్య ।
అమంస్త సౌభాగ్యవతీషు ధుర్యా
మాత్మాన ముద్భూతవిలక్షభావా ॥ 30

చెప్పుచు స్వభావోక్తి అలంకారమును కాళిదాసు చక్కగా ప్రయోగించి నాడు ) 26

పద్మనయనయగు పార్వతియొక్క పాదకమలమునకు లత్తుకరసమును (పారాణి ద్రవమును) చేతితో పూసి, ఎఱ్ఱబడినచేతులను తన తలపై నుండి ప్రవహించుచున్న గంగాప్రవాహమునందు చంద్రశేఖరుడయిన శివుడు కడుగుకొనెను. 27

భస్మముపూయబడిన తన శరీరముమీద అద్దమును రాసి, (తుడిచి) నిర్మలమొనర్చి పార్వతి ధరించిన అలంకారముయొక్క (ఆభరణముల యొక్క) శోభను అవమానించుటకే ఆ అద్దములో తన జీవితవల్లభయొక్క ప్రతిబింబమును ఆ శివుడు చూపించెను. 28

శివుడు చూపించిన ఆ మణిదర్పణమునందు నఖక్షతములు మొదలగు సంభోగచిహ్నముకల తన శరీరమును చూచుకొని, (ఆమె భావనయే దర్శనముగా పరిణమించినదని భావము.) "వీనిని చూచి ఇతరులు ఏమనుకొందురో" అను భావముతో సిగ్గుపడి, పార్వతి ఆ హరునియందు కలిగిన ప్రేమను పైకి ప్రకటించుటకు పులకరింతను దాల్చెను. (ఆమెకు కలిగిన ఆనందమే పులకరింతగా మారి పైకి కనబడినదని భావన )29

తన ప్రియుడగు శివునిచేత రచింపబడిన విశేషాలంకార శోభను అద్దమునందు చూచుకొని, అతనిపై గల అనురాగమునకు సూచకముగా చిరునవ్వు నవ్వెను ఇంతకు పూర్వము కలిగిన పులకరింత మొదలగు విలక్షణములను విడిచి ఆ పార్వతి ప్రసన్నురాలయ్యెను (తన భర్తయే తనను స్వయముగా అలంకరించు భాగ్యము దుర్లభము. కనుక ఆ భాగ్యమునొందిన ఆమె, సౌభాగ్యవంతురాండ్రయిన స్త్రీలందరిలో తాను శ్రేష్ఠురాలినని తలచెను 30

శ్లో॥ అన్తః ప్రవిశ్యా వసరేఽథ తత్ర
స్నిగ్ధే వయస్యే విజయా జయా చ ।
సుసమ్ప్ర దోపాచరతాం కలానాం
అఙ్కే స్థితాం తాం శశిఖణ్డమౌలేః ॥ 31

## శివప్రసాదనార్థం గన్ధర్వై ర్గాయనమ్

శ్లో॥ వ్యథు ర్బృహి ర్మఙ్గలగాన ముచ్చై
ర్వైతాలికా శ్చిత్రచరిత్రచారు ।
జగు శ్చ గన్ధర్వగణాః సశఙ్ఖ
స్వనం ప్రమోదాయ పినాకపాణేః ॥ 32

శ్లో॥ తతః స్వ సేవావసరే సురాణాం
గణాం స్త దాలోకనతత్పరాణామ్ ।
ద్వారి ప్రవిశ్య ప్రణతోఽథ నన్దీ
నివేదయామాస కృతాఞ్జలి స్సన్ ॥ 33

శ్లో॥ మహేశ్వరో మానసరాజహంసీం
కరే దధాన స్తనయాం హిమాద్రేః ।
సమ్భోగలీలాలయతః సహేలం
హరో బహిస్థా నభినిర్జగామ ॥ 34

శ్లో॥ క్రమా న్మహేన్ద్రప్రముఖాః ప్రణేముః
శిరోనిబద్ధాఞ్జలయో మహేశమ్ ।
ప్రాలేయశైలాధిపతే స్తనూజాం
దేవీం చ లోకత్రయమాతరం తే ॥ 35

తదనంతరము జయ, విజయ అను పేరులుకల పార్వతియొక్క ఇష్టసఖురాండ్రు సంభోగగృహములోనికి ప్రవేశించి, చంద్రశేఖరుని ఒడిలో ఉన్న ఆ పార్వతిని, తమ అలంకరణనైపుణ్యసంపదతో అలంకరించిరి 31

## శివుని ఆనందింపజేయగోరి, గంధర్వులు పాడుట

సంభోగగృహపుముంగిలిలో చిత్రచరిత్రముతో మనోహరముగా మంగళగీతములను వందిమాగధులు బిగ్గరగా ఆలాపించిరి అట్లే గంధర్వులు పాంచజన్యమను శంఖపు శబ్దముతో కలిపి శివునకు శ్రవణ మంగళముగా పాడిరి 32

అంతలో నందీశ్వరుడు, తాను సేవించుటకు తగిన సమయము వచ్చినదని గుర్తించి, వంగి నమస్కరించుచు ఆ సంభోగ గృహపు ద్వార ప్రాంతమునకు వచ్చి చేతులు జోడించి, 'స్వామీ మీ దర్శనమునకై దేవతలందరు ఉత్సాహపడుచున్నా" రని నివేదించెను. 33

తన మనస్సు అను సరోవరమునకు శోభను గూర్చు హంసయగు ఆ పార్వతిని, చేతితో పట్టుకొని, తన సురతగృహమునుండి లీలగా నడుచుచు మహేశ్వరు డను ఆ శివుడు ఆ దేవతల కెదురుగా నడిచి వచ్చెను. 34

మహేంద్రుడు మొదలుగాగల దేవతలందరును తమ తమ తలలపై చేతులను జోడించి, ఆ శివునకు వరుసగా నమస్కరించిరి. అట్లే హిమగిరి నందినియును, ముల్లోకములకు తల్లియును అగు పార్వతికి కూడా వరుసగా నమస్కరించిరి. 35

శ్లో॥ యదాగతం తా న్విబుధా న్విసృజ్య
ప్రసాద్య మానక్రియయా ప్రతస్థే ।
స నన్దినా దత్తభుజో ఽ ధిరుహ్య
వృషం వృషాఙ్కః సహ శైలపుత్ర్యా । 36

శ్లో॥ మనో ఽ తివేగేన కకుద్మతా స
ప్రతిష్ఠమానో గగనాధ్వగో ఽ న్తః ।
వైమానికైః సాఞ్జలిభి ర్వవన్దే
విహారహేలాగతిభి ర్గిరీశః ॥ 37

శ్లో॥ స్వర్వాహినీవారివిహారచారీ
రతాన్తనారీశ్రమశాన్తికారీ ।
తౌ పారిజాతప్రసవప్రసఙ్గో
మరు త్సిషేవే గిరిజాగిరీశౌ ॥ 38

## కైలాసవర్ణనమ్

శ్లో॥ పినాకినా పి స్ఫటికాచలేన్ద్రః
కైలాసనామా కలితామ్బరాంశః ।
ధృతార్ధసోమో ఽ ద్భుతభోగిభోగో
విభూతిధారీ స్వ ఇవ ప్రపేదే ॥ 39



శివపార్వతులు కైలాసమునకు వచ్చుట. శ్లోకము 36

వృషభకేతనుడయిన శివుడు, ఇంద్రాదిదేవతలను, సగౌరవముగా సంతోషపరచి, వీడ్కొలిపి, నందీశ్వరుడు తన చేతి నందింపగా వృషభము నెక్కి, పార్వతితోసహా బయలుదేరెను. **36**

మనోవేగమునకంటె మిక్కిలి వేగముగా పయనించు వృషభము నెక్కి ఆకాశమార్గమున పయనించు ఆ గరీశుడయిన శివుని చూచి, విహారార్థమై విలాసముగా విమానములలో పయనించు దేవతలు అంజలిని ఘటించి ప్రణమిల్లిరి **37**

ఆకాశగంగాజలమునందు విహరించిన, (నీటి తుంపురులచే చల్లనయిన) రతిక్రీడానంతరము కలిగిన శ్రమను తొలగింపజాలిన (మెల్లగా వీచనట్టి) పారిజాతముఅను కల్పవృక్షపు పూలతో సంబంధముకలిగిన (పరిమళభరితమయిన) వాయువు, ఆ గౌరీశంకరులను సేవించెను. **38**

## కైలాసవర్ణనము

పినాకముఅను విల్లును చేబూనిన శివుడు, కైలాసము అను గిరిని చేరుకొనెను ఆయా లక్షణములు కలిగియుండుటవలన ఆ గిరి శివుని వలెనే కనబడుచున్నది శివునకును కైలాసమునకును ఉన్న సంపూర్ణ సామ్యము ఇది. శివుడు తెల్లనివాడు. కైలాసము స్ఫటికముల పర్వతము. కనుక తెల్లనిదే - శివుడు అంబరాంశుడు. (దిగంబరుడు) కైలాసము కూడా అంబరాంశమే = ఆకాశమునంటుకొనుచు అదే హద్దుగా గలది. శివుడు ధృతార్ధసోముడు. = అర్ధచంద్రధారి కైలాసము కూడ చంద్రకళాధరుని ధరించి, కైలాసనిలయుని మోయుచున్నది భోగినీ

శ్లో॥ విలోక్య యత్ర స్ఫటికస్య భిత్తౌ
సిద్ధాఙ్గనాః స్వం ప్రతిబిమ్బమారాత్ ।
భ్రాన్త్యా పరస్యా విముఖీ భవన్తి
ప్రియేషు మానగ్రహిలా నమత్సు ॥ 40

శ్లో॥ సుబిమ్బితస్య స్ఫటికాంశుగుప్తే
శ్చన్ద్రస్య చిహ్నప్రకరః కరోతి ।
గౌర్యార్పితస్యైవ రసేన యత్ర
కస్తూరికాయాః శకలస్య లీలామ్ ॥ 41

శ్లో॥ యదీయ భిత్తౌ ప్రతిబిమ్బితాఙ్గ
మాత్మాన మాలోక్య రుషా కరీన్ద్రాః ।
మత్తాన్యకుమ్భి భ్రమతో ఽ తిభీమ
దన్తాభిఘాతవ్యసనం వహన్తి ॥ 42

= ఆడు పాములకును భోగి, మగపాములకును తన శరీరముపై సంభోగమును అద్భుతముగా కల్పించినవాడు శివుడు. ఇక కైలాసము కూడ భోగి భోగములకు = పాములకు నివాసస్థానము అయినది. శివుడు విభూతిధారి = విభూతిని ధరించువాడు. కైలాసము కూడ విభూతిధారి = సంపదలకు నివాసస్థానమే (అనంతరత్నప్రభవుడు కనుక) ఈ విధముగా తన ప్రతిరూపమో లేక శివుడే రూపద్వయమును ధరించెనో అన్నట్లున్న కైలాసగిరిని పార్వతీ పరమేశ్వరులు చేరుకొనిరని భావము. 39

కైలాసగిరియందలి స్ఫటికశిలలగోడలయందు దగ్గరనుండి కనబడుచున్న ప్రతిబింబములనే చూచుకొని, అవి తమ సవతుల ఆకారములు అను భ్రాంతితో ప్రణయకలహమునందు కోపించిన సిద్ధజాతిస్త్రీలు, భర్తలు తమ నోదార్చుటకై నమస్కరించుచున్నను వారికి పరాఙ్ముఖలే అగుచున్నారు. (కోపమును మానకున్నా రని భావము.) 40

స్ఫటికశిలాపర్వతమగు ఆ కైలాసమునందు బాగుగా ప్రతిబింబించిన, శుద్ధములయిన స్ఫటికశిలాకంతులచే మరుగుపరుపబడిన, చంద్రుని లోని మచ్చలు, గౌరి దేవి, కస్తూరిరసముతోఅర్పించిన ఖండముల (చుక్కల) శోభను ప్రకటించుచున్నవి. 41

ఆ పర్వతపు గోడలయందు (ప్రాంతభాగములయందు) తమ శరీరపు ప్రతిబింబములనే చూచుకొని, మదపుటేనుగులు, అవి అన్యగజములేమో అని భ్రమపడి, కోపముచే తమ భయంకరమయిన దంతములతో ఆ గోడలను ఢీకొని, దంతములు విరిగిన బాధను అనుభవించుచున్నవి. (భ్రమాత్మకమయినజ్ఞానము దుఃఖమును కల్గించునని భావము.) 42

శ్లో॥ నిశాసు యత్ర ప్రతిబిమ్బితాని
తారాకులాని స్ఫటికాలయేషు ।
దృష్ట్వా రతాన్తచ్యుతతారహార
ముక్తాభ్రమం బిభ్రతి సిద్ధవధ్వః ॥ 43

శ్లో॥ నభశ్చరీమణ్డనదర్పణశ్రీః
సుధానిధి ర్మూర్ధని యస్య తిష్ఠన్ ।
అనర్ఘ్యచూడామణితా ముపైతి
శైలాధినాథస్య శివాలయస్య ॥ 44

శ్లో॥ సమీయివాంసో రహసి స్మరార్తా
రిరంసవో యత్ర సురాః ప్రియాభిః ।
ఏకాకినోఽపి ప్రతిబిమ్బభాజో
విభాన్తి భూయోభి రివాన్వితాః స్వైః ॥ 45

## కైలాసే హర, పార్వతీక్రీడావర్ణనమ్

శ్లో॥ దేవోఽపి గౌర్యా సహ చన్ద్రమౌలి
ర్యదృచ్ఛయా స్ఫాటికశైలశృఙ్గే ।
శృఙ్గారచేష్టాభి రనారతాభి
ర్మనోహరాభి ర్వ్యహర చ్చిరాయ ॥ 46

ఆ స్ఫటికాచలమునందలి స్ఫటికగృహములలో ప్రతిబింబించిన నక్షత్ర సమూహమును రాత్రులయందు సిద్ధాంగనలు చూచి, రతిక్రీడాంతము నందు తెగిన ముత్యములహారపు ముత్యములేమో అని భ్రమ పడుచుండిరి. 43

ఆకాశమార్గమునందు సంచరించు స్త్రీల అలంకరణార్థము అద్దపు శోభవంటి సౌందర్యము గల చంద్రుడు కైలాస పర్వతముయొక్క శిఖరముమీదినుండి, (శుభప్రదములయిన ఇళ్ళుగల), పర్వతరాజయిన హిమవంతునికి చూడామణి (తలపై ధరించురత్నము) అగుచున్నాడు. 44

అచ్చట దేవతలు మదనపీడితులై, అందువలననే రతిక్రీడలో పాల్గొనదలచి, ప్రియురాండ్రతో కలిసి ఎవరికి వారు రహస్య ప్రదేశముల యందు ఒక్కొక్క దంపతులే వచ్చినను, ఆ పర్వతపు స్ఫటికశిలలో ప్రతిబింబించుటవలన తామే బహురూపములను ధరించియున్నట్లు భావించుచున్నారు. 45

## కైలాసమున శివపార్వతులు క్రీడించుట

చంద్రశేఖరుడగు దేవుడయిన శివుడుకూడ ఆ స్ఫటికపర్వతశిఖరము మీద పార్వతితో కూడ స్వేచ్ఛగా (యధాకామముగా) మనోహరము లయిన, నిరంతరములైన శృంగారచేష్టలతో చిరకాలము విహరించెను 46

శ్లో॥ దేవస్య తస్య స్మరసూదనస్య
హస్తం సమాలిఙ్గ్య సువిభ్రమశ్రీః ।
సా నన్దినా వేత్రభృతోపదిష్ట
మార్గా పురోగేణ కలం చచాల ॥ 47

శ్లో॥ చలచ్ఛిఖాగ్రో వికటాఙ్గభఙ్గః
సుదన్తురః శుక్ల సుతీక్ష్ణతుణ్డః ।
భృవోపదిష్టః స తు శఙ్కరేణ
తస్యా వినోదాయ ననర్త భృఙ్గీ ॥ 48

శ్లో॥ కణ్ఠస్థలీలోలకపాలమాలా
దంష్ట్రాకరాలానన మభ్యనృత్యత్ ।
ప్రీతేన తేన ప్రభుణా నియుక్తా
కాలీ కలత్రస్య ముదే ప్రియస్య ॥ 49

శ్లో॥ భయఙ్కరౌ తౌ వికటం నదన్తౌ
విలోక్య బాలా భయవిహ్వలాఙ్గీ ।
సరాగముత్సృజ్య మనఙ్గశత్రో ర్గాఢం
ప్రసహ్య స్వయ మాలిలిఙ్గ ॥ 50

శ్లో॥ ఉత్తుఙ్గపీనస్తనపిణ్డపీడం
ససమ్భ్రమం తత్పరిరమ్భ మీశః ।
ప్రపద్య సద్యః పులకోపగూఢః
స్మరేణ రూఢప్రమదో మమాద ॥ 51

శుభమయిన విలాసములును, సౌందర్యమునుగల ఆ పార్వతి మదనాంతకు డయిన శివుని చేతిని ఆలంబనముగా పట్టుకొని, బెత్తమును పట్టుకొని ముందుగా నడుచుచున్న నందీశ్వరునిచే దారి చూపబడుచున్నదై, వయ్యారముగా నడువసాగెను 47

కదులుచున్న శిఖాగ్రముకలవాడై, భయంకరములైన నాట్యభంగిమలు కలవాడై ఎత్తైన పలువరుసకలవాడై తెల్లని, మిక్కిలి తీక్ష్ణమయిన ముఖము కలవాడై, సుప్రసిద్ధుడై, భృంగి (ప్రమథగణవిశిష్టుడు) ఆ పార్వతికి ఆనందమును కలిగించుటకై, శివునిచేత కనుబొమలకదలికచేత మాత్రమే ప్రేరేపింపబడినవాడై, నృత్యము చేసెను. 48

కంఠస్థలమునందు కదులుచున్న పుఱ్ఱెలమాలకలదియును, కోరలతో భయంకరమయిన ముఖము కలదియును అగు కాళికాదేవి, తన ప్రియుని భార్యయగు పార్వతియొక్క ప్రీతి కొరకై ఆ ప్రభువుచేత నియోగింపబడినదై సంతోషముతో నృత్యము చేసెను 49

భయంకరముగ అట్టహాసము చేయుచు (అరుచుచు) అందువలన భయంకరురాలయిన ఆ కాళిని, భృంగిని చూచి, భయముతో విహ్వలమైన శరీరముకల, ఆ బాలయగు పార్వతి భయముచే తనంత తానుగా మదనాంతకుని ఒడిలోనికి చేరి, ప్రేమతో గాఢముగా కౌగిలించుకొనెను. 50

పార్వతి తన ఒడిపై కెక్కగనే, ఎత్తయిన, లావుగా ఉన్న, ఆమెయొక్క స్తనపిండములకు బాధ కలుగునట్లుగా ఉన్న కౌగిలింతను పొంది ప్రేమ వలన వెంటనే పులకరింతగలవాడై ఆ ఈశ్వరుడు మన్మథ ప్రభావముచే మత్తుడయ్యెను. 51

శ్లో॥ ఇతి గిరితనుజావిలాసలీలా
వివిధవిభఙ్గిభి రేష తోషితఃసన్ ।
అమృతకరశిరోమణి ర్గిరీన్ద్రే
కృతవసతి ర్వశిభి ర్గణై ర్ననన్ద ॥ 52

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"కైలాసగమనోనామ" నవమః సర్గః

-०0०-



పావురమురూపములో వచ్చిన అగ్నిదేవుడు
శ్లోకములు 1 నుండి 4 వరకు

చంద్రశేఖరుడయిన శివుడు, కైలాస పర్వతమునందు నివసించుచు పార్వతియొక్క ఇట్టి కామక్రీడయొక్క వివిధ భంగిమలచేత సంతోషపడి, తనకు లోబడియుండు నంది మొదలగు సేవకులతో సహా ఆనందించెను (శివపార్వతుల అలౌకికమయిన క్రీడారసమును దర్శించి, నంది మొదలగు వారు కూడ సంతసించిరని భావము ఈ శ్లోకము పుష్పితాగ్రా వృత్తమునందు కూర్పబడినది.) **52**

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన 'కుమారసంభవ"మను మహాకావ్యమునందు "కైలాసగమనము" అను పేరుగల తొమ్మిదవ సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-



కైలాసస్వరూపుడగు శివుడు - శ్లోకము 39

# కుమారసమ్భవమ్

## "కుమారోత్పత్తి"ర్నామ

## దశమః సర్గః

శ్లో॥ ఆససాద సునాసీరం
సదసి త్రిదశైః సహ ।
ఏష త్రైయమ్బకం తీవ్రం
వహ న్వహ్ని ర్మహ న్మహః ॥ 1

వహ్నివైరూప్యే శక్రప్రశ్నః

శ్లో॥ సహస్రేణ దృశా మీశః
కుత్సితాఙ్గం చ సాదరమ్ ।
దుర్దర్శనం దద ర్శాగ్నిం
ధూమ్రధూమిత మణ్డలమ్ ॥ 2

శ్లో॥ దృష్ట్వా తథావిధం వహ్ని
మిన్ద్రః క్షుబ్ధేన చేతసా ।
వ్యచిన్తయ చ్చిరం కిఞ్చిత్
కన్దర్పద్వేషిరోషజమ్ ॥ 3

# కుమారసంభవము

## "కుమారోత్పత్తి" అను పదవ సర్గము

అగ్నిదేవుడు భరింపరాని, గొప్పదైన శివుని వీర్యమును వహించుచు, దేవతలతో కూడి, సభలో ఉన్న దేవేంద్రుని వద్దకు చేరుకొనెను. (ఈ సర్గమునందలి శ్లోకములు అనుష్టుప్ ఛందస్సునందు కూర్పబడినవి ) 1

### అగ్ని విరూపుడగుటకు కారణమును ఇంద్రుడు ప్రశ్నించుట

విరూపమునందియుండుటవలన చూడరానట్లున్న, పొగతో చుట్టబడి యున్న, ఆ అగ్నిని ఇంద్రుడు తన వేయి కళ్ళతో సాదరముగా చూచెను. 2

ఇంద్రుడు ఆ విధముగానున్న అగ్నిని చూచి, మనస్సు చలించినవాడై (దుఃఖముతో) శివునియొక్క కోపమువలన కలిగిన ఏదో ఒక స్వల్పాపరాధ లక్షణమునుగూర్చి చిరకాలము ఆలోచించెను 3

శ్లో॥ స విలక్ష్యముఖై ర్దేవై
ర్వీక్ష్యమాణః క్షణం క్షణమ్ ।
ఉపావిశ త్సురేన్ద్రేణా
దిష్టం సాదర మాసనమ్ ॥ 4

శ్లో॥ హవ్యవాహ! త్వయాసాది
దుర్దశేయం దశా కుతః? ।
ఇతి పృష్టః సురేన్ద్రేణ
స నిఃశ్వస్య వచో ఽవదత్ ॥ 5

శ్లో॥ అనతిక్రమణీయా త్తే
శాసనా త్సురనాయక! ।
పారావతం వపుః ప్రాప్య
వేపమానో ఽతిసాధ్వసాత్ ॥ 6

శ్లో॥ అభిగౌరి రతాసక్తం
జగా మాహం మహేశ్వరమ్ ।
కాల స్యేవ స్మరారాతేః
స్వం రూప మహ మాసదమ్ ॥ 7

శ్లో॥ దృష్ట్వా ఛద్మవిహఙ్గం మాం
సుజ్ఞో విజ్ఞాయ జమ్భభిత్ ।
జ్వలద్జ్వాలానలే హోతుం
కోపనో మా మమన్యత ॥ 8

వాడిపోయినముఖములుగల దేవతలచే ప్రతి క్షణము చూడబడుచున్న వాడై, దేవేంద్రుడు సగౌరవముగా చూపించిన ఆసనముమీద ఆ అగ్నిదేవుడు కూర్చొనెను. 4

'ఓ అగ్నిహోత్రుడా ఈ దుర్దశ నీ కెట్లు సంభవించినది?" అని ఇంద్రునిచే అడుగబడిన అగ్ని, నిట్టూర్పు విడిచి, ఇట్లు చెప్పసాగెను.

5

ఓ దేవతానాయకుడా! జవదాటరాని నీ ఆజ్ఞవలన నేను పావురము రూపమును ధరించి, గౌరీదేవి ఎదుటగా ఉన్న రతిక్రీడాసక్తుడైన, పరమేశ్వరుని వద్దకు వెళ్ళితిని తరువాత భయముచే వణకుచు నేను యమునివలె భయంకరుడయిన ఆ శివుని ఎదుట నా నిజ (అగ్ని) రూపమును ధరించితిని. 6, 7

ఓ ఇంద్రుడా! సర్వజ్ఞుడైన ఆ శివుడు నన్ను చూచి నేను మోసపు రూపమున ఉన్న పావురమునని తెలిసికొని (చూచి చూడగనే నా యధార్థ రూపమును గుర్తింపలేదు, కొంత వ్యవధి తరువాత గుర్తించుటవలన దర్శనము ముందును, నా యధార్థ స్థితిజ్ఞానము తరువాతను జరిగినవి" అని భావము.) నా యధార్థ స్వరూపమును తెలిసికొని కోపించినవాడై భగభగ మండుచున్న తన లలాటనేత్రాగ్నిలో నన్ను భస్మము చేయదలచెను 8

శ్లో॥ వచోభి ర్మధురైః సార్థైః
విన(మ్రేణ మయా స్తుతః ।
ప్రీతిమా నభవ ద్దేవః
స్తోత్రం కస్య న తుష్టయే? ॥ 9

శ్లో॥ శరణ్యః సకలత్రాతా
మా మత్రాయత శఙ్కరః ।
క్రోధాగ్నే ర్జ్వలతో గ్రాసాత్
త్రాసతో దుర్నివారతః ॥ 10

శ్లో॥ పరిహృత్య పరీరమ్భ
రభసం దుహితు ర్గిరేః ।
కామకేళిరసోత్సేకాత్
వ్రీడయా విరరామ సః ॥ 11

శ్లో॥ రజ్గభఙ్గచ్యుతం రేత
స్తద మోఘం సుదుర్వహమ్ ।
త్రిజగద్దాహకం సద్యో
మద్విగ్రహ మధి న్యధాత్ ॥ 12

శ్లో॥ దుర్విషహ్యేణ తేనా హం
తేజసా దహనాత్మనా ।
నిదగ్ధ మాత్మనో దేహం
దుర్వహం వోఢు మక్షమః । 13

అప్పుడు వినయముతో కూడిన, అర్ధవంతమైన అందువలననే మధురములైన, మనోహరములైన మాటలతో శివుని నేను స్తుతించితిని స్తుతింపబడిన ఆ దేవుడు సంతసించెను ఏలయనగా చేసిన స్తోత్రము ఎవరిని సంతోషపరుపదు? (అందరిని ఆనందింపచేయునని అర్ధము )9

శరణు ఇచ్చుటయందు నిపుణుడైన, సర్వలోక రక్షకుడైన శివుడు నివారింపశక్యముకాని, తన కోపాగ్నినుండి, అది మ్రింగునేమో అని, భయపడిన నన్ను దయతో రక్షించెను 10

ఆ శివుడు గిరిరాజనందినియగు పార్వతియొక్క కౌగిలింతనుండి విడిపించుకొని సిగ్గుతో రతిక్రీడయందలి తన ఉత్సాహమును విరమించెను 11

అప్పుడా శివుడు తన రతిక్రీడకు అంతరాయము కలుగుటవలన (ఇట్టి సమయములో కోపించుట దోషముకాదని భావము) స్ఖలించిన అమోఘమైన ముల్లోకములను దహింపజాలిన, అందువలననే భరింపరాని, రేతస్సును నా శరీరము పైన వెంటనే ఉంచెను. 12

అగ్నివలె కాల్చునట్టి, భరింపశక్యము గానట్టి, ఆ శివవీర్యముచేత కాల్చబడిన, నా దేహమును నేనే మోయలేని స్థితికి చేరితిని (నా శరీరము నెట్లు సుఖముగా ధరింపగలనో అట్టి ఉపాయమును నీవు చూడుమని అగ్ని ప్రార్ధించినాడని భావము ) 13

## జీవితరక్షణే శక్రంప్రతి వహ్నే ర్యాచనమ్

శ్లో॥ రౌద్రేణ దహ్యమానస్య
మహసాతి మహీయసా ।
మమ ప్రాణపరిత్రాణ
ప్రగుణో భవ వాసవ! ॥ 14

శ్లో॥ ఇతి శృత్వా వచో వహ్నేః
పరితాపోపశాన్తయే ।
హేతుం విచిన్తయామాస
మనసా విబుధేశ్వరః ॥ 15

శ్లో॥ తేజోదగ్ధాని గాత్రాణి
పాణినాస్య పరామృశన్ ।
కిఞ్చిత్కృపీటయోనిం తం
దివస్పతి రభాషత ॥ 16

అవ. : అథేన్ద్రో ఽగ్నిం సప్తభిః స్తౌతి.

## ఇన్ద్రకృతం హుతభుక్ స్తవనమ్

శ్లో॥ ప్రీతః స్వాహా స్వధా హన్త కారైః
ప్రీణయసే స్వయమ్ ।
దేవా, న్పితౄ, న్మనుష్యా స్త్వ
మేక స్తేషాం ముఖం యతః ॥ 17

## తనజీవితమును రక్షింపుమని అగ్ని ఇంద్రుని ప్రార్థించుట

ఓ దేవేంద్రుడా! మిక్కిలి గొప్పదయిన శివవీర్యముచేత కాల్చబడుచున్న నా ప్రాణములను రక్షించు సామర్ధ్యము నీకే కలదు అట్టి నా ప్రాణములను రక్షించి, కీర్తినందుకొనుము (నా ప్రాణ రక్షణముచేత నీకు గొప్ప కీర్తి లభించునని భావము.) **14**

దేవతాసార్వభౌముడైన దేవేంద్రుడు, అగ్ని చెప్పిన ఈ మాటలను విని, అగ్నియొుక్క పరితాపము తగ్గు మార్గమునుగూర్చి మనసార ఆలోచింపసాగెను. **15**

శివవీర్యప్రభావమువలన పరితపించుచున్న ఆ అగ్నిదేవుని శరీరమును తన చేతితో, స్పృశించుచు నెమ్మదిగా దేవేంద్రుడు ఇట్లనసాగెను. **16**

**అవతారిక** : తరువాత ఇంద్రుడు ఇటనుండి ఏడు శ్లోకములలో అగ్నిని ప్రశంసించుచున్నాడు

## ఇంద్రుడు అగ్నిని స్తుతించుట

ఓ అగ్నిదేవా! నీవు ఒక్కడవే "స్వాహా" అను పేరుతో ఆహుతి స్వీకరణ మునకై పిలువబడినవాడవై-దేవతలను, "స్వధా' అను పేరుతో పిలువబడిన వాడవై-పితృదేవతలను, "హన్త" అనుపేరుతో పిలువబడినవాడవై -మానవులను నీవే సంతోషపరచుచుందువు. ఏలయనగా నీ వొక్కడవే ఆ దేవ, పితృ, మనుష్యులకు ముఖమువై యున్నావు **17**

శ్లో॥ త్వయి జుహ్వతి హోతారో
హవీంషి ధ్వస్తకల్మషాః ।
భుఞ్జన్తి స్వర్గ మేక స్త్వం
స్వర్గప్రాప్తౌ హి కారణమ్ ॥ 18

శ్లో॥ హవీంషి మన్త్రపూతాని
హుతాశ! త్వయి జుహ్వతః ।
తపస్విన స్తపస్సిద్ధిం
యాన్తి త్వం తపసాం ప్రభుః ॥ 19

శ్లో॥ నిధత్సే హుత మర్కాయ
స పర్జన్యో ఽభివర్షతి ।
తతో ఽన్నాని ప్రజా స్తేభ్య
స్తేనాసి జగతః పితా ॥ 20

శ్లో॥ అన్తశ్చరో ఽసి భూతానాం
తాని త్వత్తో భవన్తి చ ।
తతో జీవితభూత స్త్వం
జగతః ప్రాణదోఽసి చ ॥ 21

మంత్రములచే పవిత్రములైన హవిస్సులను (అగ్నిలోవేయు పదార్థములను) నీయందు ఆహుతిచేసి, యజ్ఞముచేయు తపోధనులు వారి వారి తపస్సులకు సిద్ధిని (ఫలమును) పొందుచున్నారు. ఎందువలననగా నీవు తపస్సుల కన్నిటికి ప్రభువువుకదా! 18

ఓ హుతాశనుడా! (వేసిన ఆహుతులను భుజించువాడా!) తపస్సు చేయువారు మంత్రోచ్చారణముచే పవిత్రములయిన హవిస్సులను నీ యందు హోమము పేరుతో అర్పించుచు తమ తపస్సునకు సిద్ధిని పొందుచున్నారు ఏలయనగా నీవే తపస్సులకు (ఫలసిద్ధినిచ్చు) ప్రభువవు కదా! 19

ఓ అగ్నిదేవుడా దేవతలయం దతర్యామిగాఉండు సూర్యదేవునకు హుతము చేయబడిన ఆహుతులను అందింతువు. అందువలన ఆ సూర్యుడు మేఘుడై వర్షించును. ఆ వర్షమువలన అన్నము (పంట) పుట్టుచున్నది ఆ వివిధసస్యములనుండి ప్రజ లుద్భవించుచున్నారు అందువలన నీవు జగత్‌పితవు అయిఉన్నావు ('పా = రక్షించుట అనుధాతువునుండి పితృ శబ్దము ఉత్పన్నమయినది. పితా అనగా రక్షించువాడు అను అర్థమును ఇచ్చుట స్వీకరింపవలెను కాని, కన్నతండ్రి అను అర్థమును గ్రహింపరాదని భావము ) 20

నీవు ప్రాణు లందరిలోను వ్యాపించి యుందువు ఆ ప్రాణు లన్ని నీ వలననే ఉద్భవించుచున్నవి జీవులు జీవించి యుండుటకు నీవు కారణమగుటవలన జగత్తున కంతటికిని ప్రాణదుడవు (ప్రాణము నిచ్చువాడవు) అయి ఉన్నావు. 21

శ్లో॥ జగతః సకలస్యాస్య
త్వ మేకో ఽ స్యుపకారకృత్ ।
కార్యోపపాదనే తత్ర
త్వత్తో ఽ న్యః కః ప్రగల్భతే? ॥ 22

శ్లో॥ అమీషాం సురసంఘానాం
త్వ మేకో ఽ ర్థసమర్థనే ।
విపత్తి రపి సంశ్లాఘ్యో
పకారవ్రతినో ఽ నల! ॥ 23

అవ. : సత్ప్ర త్యుపాయ ముపదిశతి.

శ్లో॥ దేవీ భాగీరథీ పూర్వం
భక్త్యా స్మాభిః ప్రతోషితా ।
నిమజ్జత స్తవోదీర్ణం
తాపం నిర్వాపయిష్యతి ॥ 24

శ్లో॥ గఙ్గాం తద్గచ్ఛ మా కార్షీః
విలమ్బం హవ్యవాహన ।
కార్యే ష్వవశ్యకార్యేషు
సిద్ధయే క్షిప్రకారితా ॥ 25

నీ ఒక్కడవే ఈ సర్వజగత్తుకు హితమును చేకూర్చువాడవు. అందువలననే మా కార్యమును సాధించుటకు నీకంటె సమర్థు డింకొక డెవ్వ రున్నారు? (ఎవ్వరును లేరని భావము.) 22

ఓ అనలుడా! (అగ్నిదేవుడా!) దేవతాసమూహమయిన మా వంటివారి కార్యమును స్సాధించుటకు నీ ఒక్కడవే సమర్థుడవు. ("ఇట్టి ఆపత్స్థితిలో ఉన్న, నేను (అగ్నిని) ఏమి చేయగలను?" అనుకొందువేమో. అను అనుమానమునకు సమాధానమును చెప్పుచున్నాడు.) ఇతరుల కుపకరించుటే నియమముగా పెట్టుకొనిన పురుషులకు ఆపద వచ్చినను అది బాగుగా శ్లాఘింపదగినదే అగును. (అందువలననే నీవు విపత్తి స్థితిలో ఉన్నను పొగడబడుచున్నావు అని భావము.) 23

**అవతారిక :** ఇప్పుడు ఉపాయమును ఉపదేశించుచున్నాడు.

గంగానదీదేవత, పూర్వము మాచే భక్తితో సంతోషపరుపబడినది ఆమెలో నీవు స్నానము చేసినపుడు నీ దుస్సహతాపమును ఆమె ఉపశమింప చేయగలదు. 24

ఓ! హవ్యవాహనుడా! (అగ్నిదేవా!) అందువలన వెంటనే గంగానది వద్దకు వెళ్ళుము. ఆలస్యమును చేయవద్దు. తప్పనిసరిగా చేయవలసిన పనుల విషయమునందు సిద్ధిని పొందుటకు త్వర కావలెను. (ఆలస్యము పనికిరా దని భావము.) 25

అవ. : నను శక్తేనాపి మయా దుర్వాహ్యం శైవం
తేజో గఙ్గా కథం ధరిష్యతీ త్యాశ ఙ్క్యాహ.

శ్లో॥ శమ్భో రమ్భోమయీమూర్తిః
సైవ దేవీ సురాపగా ।
త్వత్తః స్మరద్విషో బీజం
దుర్భరం ధారయిష్యతి ॥ 26

శ్లో॥ ఇ త్యుదీర్య సునాసీరో
విరరామ స చానలః ।
త ద్విసృష్ట స్త మాపృచ్ఛ్య
ప్రతస్థే స్వ ర్ధునీమభి ॥ 27

## గఙ్గాంప్రతి హుతభుజః ప్రస్థానమ్

శ్లో॥ హిరణ్యరేతసా తేన
దేవీ స్వర్గతరఙ్గిణీ ।
తీర్ణాధ్వనా ప్రపేదే సా
నిశ్శేష క్లేశనాశినీ ॥ 28

అవ. : అథ త్రిభి స్తామేవ విశినష్టి.

శ్లో॥ స్వర్గారోహణ నిఃశ్రేణి
ర్మోక్షమార్గాధిదేవతా ।
ఉదారదురితోద్గార
హారిణీ దుర్గతారిణీ॥ 29

అవతారిక : "సమర్థుడనగు నేనే ధరింపలేని శివతేజస్సును, గంగ ఎట్లు భరించును?" అను అనుమానమునకు సమాధానమును చెప్పుచున్నాడు.

అష్టమూర్తి యగు శివునియొక్క జలమయమయిన రూపమే, ఆ గంగానది! అందువలన దుర్భరమయిన శివుని తేజస్సును నీనుండి గ్రహించి, ఆమె ధరింపగలదు. 26

ఈ విధముగా చెప్పి, ఇంద్రుడు తన ప్రసంగమును చాలించెను. ఆ అగ్నిదేవుడు కూడ ఇంద్రునిచే విడువబడినవాడై శలవు తీసికొని, దేవతల నదియగు గంగవైపునకు బయలుదేరెను. 27

## గంగ వద్దకు అగ్ని బయలుదేరుట

అట్లు బయలుదేరి, గంగవరకు గల దారిని దాటి, అగ్నిహోత్రుడు కష్టములను మిగల్చకుండ (అన్ని కష్టములను) నశింపజేయు ఆకాశగంగను చేరెను. 28

అవతారిక : తరువాతి మూడు శ్లోకములలో ఆకాశగంగనే వర్ణించుచున్నాడు.

స్వర్గమున కెక్కదలచిన వారికి నిచ్చెనయును, (దీనిలో స్నానము చేసినంత మాత్రముననే స్వర్గము లభించునని భావము) మోక్షమునకు తీసికొని వెళ్ళు మార్గమునకు అధిదేవతయును, మహాపాప సమూహమును హరించునదియును. సంసారసాగరమును తరింపచేయునదియును, (అగు గంగానదిని అగ్నిదేవుడు సమీపించెను.) 29

శ్లో॥ మహేశ్వరజటాజూట
వాసినీ పాపనాశినీ ।
సరాగాన్వయ నిర్వాణ
కారిణీ ధర్మధారిణీ ॥ 30

శ్లో॥ విష్ణుపాదోదకోద్భూతా
బ్రహ్మలోకా దుపాగతా ।
త్రిభిః స్రోతోభి రశ్రాన్తం
పునానా భువనత్రయమ్ ॥ 31

## వహ్నింప్రతి గఙ్గాయాః సమ్ముఖీభవనమ్

శ్లో॥ జాతవేదస మాయాన్త
మూర్మిహస్తైః సముత్థితైః ।
ఆజుహో వార్థసిద్ధ్యై తం
సుప్రసాదధరేవ సా ॥ 32

శ్లో॥ సమ్మిలద్భి ర్మరాలైః సా
కలం కూజద్భి రున్మదైః ।
దదే శ్రేయాంసి దుఃఖాని
నిహన్మీతి త మభ్యధాత్ ॥ 33

మహేశ్వరుని జటాజూటమునందు నివసించునదియును, పాపములను నశింపజేయునదియును, విషయలోలుర వంశమునకు చెందిన వారికి కూడ మోక్షమును కలిగించునదియును, (విషయలోలురకే మోక్షము నిచ్చు సామర్థ్యము గలదనుటచే ముక్తసంగులకు మోక్షమును ప్రసాదించునని వేరుగా చెప్పనక్కరలేదు కదా!) ధర్మము నాచరింప జేయునదియును, (తనతో సంబంధము పెట్టుకొనిన జంతువులను ధర్మాత్ములుగా చేయునదియును) అగు గంగానదిని అగ్నిదేవుడు చేరుకొనెను. **30**

విష్ణుపాదోదకమునుండి పుట్టినదియును, బ్రహ్మలోకమునుండి ఆకాశమునకు వచ్చినదియును, స్వర్గ, మర్త్య, పాతాళములను ముల్లోకములను తన మూడుపాయలతో శ్రమ అనుకొనకుండ పవిత్రములుగా చేయునదియును, (అగు ఆకాశగంగను అగ్నిదేవుడు సమీపించెను.) **31**

## గంగ అగ్నిదేవున కెదురువచ్చుట

గొప్ప అనుగ్రహముకలిగిన ఆ గంగ, తన వైపునకు వచ్చుచున్న అగ్నిదేవుని అర్థమును (ప్రయోజనమును) సిద్ధింపచేయుటకై తన కదలుచున్న అలలుఅను చేతులతో ఆహ్వానించుచున్నదో అన్నట్లనిపించెను. **32**

గుంపులు కట్టి, మదించిన, మధురముగా కూయుచున్న, హంసలకూతలనే సమాధానముగా చేసి, ఆ గంగానది "నీకు శ్రేయస్సును సమకూర్చుదును. దుఃఖములను నశింపజేయుదును" అని అగ్నితో పలికెను. (జలరూపమున ఉన్న గంగ మాటాడుట కవకాశము లేదు. కనుక హంసల కూజితములద్వారా సమాధానము నిచ్చె నని భావము.) **33**

శ్లో॥ కల్లోలై రుద్గతై రర్వా-
చీనం తట మభిద్రుతైః ।
ప్రీతేవ త మభీయాయ
స్వర్ధునీ జాతవేదసమ్ ॥ 34

శ్లో॥ అథాభ్యుపేత స్తాపార్తో
నిమమ జ్జానలః కిల ।
విపదా పరిభూతాః కిం
వ్యవస్యన్తి విలమ్బితుమ్? ॥ 35

శ్లో॥ గఙ్గావారిణి కల్యాణ
కారిణి శ్రమహారిణి ।
స మగ్నో నిర్వృతిం ప్రాప
పుణ్యభారిణి తారిణి ॥ 36

శ్లో॥ తత్ర మాహేశ్వరం ధామ
సఙ్చక్రామ హవిర్భుజః ।
గఙ్గాయా ముత్తరఙ్గాయా
మన్తస్తాపవిపద్భృతి ॥ 37

ఆ దేవతలనదియగు గంగ సంతోషపడినదై ఆనందముతో పొంగి వచ్చుచు, ముందుగనే ఒడ్డును తాకుటకై పరుగులిడుచున్న అలలతో అగ్నిదేవుని సంతోషముతో స్వాగతించుటకై ఎదురువెళ్ళుచున్నదో అన్నట్లుండెను. 34

ఆ తరువాత ఆ అగ్నిదేవుడు శివతేజస్సువలనకలిగిన తాపముచే బాధపడుచున్నవాడై గంగ కెదురుగ వచ్చి అందులో మునిగెను. ఆపదల నందినవారు దానికి ప్రతిక్రియను చేయుటలో జరుగు ఆలస్యమును ఓర్చుకొనగలరా! (ఓర్చుకొనలేరు. ఆలస్యము చేయరు. అని భావన.) 35

సర్వసుఖములను కలిగించునదియును, సర్వశ్రమలను తొలగించు నదియును, జనులకు పుణ్యములను కలిగించునదియును, సంసారసాగరమును తరింపజేయునదియును అగు గంగాజలమునందు మునిగి (స్నానము చేసి) ఆ అగ్నిదేవుడు ఆనందము ననుభవించెను. 36

లోపల తాపము అను ఆపదను ధరించిన, అందువలననే ఎగిసి పడుచున్న అలలుగల, గంగానది లోనికి అప్పుడా శివతేజస్సు అగ్నినుండి సంక్రమించెను. (ప్రవేశించెను). 37

శ్లో॥ కృశాను రేతసో రేత
స్యాదృతే సరితా తయా ।
నిశ్చక్రామ తతః సౌఖ్యం
హవ్యవాహో వహ న్బహు ॥ 38

శ్లో॥ సుధాసారై రివా మ్భోభి
రభిషిక్తో హుతాశనః ॥
యథాగతం జగా మాథ
పరాం నిర్వృతి మాదధత్ ॥ 39

శ్లో॥ సా సుదుర్విషహం గఙ్గా
ధామ కామజితో మహత్ ।
ఆదధానా పరీతాప
మవాప వ్యోమవాహినీ ॥ 40

శ్లో॥ బహి రార్తా యుగాన్తాగ్నే
స్తప్తానీవ శిఖాశతైః ।
హిత్వో ష్ణాని జలా న్యస్యా
నిర్జగ్ము ర్జలజన్తవః ॥ 41

శ్లో॥ తేజసా తేన రౌద్రేణ
తప్తాని సలిలాన్యపి ।
సముదఞ్చన్తి చణ్డాని
దుర్ధరాణి బభార సా ॥ 42

ఆ గంగానది శివునియొక్క తేజస్సును సాదరముగా స్వీకరింపగనే అగ్ని మిక్కిలి సౌఖ్యమును పొంది, (చల్లబడి) గంగా జలమునుండి పైకి వచ్చెను. 38

ఆ తరువాత అమృతమయములో అన్నట్లున్న నీటిలో స్నానము చేసి, మిక్కిలి సుఖమునంది, వచ్చినవాడు వచ్చినట్లే అగ్నిదేవుడు వెడలిపోయెను. 39

ఆకాశగంగ, భరింపరాని, మదనాంతకుని గొప్ప తేజస్సును ధరించి, తాను పరితాపమును పొందెను. 40

యుగాంతాగ్ని యొక్క వందలకొలది జ్వాలలవలెనున్న శివతేజః ప్రతాపము చేత బాగుగా వేడెక్కిన గంగనీటిని విడిచి, గంగలోనుండు జలజంతువులు తాపార్తములై, పైకి వెడలి వచ్చినవి. 41

ప్రచండమయిన ఆ శివవీర్యప్రతాపముచేత మిక్కిలి వేడెక్కి సలసలకాగి, పొంగుచున్న నీళ్ళనే ఆ గంగానది ధరించెను. 42

## మన్దాకినీప్రభృతి స్నానార్థం కృత్తికాగమనమ్

శ్లో॥ జగచ్చక్షుషి చణ్డాంశౌ
కిఞ్చి దభ్యుదయోన్ముఖే ।
జగ్ముః షట్కృత్తికా
మాఘే మాసి స్నాతుం సురాపగామ్ ॥ 43

అవ. : అథ చతుర్భిః సురాపగాం విశినష్టి.

శ్లో॥ శుభ్రై రభ్రభజ్కషై రూర్మి
శతైః స్వర్గనివాసినామ్ ।
కథయన్తీ మివాలోకా
వగాహో చమనాదికమ్ ॥ 44

శ్లో॥ సుస్నాతానాం మునీన్ద్రాణాం
బలికర్మోచితై రలమ్ ।
బహిః పుష్పోత్కరైః కీర్ణ
తీరాం దూర్వాక్షతాన్వితైః ॥ 45

శ్లో॥ బ్రహ్మధ్యానపరై ర్యోగ
పరై ర్బ్రహ్మాసనస్థితైః ।
యోగనిద్రాగతై ర్యోగ
పట్టబన్ధై రుపాశ్రితామ్ ॥ 46

## స్నానముచేయుటకై గంగవద్దకు కృత్తికలు వెళ్ళుట

మాఘమాసమునందు సూర్యుడు అప్పుడే కొంచెముగా ఉదయింప బోవుచున్న ప్రభాతసమయమునందు షట్కృత్తికలు అను స్త్రీలు స్నానము చేయుటకై గంగానదికి వెళ్ళిరి. **43**

అవతారిక : ఇటనుండి నాలుగు శ్లోకములలో ఆకాశగంగను వర్ణించుచున్నాడు.

(తనలోనికి దిగి) తనను చూచునట్టి, స్నానముచేయునట్టి, ఆచమనము చేయునట్టి, స్వర్వాసులయిన దేవతలకు ఆకాశమునంటునట్టి, నిర్మలములములయిన వందలకొలదిఅలలద్వారా తన దుఃఖమును చెప్పుకొనుచున్నదో అనునట్లున్న, (గంగ వద్దకు కృత్తికలు చేరిరి.) **44**

చక్కగా స్నానముచేసి సప్తఋషులయొక్క పూజకుతగిన గరికపోచల చేత, అక్షతలచేత, పుష్పోపహారములచేత, వ్యాపించిన గట్టు, ఇసుక భాగముగల, (గంగానదిని కృత్తికలు చేరిరి.) **45**

బ్రహ్మధ్యానమునందు మనస్సును లగ్నముచేసినవారును, యోగాభ్యాసమునం దాసక్తి కలవారును, బ్రహ్మాసనమునం దుండి యోగమును, తపస్సును చేయువారును, యోగనిద్రాసమాధిస్థితి యందున్నవారును, యోగపట్టమును ధరించినవారును అగు యోగులచేత ఆశ్రయింపబడిన, ( గంగానదిని కృత్తికలు చేరిరి.) **46**

శ్లో॥ పదాఙ్గుష్ఠాగ్రభూమిస్థైః
సూర్యసమ్బన్ధదృష్టిభిః ।
బ్రహ్మర్షిభిః పరం బ్రహ్మ
గృణద్భి రుపసేవితామ్ ॥ 47

శ్లో॥ అథ దివ్యాం నదీం దేవీ
మభ్యనన్ద న్విలోక్య తాః ।
కం నాభినన్దయ త్యేషా
దృష్టా పీయూషవాహినీ ॥ 48

సురసరిదవలోకనేన కృత్తికానా మానన్దః

శ్లో॥ చన్ద్రచూడామణి ర్దేవో
యా ముద్వహతి మూర్ధని ।
యస్యా విలోకనం పుణ్యం
శ్రద్దధు స్తాం ముదా హృది ॥ 49

శ్లో॥ దివ్యాం విష్ణుపదీం దేవీం
నిర్వాణపదదేశినీమ్ ।
నిర్ధూతకల్మషాం మూర్ధ్నా
సుప్రహ్వా స్తా వవన్దిరే ॥ 50

శ్లో॥ సౌభాగ్యైః ఖలు సుప్రాపాం
మోక్షప్రతిభువం సతీమ్ ।
భక్త్యా త్ర తుష్టువు స్తాం తాః
శ్రద్దధానా దివోధునీమ్ ॥ 51

పాదాగ్రముమీద నిలిచియున్నవారును, సూర్యునియందే దృష్టిని నిలిపినవారును, బ్రహ్మమంత్రమును జపించినవారును, అగు బ్రహ్మఋషులయిన సప్తఋషులచేత ఆశ్రయింపబడిన, (గంగానదిని కృత్తికలు చేరిరి.) 47

ఆ తరువాత ఆ కృత్తికలు స్వర్గలోకపునదియగు ఆకాశగంగానదిని చూచి, సంతోషించిరి. అమృతమునుప్రవహించుగంగ, దర్శింపబడి ఎవరిని ఆనందపఱుపదు? (అందరిని ఆనందింపజేయునని భావము.) 48

## ఆకాశగంగాదర్శనముచేత కృత్తికలకు కలిగిన ఆనందము

చంద్రునిచూడామణిగాధరించిన శివుడు ఏ నదిని తనతలమీద ధరించెనో, దేని దర్శనము పుణ్యప్రదమో ఆ గంగా నదిని కృత్తికలు మనసార భక్తితో నమ్మి, (అర్చించిరి.) 49

మోక్షప్రదాత్రియును, పాపమును ప్రక్షాళనము చేయునదియును, స్వర్గలోకమునకు సంబంధించినదియును, విష్ణుపాదమునుండి ఉద్భవించినదియును అగు గంగాదేవికి కృత్తికలు మిక్కిలి వినయముతో వంగి, భక్తితో నమస్కరించిరి. 50

అచ్చట ఆకృత్తికలు శ్రద్ధకలవారై తమ భాగ్యవశమున మోక్షమును సులభముగా ఇప్పించు, పతివ్రతయయిన, ఆ ఆకాశగంగానదిని భక్తిశ్రద్ధలతో స్తుతించిరి. 51

శ్లో॥ ముక్తిస్త్రీసఙ్గదూత్యజ్ఞైః
తత్ర తా విమలై ర్జలైః ।
ప్రక్షాలితమలాః సస్నుః
సుస్నాతా స్తపసాన్వితాః ॥ 52

శ్లో॥ స్నాత్వా తత్ర సులభ్యాయాం
భాగ్యైః పరిపచేలిమైః ।
చరితార్థం స్వ మాత్మానం
బహు తా మేనిరే ముదా ॥ 53

శ్లో॥ కృశానురేతసో రేత
స్తాసా మభి కలేవరమ్ ।
అమోఘం సఞ్చచారాథ
సద్యో గఙ్గావగాహనాత్ ॥ 54

హరతేజసా కృత్తికాపరితాపజననమ్

శ్లో॥ రౌద్రం సుదుర్ధరం ధామ
దధానా దహనాత్మకమ్ ।
పరితాప మవాపు స్తా
మగ్నా ఇవ విషామ్బుధౌ ॥ 55

తపస్వినులయిన ఆకృత్తికలు ముక్తిఅను స్త్రీతోడి సంగమము (ప్రాప్తి) అను విషయమునందు దౌత్యమునుచేయుపనిని బాగుగా తెలిసిన, (గంగాజల స్పర్శ మాత్రముననే ముక్తి లభించునని భావము.) జలములతో తమ పాపములు పోవునట్లుగా స్నానము చేసిరి. (మలాపకర్షణ స్నానానంతరము శుద్ధస్నానముచేయుట అను సాంప్రదాయిక విషయ మిచ్చుట ప్రస్తావింపబడినది.) 52

తమ అదృష్టము పండి, సులభముగా లభించిన గంగాజలమునందు ఆకృత్తికలు స్నానము చేసి, తాము కృతార్థురాండ్ర మయినామని తలచిరి. 53

ఆ తరువాత ఆ కృత్తికలు గంగాస్నానము చేసినకారణముగా సఫలమయిన ఆ హరుని వీర్యము వెంటనే ఆ కృత్తికలయొక్క శరీర మధ్యమునకు సంక్రమించెను. (లగ్నమయ్యెను. అని భావము.) 54

## హరుని తేజస్సుచేత కృత్తికలు తపింపజేయబడుట

అగ్ని రూపమయిన, అందువలననే ధరింపశక్యముగాని, ఆ శివతేజస్సును ధరించిన ఆ కృత్తికలు విషసముద్రములో మునిగినారేమో అన్నట్లు పరితాపమునందిరి. 55

శ్లో॥ అక్షమా దుర్వహం వోఢు
మమ్బునో బహి రాతురాః ।
అగ్నిం జ్వలన్త మన్త స్తా
దధానా ఇవ నిర్యయుః ॥ 56

శ్లో॥ అమోఘం శామ్భవం బీజం
నద్యా నద్యోజ్ఝితం మహత్ ।
తాసా మభ్యుదరం దీప్తం
స్థితం గర్భత్వ మాగమత్ ॥ 57

శ్లో॥ సుజ్ఞా విజ్ఞాయ తా గర్భ
భూతం త ద్వోఢు మక్షమాః ।
విషాద మదధుః సద్యో
గాఢం భర్తృభియా హ్రియా ॥ 58

శ్లో॥ తతః శరవణే సార్ధం
భయేన వ్రీడయా చ తాః ।
తద్గర్భజాత ముత్సృజ్య
స్వా న్స్పృహో నభినిర్యయుః ॥ 59

ధరింపవీలుకాని ఆ శివతేజస్సును వహింపజాలక వ్యాకులపడి, అగ్నిని శరీరమునందు భరించుచున్నారో అన్నట్లు బాధపడుచు గంగనీటినుండి వెడలివచ్చిరి. 56

గంగానదిచే వెంటనే విడువబడిన, అందువలననే ఆకృత్తికల ఉదరములో వెలుగుచున్న, ఆ గొప్పశివవీర్యము (బీజము) గర్భముగా పరిణమించినది. 57

చతురలయిన ఆ కృత్తికలు ఆశివవీర్యము గర్భముగా పరిణమించినదను విషయమును గ్రహించికూడ దానిని భరింపలేక నిజభర్తలవలని భయముతోను, (ఈ గర్భమును ధరింపకున్నచో అది అనుచితమగును. ధరింతమన్నచో శరీరము దహించుకొని పోవుచున్నది అను భయముతో) సిగ్గుతోను, (ఇంతవరకు నిజభర్తలవీర్యమును ధరింపలేదని లోక ప్రవాదమువలనకలుగుసిగ్గుతో) వెంటనే చాల దుఃఖము ననుభవించిరి. 58

అనంతర మా కృత్తికలు ఆ గర్భజాతమును (గర్భసామాన్యమును) భయముతోను, సిగ్గుతోను, తెల్లుగడ్డిమీద విడిచిపెట్టి, తమ ఇండ్ల కేగిరి. 59

## కుమారసమ్భవః

శ్లో॥ తాభి స్త్రత్రామృతకరకలాకోమలం భాసమానం
తద్విక్షిప్తం క్షణమభినభోగర్భ మభ్యుజ్జిహానైః ।
స్వై స్తేజోభి ర్దినపతిశతస్పర్ధమానై రమానై
ర్వ్యక్తైః షడ్భిః స్మరహరగురుస్పర్థయే వా జనీవ ॥ 60

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"కుమారోత్పత్తి"ర్నామ దశమః సర్గః
-o0o-



ఆరుముఖముల కార్తికేయుడు - శ్లోకము 60

## కుమారుని జననము

ఆ కృత్తికలచేత తెల్లుగడ్డిపై ఉంచబడినదియును, చంద్రకళలవలె మృదువై భాసిల్లుచున్నదియును, అగు ఆ గర్భజాతము ఆకాశముమధ్యవరకు తేజస్సును పైకెగజిమ్ముచున్న వందమంది సూర్యులతో పోటీపడుచున్న, (అంతకంటె అధికమయిన) అసంఖ్యాకమయిన తేజస్సమూహముకలిగి, ఆరుముఖములతో కూడి, "(బ్రహ్మకు నాలుగే ముఖములు కాని నాకు ఆరు ముఖములున్నవి") అని బ్రహ్మతో పోటీపడుచున్నాడో అన్నట్లు ఒక కుమారరూపమున జన్మించెను. ఈ శ్లోకము మందాక్రాంతావృత్తము నందు కూర్పబడినది.

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను మహాకావ్యమునందు "కుమారోత్పత్తి" అను పేరుగల పదవ సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-



హరతేజస్సంభవుడు - కుమారస్వామి. శ్లోకము 60

# కుమారసమ్భవమ్

## "కుమారబాలలీలాః" నామ

## ఏకాదశః సర్గః

ఇన్ద్రాదిభిస్సమేత్య గఙ్గయా కుమారాయ స్తన్యప్రదానమ్

శ్లో॥ అభ్యర్థమానా విబుధైః సమగ్రైః
ప్రహ్వైః సురేన్ద్రప్రముఖై రుపేత్య ।
తం పాయయామాస సుధాతిపూర్ణం
సురాపగా స్వం స్తన మాశు మూర్త్యా ॥ 1

శ్లో॥ పిబన్ స తస్యాః స్తనయోః సుధౌఘం
క్షణం క్షణం సాధు సమేధమానః ।
ప్రా పాకృతిం కా మపి షడ్భి రేత్య
నిషేవ్యమాణః ఖలు కృత్తికాభిః ॥ 2

శ్లో॥ భాగీరథీపావక కృత్తికానా
మానన్దబాష్పాకుల లోచనానామ్ ।
తం నన్దనం దివ్య ముపాత్తు మాసీ
త్పరస్పరం ప్రౌఢతరో వివాదః ॥ 3

# కుమారసంభవము

## "కుమారబాలలీలలు" అను
## పదకొండవ సర్గము

### ఇంద్రాదులతోకలిసివచ్చిన గంగ కుమారస్వామికి పాలిచ్చుట

ఇంద్రుడు మొదలుగాగల సమస్త దేవతలు సమీపించి, వినయముతో ప్రార్థింపగా, ఆ మందాకిని (ఆకాశగంగ) వెంటనే దేవతారూపమును ధరించి, ఆ కుమారునిచే అమృతమయమయిన తన స్తన్యమును త్రాగించెను. (ఈ సర్గమునందలి శ్లోకములు ఉపజాతికి చెందిన ఇంద్రవజ్రాఛందస్సునందు కూర్పబడినవి.) 1

ఆ కుమారుడు మందాకినియొక్క స్తనములనుండి అమృతమయమయిన పాలను త్రాగుచు, క్షణక్షణమునకు బాగుగా పెరుగుచున్నవాడై, ఆరుగురు కృత్తికలు తనను సమీపించిసేవించుచుండగ, ఏదో ఒక అనిర్వచనీయమైన (లోకోత్తరమయిన) ఆకారమును పొందెను. 2

ఆనందబాష్పములతోనిండిన కళ్ళుగల గంగ, అగ్ని, కృత్తికలయొక్క దివ్యమయిన, (లోకోత్తరమయిన) స్వరూపముకల ఆ కుమారుని తీసికొనుటకు ఆ ముగ్గురిలో ఒకరొకరికి గొప్ప కలహము ఏర్పడినది. ("వీడు నా కుమారుడు. నా కుమారుడు" అను వాదనతో బాటు పెద్ద కలహ మేర్పడినదని భావము.) 3

శ్లో॥ అత్రాన్తరే పర్వతరాజపుత్ర్యా
సమం శివః స్వైరవిహారహేతోః ।
నభో విమానేన విగాహమానో
మనోఽతివేగేన జగామ తత్ర ॥ 4

శ్లో॥ నిసర్గవాత్సల్యవశా ద్వివృద్ధ
చేతఃప్రమోదౌ గలదశ్రునేత్రౌ ।
అపశ్యతాం తం గిరిజాగిరీశౌ
షడాననం షడ్దినజాతమాత్రమ్ ॥ 5

శ్లో॥ అథా హ దేవీ శశిఖణ్డమౌలిం
కోఽయం శిశు ర్దివ్యవపుః పురస్తాత్ ।
కస్యాథవా ధన్యతమస్య పుంసో?
మాతా స్య కా భాగ్యవతీషు ధుర్యా ? ॥ 6

శ్లో॥ స్వర్గాపగాసా వనలోఽయ మేతాః
షట్కృత్తికాః కిం కలహాయమానాః ।
పుత్రో మమాయం న తవాయ మిత్థం
మిథ్యేతి వైలక్ష్య ముదాహరన్తి ॥ 7

## కస్యేద మపత్యమితి శివగౌర్యోః సంవాదః

శ్లో॥ ఏతేషు కస్యేద మపత్య మీశా
ఖిల త్రిలోకీతిలకాయమానమ్ ।
అన్యస్య కస్యా ప్యథ దేవదైత్య
గన్ధర్వ సిద్ధోరగ రాక్షసేషు ॥ 8

ఇంతలో పర్వతరాజపుత్రియగు పార్వతితోకలిసి స్వేచ్ఛావిహారము కొరకు మనోవేగమునకంటె వేగముగా పోగలిగిన విమానము నెక్కి ఆకాశ మార్గమునందు విహరించుచు, ఆ వివాదము జరుగుచున్న (కుమారస్వామి ఉన్న) ప్రదేశమునకు శివుడు వచ్చెను. **4**

సహజమయిన వాత్సల్య భావముతో పెరిగిన ఆనందము కలవారై, అందువలననే ఆనందబాష్పములను రాల్చుచు, ఆరు రోజుల క్రితము మాత్రమే అవతరించిన ఆరుతలలుగల, ఆ కుమారుని గిరిజా, గిరీశు లిరువురును చూచిరి. **5**

ఆ కుమారుని చూచిన తరువాత "ఈ ఎదుటనున్న కుమారు డెవ్వరు? ఈ దివ్యరూపమును ధరించిన వీడు ఏ ధన్యాత్ముని కుమారుడు? భాగ్యవంతురాండ్రలో అగ్రగణ్యురాలయిన ఏ తల్లికి కుమారు డితడు?" అని భవాని చంద్రశేఖరుని ప్రశ్నించెను. **6**

మఱియు ఈ గంగయును, ఈ అగ్నియును, ఈ ఆరుగురు కృత్తికలును వాదులాడుకొనుచు "వీడు నా కుమారు"డని గంగయును, "వీడు నా కుమారుడు, నా కుమారుడే" అని అగ్నియును, "మీ ఇద్దరిలో ఏ ఒక్కరికి కొడుకు కాదు నా కుమారుడే. ఇది సత్యము." అని కృత్తికలును ఇట్లు పరస్పర విరుద్ధముగా ఏల మాట్లాడుచున్నారు? ఏల వాదించుకొను చున్నారు? **7**

## ఇత డెవరిబిడ్డ డని గౌరీశంకరులు సంభాషించుకొనుట

"ఈశ్వరుడా! ఈ గంగ, అగ్ని, కృత్తికలు అను ముగ్గురిలో (నిజముగా) వీ డెవరి కుమారుడు? లేక త్రిలోకశ్రేష్ఠుడైన ఈ బాలుడు దేవ, దైత్య, గంధర్వ, సిద్ధోరగ, రాక్షసులకు గాని, మరి ఏ ఇతరునికి వీడు కుమారుడు?" చెప్పుము. **8**

శ్లో॥ శ్రుత్వేతి వాక్యం హృదయప్రియాయాః
కౌతూహలిన్యా విమలస్మితశ్రీః ।
సాన్ద్రప్రమోదోదయసౌఖ్యహేతు
భూతం వచో ఽవోచత చన్ద్రచూడః ॥ 9

శ్లో॥ జగత్త్రయీనన్దన ఏష వీరః
ప్రవీరమాతు స్తవ నన్దనో ఽస్తి ।
కల్యాణి! కల్యాణకరః సురాణాం
త్వత్తో ఽపరస్యాః కథ మేష సర్గః ॥ 10

శ్లో॥ దేవి! త్వ మే వాస్య నిదాన మాస్సే
సర్గే జగన్మఙ్గలగానహేతోః ।
సత్యం త్వ మే వేతి విచారయస్వ
రత్నాకరే యుజ్యత ఏవ రత్నమ్ ॥ 11

శ్లో॥ అతః శృణు ష్వావహితేన వృత్తం
బీజం య దగ్నౌ నిహితం మయా తత్ ।
సఙ్క్రాన్తమన్త స్త్రిదశాపగాయాం
తతో ఽవగాహే సతి కృత్తికాసు ॥ 12

శ్లో॥ గర్భత్వ మాప్తం తదమోఘ మేత
త్తాభిః శరస్తమ్బ మధి న్యధాయి ।
బభూవ తత్రాయ మభూతపూర్వో
మహోత్సవో ఽశేషచరాచరస్య ॥ 13

చంద్రశేఖరుడయిన శివుడు వివరములను తెలిసికొనవలెనను కుతూహలముగల హృదయప్రియయగు పార్వతియొక్క పై మాటను విని, కొంచెముగా నవ్వి, (చిరునవ్వుతో) మిక్కిలి ఆనందము కలుగుటవలన సౌఖ్యముకలిగించునట్టి మాటను ఇట్లు చెప్పెను. 9

ఓశుభప్రదురాలా! ముల్లోకముల నానందపరచు ఈ వీరుడు ప్రకృష్ట వీరజననివగు నీ కుమారుడే అయిఉన్నాడు. (ఇతడు నా కుమారుడగుటకు నిదర్శనమేమి యందువా?) ఇంద్రాదిదేవతలకు శుభముల నీయజాలిన ఇట్టి సృష్టి (కుమారుడు) నీకంటె వేరయిన ఇతరస్త్రీనుండి ఎట్లు జరుగును? (తారకుని వినాశమునందించుటకు కావలసిన శక్తి నీనుండి పుట్టిన వానికే ఉండును. అందువలన ఇతడు నీ కుమారుడే అని భావము.) 10

ఓ దేవీ! జగన్మంగళ గానముల నాలపించుటకు కారణభూతుడయిన ఈ కుమారుని ఉత్పత్తికి నీవే మూలకారణమువు అయి ఉన్నావు. ("నేనే మూలకారణము నగుటకు ప్రమాణమేమి?" అని ప్రశ్నింతువా?) నీవే నిజమును విచారింపుము. రత్నము రత్నాకరమునందే (1.సముద్రమునందే 2. గనియందే) ఉద్భవించుటకు తగియుండును. 11

ఓ ప్రియురాలా! అందువలన శ్రద్ధగా జరిగిన దానిని వినుము. "నేను ఏ నా వీర్యమును అగ్నియం దుంచితినో దాని నాతడు ఆకాశగంగ యందు విడిచినాడు. అందులో స్నానము చేయుటకు వెళ్ళిన కృత్తికలలోనికి ఆ నా తేజము గంగద్వారా ప్రవేశించినది. అచ్చట అది గర్భరూపమున పరిణమించినది. ఆ కృత్తికలు ఆ గర్భమును రెల్లుగడ్డి మీద ఉంచిరి. ఆ రెల్లుగడ్డిపైనుండి నా అమోఘమయిన తేజము అశేషచరాచరజగత్తు కంతటికి ఆనందప్రదుడగు (మహోత్సవప్రదుడగు.) ఈ బాలుడుగా పరిణమించినది. 12 &13

శ్లో॥ అశేషవిశ్వప్రియదర్శనేన ధుర్యా
త్వ మేతేన సుపుత్రిణీనామ్ ।
అలం విలం బ్యాచలరాజపుత్రి!
స్వపుత్ర ముత్సఙ్గతలే నిధేహి ॥ 14

శ్లో॥ అథేతి వాది న్యమృతాంశుమౌలౌ
శైలేన్ద్రపుత్రీ రభసేన సద్యః ।
సాన్ద్రప్రమోదేన సుపీనగాత్రీ
ధాత్రీ సమస్తస్య చరాచరస్య ॥ 15

శ్లో॥ కిరీటబద్ధాఞ్జలిభి ర్నభఃస్థై
ర్నమస్కృతా సత్వరనాకిలోకైః ।
విమానతో ఽవాతర తాత్మజం తం
గ్రహీతు ముత్కణ్ఠితమానసా భూత్ ॥ 16

శ్లో॥ స్వర్గాపగా పావకకృత్తికాదీ
న్కృతాఞ్జలీ నానమతోఽపి భూయః ।
హి త్వోత్సుకా తం సుత మాససాద
పుత్రోత్సవే మాద్యతి కా న హర్షాత్? ॥ 17

శ్లో॥ ప్రమోదబాష్పాకులలోచనా సా
న తం దదర్శ క్షణ మగ్రతోఽపి ।
పరిస్పృశన్తీ కరకుడ్మలేన
సుఖాన్తరం ప్రాప కి మప్యపూర్వమ్ ॥ 18

ఓ పర్వతరాజనందినీ! సమస్త జగత్తునకు ప్రీతికారణమయిన దర్శనముగల ఈ పుత్రునితో నీవు సత్పుత్రులను కన్నతల్లులలో శ్రేష్ఠురాలివి అయితివి. ఇక ఆలస్యము చేయవలదు. నీ కుమారుని ఒడిలో కూర్చుండబెట్టుకొనుము. 14

చంద్రశేఖరుడగు శివుడు ఈ విధముగా చెప్పగనే జగజ్జనని అయిన గిరిరాజకుమారి, మిక్కిలి ఆనందముతో ఉప్పొంగిపోయినదై ఆకాశముననున్న దేవతావర్గము వేగముగా తమ చేతులను కిరీటములకు జోడించి నమస్కరించుచుండగా, విమానమునుండి క్రిందికి దిగి ఆ కుమారుని ఎత్తుకొనుటయందు ఉత్సుకురా లయ్యెను. 15&16

పుత్రోత్సాహముచేత ఉత్కంఠితురాలయిన పార్వతి, తనకు ఆకాశగంగయును అగ్నియును, కృత్తికలును ప్రణమిల్లి, అంజలి ఘటించి మరల మరల నమస్కరించుచున్నను, వారిని విడిచి కుమారుని చూచు ఉత్సాహముతో ఆ కుమారుని వద్దకు చేరెను. కుమారునికన్న ఎవతె హర్ష పరవశురాలు కాకుండును? (అందరును హర్షపరవశు లగుదురని భావము.) 17

ఆ పార్వతి, తన కుమారు డెదురుగా ఉన్నప్పటికిని కళ్ళుఆనంద బాష్పములతో నిండియుండుటవలన చూడలేకపోయినది. తరువాత తన మొగ్గలవంటి సుకుమారమయిన చేతులతో ఆ బాలుని స్పృశించి, లోకోత్తరమయిన సుఖము ననుభవించెను. 18

శ్లో॥ సువిస్మయానన్దవికస్వరాయాః
శిశు ర్గలద్బాష్పతరఙ్గితాయాః ।
వివృద్ధవాత్సల్యరసోత్తరాయా
దేవ్యా దృశో ర్గోచరతాం జగామ ॥ 19

శ్లో॥ త మీక్షమాణా క్షణ మీక్షణానాం
సహస్ర మాప్తుం వినిమేష మైచ్ఛత్ ।
సా నన్దనాలోకనమఙ్గలేషు
క్షణం క్షణం తృప్యతి కస్య చేతః? ॥ 20

## పార్వతీ బాలం అఙ్కస్థం కరోతి

శ్లో॥ వినమ్రదేవాసురపృష్ఠగాభ్యా
మాదాయ తం పాణిసరోరుహాభ్యామ్ ।
నవోదయం పార్వణచన్ద్రచారుం
గౌరీ స్వ ముత్సఙ్గతలం నినాయ ॥ 21

శ్లో॥ స్వ మఙ్క మారోప్య సుధానిధాన
మివాత్మనో నన్దన మిన్దువక్త్రా ।
త మేక మేషా జగదేకవీరం
బభూవ పూజ్యా ధురి పుత్రిణీనామ్ ॥ 22

ఆశ్చర్యము, ఆనందములతో వికసించినకనులనుండి జాలువారు ఆనంద బాష్పములతరంగములుకలిగిన, కుమారుని పొందుటవలన పెరుగుచున్న వాత్సల్యరసోత్తర అయిన పార్వతియొక్క కంట, ఆ బాలుడు పడెను. (కుమారుని హర్షపరవశయై పార్వతి చూచెనని భావము.)19

ఆ బాలుని క్షణకాలము చూచుచున్న ఆ దేవి "ఇతనిని చూచుటకు కనురెప్పలువేయని వేయికళ్ళు కావలెనని కోరుకొనినది. (ఉన్న రెండు కళ్ళతో బాలుని పూర్తిగాచూచుటకు కుదురుటలేదు కనుక వేయి కళ్ళను కోరుకొనినదని భావము.) కుమారుని చూచుటే మంగళము. ఆ మంగళమును పొందువిషయమునందు ప్రతిక్షణము ఎవనిమనస్సు తృప్తిపడును? (ఎంత చూచినను తనివి తీరదని భావము.) 20

## బాలుని పార్వతి తన ఒడిలో కూర్చొనబెట్టుకొనుట

దేవదానవులు వినమ్రులై నమస్కరించుచుండగ వారి వెంట నుండి వారికి అభయము నీయజాలిన కరకమలముతో పార్వతీదేవి ఉదయించుచున్న పూర్ణిమనాటి చంద్రునివలె సుందరుడయిన కుమారుని పట్టుకొని, తన ఒడియందు కూర్చుండబెట్టుకొనెను. 21

ఇందువదనయగు పార్వతి అద్వితీయుడయిన, జగదేకవీరుడయిన, తన కుమారుని, అమృతపాత్రమును ఒడిలో పెట్టుకొనినట్లు ధరించి పుత్రవంతురాండ్రలో అగ్రపూజ నందుకొనిన దాయెను. 22

శ్లో॥ నిసర్గవాత్సల్యరసౌఘసిక్తా
సాన్ద్రప్రమోదామృతపూరపూర్ణా ।
త మేకపుత్రం జగదేకమాతా ఒభ్య
త్సఙ్గినం ప్రస్రవిణీ బభూవ ॥ 23

శ్లో॥ అశేషలోకత్రయమాతు రస్యాః
షాణ్మాతురః స్తన్యసుధా మధాసీత్ ।
సురస్రవన్త్యాః కిల కృత్తికాభి
ర్ముహు ర్ముహుః సస్పృహ మీక్ష్యమాణః ॥ 24

శ్లో॥ సుఖాశ్రుపూర్ణేన మృగాఙ్కమౌలేః
కలత్ర మేకేన ముఖామ్బుజేన ।
తస్యైకనాలోద్గతపఙ్కపద్మ
లక్ష్మీం క్రమా త్షడ్వదనీం చుచుమ్బ ॥ 25

శ్లో॥ హైమీ ఫలం హేమగిరే ర్లతేవ
వికస్వరం నాకనదీవ పద్మమ్ ।
పూర్వేవ ది బ్జానతన మిన్దు మాభా
త్తం పార్వతీ నన్దన మాదధానా ॥ 26

సహజసిద్ధమయిన వాత్సల్యరసప్రవాహములో మునిగి తేలుచున్నదై (ఈ వాత్సల్యము సహజసిద్ధవే కాని కేవలము తల్లి, కొడుకుల సంబంధమయినది కాదని భావము.) అతిశయమయిన ఆనందము అను అమృతప్రవాహముతో నిండినదై, జగజ్జనని ఒడిలో కూర్చొనియున్న బాలునికై స్తనములనుండి పాలను చేపినదాయెను. 23

ఆరుముఖములుకలిగిన కార్తికేయుడు ఆకాశగంగచేతను, కృత్తికలచేతను ఆశగా చూడబడుచున్నవాడై (మాకును చేపువచ్చినది. పార్వతియొక్క పాలనుత్రాగినతరువాత మా స్తనములనుండి ప్రవహించు అమృత మయములయిన పాలనుకూడా బాలుడు విస్మరించునా? అను) ఆశతో, మాటిమాటికి గంగా కృత్తికలచే చూడబడుచున్న వాడై, జగజ్జననియొక్క పాలను పూర్తిగా త్రాగెను. 24

చంద్రశేఖరుని భార్యయగు పార్వతి, ఒకే కాడుకు ఉద్భవించిన ఐదు పద్మముల శోభవంటి శోభకల ఆ కుమారస్వామియొక్క ఆరుముఖములను ఆనందాశ్రువులను విడుచుచున్న కన్నులుకల తన యొక్క వదనారవిందముతో, అతిశయమయిన ప్రేమతో వరుసగా ముద్దాడెను. 25

1. మేరుపర్వతప్రాంతమునందు పుట్టిన బంగరుతీగ, పండును ధరించినట్లును, 2. దేవనదియగు ఆకాశగంగ, వికసించిన పద్మమును ధరించినట్లును, 3. తూర్పు దిక్కు చంద్రుని ధరించినట్లును ఆ కుమారుని ఒడిలో పెట్టుకొని, పార్వతి ప్రకాశించినది. 26

## గౌరీశివౌ కుమారేణసమం విమానారోహణమ్

శ్లో॥ ప్రీతాత్మనా సా ప్రయతేన దత్త
హస్తావలమ్బా శశిశేఖరేణ ।
కుమార ముత్సఙ్గతలే దధానా
విమాన మభ్రంలిహ మారురోహ ॥ 27

శ్లో॥ మహేశ్వరోఽపి ప్రమదప్రరూఢ
రోమోద్గమో భూధరనన్దనాయాః ।
అఙ్కా దుపాదత్త తదఙ్కతః సా
తస్యాస్తు సోఽప్యాత్మజవత్సలత్వాత్ ॥ 28

శ్లో॥ దధానయా నేత్రసుధైకసత్రం
పుత్రం పవిత్రం సుతయా తయాఽద్రేః ।
సంశ్లిష్యమాణః శశిఖణ్డధారీ
విమానవేగేన గృహాన్ జగామ ॥ 29

శ్లో॥ అధిష్ఠితః స్ఫాటికశైలశృఙ్గే
తుఙ్గే నిజం ధామ నికామరమ్యమ్ ।
మహోత్సవాయ ప్రమథప్రముఖ్యా
న్పృథూ న్గణాన్ శమ్భు రథాదిదేశ ॥ 30

## కుమారుని తీసికొని, శివపార్వతులు విమానము నెక్కుట

ప్రీతుడై, సావధానుడయిన చంద్రశేఖరుని చేయూత నందుకొని ఆకాశమునంటుకొనునంతటి ఎత్తుగా ఉన్న విమానమును కుమారుని ఒడిలో ధరించుచు ఆ పార్వతీదేవి ఎక్కెను. 27

వాత్సల్యభావముచే ఒడలుపులకరించిన శివుడుకూడ కుమారుని మీది వాత్సల్యభావముతో గిరిరాజనందినియొక్క ఒడినుండి ఆ బాలుని తన ఒడిలోనికి తీసికొనెను. ఆ తరువాత ఆ శివునిఒడినుండి పార్వతి మరల ఆ బాలుని తన ఒడిలోనికి తీసికొనెను. మరల ఆమె ఒడి నుండి శివుడు ఆ బాలుని తన ఒడిలోనికి తీసికొనెను. (కుమారునిమీది అధిక వాత్సల్యభావమువలన ఒకరి నుండి మరియొకరు ఆ బాలుని అందుకొని రని భావము.) 28

అర్ధచంద్రధరుడయిన మహేశ్వరుడు, అమృతసత్రమును (అమృతపు నిధానమును అమృతము వలె నయనానందకరుడును) పవిత్రుడును అగు కుమారుని పట్టుకొనిన, హిమగిరితనయయగు పార్వతిని, ప్రేమతో కౌగిలించుకొని, విమానముయొక్కవేగమువలన త్వరగా తన గృహమునకు చేరెను. 29

ఆ తరువాత ఎత్తయిన స్ఫటికములకొండయైన కైలాసపర్వతశిఖరము మీదనున్న, మిక్కిలిఅందమయిన తనఆసనముమీద కూర్చొనినవాడై, మహోత్సవమును నిర్వహించుటకై తన ప్రమథగణనాయకులను మహేశ్వరుడు ఆజ్ఞాపించెను. 30

శ్లో॥ పృథుప్రమోదః ప్రగుణో గణానాం
గణః సమగ్రో వృషవాహనస్య ।
గిరీన్ద్రపుత్ర్యా స్తనయస్య జన్మ
న్యథోత్సవం సంవవృతే విధాతుమ్ ॥ 31

అవ. : ఇతః పరం సప్తభి రుత్సవా నేవాహ.

శ్లో॥ స్ఫురన్మరీచిచ్ఛురితామ్బరాణి
సన్తానశాఖిప్రసవాఞ్చితాని ।
ఉచ్చిక్షిపుః కాఞ్చనతోరణాని
గణా వరాణి స్ఫటికాలయేషు ॥ 32

## పుత్రజన్మమహోత్సవే మఙ్గలగీతాదీని

శ్లో॥ దిక్షు ప్రసర్పం స్తదధీశ్వరాణా
మథా మరాణా మివ మర్త్యలోకే ।
మహోత్సవం శంసితు మాహతో ఽ న్యై
ర్దధ్వాన ధీరః పటహః పటీయాన్ ॥ 33

శ్లో॥ మహోత్సవే తత్ర సమాగతానాం
గన్ధర్వవిద్యాధరసున్దరీణామ్ ।
సమ్భావితానాం గిరిరాజపుత్ర్యా
గృహే ఽ భవ న్మఙ్గలగీతకాని ॥ 34

ఆ తరువాత పార్వతీపరమేశ్వరుల కుమారునియొక్క జన్మోత్సవమును నిర్వహించుటకై మహానందమునొందిన గొప్పసుగుణములుగల ప్రమద గణసమూహము సన్నద్ధ మయ్యెను. 31

అవతారిక : ఇచ్చట నుండి ఏడు శ్లోకములలో జన్మోత్సవములను వర్ణించు చున్నాడు.

ప్రకాశించుచున్న కిరణకాంతులతో ఆకాశమునందు చిత్రవర్ణమును కల్పించుచున్నవియును, సంతానమను కల్పవృక్షముయొక్క పుష్పములతోను, పత్రములతోను నిర్మింపబడినవియును, బంగారు తీగలతో కూర్పబడినవియును అగు తోరణములను ప్రమథగణములు స్ఫటికపుఇండ్లకు ముందు భాగమున ఎత్తుగా కట్టిరి. 32

## పుత్రజన్మమహోత్సవమున మంగళవాద్యములు మ్రోగుట

తోరణములు కట్టిన తరువాత ఇంద్రాది దిక్పాలకులయొక్కయు, దేవతలయొక్కయు సేవకులచే మ్రోగింపబడిన, గంభీరముగా, బిగ్గరగా, మ్రోగుచున్న యుద్ధభేరీల శబ్దము, దశదిశల వ్యాపించి, మధ్యమలోకము నందు (భూలోకమునందు) కూడ జరుగబోవు కుమారజన్మోత్సవమును తెలియజేయుచున్నదో అన్నట్లు మార్మ్రోగెను. 33

ఆ మహోత్సవమునకు వచ్చిన, అందువలననే పార్వతిఇంటిలో సత్కరింపబడిన, గంధర్వ, విద్యాధరస్త్రీలు, మంగళగీతములను ఆలపించిరి. 34

శ్లో॥ సుమఙ్గలోపాయనపాత్రహస్తా స్తం
మాతరో మాతృవ దభ్యుపేతాః ।
విధాయ దూర్వాక్షతకాని మూర్ధ్ని
నిన్యుః స్వ మఙ్కం గిరిజాతనూజమ్ ॥ 35

శ్లో॥ ధ్వనత్సు తూర్యేషు సుమన్ద్ర మంక్యా
లింగ్యో ర్ధ్వకే ష్వప్సరసో రసేన ।
సుసన్ధిబన్ధం ననృతుః సువృత్త
గీతానుగం భావరసానువిద్ధమ్ ॥ 36

శ్లో॥ వాతా వవుః సౌఖ్యకరాః, ప్రసేదు
రాశా, విధూమో హుతభుగ్ దిదీపే ।
జలా న్యభూవ న్విమలాని, తత్రో
త్సవే, ఽన్తరిక్షం ప్రససాద సద్యః ॥ 37

శ్లో॥ గమ్భీరశఙ్ఖధ్వనిమిశ్ర ముచ్చై
ర్నభోద్భవా దున్దుభయః ప్రణేదుః ।
దివౌకసాం వ్యోమ్ని విమానసఙ్ఘా
విముచ్య పుష్పప్రచయా న్ప్రసస్రుః ॥ 38

శ్లో॥ ఇత్థం మహేశాద్రిసుతాసుతస్య
జన్మోత్సవే సమ్మదయాఞ్చకార ।
చరాచరం విశ్వ మశేష మేత
త్పురం చకమ్పే కిల తారకశ్రీః ॥ 39



పుత్రజన్మోత్సవమున మ్రోగిన మంగళవాద్యములు. శ్లోకము 36

మంగళద్రవ్యములు (పూజాద్రవ్యములను కానుకలను) కలిగిన పాత్రలను చేత బట్టుకొని వచ్చిన, సప్తమాతృకలు తలపై గరికె పోచలను, అక్షతలను పెట్టుకొని, ఆ ఉమా పుత్రుడయిన కుమారుని, తల్లియగు పార్వతివలెనే తమ తమ ఒడిలోనికి తీసికొనిరి. 35

1. అంక్యము, 2. ఆలింగ్యము, 3. ఊర్ధ్వకములు అను పేరుగల వాద్యవిశేషములు గంభీరస్వరములో మ్రోగుచుండగా, రంభ మొదలగు అప్సరసలు ప్రీతిపూర్వకముగా మంచి సంధిబంధములుగల మంచివృత్తములతో కూర్చబడిన గీతములను అనుసరించుచు శృంగారాది రసములతోనిండిన నాట్యమును చేయనారంభించిరి. 36

ఆ ఉత్సవమునందు వాయువు సుఖస్పర్శముగా వీవసాగెను. దిక్కులు నిర్మలము లయ్యెను. అగ్ని పొగలేక దేదీప్యమానముగా వెలుగొందెను. నీరు తేటదేరి స్వచ్ఛమయ్యెను. ఆకాశముకూడ వెంటనే విశద మయ్యెను. 37

శివుని ఇంటనుండు దుందుభులు గంభీరముగా మోగు పాంచజన్య శంఖధ్వనితోబాటుగా బిగ్గరగా మ్రోగసాగినవి. దేవతలసమూహములు విమానముల ద్వారా ఆకాశమునుండి పుష్పవృష్టిని కురిపించినవి. 38

ఈ విధముగా గిరిజాశంకరుల కుమారునియొక్క జన్మోత్సవమునందు సమస్తచరాచరజగత్తు ఆనందమున నోలలాడెను. కాని తారకాసురుని రాజ్యసంపదమాత్రము భయముతో గడగడ వణికిపోయెను. 39

## కుమారబాలలీలావర్ణనమ్

శ్లో॥ తతః కుమారః సముదాం నిదానైః
స బాలలీలాచరితై ర్విచిత్రైః ।
గిరీశగౌర్యో ర్హృదయం జహార
ముదే న హృద్యా కిము బాలకేలిః? ॥ 40

శ్లో॥ మహేశ్వరః శైలసుతా చ హర్షా
త్పతర్ష మేకేన ముఖేన గాఢమ్ ।
అజాతదన్తాని ముఖాని సూనో
ర్మనోహరాణి క్రమత శ్చుచుమ్బ ॥ 41

శ్లో॥ క్వచి త్స్ఖలద్భిః క్వచి దస్ఖలద్భిః
క్వచి త్ప్రకమ్పైః క్వచి దప్రకమ్పైః ।
బాలః స లీలాచలనప్రయోగై
స్తయో ర్ముదం వర్ధయతిస్మ పిత్రోః ॥ 42

శ్లో॥ అహేతుహాసచ్ఛురితాననేన్దు
ర్గృహాఙ్గణక్రీడనధూలిధూమ్రః ।
ముహు ర్వద న్కిఞ్చి దలక్షితార్థం
ముదం తయో రఙ్కగత స్తతాన ॥ 43

## శివకుమారయోః కౌతుకవర్ణనమ్

శ్లో॥ గృహ్ణ న్విషాణే హరవాహనస్య
స్పృశ న్నుమాకేసరిణం సలీలమ్ ।
స భృఙ్గిణః సూక్ష్మతరం శిఖాగ్రం
కర్ష న్బభూవ ప్రమదాయ పిత్రోః ॥ 44

## కుమారుని బాలలీలలవర్ణనము

అనంతర మా కుమారుడు అనేకరూపములయిన, మిక్కిలిప్రీతికారకము లయిన, తన బాల్యలీలలతో తలిదండ్రులయిన పార్వతీపరమేశ్వరుల యొక్క మనస్సులను పరవశింపజేసెను. మనోహరమయిన బాలకేళి సంతోషమును కలిగింపదా? (కలిగించియే తీరు ననిభావము.) **40**

ఆ మహేశ్వరుడును పార్వతియును సంతోషమువలన మిక్కిలి ఆశతో ఇంకను పళ్ళురాని కుమారుని ఆరు ముఖములను తమకున్న ఒక్కముఖముతోనే గట్టిగా, వరుసగా ముద్దాడిరి. **41**

ఆ కుమారుడు ఒక ప్రదేశమునందు జారుచున్న, మరియొకచోట జారని, (స్థిరమయిన) ఒకచోట వణకుచున్న, మరియొకచోట వణకని నడకను మొట్టమొదటిసారిగా నడుచుప్రయత్నమునందు ప్రదర్శించుచు తల్లిదండ్రుల ఆనందమును పెంపొందింపజేసెను. **42**

ఇంటిముంగిట ఆడుకొనుటచేత దుమ్ము అంటుకొనినశరీరముతో, ఒడిలో నికెక్కిన కుమారుడు, అకారణముగా నవ్వుటచేత మెరియుచున్న ముఖచంద్రుడుకలవాడై, సరిగా అర్థముకాని (బోధపడని) ఏవేవో మాట లను మాటిమాటికి మాటలాడుచు, తల్లిదండ్రుల నానందపరచెను. **43**

## శివుడు-కుమారస్వాములయొక్క పరిహాసచేష్టావర్ణనము

ఆ కుమారుడు హరునివాహనమైన నందీశ్వరునియొక్క కొమ్ములను పట్టుకొనుచును, పార్వతీదేవికి వాహనమయిన సింహపుజూలును తాకుచును, అట్లే ప్రమథగణములలోని భృంగియొక్క శిఖను లాగుచును తలిదండ్రుల నానందపఱచెను. **44**

శ్లో॥ ఏకో నవ ద్వౌ దశ పఞ్చ సప్తే
త్యజీగణ న్నాత్మముఖం ప్రసార్య ।
మహేశకణ్ఠోరగ దన్తపఙ్క్తిం
తదఙ్కగః శైశవమౌగ్ధ్య మైశిః ॥ 45

శ్లో॥ కపర్దికణ్ఠాన్తకపాలదామ్నో
ఉఙ్గులిం ప్రవే శ్యాననకోటరేషు ॥
దన్తానుపాత్తుం రభసీ బభూవ
ముక్తాఫలభ్రాన్తికరః కుమారః ॥ 46

శ్లో॥ శమ్భోః శిరోఽన్తఃసరితస్తరఙ్గా
న్విగాహ్య గాఢం శిశిరా న్రసేన ।
స జాతజాడ్యం నిజపాణిపద్మ
మతాపయ ద్భాలవిలోచనాగ్నౌ ॥ 47

శ్లో॥ కిఞ్చి త్కలం భఙ్గురకన్ధరస్య
నమజ్జటాజూటధరస్య శమ్భోః ।
ప్రలమ్బమానం కిల కౌతుకేన
చిరం చుచుమ్బే ముకుటేన్దుఖణ్డమ్ ॥ 48

శ్లో॥ ఇత్థం శిశోః శైశవకేలివృత్తై
ర్మనోఽభిరామై ర్గిరిజాగిరీశౌ ।
మనోవినోదైకరస ప్రసక్తౌ
దివానిశం నావిదతాం కదాచిత్ ॥ 49

తండ్రియొక్క ఒడిలోకూర్చొని ఆ ఈశ్వర కుమారుడు తన ముఖమును ముందుకుచాచి, ఈశ్వరుని మెడలోనున్న పాములయొక్క పలువరుసను బాల్యమునందలి ముగ్ధభావమువలన ఒకటి, తొమ్మిది, రెండు, పది, అయిదు, ఏడు అని లెక్కింపసాగెను. 45

కుమారుడయిన కార్తికేయుడు శివునికంఠమునుండి వేలాడుచున్న పుఱ్ఱెలమాలయొక్క నోటి కన్నములో వేలినిదూర్చి, అవి దాని ముత్యములేమో అను భ్రాంతితో దంతములను లాగుటకు తొందరపడుచుండెను. 46

ఆ కుమారుడు చల్లని నీరుగల శివుని జటాజూటమునకు మధ్యనున్న, గంగయొక్క అలలలోనికి ఇష్టపూర్వకముగా చేతినిపెట్టి, చల్లదనమువలన చేయి బిగుసుకొనిపోగా ఆ హస్తకమలమును శివుని నుదుటికంటి మంటయందు వెచ్చజేసికొనుచున్నాడు. 47

కొద్దిగా క్రిందికి మెడవంగుటచే జారిన జటాసమూహమునుండి వ్రేలాడుచున్న, అందమయిన చంద్రకళను ఆనందముగా ఆ కుమారుడు చిరకాలము ముద్దాడెను. 48

గిరిజాగిరీశులు, మనోభిరామములయిన ఇట్టి బాలుని శైశవలీలా చరిత్రములతో మనసార ఏకాంతానందముననుభవించుచు రాత్రింబవళ్ళ కాలమును తెలిసికొనలేకపోయిరి. (కాలముగడిచిన విషయమును కూడ గుర్తింపలేదని భావము). 49

శ్లో॥ ఇతి బహువిధం బాలక్రీడావిచిత్రవిచేష్టితం
లలితలలితం సాన్ద్రానన్దం మనోహర మాచరన్ ।
అలభత పరాం బుద్ధిం షష్ఠేదినే నవయౌవనం
స కిల సకలం శాస్త్రం వివేద విభు ర్యథా ॥ 50

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"కుమారబాలలీలాః"నామ ఏకాదశః సర్గః

-o0o-



పార్వతి ఒడిలోనున్న కుమార స్వామి. శ్లోకములు 21 నుండి 23 & 26

50 ఈవిధముగా వివిధములయిన మృదుమధురములయిన, సాంద్రానంద సంధాయకములయిన, బాలక్రీడా విచిత్రవిచేష్టితములను ప్రదర్శించుచు ఆకుమారుడు, తాను పుట్టిన ఆరవనాడు గొప్ప బుద్ధిశక్తిని, నవ యవ్వనమును పొందెను తన బుద్ధిశక్తితో సమస్త అస్త్రమంత్రములను తెలిసికొనెను (పురాతనజన్మమునందలి సత్‌సంస్కారమున్నవారికి అసాద్య మేదియు ఉండదని భావము ఈ శ్లోకము హరిణీవృత్తమునందు కూర్పబడినది.) 50

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన 'కుమారసంభవ"మను మహాకావ్యమునందు 'కుమారబాలలీలలు" అను పేరుగల పదునొకొండవ సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-





బాలలీలలను ప్రదర్శించు కుమారస్వామి - శ్లోకములు 43 నుండి 49 వరకు

# కుమారసమ్భవమ్

## "కుమారసేనాపత్యవర్ణనం" నామ

## ద్వాదశః సర్గః

### మహేశ్వరసదనే సురేశ్వరప్రవేశః

శ్లో॥ అథ ప్రపేదే త్రిదశై రశేషైః
క్రూరాసురోపప్లవ దుఃఖితాత్మా ।
పులోమపుత్రీదయితో ఽన్ధకారిం
పత్రీవ తృష్ణాతురితః పయోదమ్ ॥ 1

శ్లో॥ దృష్ట్వారి సన్త్రాసఖిలీకృతా త్స
కథఞ్చి దమ్భోద విహారమార్గాత్ ।
అవాతతా రాభిగిరిం గిరీశ
గౌరీపదన్యాసవిశుద్ధ మిన్ద్రః ॥ 2

శ్లో॥ సఙ్క్రన్దనః స్యన్దనతో ఽవతీర్య
మేఘాత్మనోమాతలిదత్తహస్తః ।
పినాకినో ఽథాలయ ముచ్చచాల
శుచౌ పిపాసాకులితో యథామ్భః ॥ 3

# కుమారసంభవము

## "కుమారసేనాపత్యవర్ణనము" అను పండ్రెండవ సర్గము

### తారకాసురునకు భయపడిన దేవేంద్రాదులు శివునివద్దకు వెళ్ళుట

ఆతరువాత క్రూరుడయిన తారకాసురుడు కలిగించిన ఆపదచే దుఃఖించినవాడై, పులోముడు అను మునికుమార్తెయైన, శచీదేవికి భర్తయగు ఇంద్రుడు, సమస్తదేవతాబృందములు తనవెంటరాగా, దాహముతో పీడింపబడుచున్నచాతకపక్షి మేఘమును సమీపించు చున్నట్లు, అంధకుడను రాక్షసునకు శత్రువయిన శివునివద్దకు వచ్చెను (ఈ సర్గమునందలి శ్లోకములు ఉపజాతికి చెందిన ఇంద్రవజ్రా ఛందస్సునందు కూర్చబడినవి.) 1

గర్వించినశత్రువువలని భయముచేత చొరరాని ఆకాశమార్గమునుండి, గౌరీశంకరులు అడుగిడుటచేత పవిత్రమయిన కైలాసపర్వతమునకు ఎదురుగాఉన్న ప్రదేశమునందు, అతికష్టముమీద ఆ ఇంద్రుడు దిగెను. 2

సారథియగు మాతలి అందించిన చేయూత నందుకొని మేఘాకారమున నుండు రథమునుండి దిగి, వేసవికాలములో దాహముచేత పీడితుడయిన పురుషుడు నీటివద్దకు ఆతురతతో వెళ్ళునట్లు ఆ తరువాత శివునివద్దకు ఇంద్రుడు వెళ్ళెను. 3

## ఇన్ద్రస్య శివసదనగమనమ్

శ్లో॥ ఇత స్తతోఽథ ప్రతిబిమ్బభాజం
విలోకమానః స్పటికాద్రిభూమౌ ।
ఆత్మాన మప్యేక మనేకధా స
వ్రజ న్విభో రాస్పద మాససాద ॥ 4

శ్లో॥ విచిత్ర చఞ్చన్మణిభఙ్గిసఙ్గం
సౌవర్ణదణ్డం దధతాఽతిచణ్డమ్ ।
స నన్దినాధిష్ఠిత మధ్యతిష్ఠ
త్సౌధాఙ్గణద్వార మనఙ్గశత్రోః ॥ 5

శ్లో॥ తతః స కక్షాహిత హేమదణ్డో
నన్దీ సురేన్ద్రం ప్రతిపద్య సద్యః ।
ప్రతోషయామాస సుగౌరవేణ
గత్వా శశంస స్వయ మీశ్వరస్య ॥ 6

శ్లో॥ భ్రూసంజ్ఞయానేన కృతాభ్యనుజ్ఞః
సురేశ్వరం తం జగదీశ్వరేణ ।
ప్రవేశయామాస సురైః పురోగః
సమం స నన్దీ సదనం [1]సదస్య ॥ 7

---

1. హరస్య

## ఇంద్రుడు శివసదనమునకు చేరుట

ఆతరువాత స్ఫటికాచలమగు కైలాసప్రాంతమునందు ముందుకుసాగుచు, ఇంద్రుడొక్కడే అయినను అచ్చటి స్ఫటికశిలలో అచ్చటచ్చట ప్రతిబింబించిన తన అనేకప్రతిబింబములను చూచుచు శివుడుండు ప్రదేశమునకు చేరెను 4

అచ్చట అనేకవర్ణములలో దేదీప్యమానములయిన మణులతో అలంకరింపబడినదియును, (నవరత్నఖచితమయిన అని భావము) మిక్కిలి భయంకరమయిన బంగారు బెత్తమునుధరించిన నంది ద్వారపాలకుడుగ నిలిచియున్నదియును, అగు మదనాంతకుడయిన శివునియొక్క రాజభవనపు ముఖద్వారమును దేవేంద్రుడుచేరెను (భగవదనుమతికొరకై ద్వారమువద్ద వేచియుండె నని భావము) 5

గణాధిపుడగునంది దేవేంద్రుని వెంటనే సమీపించి, మిక్కిలి గౌరవముతో స్వాగతవాక్యములను పలికి, ఆనందపరచెను. ఆ తరువాత తన చేతనున్న బంగారుబెత్తమును భవనపు ద్వారమువద్ద ఉంచి, స్వయముగా ఈశ్వరునకు (ఇంద్రునిరాకను) నివేదించెను. 6

ఇట్లు నంది విన్నవింపగా, జగదీశ్వరుడు తన కనుబొమలను అంగీకార సూచకముగా మాత్రమే కదిలింపగా చూచి, ప్రమధగణాధిపుడగు నందీశ్వరుడు తాను ముందునడుచుచు దేవతాసమూహములతోసహా శుభప్రదమయిన మహేశ్వరుని భవనములోనికి ఆ ఇంద్రుని ప్రవేశపెట్టెను. 7

## మహేశ్వరసదనే సురేన్ద్ర ప్రవేశః

శ్లో॥ స చణ్డిభృఙ్గిప్రముఖై ర్గరిష్ఠై
ర్గణై రనేకై ర్వివిధస్వరూపైః ।
అధిష్ఠితం సంసది రత్నమయ్యాం
సహస్రనేత్రః శివ మాలులోకే ॥ 8

## కైలాసధామ్ని శివదర్శనవర్ణనమ్

అవ. : అథ త్రయోదశభి ర్మహేశ్వరం విశినష్టి.

శ్లో॥ కపర్దముద్బద్ధమహీనమూర్ధ
రత్నాంశుభి ర్భాసుర ముల్లసద్భిః ।
దధాన ముచ్చైస్తర మిద్ధధాతోః
సుమేరు శృఙ్గస్య సమత్వ మాప్తమ్ ॥ 9

శ్లో॥ బిభ్రాణ ముత్తుఙ్గతరఙ్గమాలాం
గఙ్గాం జటాజూటతటం భజన్తీమ్ ।
గౌరీం తదుత్సఙ్గజుషం హసన్తీ
మివ స్వఫేనైః శరదభ్రశుభ్రైః ॥ 10

శ్లో॥ గఙ్గాతరఙ్గ ప్రతిబిమ్బితైః స్వై
బహూభవన్తం శిరసా సుధాంశుమ్ ।
చలన్మరీచిప్రచయై స్తుషార
గౌరై ర్విమద్యోతిత ముద్వహన్తమ్ ॥ 11

## మహేశ్వరుని సదనములోనికి సురేంద్రుడు ప్రవేశించుట

పెద్దలయిన, అనేకాకారములను ధరించిన చండి, భృంగి మొదలగు ప్రమధగణాధినాధులతోబాటు రత్నాసనముపై కూర్చొని ఉన్న శివుని ఆ వెయ్యికన్నులుకల దేవేంద్రుడు చూచెను. 8

## కైలాసమునందు శివుని దర్శించుట

**అవతారిక :** ఇచట నుండి పదమూడు శ్లోకములలో శివుని వర్ణించుచున్నాడు

పాములు అను త్రాళ్ళతో గట్టిగాకట్టబడినదియును, పాములనాయకుడుఅయిన వాసుకి మొదలగు మహాసర్పముల శిరోమణులకాంతులచే ప్రకాశించుచున్న దియును, ప్రవృద్ధమయిన గైరికాదిధాతువులచే ప్రకాశించు బంగరుకొండయగు మేరుపర్వతశిఖరములతో పోల్పదగినట్లున్నదియును అగు మిక్కిలి ఎత్తైన జటాజూటమును ధరించియున్న శివుని చూచెను 9

ఎత్తుగా ఎగిసిపడుచున్న తరంగములుకలదియును, శివుని జటాజూట సమీపమున ఉన్నదియును శరత్కాలపు మేఘమువలెనున్న తన నిర్మలయమయిన నురుగుముద్దలతో శివునిఒడిలోనికి చేరుచున్న సవతియగు పార్వతిని పరిహసించుచున్నదో అన్నట్లున్నదియును, అగు గంగను ధరించిన వాడును 10

గంగయొక్క అలలయందు ప్రతిబింబించిన శరీరముతో, అనేక రూపములతో కనబడుచున్న చంద్రబింబమును తలపై ధరించినవాడును, మంచువలె తెల్లని మెరియుచున్న తన కిరణములచేత అసలే తెల్లనైన తన శరీరమును ఇంకను తెల్లబరచుచున్నవాడును. 11

శ్లో॥ భాలస్థలే లోచన మేధమాన
ధామాధరీభూతరవీన్దునేత్రమ్ ।
యుగాన్తకాలోచిత హవ్యవాహం
మీనధ్వజప్లోషణ మాదధానమ్ ॥ 12

శ్లో॥ మహార్ఘరత్నాఞ్చితయో రుదారం
స్ఫురత్ప్రభామణ్డలయోః సమన్తాత్ ।
కర్ణస్థితాభ్యాం శశిభాస్కరాభ్యా
ముపాసితం కుణ్డలయో శ్చలేన ॥ 13

శ్లో॥ స్వబద్ధయా కణ్ఠికయేవ
నీలమాణిక్యమయ్యా కుతుకేన గౌర్యాః ।
నీలస్య కణ్ఠస్య పరిస్ఫురన్త్యా
కాన్త్యా మహత్యా సువిరాజమానమ్ ॥ 14

శ్లో॥ కాలార్దితానాం త్రిదశాసురాణాం
చితారజోభిః పరిపాణ్డురాఙ్గమ్ ।
మహన్మహేభాజిన ముద్గతాభ్ర
ప్రాలేయశైలశ్రియ ముద్వహన్తమ్ ॥ 15

నుదుటియందలి కంటిలో పెరుగుచున్న తేజస్సుతో దానిక్రిందనున్న సూర్యచంద్ర నేత్రముల తేజస్సును క్రిందుపరచుచున్నదియును (లేక తేజోవిశేషముగల పైనున్న కంటితో దానికంటె క్రిందిస్థానముననున్న తక్కిన సూర్యచంద్ర నేత్రములను అధఃకరించుచు అనికూడ, కన్నులున్న స్థలమునుబట్టి చమత్కార పూర్వకమయిన అర్థమును చెప్పుకొనవచ్చును ) ప్రళయాగ్నిని కలిగినదియును, చేపనే ధ్వజచిహ్నముగా ధరించిన మన్మథుని దహించినదియును అగు మూడవ కన్నును ధరించినవాడును. 12

మిక్కిలివిలువయిన మణులతోపొదగబడిన అందువలననే అన్నివైపుల అధికముగా కాంతిని ప్రసరింపచేయు, కుండలము అను మిషతో చెవితమ్మియందు కూర్చొనిన సూర్యచంద్రులచే సేవింపబడుచున్నవాడును. 13

కౌతుకముతో తనకంఠమునందు కట్టుకొనిన నీలమాణిక్యఖచిత మయిన గౌరీదేవియొక్క కంఠభూషణమో అన్నట్లు విరాజిల్లుచున్నదియును, అన్నివైపులకు ప్రసరించు తేజస్సుగలదియును అగు కంఠమునందలి నల్లనిమచ్చయొక్క గొప్ప కాంతికలవాడును. 14

అవసానకాలపు మృత్యువుచే పీడితులయిన, (మరణించిన) దేవతలయొక్క, రాక్షసులయొక్క చితులయందలి భస్మమును పూసికొనుటచే తెల్లనయిన శరీరముకలవాడును, (దేవతలకు మరణములేదుకదా మరి వారి చితాభస్మ లేపనమునకు అర్థమేమి అని ఆలోచించి కొందరు ఈమాట కవియొక్క ప్రమాదమువలన దొర్లినదని సరిపెట్టుకొనిరి అందువలననే మరికొందరు త్రిదశాసురులు అను పదమునకు బదులుగా మనుజాసురులు అను పాఠమును గ్రహించి, పైన కవిచేసిన దోషమును సర్దివేసిరి.) పెద్ద ఏనుగుయొక్క (గజాసురునియొక్క) చర్మమును ధరించినవాడును, అందువలననే ఏనుగుతోలు నల్లగా మేఘమువలె నుండగా, తెల్లనయిన శివునిశరీరము హిమవత్ పర్వతమువలె ఉండెనట. అట్టి మేఘహిమంతుల సన్నివేశమువలె ప్రకాశించుచున్నవాడును. 15

శ్లో॥ పాణిస్థితబ్రహ్మకపాల పాత్రం
వైకుణ్ఠభాజాపి నిషేవ్యమాణమ్ ।
నరాస్థికణ్ఠాభరణం రణాన్త
మూలం త్రిశూలం కలయన్త ముచ్చైః ॥ 16

శ్లో॥ పురాతనీం బ్రహ్మకపాలమాలాం
కణ్ఠేవహన్తం పున రాశ్వసన్తీమ్ ।
ఉద్గీతవేదాం ముకుటేన్దువర్ష
త్సుధాభరౌఘాప్లవలబ్ధసంజ్ఞామ్ ॥ 17

శ్లో॥ సలీలమఙ్కస్థితయా గిరీన్ద్ర
పుత్ర్యా నవాష్టాపదవల్లిభాసా ।
విరాజమానం శరదభ్రఖణ్డం
పరిస్ఫురన్త్యా చిరరోచిషేవ ॥ 18

శ్లో॥ దృష్టాన్తకప్రాణహరం పినాకం
మహాసురస్త్రీవిధవత్వహేతుమ్ ।
కరేణ గృహ్ణన్త మగృహ్య మన్యైః
పురా స్మరప్లోషణకేలికారమ్ ॥ 19

చేతిలో (బహ్మకపాలమును పట్టుకొని వైకుంఠాదిపుడయిన శ్రీహరిచేతకూడా సేవింపబడుచున్నవాడై, (వైకుంఠవాసుడు శివునిసేవించుట ఎప్పుడో ఒకప్పుడుమాత్రమే కాదు "శివకేశవుల మూర్తులు ఒకటే" అని ఏడవ సర్గమునందు చెప్పబడిన వాక్యమువలనను, అప్పుడప్పుడు విష్ణువుకంటె శివు డధికమహిమోపేతుడని చెప్పబడుటవలనను హరి, హరుని అప్పుడప్పుడు సేవించుచునే యుండునని తెలియుచున్నది.) అట్లే మానవులయొక్క ఎముకలను ఆభరణములుగా ధరించినవాడును (లేదా (ప్రళయకాలమునందు తన (త్రిశూలమునందు ఎముకలు కలవాడును), యుద్ధసమయములందు తన శ(త్రువులను సంహరించుటకు కారణమయిన (సాధనమయిన) గొప్ప (త్రిశూలము అను ఆయుధమును ధరించినవాడును 16

తలపైనున్న చం(ద్రునినుండి వర్షించుచున్న అమృత(ప్రవాహములలో మునిగిన (స్నానముచేసిన) ఫలితముగా తిరిగి జీవమునుపొందినదియును, (బహ్మ కపాలమాలయగుటవలన వేదోచ్చారణము చేయుచున్నదియును, పురాతన మయినదియును అగు (బహ్మకపాలమాలను కంఠమునందు ధరించుచున్న వాడును. 17

(క్రొత్త బంగరుతీగవంటి కాంతిగల, ((ప్రకాశించుచున్న) లీలగా తనఒడిలో కూర్చొనియున్న, పార్వతితో కూడి, పచ్చగా మెరియుచున్న మెరుపుతీగతోకూడిన తెల్లని హిమవంతుని వలె కనపడుచున్నవాడును. 18

గర్వించిన అంధకాసురుని (ప్రాణములను అపహరించినవాడును, మహా రాక్షసాంగనలవైధవ్యమునకుకారణభూతుడయినవాడును, (మహారాక్షస సంహారకుడని భావము) పూర్వము మన్మథుని అవలీలగా దహించినవాడును, తాముకాక ఏ ఇతర దేవతలచేతను ధరింపశక్యముగాని (పినాకము అను) ధనుస్సును కేల బూనినవాడును. 19

శ్లో॥ భద్రాసనం కాఞ్చనపాదపీఠం
మహార్ఘమాణిక్యవిభఙ్గిచిత్రమ్ ।
అధిష్ఠితం చన్ద్రమరీచిగౌరై
రుద్వీజ్యమానం చమరై ర్గణాభ్యామ్ ॥ 20

శ్లో॥ శస్త్రాస్త్ర విద్యాభ్యసనైకసక్తే
ష్వవిస్మయై రేత్య గణైః సుదృష్టే ।
నీరాజ్యమానే స్ఫటికాచలేన
సానన్దనిర్దిష్టదృశం కుమారే ॥ 21

శ్లో॥ తథావిధం శైలసుతాధినాథం
పులోమపుత్రీదయితో నిరీక్ష్య ।
ఆసీత్ క్షణం క్షోభపరోను కస్య మనో
న హి క్షుభ్యతి ధామధామ్ని? ॥ 22

శ్లో॥ వికస్వరామ్భోజ వనశ్రియా తం
దృశాం సహస్రేణ నిరీక్షమాణః ।
రోమాలిభిః స్వర్గపతి ర్బభాసే
పుష్పోత్కరాకీర్ణ ఇవాద్రుమశాఖీ ॥ 23

శ్లో॥ దృష్ట్వా సహస్రేణ దృశాం మహేశ
మభూ త్కృతార్థో ౬ తితరాం మహేన్ద్రః ।
సర్వాఙ్గజాతం తదధో విరూప
మివప్రియాకోపకరం వివేద ॥ 24

మిక్కిలి విలువయిన వజ్రమాణిక్యాదులతో అలంకరింపబడుటవలన చిత్రమయినదియును శుభప్రదమయినదియును, దానిముందు బంగరు పాదపీఠముగలదియును అగు సింహాసనముపై కూర్చునియున్నవాడును, (కొందరు భద్రాసనమని ఆ ఆసనమునకు పేరుపెట్టిరి ) చంద్రకిరణములచే తెల్లనయిన చామరములచే ప్రమదగణములచే వీచబడుచున్నవాడును 20

ధనుస్సు మొదలగుశస్త్రములను సమ్మోహనాద్యస్త్రములను విద్యలుగా అభ్యసించుటయందే ఏకాసక్తికలిగినవాడును, సమీపించిన ప్రమథగణములు మొదలగువారిచే ఆశ్చర్యముగా చూడబడుచున్నవాడును, జంగమరూపమును ధరించిన స్ఫాటికపర్వతమగు కైలాసముచే హారతి ఇవ్వబడినవాడును అగు తన కుమారుని రెప్పవాల్చకుండ ఆనందముతో చూచువాడును 21

పూర్వము పదమూడు శ్లోకములయందు చెప్పబడినట్లున్న గిరిజాపతిని (శివుని) శచీదేవికి ప్రియుడైన ఇంద్రుడు, దర్శించి ఒక్క క్షణకాలము మనఃక్షోభమువలన వ్యాకులు డయ్యెను (మహేశ్వరదర్శనముచేత ఆకులుడగుటేమి? అను అనుమానమునకు సమాధానము నిచ్చుచున్నాడు ) ఏలయనగా తేజోరాశి ముందు ఎవని మనస్సు క్షోభింపదు? (అందరి మనస్సు క్షోభించుననని భావము.) 22

స్వర్గాధిపతియగు ఇంద్రుడు, వికసించిన తామరపూల సౌందర్యమువంటి, అందముగల తన వెయ్యికన్నులతో మహేశ్వరుని చూచుచు, కలిగిన పులకరింతతో విరగబూసినపూలుకల మామిడికొమ్మవలె ప్రకాశించెను 23

వెయ్యికళ్ళతో శివునిచూచి ఇంద్రుడు మిక్కిలి కృతార్థు డయ్యెను. ఇంద్రునకు పులకరింతవలన కలిగిన అంగవికారము ఆతని భార్యయగు శచీదేవికి కోపము కలిగ్గించినదేమో అన్నట్లుండెను (అతడు తన సవతిని చూచుటవలన పులకరింత కలిగించినదేమో దాని వికారమే ఇది అని శచీదేవి అనుకొని కోపగించినట్లున్నదని భావము). 24

## ఇన్ద్రేణ శివాన్తికే కుమారదర్శనమ్

శ్లో॥ తతః కుమారం కనకాద్రిసారం
పురన్దరః ప్రేక్ష్య ధృతాస్త్రశస్త్రమ్ ।
మహేశ్వరోపాన్తికవర్తమానం
శత్రో ర్జయాశాం మనసా బబన్ధ ॥ 25

శ్లో। శ్రీనీలకంఠ! ద్యుపతిః పురోఽస్తి
త్వయి ప్రణామావసరం ప్రతీచ్ఛన్ ।
సహస్రనేత్రే ఽత్ర భవ త్రినేత్ర!
దృష్ట్యా ప్రసాదప్రగుణో మహేశ! ॥ 26

శ్లో॥ ఇతి ప్రబద్ధాఞ్జలి రేత్య నన్దీ
నిధాయ కక్షామభి హేమవేత్రమ్ ।
ప్రసాదపాత్రం పురతో భవిష్ణు
రథ స్మరారాతి మువాచ వాచమ్ ॥ 27

## శివుని సమీపమునందు కుమారస్వామిని ఇంద్రుడు చూచుట

ఆ తరువాత ఇంద్రుడు మేరుపర్వతమువంటి శక్తిగల అస్త్రములను, శస్త్రములను ధరించినవాడును, తండ్రియగు మహేశ్వరునివద్దనున్నవాడును అగు కుమారునిచూచి, తన శత్రువగు తారకాసురుని జయింపగలమని మనస్సులో దృఢముగా విశ్వసించెను. (కుమారుని చూడగనే 'ఈ బాలుడు నా శత్రువగు తారకాసురుని గెలువగల'డను దృఢనిశ్చయము దేవేంద్రునకు కలిగెనని భావము.) **25**

అనంతరము ప్రమథగణాధిపుడయిన నందీశ్వరుడు అందరికంటె ముందు నడుచుచుండుటచేత మహేశ్వరుడున్న ద్వారప్రాంతము మొదలుకొని, మహేశ్వరుడున్న మందిరప్రాంగణమువరకుగల మధ్యప్రదేశమునందు ప్రమథగణములును, దేవతాగణములును నిండియుండగా, అందరికంటె నేను ముందుగవెళ్ళి "తమ అనుగ్రహమును పొందుటకై" దేవేంద్రుడు వచ్చినాడను విషయమును చెప్పుటచేత, సంతోషించిన అంధకారిఅగు శివుడు ఇచ్చు పారితోషికమును పొందుటకు పాత్రుడుకాగోరి, శివుని సమీపించి, తన చేతిలోఉన్న బంగారుబెత్తమును ద్వారమువద్దఉంచి, (యజమానిని చూచుటకును, కబురుచెప్పుటకును వేత్రధారి (ద్వారపాలకుడు) వెళ్ళవలసినపుడు తన చేతనున్న బెత్తమును ద్వారమువద్ద ఉంచివెళ్ళుట వారి ఉద్యోగమునకు సంప్రదాయము. ఆ బెత్తమును, దానివలనకలుగు శిక్ష ఇతరులకేకాని యజమానికికాదు అని సూచించుటకే ఇట్లు చేసెనని భావము.) లోనికేగి చేతులుజోడించి మహేశ్వరునితో "ఓ శ్రీయుక్తుడయిన నీలకంఠుడా! పార్వతీసమేతుడవయిన మహేశ్వరుడా! స్వర్గాధిపతియయిన దేవేంద్రుడు నీకు ప్రణమిల్లుటకు, మీ అనుమతికొరకై ఎదురుచూచుచు నీ ద్వారము వద్ద (ఎదుట) వేచియున్నాడు. అందువలన ఓ త్రినేత్రుడా! నీ మూడుకన్నులను వేయికనులవానిపై ప్రసరింపజేసి అనుగ్రహింపుము" అని చెప్పెను. **26 & 27**

## శివం ప్రణమ్యేన్ద్రేణ స్వకృతార్థత్వ సమ్భావనమ్

శ్లో॥ పురా సురేన్ద్రం సురసంఘసేవ్యం
త్రిలోకసేవ్య స్త్రిపురాసురారిః ।
ప్రీత్యా సుధాసారనిధారిణేవ
తతో ఽనుజగ్రాహ విలోకనేన ॥ 28

శ్లో॥ కిరీట కోటిచ్యుత పారిజాత
పుష్పోత్కరేణానమితేన మూర్ధ్నా
స్వర్గైకవన్ద్యో జగదేకవన్ద్యం తం
దేవదేవం ప్రణనామ దేవః ॥ 29

శ్లో॥ అనేకలోకైక నమస్క్రియార్హం
మహేశ్వరం తం త్రిదశేశ్వరః సః ।
భక్త్యా నమస్కృత్య కృతార్థతాయాః
పాత్రం పవిత్రం పరమం బభూవ ॥ 30

శ్లో॥ సుభక్తిభాజా మధిపాదపీఠం
ప్రాన్తక్షితిం నమ్రతరైః శిరోభిః ।
తతః ప్రణేముః పురతో గణానాం
గణాః సురాణాం క్రమతః పురారిమ్ ॥ 31

శ్లో॥ గణోపనీతే ప్రభుణోపదిష్టః
శుభాసనే హేమమయే పురస్తాత్ ।
ప్రాపోపవిశ్య ప్రముదం సురేన్ద్రః
ప్రభుప్రసాదో హి ముదే న కస్య? ॥ 32

## శివునకు ప్రణమిల్లి, ఇంద్రుడు తాను కృతార్ధుడనైతినని భావించుట

నందీశ్వరు డిట్లు విన్నవించిన తరువాత త్రిజగత్తులచేత సేవింపబడదగిన, త్రిపురాసురాంతకుడయిన శివుడు, దేవతాసంఘములచే సేవింపబడు దేవేంద్రునికి ముందుగా అమృతధారలనువర్షించు తన దర్శనము నిచ్చెను ఆ తరువాత అనుగ్రహించెను (యజమానులయొక్క అనుగ్రహదృష్టియే సేవకులపై అనుగ్రహము చూపుట యగునని భావము.) 28

కేవలము స్వర్గలోక నివాసులచేత మాత్రమే నమస్కరింపబడిదగిన దేవేంద్రుడు, తలనువంచుటచేత క్రిందపడుచున్న కిరీటమునందలి పారిజాతమందారాది పుష్పములుకల తలతో, జగత్తులన్నింటికి ఏకైక వంద్యుడయిన మహేశ్వరునకు ప్రణమిల్లెను. 29

త్రిదశేశ్వరుడుఅయిన ఇంద్రుడు భక్తిపూర్వకముగా అనేకములయిన లోకములయందలి ప్రాణుల కందరకు నమస్కరింపదగిన, ఏకైక నాయకుడగు ఆ మహేశ్వరునకు నమస్కరించి, పరమపవిత్రతను, కృతార్ధతను పొందెను 30

తదనంతరము భక్తియుక్తులయిన, ఇంద్రుడుతప్ప మిగిలిన దేవతాగణము లన్నియు ప్రమధగణములముందు (వారు చూచుచుండగ అని అర్ధము) పాదపీఠముపై నుంచిన శివుని పాదములకు వినయ వినమితోత్తమాంగులై వరుసగా ప్రణమిల్లిరి. 31

(శివుని ఆజ్ఞచే) ఒకానొక ప్రమధునిచే తీసికొనిరాబడిన బంగారముతో నిర్మింపబడిన, శుభకరమయిన ఆసనమునందు శివునిచే ఆజ్ఞాపింపబడినవాడై, శివుని సన్నిధిని (ఎదుట) ఇంద్రుడు కూర్చుని ఆనందించెను. యజమానియొక్క అనుగ్రహము ఎవరిని సంతోషపరుపదు? (అందరిని సంతోషపరచునని భావము.) 32

శ్లో॥ క్రమేణ చాన్యేఽపి విలోకనేన
సమ్భావితాః సస్మిత మీశ్వరేణ
ఉపావిశం స్తోష విశేషమాప్తా
దృగ్గోచరే తస్య సురాః సమగ్రాః ॥ 33

శ్లో॥ అథాహ దేవో బలవైరిముఖ్యా
న్గీర్వాణవర్గా న్కరుణార్ద్ర చేతాః ।
కృతాఞ్జలీకా నసురాభిభూతా
న్ధ్వస్త శ్రియః శ్రాన్తముఖా నవేక్ష్య ॥ 34

## దేవేభ్యో హరస్య ఆగమనహేతు పరిప్రశ్నః

శ్లో॥ అహో బతానన్తపరాక్రమాణాం
దివౌకసో వీరవరాయుధానామ్ ।
హిమోదబిన్దుగ్లపితస్య కిం వః
పద్మస్య దైన్యం దధతే ముఖాని? ॥ 35

శ్లో॥ స్వర్గౌకసః స్వర్గపరిచ్యుతాః కిం
స్వపుణ్యరాశౌ సుమహత్తమేఽపి ।
చిహ్నం విరోధం న తు యూయ
మేతే నిజాధిపత్యస్య పరిత్యజధ్వమ్ ॥ 36

శ్లో॥ దివౌకసో దేవగృహం విహాయ
మనుష్యసాధారణతా మవాప్తాః ।
యూయం కుతః కారణత శ్చరధ్వం
మహీతలే మానభృతో మహాన్తః ॥ 37

ఇతర దేవతాగణములుకూడ చిరునవ్వుతో కొందరును, అనుగ్రహసూచకమైన చూపులతోనే మరికొందరును, ఈశ్వరునిచేత వరుసగా అనుగ్రహింపబడినవారై, మిక్కిలి సంతోషము నందిరి. అందరు శివుని దృష్టిలోపడునట్లు ఒకచోట గుమిగూడి యుండిరి 33

ఆ తరువాత ఇంద్రుని నాయకునిగ చేసికొని, తనవద్దకు వచ్చిన, తారకాసురుని చేత గెలువబడిన, అందువలననే తమ రాజ్యలక్ష్మిని కోల్పోయిన, దిగులుపడి యున్న ముఖములుగల (తమ సుఖమును, తేజస్సును పోగొట్టుకొనిన), తమ కష్టములను తొలగించుటకై చేతులుజోడించి, ప్రార్థించుచున్న, దేవతాగణములను చూచి, మనస్సు కరిగినవాడై వారితో దేవదేవుడయిన శివుడు ఇట్లనెను 34

## శివుడు దేవతల ఆగమనమునుగూర్చి కారణమును అడుగుట

ఓ స్వర్గలోకనివాసులారా! అపరిమితమయిన పరాక్రమముకల, మహా పరాక్రమశాలురయిన శత్రువులనుకూడ చంపజాలిన శక్తిమంతములయిన ఆయుధములను ధరించునట్టి, మీ ముఖములు మంచుచుక్కలచేత తన శోభను కోల్పోయిన పద్మములవలె ఎందుకు సంతసింపకున్నవి? (మీరు రాజ్యభ్రష్టు లగుటకు కారణమేమి? అని ప్రశ్నించెనని భావము.) 35

ఓ స్వర్లోక నివాసులారా! స్వర్గప్రాప్తికి కారణభూతమయిన, అక్షయమయిన పుణ్యము మీకున్నను స్వర్గమునుండి మీరెట్లు పరిభ్రష్టు లయినారు? కాని మీ రాజ్యాధిపత్యమునకు చిహ్నముగా చిరకాలమునుండి ధరించుచున్న ఛత్రచామరాదులను మాత్రము విడిచిపెట్టకుడు. (ఈ శ్లోకమునందు 'త్యజధ్వం' అను ఆత్మనేపద ప్రయోగము ఏలచేసినాడో ఆలోచింపవలసియున్నది ) 36

ఓ స్వర్గలోకనివాసులారా! మీరు గొప్పవారును, అభిమానధనులు అయిఉండి కూడ, దేవగృహమయిన స్వర్గలోకమును విడిచిపెట్టి, కేవలము మనుష్యులు ఉండు భూలోకమున ఎందుకు సంచరించుచున్నారు? (ఇచ్చటకూడ 'చరధ్వం' అను ఆత్మనేపద ప్రయోగము నేలచేసినాడో ఆలోచింపవలసియున్నది.) 37

శ్లో॥ అనన్య సాధారణ సిద్ధ ముచ్చై
స్త ద్దైవతం ధామ నికామరమ్యమ్ ।
కస్మా దకస్మా న్నిరగా ద్భువద్భ్య
శ్చిరార్జితం పుణ్య మివా పచారాత్ ॥ 38

శ్లో॥ దివౌకసో వో హృదయస్య
కస్మా త్తథావిధం ధైర్య మహార్య మార్యాః ।
అగా దగాధస్య జలాశయస్య
గ్రీష్మాతితాపాదివశా దివామ్భః ॥ 39

అవ. : సమ్ప్రతి స్వయమేవ భయనిమిత్తం దర్శయతి.

శ్లో॥ సురాః సురాధీశపురఃసరాణాం
సమీయుషాం వః సమమాతురాణామ్ ।
త ద్ర్బూత లోకత్రయ జిత్వరా త్కిం
మహాసురా త్తారకతో విరుద్ధమ్ ॥ 40

శ్లో॥ పరాభవం తస్య మహాసురస్య
నిషేద్ధు మేకో ఽ హ మలమ్భవిష్ణుః ।
దావానలప్లోషవిపత్తి మన్యో
మహామ్బుదా త్కిం హరతే వనానామ్? ॥ 41

శ్లో॥ ఇతీరితే మన్మథమర్దనేన సురాః
సురేన్ద్రప్రముఖా ముఖేషు ।
సాన్ద్రప్రమోదాశ్రుతరజ్గితేషు
దధుః శ్రియం సత్వర మాశ్వసన్తః ॥ 42

ఇతర ప్రదేశములతో పోల్చుటకు తగనిదియును, మీరు మీ పుణ్యములతో సాధించుకొనినదియును, మిక్కిలి మనోహరమయినదియును మిక్కిలి ప్రసిద్ధమయినదియును దేవతలకు నివాసమయినదియును అగు స్వర్గమును అకారణముగా (ఉన్నట్లుండి) ఏ అపచారమువలన మీరు చిరకాలమునుండి సంపాదించుకొనిన పుణ్యమునువలె విడిచిపెట్టినారు? 38

ఓ స్వర్గ నివాసులగు ఆర్యులారా గ్రీష్మతాపముచేత మిక్కిలి లోతయిన చెరువు యొక్కనీరు ఎండిపోవునట్లు అనిర్వచనీయమయిన మీ మనోధైర్యము ఏల నశించినది? 39

**అవతారిక :** ప్రస్తుతము తనంతతానే దేవతలకు కలిగినభయమునకు కారణమును చూపుచున్నాడు

ఓ దేవతలారా ఆతురులై, దేవేంద్రుని నాయకునిగచేసికొని మీరిచ్చటికి అందరును కలిసివచ్చుటకుగల కారణమును, ముల్లోకమును జయించిన తారకాసురునితో ఏర్పడిన శత్రుత్వమేనా! మీ శత్రువతడేనా? చెప్పుడు. 40

ఓ దేవతలారా! ఆ తారకాసురునివలన మీకు కలిగిన పరాజయమును నివారించుటకు నే నొక్కడనే సమర్థుడను. జనులకు దావానలమువలన కలిగిన దాహము (కాలిపోవుట) అను ఆపదను పెద్ద మేఘముకంటె ఏ ఇతరులయినను తొలగింపగలరా? (ఇతరుల కసాధ్యమని భావము.) 41

మదనాంతకుడయిన మహేశ్వరుడు ఈ విధముగా చెప్పగనే ఇంద్రుడు మొదలగు దేవతలు ఊరడిల్లి, (ప్రాణములు లేచివచ్చినట్లయి) మహేశ్వరుని వాక్యము వినుటవలనకలిగిన ఆనందముతో అలలవలె పొంగివచ్చుచున్న కన్నీళ్లుగల ముఖములయందు ఒక నూతనోత్సాహపు కాంతిని ధరించిరి 42

శ్లో॥ తతో గిరీశస్య గిరాం విరామే
జగాద లబ్ధేఽవసరే సురేన్ద్రః ।
భవన్తి వాచో ఽవసరే ప్రయుక్తా
ధ్రువం ఫలావిష్టమహోదయాయ ॥ 43

దేవతానాం దుఃఖకారణంప్రతి శివాయ ఇన్ద్రస్య విజ్ఞాపనమ్

శ్లో॥ జ్ఞానప్రదీపేన తమోపహేనా
వినశ్వరేణా స్ఖలితప్రభేణ ।
భూతం భవ ద్భావి చ యచ్చ
కిఞ్చి త్సర్వజ్ఞ! సర్వం తవ గోచరం తత్ ॥ 44

శ్లో॥ దుర్వారదోరుద్యమదుస్సహేన
య త్తారకే ణామరఘస్మరేణ ।
తదీశతామాప్తవతా నిరస్తా
వయం దివోఽమీ వద కిం న వేత్సి? ॥ 45

శో॥ విధే రమోఘం స వరప్రసాద
మాసాద్య సద్య స్త్రిజగజ్జిగీషుః ।
సురా నశేషా నహకప్రముఖ్యా
న్దోర్దణ్డచణ్డో మనుతే తృణాయ ॥ 46

శ్లో॥ స్తుత్యా పురా స్మాభి రుపాసితేన
పితామహే నేతి నిరూపితం నః ।
సేనాపతిః సంయతి దైత్యమేతం
పురః స్మరారాతిసుతో నిహన్తి ॥ 47

శివుడు మాట్లాడుట పూర్తిఅయిన తరువాత అవకాశమునుచూచికొని మహేంద్రుడు ఇట్లనెను యుక్తకాలమునందు మాట్లాడబడినమాటలు సఫలములై, సంపూర్ణాభ్యుదయమును కలిగించుననుట నిజము. 43

## దేవతల దుఃఖమునకు కారణమును ఇంద్రుడు శివునకు విన్నవించుట

ఓ సర్వజ్ఞుడా! అజ్ఞానమును నశింపచేయువాడవును, అక్షయుడవును అఖండానంద తేజోవిరాజితుడవును, ఆత్మజ్ఞాన దీపమవును అగు నీకు గడిచిన గడచుచున్న, జరుగబోవు విషయములన్నియును తెలియునుకదా! (నీ ఆత్మజ్ఞానముచేత త్రైలోక్యమునందు, త్రికాలములయందలి విషయముల నన్నింటిని నీవు తెలిసికొనుచున్నావు అని భావము ) 44

ఓ భగవంతుడా దుర్వారమయిన భుజదండపు బలముచేత దుఃస్సహుడై అందువలననే దేవతలను చంపునట్టివాడై స్వర్‌లోకాధిపత్యమును పొందిన తారకాసురునిచేత ఈ మేము (దేవతలము) స్వర్గమునుండి వెళ్ళగొట్టబడితిమి. ఈ విషయము నీకు తెలియదా? (నీకు తెలిసిన విషయమే ఇది అని భావము ) 45

ఆ తారకాసురుడు, బ్రహ్మనుండి అమోఘమయిన వరమునుపొంది, వెంటనే తన బాహుబలముతో దుర్జయుడయి, ముల్లోకములను గెలువగోరి నేను నాయకుడనయిన సర్వదేవతలను తృణీకరించుచున్నాడు. 46

పూర్వము మేము స్తుతింపగా మా కనుకూలముగా అనుగ్రహించిన బ్రహ్మదేవుడు మాతో ఇట్లనెను. “ఓ దేవతలారా! యుద్ధములో మదనాంతకుడగు శివుని యొక్క కుమారుడు దేవసేనాధిపతియై, ఈ రాక్షసుని భావికాలమునందు సంహరింపగలడు.” 47

శ్లో॥ అహో తతో౽నన్తర మద్య యావ
త్సుదుస్సహాం తస్య పరాభవార్తిమ్ ।
విషేహిరే హన్త హృదన్తశల్యా
మాజ్ఞానివేశం త్రిదివౌకసో౽మీ ॥ 48

దేవైః స్వపరాభవార్తిహరణే కుమా రాదేశయాచనమ్

శ్లో॥ నిదాఘధామక్లమవిక్లవానాం
నవీనమమ్భోద మివౌషధీనాం ।
సునన్దనం నన్దమాత్మనో నః
సేనాన్య మేతం స్వయ మాదిశ త్వమ్ ॥ 49

శ్లో॥ త్రైలోక్య లక్ష్మీహృదయైకశల్యం
సమూల ముత్థాయ మహాసురం తమ్ ।
అస్మాక మేషాం పురతో భవన్న
స్దుఃఖాపహారం యుధి యో విధత్తే ॥ 50

శ్లో॥ మహాహవే నాథ తవాస్య సూనోః
శస్త్రైః శితైః కృత్తశిరోధరాణామ్ ।
మహాసురాణాం రమణీవిలాపై
ర్దిశో దశైతా ముఖరీభవన్తు ॥ 51

బ్రహ్మదేవుడు ఇట్లు చెప్పిన తరువాత, ఈనాటివరకు దేవతలు భరింపరాని, ఆ తారకాసురుడు కలిగించిన, పరాభవపీడను మనఃశల్యమునువలె బ్రహ్మయొక్క సూచనమేరకు సహించిరికదా 48

## తమ పరాభవార్తిని తొలగించుటకై కుమారు నాజ్ఞాపింపుమని దేవతలు శివుని ప్రార్థించుట

భగవంతుడా. వేసవికాలపు సూర్యతాపాధిక్యముచే వాడిపోయిన ఓషధులకు మిక్కిలి ఆనందమును కలిగించు క్రొత్త అషాఢమాసపు మేఘమువలె మా కానందమును కలిగింపుము ఈ దేవసేనాపతికాగల, నీ ఎదుటనేయున్న నీకుమారుని, మా దేవకార్యమును నిర్వర్తించుటకై నీవు స్వయముగా అజ్ఞాపింపుము. 49

ఎవడు త్రిలోకకంటకుడును, దుర్ధర్షుడును అగు తారక మహాసురుని యుద్ధమునందు, మాకు ముందుగా సేనాపతిగా నిలబడి, మొదలంట (సమూలముగా) సంహరించి మా దుఃఖమును నశింపజేయునో, అట్టి నీ కుమారుని తారకనాశనమునకై అజ్ఞాపింపుము (అతడు మా సేనానాయకుడు కానిచో దురంతమయిన మా దుఃఖ మెట్లు ఉపశమించును? అని భావము )50

ఓ నాథుడా (రక్షకుడా) ! మహాయుద్ధమునందు మాముందు నిలిచియుండు నీ కుమారునియొక్క వాడియయిన ఖడ్గములు బాణములు మొదలగు శస్త్రములచేత తలలు నరుకబడిన మహాసురుల భార్యలయొక్క వైధవ్య సూచకమయిన రోదనము పదిదిక్కులయందు మారుమ్రోగునుగాక 51

శ్లో॥ మహోరణక్షోణి పశూపహారీ
కృతే ఽసురే తత్ర తవాత్మజేన ।
వన్దిస్థితానాం సుదృశాం కరోతు
వేణీప్రమోక్షం సురలోక ఏషః । 52

శ్లో॥ ఇత్థం సురేన్ద్రే వదతి స్మరారిః
సురారిదుశ్చేష్టితజాతరోషః ।
కృతానుకమ్పస్త్రిదశేషు తేషు
భూయోఽపి భూతాధిపతి ర్బభాషే ॥ 53

## తారకవధో భావీతి శివస్యాశీర్వచనమ్

శ్లో॥ అహో అహో దేవగణాః సురేన్ద్ర
ముఖ్యాః శృణుధ్వం వచనం మమైతే ।
విచేష్టతే శఙ్కర ఏష దేవః
కార్యాయ సజ్జో భవతాం సుతాద్యైః ॥ 54

శ్లో॥ పురా మయాకారి గిరీన్ద్రపుత్ర్యాః
ప్రతిగ్రహోఽయం నియతాత్మనాపి ।
తత్రైష హేతుః ఖలు తద్భవేన
వీరేణ య ద్వధ్యత ఏవ శత్రుః ॥ 55

ఆ భీషణయుద్ధభూమిలో తారకాసురుని నీ కుమారుడు నక్కలు మొదలగు పశువులకు కానుకగా సమర్పింపగా (చంపగా) ఆ రాక్షసుడు బందించిన తమతమ భార్యలయొక్క జటాబంధములను ఈ దేవతలు విడిపింతురుగాక (శత్రువులచే బంధింపబడిన పతివ్రతలు బంధనములో ఉన్నంతవరకు జడలను వేసికొనక, జుట్టును జడలు కట్టించుకొనుటో ఒకే ముడి వేసికొనుటో చేయుదురు రాక్షసుని సంహరించిన తరువాత ఆయా స్త్రీలభర్తలు వారికి కేశసంస్కారమును చేసి జుట్టుముడిని విడిపించుట సంప్రదాయము భారతమునందలి కపటద్యూత(జూద)మునందు ఓడిన, ద్రౌపది వేసికొనిన జడను, భీముడు భారతయుద్ధమునందు దుఃశ్శాసనుని చంపి, ఆతను నెత్తుటితో ఆమె కేశములను సంస్కారముచేసి, వేణీసంహారమును చేసినట్లు మనకు తెలుపబడినది.) 52

దేవేంద్రు డిట్లు ప్రార్థింపగా తారకాసురుడు చేసిన దైవాపచారములను విని, కోపించిన మదనాంతకుడును, పశుపతియును అగు శివుడు ఆ దేవతలపై కరుణించి మరల వారితో ఇ ట్లనెను 53

## తారకవధ జరుగునని శివు డాశీర్వదించుట

అహో. అహో! దేవేంద్రుడు నాయకుడుగాగల ఓ దేవగణములారా! ఇక మీరు నా ఈ మాటను వినుడు. "ఈ శంకరదేవుడు పుత్రపౌత్రాదులతో కూడి, మీపనిని సాధించుటకై సిద్ధముగా ఉన్నాడు " (నేను పుత్రాదులను పొందుటకూడ మీ కార్యసిద్ధికొరకే అని భావింపుడు ) 54

మీకు శత్రువయిన ఈ తారకాసురుడు పార్వతివలన జన్మించిన వీరునిచే మరణించునను విషయమును తెలిసికొనియే నేను పూర్వము జితేంద్రియుడనై ఉండికూడ, హిమగిరితనయను వివాహముచేసికొంటిని 55

శ్లో॥ అత్రో ప్రపన్నం త దమీ నియుజ్య
కుమార మేనం పృతనాపతిత్వే ।
నిఘ్నన్తు శత్రుం సురలోక మేష
భునక్తు భయోఽపి సురైః సహేన్ద్రః ॥ 56

శ్లో॥ ఇ త్యుదీర్య భగవాం స్త మాత్మజం
ఘోరసఙ్గరమహోత్సవోత్సుకమ్ ।
నన్దనం హి జహి దేవ విద్విషం
సంయతీతి నిజగాద శఙ్కరః ॥ 57

శ్లో॥ శాసనం పశుపతేః స కుమారః
స్వీచకార శిరసావనతేన ।
సర్వథైవ పితృభక్తి రతానా
మేష ఏవ పరమః ఖలు ధర్మః ॥ 58

శ్లో॥ అసురయుద్ధవిధౌ విబుధేశ్వరే
పశుపతౌ వదతీతి త మాత్మజమ్ ।
గిరిజయా ముముదే సుతవిక్రమే
సతి న నన్దతి కా ఖలు వీరసూః? ॥ 59

శ్లో॥ సురపరివృఢః ప్రౌఢం వీరం కుమార ముమాపతే
ర్బలవ దమరారాతిస్త్రీణాం దృగఞ్జనభఞ్జనమ్ ।
జగదభయదం సద్యః ప్రాప్య ప్రమోదపరో ఽభవద్
ధ్రువమభిమతే పూర్ణే కో వా ముదా న హి మాద్యతి ॥ 60

అందువలన మీ కార్యము సరియయినది. (యోగ్యమయినది) పై కార్యమును నిర్వహించుటకే అవతరించిన ఈ కుమారుని దేవసేనాపతిగా ప్రతిష్ఠించి, మీ శత్రువయిన తారకుని సంహరింపుడు (వీని సాహాయ్యముతో తారకుని సంహరింపుడని అర్థము.) మరల దేవేంద్రుడు దేవతలతో కలిసి స్వర్గలోకాధి పత్యము ననుభవించును గాక **56**

శంకరభగవానుడు ఇట్లు పలికి భయంకరమయిన యుద్ధముచేయుట యందధికోత్సాహముగల, ఆనందసందాయకుడగు, ఆ కుమారునితో 'కుమారా! యుద్ధమునందు ఇంద్రద్వేషియగు తారకాసురుని సంహరింపుము" అని చెప్పెను **57**

ఆ కుమారుడు కొంచెముగా తలనువంచి (వినయముతో) తండ్రియొక్క ఆజ్ఞను శిరసావహించెను. తండ్రిపై భక్తిశ్రద్ధలుగల కుమారులు సర్వవిధముల ఇట్లు ప్రవర్తించుట ఆ కుమారుల పరమధర్మము కదా! **58**

సర్వదేవతాసార్వభౌముడును, పశుపతియును అగు శివుడు తారకాసురునితో యుద్ధము చేయవలసిన విషయమునుగూర్చి కుమారునకు చెప్పగా నిజముగా పర్వతాజపుత్రి మిక్కిలి సంతసించెను. తన కుమారుడు పరాక్రమశాలి యయినప్పుడు ఏ వీరమాత సంతసింపదు? (తప్పక సంతసించి తీరునని భావము. ఈ శ్లోకము ద్రుతవిలంబితవృత్తమునందు కూర్పబడినది.) **59**

మహాపరాక్రమశాలియయిన, బలవంతుడయిన తారకాసురునియొక్క భార్యల కళ్ళకుపెట్టుకొనిన కాటుకను తుడిచేయువాడును, (భర్త మరణించిన భార్యలు కాటుకను ధరించుట అనుచితమను సంప్రదాయ మిచ్చుట సూచింపబడినది.) అందువలననే జగత్తుల కన్నింటికిని అభయదాతయును, ఈశ్వరపుత్రుడును

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"కుమారసేనాపత్యవర్ణనం"నామ ద్వాదశః సర్గః

-o0o-



సేనాపత్యభారమును అంగీకరించిన కుమారస్వామి - శ్లోకము 58

అగు కుమారుని సేనానాయకునిగా పొంది వెంటనే మిక్కిలి హర్షపరవశు డయ్యెను తాను కోరిన కోర్కె నెరవేరగా కలిగిన ఆనందముచేత పరవశింపని వా డెవ డుండును? (అందరును పరవశింతు రని భావము. ఈ శ్లోకము హరిణీ ఛందస్సునందు కూర్పబడినది ) 60

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "కుమారసేనాపత్యవర్ణనము" అను పేరుగల
పం(డెండవసర్గమునకు "(పవచన(పభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన (బహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సు(బహ్మణ్య శర్మ వెలయించిన ఆం(ధానువాదము

-o0o-



కుమారుని సేనానిగా చేయుమని దేవతలు
శివుని (ప్రార్థించుట. శ్లోకము 49

# కుమారసమ్భవమ్

## "కుమారసేనాపత్యాభిషేకః" నామ

## త్రయోదశః సర్గః

శ్లో॥ ప్రస్థానకాలోచిత చారువేషః
స స్వర్గివర్గై రనుగమ్యమానః ।
తతః కుమారః శిరసా నతేన
త్రైలోక్యభర్తుః ప్రణనామ పాదౌ ॥ 1

శ్లో॥ జహీన్ద్రశత్రుం సమరే ఽ మరేశ
పదం స్థిరత్వం నయ వీర! వత్స! ।
ఇత్యాశిషా తం ప్రణమన్త మీశో
మూర్ధ న్యుపాఘ్రాయ ముదా భ్యనన్దత్ ॥ 2

శ్లో॥ ప్రహ్వీభవ న్నమ్రతరేణ మూర్ధ్నా
నమశ్చకా రాంఘ్రియుగం స్వమాతుః ।
తస్యాః ప్రమోదాశ్రుపయః ప్రవృష్టి
స్తస్యాభవ ద్వీరవరాభిషేకః ॥ 3

# కుమారసంభవము

## "కుమారసేనాపత్యాభిషేకము" అను పదుమూడవ సర్గము

ఆ తరువాత ఆ కార్తికేయుడు యుద్ధమునకు బయలుదేరునప్పుడు తత్కాలోచితమయిన, సుందరమయిన వేషముకలవాడై, ఇంద్రాది దేవగణములచే అనుసరింపబడుచున్నవాడై, శిరసును వంచి వినయముతో త్రిలోకనాధుడయిన శివుని పాదములకు ప్రణమిల్లెను (ఈ సర్గమునందలి శ్లోకములు ఇంద్రవజ్రాఛందస్సునందు కూర్పబడినవి ) 1

నమస్కరించుచున్న ఆ కుమారునిచూచి, శివుడు సంతోషముతో ఆతని తలను మూర్కొని, "ఓ వీరుడా! వత్సా! యుద్ధములో తారకాసురుని సంహరింపుము స్వర్గపదవిని స్థిరపరుపుము" ఇట్టి ఆశీస్సులతో కుమారుని అభినందించెను. 2

వంగుచు, మిక్కిలి వినయప్రదర్శకమగు తలతో (ఈ విషయమువలన ఇతరావయవములకంటె బాగుగా తలనువంచినాడని అర్ధమును గ్రహింప వలెనని భావము ) తల్లియగు పార్వతియొక్క పాదయుగ్మమునకు ప్రణమిల్లెను. ఆమె కనులనుండి వర్షపుధారలవలె ప్రవహించు ఆనందబాష్పసారము సేనాపతియగు వీరవరునకు చేయు అభిషేక మయ్యెను. (ఆనందబాష్పధారలతో ఆపాదమస్తకము తడిపెనని భావము ) 3

శ్లో॥ త మఙ్కమారోప్య సుతా హిమాద్రే
రాశ్లిష్య గాఢం సుతవత్సలా సా ।
శిర స్యుపాఘ్రాయ జగాద శత్రుం
జిత్వా కృతార్థీ కురు వీరసూం మామ్ । 4

శ్లో॥ ఉద్దామదైత్యేశవిపత్తిహేతుః
శ్రద్ధాలుచేతాః సమరోత్సవస్య ।
ఆపృచ్ఛ్య భక్త్యా గిరిజాగిరీశౌ
తతః ప్రతస్థే ఽభిదివం కుమారః ॥ 5

శ్లో॥ దేవం మహేశం గిరిజాం చ దేవీం
తతః ప్రణమ్య త్రిదివౌకసో ఽపి ।
ప్రదక్షిణీకృత్య చ నాకనాథపూర్వాః
సమస్తా స్త మథానుజగ్ముః ॥ 6

శ్లో॥ అథ వ్రజద్భి స్త్రిదశై రశేషైః
స్ఫురత్ప్రభా భాసుర మణ్డలై స్తైః ।
నభో బభాసే పరితో వికీర్ణం
దివాపి నక్షత్రగణై రివోగ్రైః । 7

శ్లో॥ రరాజ తేషాం వ్రజతాం సురాణాం
మధ్యే కుమారో ఽధికకాన్తికాన్తః ।
నక్షత్రతారాగ్రహమణ్డలానా
మివ త్రియామారమణో నభో ఽన్తే ॥ 8

కుమారునిమీద వాత్సల్యభావముకల ఆ పార్వతి ఆ కార్తికేయుని ఒడిలోనికి తీసికొని, గాఢముగా ఆలింగనముచేసికొని, మూర్కొని, 'ఓ వత్సా నీవు శత్రువయిన తారకుని గెలిచి నన్ను వీరమాతగా చేయుము" అని పలికెను 4

తదనంతరము మహాభయంకరుడయిన తారకాసురుని చంపుటకై యుద్ధము చేయుటయందు ఉత్సాహపడుమనస్సుకల కార్తికేయుడు భక్తిపూర్వకముగా తన తల్లిదండ్రులయిన గిరిజాగిరీశులవద్ద శెలవుతీసికొని, స్వర్గము వైపునకు బయలుదేరెను 5

తరువాత ఇంద్రుడు మొదలుగాగల స్వర్గవాసులయిన సమస్తదేవతలుకూడ శివపార్వతులకు ప్రణమిల్లి, ప్రదక్షిణముచేసి, కుమారస్వామిని అనుసరించి బయలుదేరిరి. 6

పిమ్మట కదులుచుండుటవలన ప్రకాశించుచున్న తేజోమండలముకల ఆ దేవతలందరిచేత వ్యాపింపబడిన ఆకాశము, పగటిపూట కూడ ప్రకాశమానములయిన నక్షత్రములతో కూడియున్నదా అన్నట్లు వెలుగొందు చుండెను 7

అంతరిక్షమున నడుచుచున్న ఆ దేవతలమధ్యన కార్తికేయు దుండి, తన అధిక కాంతితో మనోహరుడయి, అశ్విన్యాదులయిన ఇరవయ్యేడు నక్షత్రములకును, సూర్యాది నవగ్రహములకును మధ్యనుండు చంద్రునివలె ప్రకాశించెను. 8

## పిత్రాశంసితకుమారస్య యుద్ధప్రస్థానమ్

శ్లో॥ గిరీశగౌరీతనయేన సార్ధం
పులోమపుత్రీదయితాదయ స్తే
ఉత్తీర్య నక్షత్రపథం ముహూర్తా
త్ప్రపేదిరే లోక మధాత్మనీనమ్ ॥ 9

శ్లో॥ తే స్వర్గలోకం చిరకాలదృష్టం
మహాసురత్రాసవశంవదత్వాత్ ।
సద్యః ప్రవేష్టుం న విషేహిరే తత్
క్షణం వ్యలమ్బన్త సురాః సమగ్రాః । 10

శ్లో॥ పురో భవ త్వం న పురో భవామి
నాఽహం పురోగోఽస్మి పుర స్సర త్వమ్ ।
ఇత్థం సురా స్తత్క్షణమేవ భీతాః
స్వర్గం ప్రవేష్టుం కలహం వితేనుః ॥ 11

శ్లో॥ సురాలయాలోకనకౌతుకేన
ముదా శుచిస్మేరవిలోచనా స్తే ।
దధుః కుమారస్య ముఖారవిన్దే
దృష్టిం ద్విషత్సాధ్వసకాతరాన్తామ్ ॥ 12

## తండ్రి ఆజ్ఞపై కుమారస్వామి యుద్ధమునకు బయలుదేరుట

అంతట శచీపతియగు ఇంద్రుడు నాయకుడుగాగల ఆ దేవగణములు, శివపార్వతీ నందనుడగు కుమారస్వామితోకూడి, క్షణకాలములో ఆకాశ మార్గమును దాటి, తమ లోకమగు స్వర్గమునకు చేరుకొనిరి (ఈ శ్లోకమునందు శివకుమారుడో గౌరీపుత్రుడో అని తల్లిదండ్రులలో ఎవరికో ఒకరికి కుమారు డననిన చాలును కదా "శివపార్వతీ నందను"డనుట ఎందులకు? అను అనుమానమును తీర్చుటకు చెప్పిన సమాధాన మిది. శివుని పరాక్రమము, పార్వతియొక్కశక్తి రెండునుకలిసి అవతరించిన కుమారుడు కనుక ఆతని అధికశక్తిని ప్రకటించుటకే ''గిరీశగౌరీతనయుడు'' అనుపదము ప్రయోగింపబడినది.) 9

తారకాసురునివలన కలిగిన భయమునకు లోబడుటవలన, చాలకాలము తరువాత చూచిన స్వర్గలోకములోనికి ఆ దేవత లందరును వెంటనే ప్రవేశింపలేక పోయిరి క్షణకాలము దానిలోనికి ప్రవేశించుటకు తటపటాయించిరి. (వెనుకాడుచు ఆలస్యముచేసిరి భయపడిన ఎవడయినను తన ఇంటిలోనికి ప్రవేశించుటకు ఆలస్యముచేయునట్లే దేవతలు కూడ వెంటనే స్వర్గములోనికి ప్రవేశింపక ఆలస్యము చేసిరని భావము ) 10

తత్క్షణమే తారకుని ఉనికిచే భయపడిన దేవతలు స్వర్గములోనికి ప్రవేశించుటకు "నీవు ముందు నడువుము. నేను ముం దుండను కాని నీవే ముం దుండుము, నేను ముందు నడువను. నీవు ముందు నడువుము' అని ఈవిధముగా కలహించుకొనసాగిరి (ఎవడును లోనికి ప్రవేశింపక అచ్చటేయుండి పరస్పరము కలహించుకొనసాగిరని భావము ) 11

స్వర్గమును చూచుటచేత కలుగు ఆనందము కారణముగా మందహాసముతో కూడిన కన్నులుగల దేవతలు, తారకుడు అను శత్రువుయొక్క భయముచేత, బెదురుచున్న తమచూపును కుమారస్వామియొక్క వదనకమలమునందు లగ్నముచేసిరి (లోనికి చొరరాని ఈదేశములోనికి ప్రవేశించు ఉపాయమును

శ్లో॥ సహేల హాసచ్ఛురితాననేన్దు
స్తతః కుమారః పురతో భవిష్ణుః ।
స తారకాపాత మపేక్షమాణో
రణప్రవీరో హి సురా నవోచత్ ॥ 13

స్వర్గదర్శనార్థం కుమారస్యోత్సాహప్రదర్శనమ్

శ్లో॥ భీత్యాల మద్య త్రిదివౌకసో ఽమీ
స్వర్గం భవన్తః ప్రవిశన్తు సద్యః ।
అత్రైవ మే దృక్పథ మేతు శత్రు
ర్మహాసురో వః ఖలు దృష్టపూర్వః ॥ 14

శ్లో॥ స్వర్లోకలక్ష్మీకచకర్షణాయ
దోర్మణ్డలం వల్గతి యస్య చణ్డమ్ ।
ఇహైవ తచ్ఛోణితపానకేళి
మహ్నాయ కుర్వన్తు శరా మమైతే ॥ 15

శ్లో॥ శక్తి ర్మమా సావహతప్రచారా
ప్రభావసారా సుమహాఃప్రసారా ।
స్వర్లోకలక్ష్మ్యా విపదావహారేః
శిరో హరన్తీ దిశతా న్ముదం వః ॥ 16

తెలిసికొనగోరినవారై అతని ముఖములోనికి చూచిరనియు కుమారస్వామి వయస్సునకు బాలుడయినను భయపడనందువలన ఆతని ముఖములోనికి చూచుటకు దేవతలు సంతసించిరనియు ఇచ్చట గ్రహింపవలెను.) 12

దేవతలు తనను చూచినతరువాత, యుద్ధమునందు మహావీరుడగు కార్తికేయుడు యుద్ధముచేయుటకై తారకాసురుని ఆగమనముకొరకు ఎదురు చూచుచు, విలాసముగా నవ్వుచున్న ముఖచంద్రుడుకలవాడై, కొంచెముగా నవ్వి (మందహాసము చేసి) దేవతలతో ఇట్లనెను 13

## స్వర్గమును చూచుటకై కుమారస్వామి ఉత్సాహపడుట

ఓ! స్వర్గవాసులయిన దేవతలారా. ఇప్పుడిక భయపడవలదు కాని మీరు వెంటనే స్వర్గలోకములోనికి ప్రవేశింపుడు. ఆ తారకుని మీరు లోగడ చూచినారుకదా మీ శత్రువయిన తారకుడు ఈ స్వర్గలోకములోనే నాకంట పడునుగాక 14

స్వర్గలోక రాజ్యలక్ష్మియొక్క జుట్టునుబట్టి లాగుటకు ఏ తారకుని భయంకరమయిన బాహుదండము కదులుచున్నదో, ఆ తారకాసురుని నెత్తురును త్రాగుట అను ఆటను ఈ నా బాణములు వెంటనే ఆడుగాక (అతనిని సంహరించుగాక అని భావము.) 15

నిరాఘాటమయిన సామర్థ్యమే సారముగాగలదియును, గొప్ప తేజోమండలము కలదియును, స్వర్గలోక లక్ష్మికి కలిగిన ఆపదను తొలగించి సుఖమునిచ్చు నదియును, అట్లే శత్రువుల శిరస్సులను ఖండించునదియును అగు ఈ నా "శక్తి" అను ఆయుదము మీకు సంతోషమును కలిగించునుగాక 16

శ్లో॥ ఇత్యన్ధకారాతిసుతస్య దైత్య
వదాయ యుద్ధోత్సుకమానసస్య
సర్వం శుచిస్మేరముఖారవిన్దం
గీర్వాణవృన్దం వచసా ననన్ద ॥ 17

## కుమారావలోకనేన దేవబృన్దస్య హర్షజననమ్

శ్లో॥ సాన్ద్రప్రమోదా త్పులకోపగూఢః
సర్వాఙ్గసంపుల్లసహస్రనేత్రః ।
తస్యోత్తరీయేణ నిజామ్బరేణ
నిరుఞ్ఛనం చారు చకార శక్రః ॥ 18

శ్లో॥ ఘన ప్రమోదాశ్రుతరఙ్గితాక్షై
ర్ముఖై శ్చతుర్భిః ప్రచురప్రసాదైః ।
అథో చుచుమ్బే విధి రాద్యవృద్ధః
షడాననం షట్సు శిరఃసుచిత్రమ్ । 19

శ్లో॥ తం సాధు సాధ్వీత్యభితః ప్రశస్య
ముదా కుమారం త్రిపురాసురారేః ।
ఆనన్దయ న్వీర జయేతి వాచా
గన్ధర్వవిద్యాధరసిద్ధసఙ్ఘాః ॥ 20

శ్లో॥ దివ్యర్షయః శత్రువిజేష్యమాణం
త మభ్యనన్ద న్నిఖల నారదాద్యాః ।
నిరుఞ్ఛనం చక్రు రథోత్తరీయై
శ్చామీకరీయై ర్నిజవల్కలైశ్చ ॥ 21

తారకుడను రాక్షసుని సంహరించుటకొరకు ఉత్సాహపడుచున్న మనస్సుగల అంధకాసురునిశత్రువగు శివుని కుమారునియొక్క పైమాటలచేత దేవతా సమూహ మంతయు చిరునవ్వుతో వికసించిన ముఖకమలము కలదయ్యెను. (సంతసించెనని భావము.) 17

## కుమారుని చూచుటచే దేవతలకు సంతోషము కలుగుట

మిక్కిలి ఆనందమువలన కలిగిన పులకరింతకలవాడై, సర్వాంగములయందును వికసించిన వెయ్యికనులుగల దేవేంద్రుడు, ఆ కుమారస్వామియొక్క ఉత్తరీయమును తన వస్త్రముతో అందముగా మార్చుకొనెను. (సోదర భావముతో వస్త్రములను, తలపాగలను ఒకరి వొకరు మార్చుకొను సంప్రదాయము ప్రకారము దేవేంద్రు డిట్లు చేసె ననిభావము.) 18

పిమ్మట గొప్ప సంతోషముకలిగిన కారణముగ ఆనందబాష్పతరంగములుగల కన్నులుగల, మిక్కిలి ప్రసన్నములయిన తన, నాలుగుముఖములతో, ఆద్యులయిన హరిహరులకంటె వృద్ధుడగు బ్రహ్మదేవుడు ఆ కార్తికేయుని ఆరు తలలపై చిత్రముగా ముద్దుపెట్టుకొనెను (తన నాలుగుతలలతో ఒకేసారి విడివిడిగా ఆరు తలలపై ముద్దాడుట విచిత్ర మనిపించెను.) 19

దేవగాయకులయిన గంధర్వులును విద్యాధరులును, సిద్ధులు మొదలగు దేవజాతుల సంఘములన్నియు ఆ త్రిపురాసురాంతకుడగు శివుని కుమారుని సంతోషముతో "సాధు, సాధు ఓ వీరుడా! నీవు శత్రువునుండి గెలుపును పొందుము" అని సర్వతోముఖముగా ప్రశంసించి, అతని నానందనపరచిరి. 20

నారదుడు మొదలుగాగల దివ్యఋషులు శత్రువగు తారకాసురుని గెలువ బోవుచున్న ఆ కుమారస్వామిని అభినందించిరి ఆ తరువాత బంగరు వన్నెగల ఆతని వస్త్రములతో తమ వస్త్రములను బంధుత్వసూచకముగా మార్చుకొనిరి. 21

శ్లో॥ తతః సురాః శక్తిధరస్య తస్యా
వష్టమ్భతః సాధ్వస ముత్సృజన్తః ।
ఉత్సేహిరే స్వర్గ మనన్తశక్తే
ర్గన్తుం వనం యూదపతే రివేభాః ॥ 22

శ్లో॥ అథాభిపృష్ఠం గిరిజాసుతస్య
పురన్దరారాతివధం చికిర్షోః ।
సురా నిరీయు స్త్రిపురం దిధక్షో
రివ స్మరారేః ప్రమథాః సమన్తాత్ ॥ 23

శ్లో॥ సురాఙ్గనానాం జలకేలిభాజాం
ప్రక్షాలితైః సన్తత మఙ్గరాగైః ।
ప్రపేదిరే పిఞ్జరవారిపూరాం
స్వర్గౌకసః స్వర్గధునీం పురస్తాత్ ॥ 24

అవ. : దిగ్దన్తినా మిత్యారభ్య చతుర్భిః తా మేవ విశినష్టి.

శ్లో॥ దిగ్దన్తినాం వారివిహారభాజాం
కరాహతై ర్భ్రమతరై స్తరఙ్గైః ।
ఆప్లావయన్తీం ముహు రాలవాల
శ్రేణిం తరూణాం నిజతీరజానామ్ ॥ 25

శ్లో॥ లీలారసాభిః సురకన్యకాభి
ర్హిరణ్మయీభిః సికతాభి రుచ్చైః ।
మాణిక్యగర్భాభి రుపాహితాభిః
ప్రకీర్ణతీరాం వరవేదికాభిః ॥ 26

పిమ్మట "శక్తి' అను ఆయుధమును ధరించిన, కార్తికేయుని ఆశ్రయించుటవలన భయమును వీడినవారై, దేవతలు మహాశక్తిమంతుడయిన గజేంద్రుని ఆశ్రయించుటవలన ఇతర సామాన్యగజములు నిర్భయముగా వనములోనికి ప్రవేశించునట్లు స్వర్గములోనికి ప్రవేశింప నుత్సహించిరి. 22

దేవతలు ఉత్సాహమును ప్రదర్శించిన తరువాత, ఇంద్రునిశత్రువగు తారకాసురుని వధింపగోరిన, గిరిజాసుతుడయిన కుమారుని వెనుక, త్రిపురాసురుని సంహరింపజనిన శివునివెనుక ప్రమథగణములవలె, అన్నివైపులనుండి స్వర్గములోనికి ప్రవేశించిరి. 23

దేవతలు తమ ఎదుట ప్రవహించుచున్న, జలక్రీడాపరాయణురాంద్రయిన అప్సరసలయొక్క అంగరాగము కడుగబడుటవలన ఆ ద్రవ్యములన్నియు నీటిలో కలియుటచేత పసుపుపచ్చని జలప్రవాహముకల స్వర్గలోకపు నదియగు మందాకినీ తీరమును చేరిరి. 24

**అవతారిక :** 'దిగ్దంతినాం' అను శ్లోకమునుండి నాలుగు శ్లోకములలో ఆకాశగంగనే వర్ణించుచున్నాడు.

జలములలో క్రీడించు ఐరావతము మొదలగు మిక్కిలి భయంకరములయిన, దిగ్గజములయొక్క జలక్రీడలవలన, పైకెగసిన అలలచేత, తమ గట్టుననున్న చెట్లయొక్క పాదులవరుసను మాటిమాటికి నీటితో నింపుచున్నదియును, (ముంచెత్తుచున్నదియును) 25

క్రీడాసక్తురాంద్రయిన దేవకన్యలచేత బంగారపుటిసుకలో మాణిక్యములను ఉంచి ఆడు ఆటకొరకై నిర్మింపబడిన ఎత్తైన సువర్ణవేదికలతో వ్యాపింపబడిన గట్టుగలదియును, (దీనినే "సువర్ణసికతాకేళి" అని మేఘసందేశమునందుకూడ కాళిదాసు వర్ణించినాడు ) 26

శ్లో॥ సౌరభ్యలుబ్ధభ్రమరోపగీతై
ర్హిరణ్యహంసావలికేలిలోలైః ।
చామీకరీయైః కమలై ర్వినిద్రై
శ్చ్యుతైః పరాగైః పరిపిఙ్గతోయామ్ ॥ 27

శ్లో॥ కుతూహలా ద్ద్రష్టు ముపాగతాభి
స్తీరస్థితాభిః సురసున్దరీభిః ।
అభ్యూర్మిరాజి ప్రతిబిమ్బితాభి
ర్ముదం దిశన్తీం వ్రజతాం జనానామ్ । 28

మన్దాకినీం దృష్ట్వా కుమారస్య సంమోదః

శ్లో॥ ననన్ద సద్య శ్చిరకాల దృష్టాం
విలోక్య శక్రః సురదీర్ఘికాం తామ్ ।
అదర్శయ త్సాదర మద్రిపుత్రీ
మహేశపుత్రాయ తతః పురోగః ॥ 29

శ్లో॥ స కార్త్తికేయః పురతః పరీతః
సురైః సమస్తైః సురనిమ్నగాం తామ్ ।
అపూర్వదృష్టా మవలోకమానః
సవిస్మయః స్మేరవిలోచనో ఽభూత్ ॥ 30

శ్లో॥ ఉపేత్య తాం తత్ర కిరీటకోటి
న్యస్తాఞ్జలి ర్భక్తిపరః కుమారః ।
గీర్వాణవృన్దైః ప్రణుతాం ప్రణుత్య
నమ్రేణ మూర్ధ్నా ముదితో వవన్దే । 31

సుగందాస్వాదనమునందు లంపటముగల (అత్యాసక్తములయిన) తుమ్మెదల పాటలచే మారుమ్రోగుచున్నదియును బంగరు హంసలయొక్క ఆటకారణముగా కదులుచున్న వికసించిన బంగరుతామరపూలతో గుర్తింపబడినవియును, ఆ బంగరు తామరపూలనుండి జారిన పుప్పొడిచేత అంతటా పసుపుపచ్చని నీరు కలదియును, 27

చూడవలెనను కుతూహలమువలన, ఆనందముగ సమీపించిన, గట్టుపైనున్న, దేవతాస్త్రీల(అప్సరసల) మూర్తులను అలల వలరుసలమధ్యన, ప్రతిబింబింప జేయుచు ఆ ప్రాంతములయందు సంచరించు జనుల కానందమును కలిగించు నదియును, (చాల అలలలో ప్రతిబింబించు అప్సరసల ప్రతిబింబములతో అనేక రూపములను కన్పట్టచేసి, ఆనంద మొనగూర్చుచున్నదని అర్ధము )28

## మందాకినీనదిని చూచి కుమారు డానందించుట

చాలాకాలము తరువాత దర్శన మిచ్చిన ఆ దేవనదియగు మందాకినిని దేవేంద్రుడు చూచి, వెంటనే మిక్కిలి ఆనందించెను. (మిక్కిలి అందమయిన వస్తువు చిరకాలము తరువాత కనపడినప్పుడు అది మిక్కిలి ఆనందమును కలిగించునని భావము ) ఆ పిమ్మట దేవేంద్రుడు ఆ దేవనదిని గౌరీశంకరుల పుత్రుడయిన కార్తికేయునకు తాను ముందుండి చూపించెను. 29

సమస్తదేవపరివృతుడయిన ఆ కార్తికేయుడు ఇంతకుపూర్వముచూడబడని, ఇప్పుడే మొదటి సారిగాచూడబడిన, ఆ దేవనదిని తన యెదుట చూచుచు ఆశ్చర్యపడెను చిఱునవ్వుతో కూడిన కనులుకలవా డయ్యెను. 30

భక్తిపరుడయిన కుమారుడు దేవతాబృందములచేత బాగుగా స్తుతింపబడిన, ఆ మందాకినీ నదిని సమీపించి, కిరీటాగ్రమునందు అంజలిని జోడించి, స్తుతించి ఆనందించెను వినయముతో తలను వంచి, ప్రణమిల్లెను. 31

శ్లో॥ ప్రణర్తితస్మేరసరోజరాజిః
పురః పరీరమ్భమిలన్మహోర్మిః ।
కపోలపాలిశ్రమవారిహారీ భేజే
గుహం తం సరితః సమీరః ॥ 32

శ్లో॥ తతో వ్రజ న్నన్దన నామధేయం
లీలావనం జమ్భజితః పురస్తాత్ ।
విభిన్నభగ్నోద్ధృతశాలసఙ్ఘం
ప్రేక్షాఞ్చకార స్మరశత్రుసూనుః ॥ 33

శ్లో॥ సురద్విషోపప్లుతమేవ మేత
ద్వనం బలస్య ద్విషతో గతశ్రి ।
ఇత్థం విచి న్త్యారుణలోచనో ఽ భూత్
భ్రూభఙ్గదుష్ప్రేక్ష్యముఖః స కోపాత్ ॥ 34

శ్లో॥ నిర్లూనలీలోపవనా మపశ్య
ద్దుఃసఞ్చరీభూతవిమానమార్గామ్ ।
విధ్వస్తసౌధప్రచయాం కుమారో
విశ్వైకసారా మమరావతీం సః ॥ 35

వికసించిన తామరపూలవరుసలను విస్తరింపచేయుచున్న ( ఈ విశేషణము వలన సౌగంధ్యము సూచింపబడినది ) ఆలింగనము చేసికొను, ఒండొంటి శరీరములను కలుపుకొనుచున్న మహాతరంగములు కలదియును (ఈ విశేషణమువలన చల్లదనము చూపింపబడినది ) అలసటవలన తీగలవంటి సుకుమారములయిన చెక్కిళ్ళపై ఏర్పడిన, చెమటబొట్లను హరించుచున్నదియును (ఈ విశేషణముచేత మెల్లగా వీచుట సూచింపబడెను.) అగు మందాకినీ పవనము తన యెదుటనున్న ఆ కార్తికేయుని సేవించెను 32

గంగను చూచినపిమ్మట ముందుకు సాగుచు, మదనాంతకుని పుత్రుడగు ఆ కుమారస్వామి, తన యెదుట బాణములతో వందరంధ్రములు కలదిగా చేయుబడుటవలన (మొదలు వేరు లేక వందముక్కలుగా చేయబడి పెకలింపబడిన) శాలవృక్షసమూహముగల నందనమను పేరుగల ఇంద్రుని విహారోద్యానవనమును చూచెను 33

ఆ కుమారస్వామి ఈ ఎదుటనున్న (ఇతరు లెవ్వరిచేతను నశింపజేయబడని), కేవలము తారకాసురునిచేతమాత్రమే అన్నివైపులనుండి నశింపచేయబడి తన శోభను కోల్పోయిన, ఇంద్రుని ఉద్యానవనమగు 'నందనవనము'ను చూచి, కోపముతో ఎర్రబడిన కన్నులుగల, భయంకరమయిన ముఖముకలవాడయ్యెను. మహాత్ములకు పరదుఃఖమే మిక్కిలి దుఃఖదాయకమగునని భావము. 34

ఆ కుమారస్వామి ఖండింపబడిన, లీలోద్యానములు కలదియును, సంచరించుటకుకష్టమయిన విమానమార్గము కలదియును, ఎగురగొట్టబడిన రాజసౌధసముదాయముకలదియును ప్రపంచముమొత్తములో ఏకైక సారభూతమయినదియును అగు "అమరావతి" అను ఆ ఇంద్రుని పట్టణమును చూచెను 35

శ్లో॥ గతశ్రియం వైరివరాభిభూతాం
దశాం సుదీనా మభితో దధానామ్ ।
నారీ మవీరా మివ తా మవేక్ష్య
సబాధ మన్తః కరుణాపరో ఽ భూత్ । 36

కుమారస్య తారక త్రస్తామరరాజధానీప్రదేశః

శ్లో॥ దుశ్చేష్టితే దేవరిపౌ సరోష
స్తస్యావిషణ్ణః సమరాయ చోత్కః ।
తథావిధాం తాం స వివేశ పశ్య
న్సురైః సురాధీశ్వరరాజధానీమ్ ॥ 37

శ్లో॥ దైతేయదన్త్యావలి దన్తఘాతై
క్షుణ్ణాన్తరాః స్ఫాటికహర్మ్య పఙ్క్తీః ।
మహాహినిర్మోకపినద్ధజాలాః
స వీక్ష్య తస్యాం విషసాద సద్యః ॥ 38

శ్లో॥ ఉత్కీర్ణ చామీకరపఙ్కజానాం
దిగ్దన్తిదానద్రవదూషితానామ్ ।
హిరణ్య హంసవ్రజవర్జితానాం
విదీర్ణవైడూర్య మహాశిలానామ్ ॥ 39

శ్లో॥ ఆవిర్భవద్బాలతృణాఞ్చితానాం
తదీయ లీలాగృహదీర్ఘికాణామ్ ।
స దుర్దశాం వీక్ష్య విరోధిజాతాం
విషాదవైలక్ష్యభరం బభార ॥ 40

బలవత్తరుడయిన శత్రువగు తారకాసురునిచేత పూర్వ శ్లోకమునందు చెప్పబడినట్లుగా ప్రధ్వస్తము చేయబడినదియును, అందువలననే శోభను కోల్పోయినదియును, మిక్కిలి దీనస్థితిని పొందియున్నదియును, (దయనీయమయిన స్థితిలో ఉన్నదియగు) నపుంసకుడగు భర్తను కలిగిన స్త్రీవలె నున్న ఆ అమరావతి నగరమునుచూచి ఆ కుమారస్వామి మనస్సులో మిక్కిలి జాలిపడెను 36

## తారకునకు భయపడిన దేవరాజధానిలోనికి కుమారస్వామి ప్రవేశించుట

దుష్కర్మపరుడయిన, దేవతలకు శత్రువయిన, తారకాసురుని విషయమునందు కోపించినవాడై, వానితో యుద్ధము చేయనుత్సహించుచు జాగుచేయక ఆ కార్తికేయుడు పూర్వము చెప్పినట్లు విధ్వస్తమై, శోభాహీనమయిన దేవేంద్రుని రాజదానిని చూచుచు, దేవతలతోకూడి దానికిలోనికి ప్రవేశించెను. 37

రాక్షసులయొక్క గజసమూహపు దంతములచే కొట్టబడిన స్ఫటికపుసౌధముల వరుసలను మధ్య బీటలిచ్చినభవనములను, మహాసర్పముల కుబుసములచేత చుట్టబడిన కిటికీలను, చూచుచు ఆ కార్తికేయుడు వెంటనే మిగుల దుఃఖించెను. 38

ఆ కుమారస్వామి, పెఱుకబడిన బంగరుకమలములు కలవియును, ఐరావతము మొదలగు దిగ్గజములను గెలిచిన తారకాసురుని గజముల మదజలముచేత మలినపరుపబడినవియును, రాక్షసభయమువలన బంగారు హంసలచేత విడిచెపెట్టబడినవియును పగులగొట్టబడిన పెద్దవైడూర్యరత్న శిలలు కలవియును, మెఱయుచున్న లేతగడ్డి వ్యాపించియున్నవినియు అగు ఇంద్రుని గృహమునందున్న దిగుడు బావులకు, శత్రువులవలన పట్టిన దుర్గతినిచూచి, మిక్కిలి దుఃఖమును, సిగ్గును పొందెను (ఆ బావుల దుర్దశను చూచి, దుఃఖమును, తా నున్నప్పటికిని ఇట్టి దుర్దశ కలిగినందుకు సిగ్గును కుమారునకు కలిగెనని భావము ) 39 &40

శ్లో॥ తద్దన్తిదత్తక్షతహేమభిత్తి
సుతన్తుజాలాకులరత్నజాలామ్ ।
నిన్యే సురేన్ద్రేణ పురోగతేన
స వైజయన్తాభిధ మాత్మసౌధమ్ ॥ 41

శ్లో। నిర్దిష్టవర్త్మా విబుధేశ్వరేణ
సురైః సమగ్రై రనుగమ్యమానః ।
స ప్రావి శత్తం వివిధాత్మరశ్మి
చ్ఛిన్నేన సోపానపథేన సౌదమ్ । 42

శ్లో॥ నిసర్గకల్పద్రుమతోరణం తం
స పారిజతప్రసవస్రగాఢ్యమ్ ।
దివ్యైః కృతస్వస్త్యయనం మునీన్ద్రై
రన్తః ప్రవిష్టప్రమదం ప్రపేదే ॥ 43

శ్లో॥ పాదౌ మహర్షేః కిల కశ్యపస్య
కులాదివృద్ధస్య సురాసురాణామ్ ।
ప్రదక్షిణీకృత్య కృతాఞ్జలిః స
న్షడ్భిః శిరోభిః స నతై ర్వవన్దే ॥ 44

శ్లో॥ స దేవమాతు ర్జగదేకవన్ద్యా
పాదౌ తథైవ ప్రణనామ కామమ్ ।
మునేః కలత్రస్య చ తస్య భక్త్యా
ప్రహ్వీభవన్ శైలసుతాతనూజః ॥ 45

ఇంద్రుడు తనముందు నడుచుచు, ఆ తారకాసురుని ఏనుగల దంతములచే కొట్టబడిన బంగారు గోడలుగల సాలీండ్ల గూళ్ళతోనిండిన రత్నసమూహముగల "వైజయంతము' అను పేరుగల, తన రాజభవనమునకు ఆ కార్తికేయుని తీసికొనివెళ్ళెను 41

'ఇటు ఇటు నడువవలెను" అని ఇంద్రునిచేత ఆ కుమారస్వామి దారి చూపబడుచున్నవాడై, సమస్తదేవతలు తన వెంటవచ్చుచుండగ, తారకునిచే పెకలింపబడుటవలన వివిధ రత్నకాంతులులేని, మెట్లమార్గముమీదుగా ఆ భవనములోనికి ప్రవేశించెను 42

కల్పవృక్షములే స్వభావసిద్ధమయిన తోరణముగాకల, పారిజాతము అను కల్పవృక్షముయొక్క పూలమాలలతో అలంకరింపబడిన, కశ్యపాది దివ్య మునీంద్రులచేత చేయబడుచున్న ఆశీర్వచనముకల, తారకుని భయముచే మధ్య గృహములోనికి ప్రవేశించిన స్త్రీలుకల, ఆ రాజభవనములోనికి కార్తికేయుడు ప్రవేశించెను. 43

దేవదానవుల ఉభయకులములకు ఆదివృద్ధుడయిన కశ్యప మహర్షియొక్క చరణములకు ప్రదక్షిణముచేసి, చేతులు జోడించి, ఆరు తలలను వంచి, వినయపూర్వకముగా ఆ కుమారస్వామి ప్రణమిల్లెను. 44

భక్తిభావముతో వంగినవాడై ఆ మునికి భార్యయును, దేవతలకు తల్లియును అగు అదితియొక్క జగదేకవంద్యములయిన పాదములకు తగునట్లుగా ఆ శైలపుత్రియొక్క కుమారుడు వందన మాచరించెను 45

## కుమారస్య దేవతాభి రాశీర్వచనమ్

శ్లో॥ స కశ్యపః సా జననీ సురాణాం
త మేదయామాసతు రాశిషా ద్వౌ ।
తయా యయా నైకజగజ్జిగీషుం
జేతా మృదే తారక ముగ్రవీర్యమ్ । 46

శ్లో॥ స్వదర్శనార్థం సముపేయుషీణాం
సుదేవతానా మదితి శ్రితానామ్ ।
పాదౌ వవన్దే పతిదేవతా స్త
మాశీర్వచోభిః పున రభ్యనన్దన్ ॥ 47

శ్లో॥ పులోమపుత్రీం విబుధాధిభర్తు
స్తతః శచీం నామ కలత్రమేషః ।
నమశ్చకార స్మరశత్రుసూను
స్త మాశిషా సా సముపాచరచ్చ ॥ 48

శ్లో॥ అథాదితీన్ద్రప్రమదాః సమేతా
స్తా మాతరః సప్త ఘనప్రమోదాః ।
ఉపేత్య భక్త్యా నమతే మహేశ
పుత్రాయ తస్మై దదు రాశిషః ప్రాక్ ॥ 49

## కుమారుని దేవత లాశీర్వదించుట

'ఈ ఆశీస్సుకారణముగా నీవు ముల్లోకములను గెలువగోరుచున్న భయంకరమైన పరాక్రమముకల, తారకాసురుని యుద్ధములో గెలువగలవాడివి కమ్ము' అని ఆ కశ్యప ప్రజాపతియు, దేవమాతయగు అదితి అను ఇద్దరును ఆ కుమారుని తమ ఆశీర్వచనములతో వర్ధిల్లచేసిరి. **46**

తన దర్శనార్థమైవచ్చి దేవమాతయగు అదితిని ఆశ్రయించిన, సౌభాగ్య వతులయిన ఇతర దేవతాస్త్రీలయొక్క పాదములకుకూడ కుమారస్వామి నమస్కరించెను. పతివ్రతలయిన ఆ దేవతాస్త్రీలు కూడా "నీవు శత్రువును గెలువుము" అను ఆశీర్వచనములతో ఆ కార్తికేయుని మరల అభినందించిరి. **47**

ఆ పిమ్మట దేవనాయకుడయిన, ఇంద్రునిభార్యయగు, పులోముని కుమార్తెయగు శచీదేవికి కూడ మదనహరుని కుమారుడయిన కుమారస్వామి నమస్కరించెను. అప్పుడా శచీదేవి కార్తికేయుని ఆశీర్వాదముతో ఉపచరించెను (సాయమునకై త న్నాశ్రయించిన ఇంద్రునిభార్యకు కుమారుడు నమస్కరించుట ఏమి? అను అనుమానమునకు సమాధానము ఇది సురనాయకుని పత్ని అగుటవలననే కుమారుడు నమస్కరించెనుగాని కేవలము ఇంద్రుని భార్యగా కాదని భావింపవలెను ) **48**

అనంతరము కుమారస్వామిని దర్శించుటవలన మిక్కిలిఆనందించినవారై, ఇంద్రుని భార్యయును, కాశ్యపుని భార్యయును, బ్రాహ్మీ మొదలగు సప్తమాతృకలును, ఒక్కచోటికే చేరి, భక్తితో నమస్కరించుచున్న ఆ కుమారస్వామికి తారకుని గెలుచుటకు సాధనభూతములయిన ఆశీర్వచనములను అందించిరి. **49**

## కుమారస్య సేనాపత్యేఽభిషిఞ్చనమ్

శ్లో॥ సమేత్య సర్వే ఽపి ముదం దధానా
మహేన్ద్రముఖ్యా స్త్రిదివౌకసో ఽథ ।
ఆనన్దకల్లోలితమానసం తం
సమభ్యషిఞ్చన్ పృతనాధిపత్యే ॥ 50

శ్లో॥ సకలవిబుధలోకః ప్రస్తనిశ్శేష శోకః
కృతరిపు విజయాశః ప్రాప్తయుద్ధావకాశః ।
అజని హరసుతేనా నన్తవీర్యేణ తేనా
ఖిలవిబుధ చమూనాం ప్రాప్య లక్ష్మీ మనూనామ్ ॥ 51

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"కుమారసేనాపత్యాభిషేకః"నామ త్రయోదశ్గః సర్గః

-౦0౦-



సేనానియై స్వర్గదర్శనమునకై బయలుదేరుట - శ్లోకము 16



దేవసేనాపతిగా అభిషిక్తుడైన కుమారస్వామి - శ్లోకము 50



దేవసేనాపతిగా అభిషిక్తుడైన కుమారస్వామి - శ్లోకము 50

## కుమారుని దేవసేనాధిపతిగా అభిషేకించుట

పిమ్మట ఇంద్రాదులగు దేవత లందరును ఇక ముందుజరుగబోవు తారకాసుర సంహారమును తలచుకొనుటవలన కలిగిన ఆనందముతో ఉప్పొంగుచున్న మనస్సుకల ఆ కుమారస్వామికి దేవసేనాపతిగా పట్టాభిషేకమును చేసిరి. **50**

అపార పరాక్రమముగల దైవసైన్యములయొక్క గొప్ప సైన్యాధిపత్యమును పొందిన, ఆ శివకుమారుని సహాయముచేత దేవతాసమూహములకు కష్టములన్నియు తీరిపోవు యుద్ధము నకవకాశము కలుగుటవలన "శత్రువును గెలువగల"మను ఆశ వారికి పొడసూపినది. (పరాక్రమము లేనివారికి పరాక్రమశాలియొక్క తోడ్పాటు లభించుటే కార్యసిద్ధిహేతు వగునని భావము.) (ఈ శ్లోకము మాలినీవృత్తమునందు కూర్పబడినది). **51**

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "కుమారసేనాపత్యాభిషేకము" అను పేరుగల
పదుమూడవసర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న"
బిరుదాంచితుడైన బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి
సుబ్రహ్మణ్య శర్మ వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-



తారకునిచే ధ్వంసముచేయబడిన ఇంద్రభవనము - శ్లోకము 41

# కుమారసమ్భవమ్

## "దేవసేనాప్రయాణః" నామ

## చతుర్దశః సర్గః

శ్లో॥ రణోత్సుకే నాన్ధకశత్రుసూనునా
సమం ప్రయుక్తై స్త్రిదశై ర్జిగీషుణా ।
మహాసురం తారకసంజ్ఞకం ద్విషం
ప్రసహ్య హన్తుం సమనహ్యత ద్రుతమ్ ॥ 1

అవ. : ఇతః పరం స ఇత్యాదిభి స్త్రిభిః కుమారసంనహన మాహ.

శ్లో॥ స దుర్నివారం మనసో ఽతివేగినం
జయశ్రియః సంనయనం సుదుస్సహమ్ ।
విజిత్వరం నామ తదా మహారథం
ధనుర్ధరః శక్తిధరో ఽధ్యరోహయత్ ॥ 2

# కుమారసంభవము

## "దేవసేనాప్రయాణము" అను పదునాల్గవ సర్గము

శత్రువును గెలువగోరిన, యుద్ధము చేయుటయందు ఉత్సాహముగల, శివకుమారుదు, యుద్ధసన్నాహమునకై తనను ప్రేరేపించిన ఇంద్రాది దేవతలతో కలిసి, తారకాసురు డను పేరుగల మహారాక్షసుడయిన శత్రువును బలవంతముగా చంపుటకు యత్నమునారంభించెను. (ఈ సర్గమునందలి శ్లోకములు ఇంద్రవజ్రాఛందస్సునందు కూర్పబడినవి. 1

**అవతారిక :** ఇచ్చటినుండి మూడు శ్లోకములలో కుమారస్వామియొక్క యుద్ధ సన్నాహమును చెప్పుచున్నాడు.

ధనస్సును, "శక్తి" అను ఆయుధమును ధరించి, వారింపశక్యముగాని, మనస్సుకంటె వేగముగా పయనించునట్టిదియును, జయశ్రీని తెచ్చిఇచ్చునదియును, శత్రువులకు తేరిపారజూడరానిదియును, గెలిపించు సామర్థ్యముకలదియును అగు "విజిత్వరము" అను పేరుగల మహారథమును ఆ గుహుదు (కుమారస్వామి) ఎక్కెను. 2

## కుమారస్యోపరి దేవై శ్ఛత్రధారణమ్

శ్లో॥ సురాలయశ్రీవిపదాం నివారణం
సురారి సమ్పత్పరితాపకారణమ్ ।
కేనాపి దధ్రేఽస్య విరోధిదారణం
సుచారు చామీకరఘర్మవారణమ్ ॥ 3

శ్లో॥ శరచ్ఛరచ్చన్ద్రమరీచిపాణ్డురైః
స వీజ్యమానోనవచారుచామరైః ।
పురఃసరైః కిన్నరసిద్ధచారణైః
రణేచ్ఛు రస్తూయత వాగ్భి రుల్బణైః ॥ 4

అవ. : ఇదానీ మిన్ద్రాదీనా మష్టానా మనుప్రయాణ మాహ.

## యమాదీనాం కుమారానుగమనమ్

శ్లో॥ ప్రయాణకాలోచిత చారువేషభృత్
వజ్రం వహ న్పర్వతపక్షదారణమ్ ।
ఐరావతం స్ఫాటికశైలసోదరం
తతో ఽధిరుహ్య ద్యుపతి స్త మన్వగాత్ ॥ 5

శ్లో॥ త మన్వగచ్ఛత్ గిరిశృఙ్గసోదరం
మదోద్ధతం మేష మధిష్ఠితః శిఖీ ।
విరోధివిద్వేషరుషాధికం జ్వలన్మహో
మహీయస్తర మాయుధం దధత్ ॥ 6

## కుమారస్వామిపై దేవతలు ఛత్రమును ధరింపజేయుట

విరోధియగు తారకాసురుని చీల్చివేయునదియును, స్వర్గలక్ష్మియొక్క ఆపదలను నశింపచేయునదియును, దేవతల శత్రువగు తారకాసురునియొక్క సంపదల నిగిరింపచేయునదియును, మిక్కిలి మనోహరమయినదియు అగు బంగరు గొడుగును ఎవరో ఒక దేవుడు కుమారస్వామి తలపై పట్టుకొనెను. (ఇచ్చట మొట్టమొదటి విశేషణమునందు, ఛత్రము జడపదార్థ మగుటవలన దానికి ఆపదలను కోసివేయు శక్తిలేకున్నను, ఆ ఛత్రమును ధరించిన కుమారస్వామి యొక్క ప్రభావమువలన స్వర్గలక్ష్మియొక్క ఆపదలను కోసివేయ గలిగినదని భావింపవలెను.) 3

వర్షాకాలాంతమునందు వచ్చు శరత్కాలమునందు నడయాడు చంద్రకిరణములవలె తెల్లనయినవియును, శ్రేష్ఠములును, మనోహరములును, అగు కొత్త చామరములచే సేవింపబడుచున్నవాడై, యుద్ధము చేయుటయం దభిలాషగల, తన ముందు నడుచుచున్న ఉద్భటులయిన కిన్నరులు, సిద్ధులు, చారణులు అను దేవజాతులవారిచే ప్రశస్తములైన మాటలచే స్తుతింపబడుచుండెను. 4

**అవతారిక :** ఇప్పుడు ఇంద్రాద్యష్టదిక్పాలకులు కుమారుని వెన్నంటి వచ్చుటను వర్ణించుచున్నాడు.

## యమాదులు కుమారస్వామిని అనుసరించి ముందుకు కదలుట

అనంతరము యుద్ధప్రయాణమునకు తగిన, మనోహరమయిన వేషమును ధరించి, పర్వతముల రెక్కలను నరుకు సామర్థ్యముగల, వజ్ర మనుపేరుగల తన ఆయుధమును చేతితో పట్టుకొని, స్ఫటికపర్వతమగు కైలాసమువలెఉన్న "ఐరావత"మను పేరుగల ఏనుగును ఎక్కి, స్వర్గాధిపతియగు ఇంద్రుడు ఆ కుమారునివెంట వచ్చెను. 5

శత్రువయిన తారకుని మీది ద్వేషము కారణముగాకలిగిన కోపముతో, ఇంకను అధికముగా తేజరిల్లుచు పర్వతశృంగమువలె ఎత్తైనదియును, గర్వముతో ఉద్ధత మయినదియును అగు గొట్టెపొట్టేలును ఎక్కి తేజస్సుతో దేదీప్యమానముగా వెలుగొందు గొప్పశస్త్రమును చేతధరించి, అగ్నిదేవుడు ఆ కుమారస్వామి వెంట నడిచివచ్చెను. 6

శ్లో॥ అథేన్ద్రనీలాచలచణ్డవిగ్రహం
విషాణవిధ్వస్తమహోపయోధరమ్ ।
అధిష్ఠితః కాసర ముద్ధతం ముదా
వైవస్వతో దణ్డధర స్త మన్వగాత్ ॥ 7

శ్లో॥ మదోద్ధతం ప్రేత మథాధిరూఢవాం
స్త మన్థకద్వేషితనూజ మన్వగాత్ ।
మహాసురద్వేషవిశేషభీషణః
సురోషణ శ్చణ్డరణాయ నైరృతః ॥ 8

శ్లో॥ నవోద్యదమ్భోధరఘోరదర్శనో
యుద్ధాయ రూఢో మకరే మహత్తరే ।
దుర్వారపాశో వరుణో రణోల్బణ
స్త మన్వియాయ త్రిపురాన్తకాత్మజమ్ ॥ 9

శ్లో॥ దిగమ్బరాధిక్రమణోల్బణం క్షణా
న్మృగం మహీయాంస మరుద్ధ విక్రమమ్ ।
అధిష్ఠితః సజ్జరకేలిలాలసో
మరు న్మహేశాత్మజ మన్వగా ద్ద్రుతమ్ ॥ 10

శ్లో॥ విరోధినాం శోణితపారణైషిణీం
గదా మనూనాం నరవాహనో వహన్ ।
మహాహవామ్భోధివిగాహనోద్ధతం
యియాసు మన్వాగమ దీశనన్దనమ్ ॥ 11

అనంతరము ఆ కుమారుడు ఇంద్రనీలమణిపర్వతమువలె భయంకరమయిన శరీరముగలదియును, పెద్ద మేఘములను తన కొమ్ములతో క్రిందికి కూలద్రోయుచున్నదియును అగు ఉద్ధతమయిన మహిషమును ఎక్కి, యమదండమును కేలబూని, యమధర్మరాజు సంతోషముగా ఆ కార్తికేయునివెంట నడిచెను. 7

ఆ తరువాత తారకాసురుని మీది వైరముతో, మిక్కిలి భయంకరమయి, మిక్కిలి కోపముగల, నైరృతకోణాధీశ్వరుడైన, నైరృతు డను రాక్షసుడు (దిక్పాలకుడు) గర్వముతో ఉద్ధతమైన శవవాహనమునెక్కి భయంకరమయిన యుద్ధము చేయుటకై శివకుమారుని వెన్నంటి నడిచెను. 8

యుద్ధమునందు ఉద్భటుడయిన వరుణదేవుడు క్రొత్తగా ఉదయించు మేఘమువలె భయంకరముగా కనిపించునట్టి, మిక్కిలి పొడవైన మొసలిపై నెక్కి, వారింపశక్యముగాని పాశము అను ఆయుధమును చేతబట్టి యుద్ధముచేయుటకై ఆ కుమారుని అనుసరించెను. 9

యుద్ధక్రీడయందు కోరికగల వాయువ్యకోణాధిపతియగు వాయుదేవుడు, క్షణకాలములోనే దిక్కులను, ఆకాశమును కూడ అతిక్రమించుటకు ఉత్సాహపడునట్టిదియును (పక్షివలె) అప్రతిహతమయిన నడకగలదియును అగు పెద్ద లేడిని ఎక్కి ఆ మహేశ్వరకుమారుని వెంట వేగముగా నడిచెను. 10

శత్రువుల నెత్తురుతో భోజనము చేయగోరునట్టి, మహాశక్తిమంతమయినట్టి గదను ధరించినవాడై, మహాయుద్ధము అను సముద్రములోనికి దిగుటకు సమర్థుడయిన, యుద్ధభూమికి పోగోరుచున్న, ఈశ్వర కుమారుని వెనుక కుబేరుడు నడిచెను. 11

శ్లో॥ మహాహినిర్బద్ధ జటాకలాపినో
జ్వలత్త్రిశూలప్రబలాయుధా యుధే ।
రుద్రా స్తుషారాద్రిసఖం మహావృషం
తతో ఽధిరూఢా స్త మయుః పినాకినః ॥ 12

## దేవగణానాం కుమారానుగమనమ్

శ్లో॥ అన్యేఽపి సంనహ్య మహారణోత్సవ
శ్రద్ధాలవః స్వర్గిగణా స్త మన్వయుః ।
స్వవాహనాని ప్రబలా న్యధిష్ఠితాః
ప్రమోదవిస్మేర ముఖామ్బుజశ్రియః ॥ 13

శ్లో॥ ఉద్దణ్డహేమధ్వజదణ్డ సఙ్కులా
శ్చఞ్చ ద్విచిత్రాతపవారణోజ్జ్వలాః ।
చలద్ఘనస్యన్దనఘోషభీషణాః
కరీన్ద్రఘణ్టారవ చణ్డచీత్కృతాః ॥ 14

శ్లో॥ స్ఫురద్విచిత్రాయుధ కాన్తిమణ్డలై
రుద్యోతితాశావలయామ్బరాన్తరాః ।
దివౌకసాం సో నువహ న్మహాచమూః
పినాకపాణే స్తనయ స్తతో యయౌ ॥ 15

శ్లో॥ కోలాహలేనోచ్చలతాం దివౌకసాం
మహాచమూనాం గురుభి ర్ధ్వజవ్రజైః ।
ఘనై ర్నిరుచ్ఛ్వాస మభూ దనన్తరం
దిఙ్మణ్డలం వ్యోమతలం మహీతలమ్ ॥ 16

పిమ్మట పినాకము అను విల్లును చేతధరించినవారును, ఈశాన్యదిక్కున కధిపతులును, పెద్ద పాములతో జడలను కట్టుకొనినవారును, "ఇప్పుడు తారకుని చంపెదము" అని ఉద్ధతముగా మాట్లాడువారును, మెరియుచున్న శూలమే ఆయుధముగా కలవారును, హిమవంతుని స్నేహితునివలె నున్న తెల్లనయిన మహావృషభమును ఎక్కిన వారును అగు రుద్రులు యుద్ధముకొరకై కుమారస్వామి వెంట నడిచిరి. 12

## దేవగణములు కుమారస్వామి ననుసరించి నడుచుట

పైన చెప్పిన దిక్పాలకులకంటె వేరయిన దేవగణములు యుద్ధానందముచే నవ్వుచున్న ముఖారవిందముకలవారై, మహారణోత్సవమునందు శ్రద్ధకలవారై, బలవత్తరములయిన తమ వాహనములనెక్కి కవచములను ధరించి, యుద్ధమునకు సన్నద్ధులై ఆ కుమారు ననుసరించిరి. 13

యుద్ధమునకు కావలసిన ఏర్పాట్లన్నియు పూర్తి అయినతరువాత, ఎత్తైన బంగారు ధ్వజములస్తంభములతో వ్యాపించినవియును, ప్రకాశించుచున్న ఆకుపచ్చ, పసుపుపచ్చ మొదలగు వివిధవర్ణములతో విచిత్రమయిన ఛత్రములు కలవియును, కదులుచున్న మేఘములు అను రథముల ఘోషతో భయంకరము లయినవియును, గజేంద్రుల ఘంటారవములు కలవియును, వివిధములయిన ఆయుధముల కాంతిమండలములను దిగంతములవరకు భూనభోనాంతరముల మధ్య వ్యాపింపజేయుచున్నవియును అగు గొప్ప దేవసైన్యములకు వెనుకగా నవ్వుచు ఆ పినాకపాణిఅగు శివునియొక్కకుమారుడు నడిచెను. 14&15

రోషముచేత పైకెగురుచు నడుచుచున్న దేవతల సైన్యముయొక్క ఘోరఘోషల చేతను, వారిసైన్యములయొక్క పెద్ద ధ్వజముల సమూహాముచేతను నిండిన భూమండలమునకును, దట్టమయిన మేఘములతో నిండిన దిఙ్మండలముకల ఆకాశమునకును, బేధమే లేకపోయెను. (భూమండలమునకును, అకాశమునకును బేధమే లేదని చెప్పుటచేత ఈ శ్లోకమునందు పరబ్రహ్మయొక్క అద్వైతస్థితి వివరింపబడినదని గ్రహింపవలెను.) 16

శ్లో॥ సురారిలక్ష్మీ పరికమ్పహేతవో
దిక్చక్రవాల ప్రతినాదమేదురాః ।
నభోన్తకుక్షిమ్భరయో ఘనాః స్వనా
నిహన్యమానైః పటహై ర్వితేనిరే ॥ 17

## యోద్ధృప్రస్థానే పటహధ్వనివర్ణనమ్

శ్లో॥ ప్రమథ్యమానాంబుధిగర్జితర్జనైః
సురారినారీగణగర్భపాతనైః ।
నభ శ్చమూధూలికులై రివాకులం
రరాస గాఢం పటహప్రతిస్వనైః ॥ 18

శ్లో॥ క్షుణ్ణం రథై ర్వాజిభి రాహతం ఖురైః
కరీన్ద్రకర్ణైః పరితః ప్రసారితమ్ ।
ధూతం ధ్వజైః కాఞ్చనశైలజం రజో
వాతై ర్హృతం వ్యోమ సమారుహ త్క్రమాత్ ॥ 19

## సేనాగమనవర్ణనమ్

అవ. : న కేవలం వ్యోమన్యారూఢం కిన్తు దిగన్తేష్వపి తథే త్యాహ.

శ్లో॥ ఖాతం ఖురై రథ్యతురఙ్గపుఙ్గవై
రుపత్యకాహాటకమేదినీరజః ।
గతం దిగన్తా న్ముఖరైః సమీరణైః
సువిభ్రమం భూరి బభార భూయసా ॥ 20

ప్రయోగింపబడుచున్న పటహాదివాద్యములధ్వనులు దేవతల శత్రువగు తారకాసురునియొక్క సంపదలు పరికంపించుటకు కారణమయినవియును, దిఙ్మండలమునందు గంభీరముగా ప్రతిధ్వనించునవియును, ఆకాశపు ప్రాంతపు పొట్టనంతటిని నింపునవియును (ఆకాశమంతటను వ్యాపించినవియును) అయి గంభీరములయిన శబ్దములను వ్యాపింపజేసినవి. 17

## యోధుల ప్రయాణసూచకముగా యుద్ధభేరులు మ్రోగుట

సైన్యపు కదలికలవలన రేగిన ధూలికణములద్వారా ఆకాశమునం దంతటను వ్యాపించినదియును, అమృతముకొరకై చిలకబడుచున్న క్షీరసాగరపు ఘోషను భయపెట్టినదియును (అంతకంటె పెద్దగా శబ్దించునదియును) అందువలననే దేవతల శత్రువయిన తారకాసురుని భార్యల గర్భస్రావమునకు కారణమయి నదియును అగు పటహముల ధ్వని, స్వర్గలోకమువరకు ప్రతిధ్వనించుచున్నదేమో అనునట్లుగా మారుమ్రోగెను. 18

రథములచేత నలుగగొట్టబడినదై, గుఱ్ఱముల గిట్టలచేత పొడిపొడిగ చేయబడినదై, మదగజముల చెవులచే అన్నివైపులకు వ్యాపించునట్లు విసరబడినదై, జెండాలచేత కంపింప జేయబడినదై, వాయువుచేత స్పృశింపబడినదై ఈ సుమేరుపర్వతము నుండి పుట్టిన పసుపుపచ్చని ధూళి, క్రమక్రమముగా ఆకాశము మీది కెక్కెను. 19

## సైన్యపు నడకను వర్ణించుట

**అవతారిక :** ధూళి కేవలము ఆకాశముమీది కెక్కుటేకాదు, దిగంతములవరకు వ్యాపించెనని చెప్పుచున్నాడు.

రథములను మోయు శ్రేష్ఠాశ్వములయొక్క గిట్టలచే త్రవ్వబడినదియును, మేరు పర్వతప్రాంతమునందున్న బంగారుభూమియొక్క ధూళి, పెద్దగా శబ్దించు వాయువులచేత దిగంతప్రాంతములవరకు చేరి, మిక్కిలి శోభించెను. 20

శ్లో॥ అధ స్తథోర్ధ్వం పురతో ౭థ పృష్ఠతో
ఽభితో ౭పి చామీకరరేణు రుచ్చకైః ।
చమూషు సర్ప న్మరుదాహతో ౭హర
న్నవీన సూర్యస్య చ కాన్తివైభవమ్ ॥ 21

శ్లో॥ బలోద్ధృతం కాఞ్చనభూమిజం రజో
బభౌ దిగన్తేషు నభఃస్థలే స్థితమ్ ।
అకాలసన్ధ్యాఘనరాగపిఙ్గలం ఘనం
ఘనానా మివ వృన్ద ముద్యతమ్ ॥ 22

శ్లో॥ హేమావనీషు ప్రతిబిమ్బ మాత్మనో
ముహు ర్విలో క్యాభిముఖం మహాగజాః ।
రసాతలోత్తీర్ణగజభ్రమా త్క్రుధా
దన్తప్రకాణ్డప్రహృతాని తేనిరే ॥ 23

శ్లో॥ సుజాత సిన్దూరపరాగపిఙ్గరైః
కలం చలద్భిః సురసైన్యసిన్ధురైః ।
శుద్ధాసు చామీకరశైలభూమిషు
నా దృశ్యత స్వం ప్రతిబిమ్బ మగ్రతః ॥ 24

సేనల మధ్యభాగమునందు గాలిచే వీవబడిన బంగరురంగుగల ధూళి, క్రింది‌కి, పైకి, ముందుకు, వెనుకకు, అన్నివైపులకు కూడ వ్యాపించుచు, ఉదయ సూర్యునియొక్క కాంతిసంపద నపహరించెను. (బంగరురంగుగల ధూళి అగుటవలన పచ్చనై, ప్రకాశమానమై, సూర్యకాంతినిమించి ప్రకాశించెనని భావము.) 21

బంగారపు నేలయందు పుట్టిన పసుపుపచ్చనిధూళి, సైన్యమునందలి సైనికుల కవాతుచే ఎగురుగొట్టబడినదై, దిక్కుల చివరివరకును, ఆకాశము నందంతటను, వ్యాపించియుండి, కాలముకాని కాలమునందు వచ్చిన, దట్టమయిన, సంధ్యా మేఘపు ఎఱ్ఱదనముతో, సుమేరుపర్వతమునుండి ఉద్భవించిన ఎరుపు, పసుపు రంగులతోకూడిన, దట్టమయిన మేఘరాజివలె ప్రకాశించెను. 22

సైన్యమునందలి మహాగజములు బంగారుభూములయందు తమ ఎదుటపడిన తమ ప్రతిబింబములనుచూచి, అవి పాతాళ లోకమునుండి పైకివచ్చిన ఏనుగులేమో అను భ్రమవలన కోపముతో తమ దంతములు అను స్తంభములతో ఆ ప్రతిబింబితగజములను మోదసాగినవి. (మహాగజముల మానాంధత్వ మిందు సూచింపబడినదని భావము.) 23

శుభప్రదమయిన సిందూరపు పొడిచేత పసుపుకలిసిన ఎఱ్ఱనైనవియును, నెమ్మదిగా, గంభీరముగా నడుచున్నవియును అగు దేవసైన్యములోని ఏనుగులు నిర్మలయమయిన సుమేరుపర్వతముయొక్క బంగరుభూములయందు ఎదుటపడినను, తమ ప్రతిబింబములను చూడలేరు. (ఆధారమగు ఎరుపుతో కూడిన పచ్చని శరీరముకల ఏనుగులకును, ఆధేయమగు బంగరు భూములయందు ప్రతిబింబించిన గజములకును ఎట్టి బేధమును వర్ణవిషయమున కనపడకపోవుటవలన ఆ ఏనుగులు తమ ప్రతిబింబమును చూడలేకపోయినవని భావము.) 24

శ్లో॥ ఇతి క్రమేణా మరరాజవాహినీ
మహోహవామ్భోధివిలాసలాలసా ।
అవాతర త్కాఞ్చనశైలతో ద్రుతం
కోలాహలక్రాన్త విధూతకన్దరా ॥ 25

## చమూరవస్య భయానకత్వవర్ణనమ్

శ్లో॥ మహాచమూస్యన్దనచణ్డచీత్కృతై
ర్విలోల ఘణ్టేభపతేశ్చ బృంహితైః ।
సురేన్ద్ర శైలేన్ద్రమహాగుహాశయాః
సింహాః మహ త్స్వప్నసుఖం న తత్యజుః ॥ 26

శ్లో॥ గమ్భీరభేరీ ధ్వనితై ర్భయఙ్కరై
ర్మహాగుహాన్తప్రతినాదమేదురైః ।
మహారథానాం గురునేమి నిఃస్వనై
రనాకులై స్తై ర్మృగరాజతా ఽజని ॥ 27

శ్లో॥ సముత్థితేన త్రిదివౌకసాం మహా
చమూరవే ణాద్రితటాన్తదారిణా ।
ప్రపేదిరే కేసరిణో ఽధికం మదం
స్వవీర్యలక్ష్మీమృగరాజతావశాత్ ॥ 28

ఘోర యుద్ధసముద్రపు క్రీడను ప్రారంభించుటకుత్సాహముకలదియును, యుద్ధ ఘోషతో పర్వతగుహలను కంపింపజేయుచున్నదియును అగు అమరాధీశ్వరు డయిన దేవేంద్రుని సేన క్రమక్రమముగా సుమేరు పర్వతమునుండి వేగముగా క్రిందికి దిగెను. 25

## సైన్యపుకదలికలవలన జన్మించిన శబ్దముయొక్క భయంకరత్వ వర్ణనము

గొప్పదగు దేవతాసైన్యమునందలి రథములుచేయు తీవ్రమైన ఛీత్కారముల చేతను, (రథములు కదులునప్పుడు చేయు శబ్దవిశేషములచేత) పరుగెత్తుచు పెద్దగా ఘంటానాదమును చేయు గజరాజుల బృంహితములచేతను (ఏనుగు అరుపునకు బృంహితమని పేరు) కూడ, దేవతాశ్రేష్ఠుడగు మేరుపర్వతపు గుహలయందు నిద్రించుచున్న సింహములు నిద్రయందలి గొప్ప సుఖమును విడువకున్నవి. (నిద్రకు భంగమును కలిగించునట్టి కోలాహలమున్నను, ఏనుగుల ఘీంకారము లున్నను, లక్ష్యపెట్టక సింహములు నిద్రాసుఖము ననుభవించుచున్నవని భావము.) 26

విశాలమయిన గుహామధ్యభాగములయందు ప్రతిధ్వనించుటచే గంభీర తరములయిన, అందువలననే భయంకరమయిన దుందుభిశబ్దములచేతను, అట్లే మహారథములయొక్క పెద్ద రథచక్రనేమి (చక్రపుటంచు) శబ్దములచేతను కూడ అనాకులములయిన సింహములకున్న 'మృగరాజు' అనుపేరు సార్థకమయినది. (ప్రతీకారము చేయుటకు శక్తిలేకున్నను శత్రువులవలనను, భయప్రమాదముల వలనను ఎట్టి పరిస్థితిలోను భయపడక స్థిరముగా ఉండుటే రాజుల పరమ ధర్మము. ఆ ధర్మమును సింహములు ఇచ్చట ఆచరించి చూపినవి కనుక అవి మృగరాజు లయినవి.) 27

మేరుపర్వత శిఖరమధ్యభాగమును చీల్చునట్టి, దేవసైన్యముయొక్క రణఘోష వ్యాపింపగనే, అచ్చటి సింహములు నిజపరాక్రమముతో శోభిల్లునట్టి మృగరాజ పదవికి వశపడి, మిక్కిలి గర్వమును పొందినవి. (సైనిక రణఘోష భయంకర మయినదైనను, సహజ శక్తిమంతములయిన సింహముల కది అధిక మదకారక


శ్లోకము 29

శ్లో॥ భియా సురానీక విమర్ద జన్మనా
విదుద్రువు ర్దూరతరం ద్రుతం మృగాః ।
గుహాగృహాన్తా ద్బహి రేత్య హేలయా
తస్థు ర్విశంకం నితరాం మృగాధిపాః ॥ 29

శ్లో॥ విలోకితాః కౌతుకినా ఽమరావతీ
జనేన జుష్టప్రమదేన దూరతః ।
సురాచలప్రాన్తభువః ప్రపేదిరే
సువిస్తృతాయాః ప్రసరం సుసైనికాః ॥ 30

తారకాదిభ్యో ఽశుభసూచకలక్షణాని

శ్లో॥ పీతాసితారక్తసితైః సురాచల
ప్రాన్తస్థితై ర్ధాతురజోభి రమ్బరమ్ ।
అయత్నగన్ధర్వపురోదయభ్రమం
బభార భూమ్నోత్పతితై రిత స్తతః ॥ 31

శ్లో॥ మహాస్వనః సైన్యవిమర్దసమ్భవః
కర్ణాన్తకూలఙ్కషతా ముపేయివాన్ ।
పయోనిధేః క్షుబ్ధతరస్య వర్ధనో
బభూవ భూమ్నా భువనోదరమ్భరిః ॥ 32

మయ్యెనని భావము. శబ్దమునకు పర్వతశృంగములనువిరుగగొట్టు శక్తి లేకున్నను ఈ శ్లోకమునందు రణఘోష మేరుశృంగములను విదలించినది అని చెప్పుటవలన ఇచ్చట అతిశయోక్తిఅలంకారము ప్రయోగింపబడినదని గ్రహింపవలెను.) **28**

దేవసైన్యముయొక్క ప్రాణాంతకమగు తొక్కిసలాటవలన కలిగిన భయముచేత భయస్వభావముకలవి కనుక లేళ్ళు వేగముగా మిక్కిలి దూరమునకు పారిపోయినవి. ఇక సింహములు మృగరాజులు కనుక ఆటగా గుహారూపము లయిన తమ ఇండ్లనుండి బయటకువచ్చి, మిక్కిలి నిర్భయముగా నిలబడినవి. **29**

సైనికులను చూడవలెనను కుతూహలముతో భార్యాసహితులయిన అమరావతీ నగరవాసులు దూరమునుండియే దేవసైన్యమునందున్న సైనికులను చూచి మిక్కిలి విశాలమయిన మేరుపర్వతముయొక్క పాదభూమికి చేరిరి. (మేరు పర్వతమును దిగివచ్చిరి అని భావము.) **30**

## తారకునిసైనికులు దర్శించిన అశుభసూచక లక్షణములు

ఇటునటు, అన్ని దిక్కులయందును ఎక్కువగా ఎగురగొట్టబడిన, సుమేరు పర్వతపు పైభాగములయందున్న పచ్చని, నల్లని, ఎర్రని, తెల్లని గైరికాది ధాతువుల పొళ్ళ కారణముగా, అచ్చట అనాయాసముగా గంధర్వనగర ముద్భవించినదో అను భ్రమను ఆకాశము కలిగించుచున్నది. (గంధర్వ నగరము అనేక వర్ణములతో అలంకరింపబడియుండునని లోకప్రసిద్ధి.) **31**

కర్ణపుటములను భేదించునదియును, చెలియలికట్టను దాటి ఉప్పొంగు సముద్రమును ఇంకను పొంగించునదియును, బ్రహ్మాండముల నన్నింటిని ఆవరించినదియును, అగు సైన్యసంక్షోభజనితమయిన మహాశబ్దము పెల్లుబికెను. **32**

శ్లో॥ మహాగజానాం గురుబృంహితై స్తతైః
సుహేషితై ర్ఘోరతరైశ్చ వాజినామ్ ।
ఘనై రథానాం గురుచణ్డచీత్కృతై
స్తిరోహితో ఽభూ త్పటహస్య నిస్వనః ॥ 33

శ్లో॥ మహాసురాణా మవరోధయోషితాం
కచాక్షిపక్ష్మస్తనమణ్డలేషు చ ।
ధ్వజేషు నాగేషు రథేషు వాజిషు
క్షణేన తస్థౌ సురసైన్యజం రజః ॥ 34

శ్లో॥ ఘనై ర్విలోక్య స్థగితార్కమణ్డలై
శ్చమూ రజోభి ర్నిచితం నభఃస్థలమ్ ।
అయాయి హంసై రభిమానసం
ఘనభ్రమేణ సానన్ద మనర్తి కేకిభిః ॥ 35

శ్లో॥ సాన్ద్రైః సురానీకరజోభి రమ్బరే
నవామ్బుదానీక నిభై రమిశ్రితే ।
చకాశిరే స్వర్ణమయా మహాధ్వజాః
పరిస్ఫురన్త స్తడితాం గణా ఇవ ॥ 36

శ్లో॥ విలోక్య ధూలీపటలై ర్భృశం ధృతం
ద్యావా పృథివ్యో రల మన్తరం మహత్ ।
కి మూర్ధ్వతో ఽధః కి మధస్త ఊర్ధ్వతో
రజో భ్యుపైతీతి జనై రతర్క్యత ॥ 37

మహాగజములయొక్క భయంకరములగు ఘీంకారములచేతను, అట్లే సర్వ వ్యాప్తములైన ఘోరతరమయిన గుఱ్ఱముల హేషితములచేతను (గుఱ్ఱపు అరుపునకు హేషిత మనిపేరు) మహారథముల చక్రనేములనుండి వెలువడు భయంకరమయిన ఛీత్కార శబ్దములచేతను, యుద్ధభేరుల మోత వినపడకుండ పోయెను. (భేరీనాదముకంటె సైన్యనినాద మధిక మయ్యెనని భావము.)33

తారకాదిమహారాక్షసుల అంతఃపురస్త్రీలయొక్క జుట్టు, కన్నులు, కనురెప్పలు, స్తనమండలములు మొదలగు అవయవములమీదను, అట్లే ధ్వజములు, ఏనుగులు, రథములు, గుఱ్ఱములమీదను సురసైన్యమునుండి పుట్టిన ధూళి క్షణములో దట్టముగా నిలిచియుండెను. (వ్యాపించెను.) 34

సూర్యమండలమును కప్పివేయునంతటి దట్టమైన సైన్యపుధూళిచేత ఆవరింపబడిన ఆకాశమునుచూచి, అది మేఘావరణమేమో అనుభ్రమతో హంసలు మానసరోవరమువైపునకు బయలుదేరినవి. ఇక నెమళ్ళు నాట్యము చేసినవి. 35

ఆకాశమునందు, కొత్తవర్షామేఘములనుబోలు దట్టమైన సైన్యరజోధూళిరేణువుల చేత అన్నివైపులనుండి ఆవరింపబడి, పెద్ద బంగారుజెండాలు మెరుపుతీగల సమూహమువలె మెఱయుచున్నవి. 36

భూమ్యాకాశముల మధ్యనున్న విశాలభాగమునందు ఆ ధూళి బాగా నిండగా చూచిన జనులు అది పైనుండి క్రిందికి వచ్చుచున్నదా? లేక క్రిందినుండి పైకి వచ్చుచున్నదా? అని ఆలోచింపసాగిరి. (అన్నివైపులకు ధూళి వ్యాపించుటవలన ఎటునుండి అది వచ్చుచున్నదో నిర్ణయింప శక్యము కాకున్నదని భావము.)37

శ్లో॥ నోర్ధ్వం న చాధో న పురో న పృష్ఠతో
న పార్శ్వతో ఉ_భూ త్ఖలు చక్షుషో గతిః ।
సూచ్యగ్రభేద్యైః పృతనారజశ్చయై
రాచ్ఛాదితా ప్రాణిగణస్య సర్వతః ॥ 38

శ్లో॥ దిగన్తదన్త్యావలిదానహారిభి
ర్విమానరన్ధ్రప్రతినాదమేదురైః ।
అనేకవాద్యధ్వనితై రనారతై ర్జగర్జ
గాఢం గురుభి ర్నభస్తలమ్ ॥ 39

శ్లో॥ భువం విగాహ్య ప్రయయౌ మహాచమూః
క్వచి న్న మాన్తీ మహతీం దివం ఖలు ।
సుసఙ్కులాయా మపి తత్ర నిర్భరా
త్కిం కాన్దిశీకత్వ మవాప నాకులా ॥ 40

శ్లో॥ ఉద్దామదానద్విపదబృన్ద బృంహితై
ర్నితాన్త ముత్తుఙ్గ తురఙ్గహేషితైః ।
చలద్ఘనస్యన్దననేమినిస్వనై రభూ
న్నిరుచ్ఛ్వాస మివాకులం జగత్ ॥ 41

సూదిమొనచే చీల్చదగినంత దట్టముగా, సైన్యమునుండి ఉద్భవించిన ధూళికణములసమూహముచే, అన్నివైపులనుండి ఆవరింపబడిన ప్రాణిగణముల యొక్క నేత్రములకు, దృష్టి పైకిగాని, క్రిందికిగాని, ముందుకుగాని, వెనుకకు గాని ప్రక్కలకుగాని ప్రసరింపలేదు. 38

దిగ్గజముల మదజలమును ఎండించునవియును, (భయంకరమైన రథఘోషను విని భయముతో ఏనుగుల మద మెండిపోయిదని భావము.) దేవతల వాహనమగు విమానముయొక్క కిటికీలయందు, ప్రతిధ్వనించుటచేత బలపడినవియును, చాలకాలము వరకు నిలువకుండ మ్రోగింపబడుచున్న అనేకములైన యుద్ధవాద్యములధ్వనులచేత ఆకాశము గాఢముగా గర్జించెను. (ప్రతిధ్వనించెను.) 39

గొప్పదియగు ఆ దేవసైన్యము, భూమండలమునందు తాను కొలువని ప్రదేశమనునది లేకుండ, భూమండలమంతయు వ్యాపించి, విశాలమగు స్వర్గమునకు బయలుదేరెను. అధికమయిన భారముకారణముగా స్వర్గమునందు కూడ క్రిక్కిరిసియుండవలసిన పరిస్థితి ఏర్పడగా, ఆసైన్యము కాందిశీకత్వమును, (భయపడి పారిపోవుటను) పొందలేదా? (పొందెనని భావము. త్రొక్కిసలాటలో ఒకరికొకరు తోసుకొని పిండిపిండి అయిపోవుదురేమో అను భయముతో పారిపోయిరని భావము.) 40

మత్తగజబృందముయొక్క బృంహితముల (అరుపుల) చేతను, మిక్కిలి ఎత్తైన గుఱ్ఱములయొక్క హేషితముల (అరుపుల)చేతను, మిక్కిలి వేగముగా నడుచునట్టి, మేఘమువలె ఎత్తును, వైశాల్యమునుకల, రథచక్రముల అంచుల శబ్దములచేతను, మిక్కిలి అనుకూలమైన ఈ జగత్తు ఊపిరిపీల్చనిదానివలె నిశ్చేష్ట మయ్యెను. 41

శ్లో॥ మహోగజానాం గురుభిస్తు గర్జితై
ర్విలోలఘణ్టారణితై రణోల్బణైః ।
వీరప్రణాదైః ప్రమదప్రమేదురై
ర్వాచాలతా మాదధిరే తరాం దిశః ॥ 42

శ్లో॥ దన్తీన్ద్రదానద్రవవారివీచిభిః
సద్యోఽపి నద్యో బహుధా పుపూరిరే ।
ధారా రజోభి స్తురగైః క్షతై ర్భృతా
యాః పఙ్కతా మేత్య రథైః స్థలీకృతా ॥ 43

సేనాదిగమనేన విషమభూమి సమీకరణమ్

శ్లో॥ నిమ్నాః ప్రదేశాః స్థలతా ముపాగమ
న్నిమ్నత్వ ముచ్చై రపి సర్వతశ్చ తే ।
తురఙ్గమాణాం వ్రజతాం ఖురైః క్షతా
రథై ర్గజేన్ద్రైః పరితః సమీకృతాః ॥ 44

శ్లో॥ నభో దిగన్తప్రతిఘోషభీషణై
ర్మహామహీభృత్తటదారణోల్బణైః ।
పయోధినిర్ధ్వానకేలిభి ర్జగ
ద్బభూవ భేరీధ్వనితైః సమాకులమ్ ॥ 45

శ్లో॥ ఇత స్తతో వాతవిధూతచఞ్చలై
ర్నిరన్ధ్రితాశాగమనై ర్ధ్వజాంశుకైః ।
లక్షైః క్వణత్కాఞ్చన కిఙ్కిణీకులై
రమజ్జి ధూలీజలధౌ నభోగతే ॥ 46

మహాగజములయొక్క ఘీంకారములచేతను, యుద్ధోత్సాహముతో బాగుగా కదులుచున్న ఘంటలయొక్క మోతలచేతను, యుద్ధోన్మాదము కారణముగా మిక్కిలి బలిసిన వీరుల సింహనాదములచేతను, దిక్కులన్నియు వాచాలత్వమును పొందినవి. (శబ్దములతో పిక్కటిల్లినవని భావము.) 42

గజేంద్రముల మదజలప్రవాహముల నీటిఅలలచేత నదులుకూడ బహువిధముల నిండినవి. (వేసవితాపముచే నదు లెండిపోయినను (ఈ గజముల మదజల ప్రవాహములచే మరల నిండినవని భావము.) పిమ్మట ఆ నదులు గుర్రముల తొక్కిడిచే పైకెగిసిన దుమ్ముతోనిండి, అందువలన బురదకలవిగామారి, దానిపై రథచక్రములు సంచరించుటవలన గట్టిపడి, స్థలములుగా చేయబడినవి. 43

## సేనాదులు సంచరించుటవలన ఎగుడుదిగుడైన భూమికూడ సమతలమైపోయినది

లోతైన భూములు సమతలభూము లైనవి. అట్లే ఎత్తైన ప్రదేశములు లోతైన గోతిస్థలములుగా మారినవి. పరుగెత్తుచున్న గుఱ్ఱపు గిట్టలతాకిడికి ఇతర ప్రదేశములనుండి ఎగిరిపడుచున్న ధూళివలన లోతుప్రదేశములు సమతలములైనవి. అట్లే ఏనుగులు, రథములు ఎత్తైన ప్రదేశములందు సంచరించుటవలన అచ్చటనున్న ధూళి పైకెగిరిపోయి అవి పల్లపు స్థలములుగా మారినవి. (మొత్తముమీద భూమి సమతలమైనదని భావము.) 44

ఆకాశమునందును, దిక్కుల చివరిభాగములయందును ప్రతిశబ్దించు భయంకరమైనవియును, పెద్దపర్వతతటములను విరుగగొట్టుటయందు, సమర్థములైనవియును, సముద్రమును కంపింపచేయు క్రీడకలవియును అగు యుద్ధభేరీనినాదములచే జగత్తంతయు వ్యాకుల మయ్యెను. 45

గాలికి రెపరెపలాడుచు, ఇటునటు కదులుచున్నవియును, నడుచుట కవకాశమీయనంత దట్టముగా దిక్కులయందు వ్యాపించినవియును, మ్రోగుచున్న, అలంకారములకై కట్టిన బంగరుమువ్వలసమూహాము కలవియును అగు లక్షలకొలది ధ్వజవస్త్రములు, ఆకాశమునందున్న ధూళి

శ్లో॥ ఘణ్టారవై రౌద్రతరై ర్నిరన్తరం
విసృత్వరై ర్గర్జరవైః సుభైరవైః ।
మత్తద్విపానాం ప్రథయామ్బభూవిరే
న వాహినీనాం పటహస్య నిస్వనాః ॥ 47

## సేనాక్రమణా ద్ధూల్యభిదూషణమ్

శ్లో॥ కరాలవాచాలముఖా శ్చమూస్వనై
ర్ధ్వస్తామ్బరా వీక్ష్య దిశో రజస్వలాః ।
తిరోబభూవే గహనై ర్దినేశ్వరో
రజోన్ధకారైః పరితః కుతో౽ప్యసౌ ॥ 48

శ్లో॥ ఆక్రాన్తపూర్వా రభసేన సైనికై
ర్దిగజ్గనా వ్యోమ రజోభిదూషితా ।
భేరీరవాణాం ప్రతిశబ్దితై ర్ఘనై
ర్జగర్జ గాఢం ఘనమత్సరాదివ ॥ 49

సముద్రమునందు మునిగిపోయినవి. (ఆ దుమ్ములో ధ్వజవస్త్రములు కనబడుటలేదని భావము.) 46

నిరంతరము వ్యాపించునట్టి, భయంకరములైన మదేభముల బృంహితముల చేతను, (ఘీంకారములచేతను) రౌద్రతరములైన ఘంటారవములచేతను, సైన్యపు కదలికను సూచించు యుద్ధభేరుల శబ్దము స్పష్టముగా వినబడలేదు. (గజ ఘీంకారములును, ఘూంటారావములును యుద్ధబేరుల శబ్దముకంటె గంభీర తరము లగుటవలన భేరీనినాదము వినబడలేదని భావము. 47

## సేనలాక్రమించుటచేత ఎగిసిన ధూళీవర్ణనము

సైన్యఘోషచే అధికముగా మాట్లాడునోరుకలవియును, దుమ్ముకొట్టుకొనిన అంబరములు(వస్త్రములు)కలవియును, దుమ్ముతో కూడినవియును అగు దిక్కులనుచూచి, తనను చుట్టుముట్టిన, దట్టమైన ధూళివలన ఏర్పడిన చీకటినిచూచి, దినేశ్వరుడైన సూర్యుడు ఎక్కడికో వెళ్ళి దాగుకొనెను. (ఈ శ్లోకమునందు శ్లేషాలంకార సామర్థ్యముచే మరియొక అర్థముకూడ సూచింపబడినది.) రజస్వల=ఋతు ధర్మమునందున్న, భయంకరాకారముగల, మౌనమును పాటించుచున్న నోరుకల, వస్త్రముజారిన (నగ్నముగాఉన్న) సైన్యము అను స్త్రీనిచూచి, రజస్వల అను లక్షణముండుటవలన గుడ్డివానివలె (చూడనివానివలె) ప్రవర్తించుచు "రజస్వలాదర్శనము నిషేధము" అను ధర్మమును పాటించుచు, గహనమైన మనస్సుగల సత్పురుషునివలె దినేశ్వరుడను పురుషుడు ఎచ్చటికో అంతర్ధానమైపోయెను. (ఎవడైన అసత్పురుషుడు రజస్వలను చూచుచున్నచో దానిని గమనించిన సత్పురుషుడు దయతో ఆ చూచుచున్న వానిముఖముపై వస్త్రమును కప్పివేయు సంప్రదాయ మిచ్చట సూచింపబడినది.)48

సైనికులచేత వేగముగా ఆక్రమింపబడిన 'దిక్కు' అనునాయిక ధూళిచే (ఋతుధర్మముచే) మలినపరుపబడగా చూచి, గాఢమైన ద్వేషమువలననో అన్నట్లు ఆకాశము, యుద్ధభేరుల గంభీరమైన ప్రతిధ్వనుల రూపమున గర్జించెను. 49

శ్లో॥ గురుసమీర సమీరితభూధరా
ఇవ గజా గగనం విజగాహిరే ।
గరుతరా ఇవ వారిధరాః రథా
భువ మితీహ వివర్త ఇవా భవత్ ॥ 50

శ్లో॥ బలవదసురలోకానల్పకల్పాన్తకాలే
నిరవధయ ఇవామ్భోరాశయో ఘోరఘోషాః ।
గరుతరపరిమజ్జద్భూభృతో దేవసేనా
వవృధు రపి సపూర్ణా వ్యోమభూమ్యన్తరాలే ॥ 51

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"దేవసేనాప్రయాణః"నామ చతుర్దశః సర్గః

-o0o-

ప్రబలప్రభంజనముచేత ఎగురగొట్టబడిన పర్వతములేమో అన్నట్లు ఏనుగులు ఆకాశములోనికి దిగినవి. పెద్ద మేఘములేమో అన్నట్లు రథములు భూమిపై దిగినవి. కాని యుద్ధమునందు మాత్రము ఈ విషయము తారుమారయినదేమో అన్నట్లున్నది. (భూమిపై నుండవలసిన పర్వతములు ఏనుగులరూపమున ఆకాశము నందుండి, ఆకాశముపై నుండవలసిన మేఘములు రథముల రూపమున క్రిందికి దిగి, భూమ్యాకాశముల స్థితులను తారుమారుచేసినవేమో అన్నట్లున్నదని భావము. ఈశ్లోకము దృతవిలంబితవృత్తము నందు కూర్పబడినది.) **50**

ఘోరఘోషను నింపునవియును, గురత్వకారణముగా 1. తమమాహాత్మ్యమువలన దేవరాజులను, 2. తమ బరువవలన పర్వతములను, తమయందు ముంచెత్తు నవియును, అగు దేవసేనలు సంపూర్ణములైయుండికూడ, భూమ్యాకాశముల మధ్యభాగమునందు ప్రళయకాలమునందలి అనల్పములును, అనంతములును అగు సముద్రములు చెలియలికట్టనుదాటి, పొంగివచ్చుచున్నవేమో అన్నట్లు ఉప్పొంగి, వర్ధిల్లినవి. (ఈ శ్లోకము మాలినీవృత్తమునందు కూర్పబడినది.)
**51**

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను
మహాకావ్యమునందు "దేవసేనాప్రయాణము" అను పేరుగల పదునాల్గవ
సర్గమునకు "ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన
బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ
వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-

# కుమారసమ్భవమ్

## "సురాసురసైన్యసంఘట్టః" నామ
## పఞ్చదశః సర్గః

శ్లో॥ సేనాపతిం నన్దన మన్ధకద్విషో
ర్యుధే పురస్కృత్య బలస్య శాత్రవః ।
సైన్యై రుపైతీతి సురద్విషాం పురో
ఉభూ త్కింవదన్తీ హృదయప్రకమ్పినీ ॥ 1

ససైనిక కుమారాగమనేన తారకేయక్షోభణమ్

శ్లో॥ చమూప్రభుం మన్మథమర్దనాత్మజం
విజిత్వరీభి ర్విజయశ్రియాశ్రితమ్ ।
శ్రుత్వా సురాణాం పృతనాభి రాగతం
చిత్తే చిరం చుక్షుభిరే మహాసురాః ॥ 2

# కుమారసంభవము

## "సురాసురసైన్యసంఘట్టము" అను పదునేనవ సర్గము

బలుడను రాక్షసునకు శత్రువైన దేవేంద్రుడు, అంధకాసురాంతకుడగు శివుని కుమారుడగు కార్తికేయుని, దేవసేనాపతిగా తనకు ముందుంచుకొని, తన సైన్యములతోసహా యుద్ధముచేయుటకు వచ్చుచున్నాడను, హృదయమును వణికించునట్టి (భయంకరమైన) కిం వదంతి (జనశ్రుతి) తారకాసురనగర నివాసులైన రాక్షసులముందు వినబడెను. (ఈ సర్గములోని శ్లోకములు 'ఇంద్రవజ్రా'అను ఉపజాతిఛందస్సునందు కూర్చబడినవి.) 1

**దేవసైన్యముతోకూడిన కుమారుని రాకను చూచి, తారకసైనికులు క్షోభిల్లుట**

విజయలక్ష్మిచేత సేవింపబడుచున్న, మన్మథమర్దనుడైన శివకుమారుని దేవసేనాధిపతిగా ముందుచుకొని, జయశీలమైన దేవసైన్యముతోకలిసి, దేవేంద్రుడు యుద్ధముచేయుటకై వచ్చుచున్నా డను వార్తను విని, తారకాదులైన మహాసురులు తమ మనస్సులయందు చిరకాలము దుఃఖించిరి. (భయపడిరని భావము. ఈ శ్లోకమునందు 'విజయలక్ష్మిచేత సేవింపబడుచున్న' అను విశేషణముచేత కార్తికేయుడు మన్మథునికాల్చిన, త్రిజగజ్జేత అయిన శివుని కుమారుడు కనుక అతనిని తారకుడును, రాక్షససైన్యమును జయింపలేరు కనుక అతని రాకచే భయపడుట యుక్తమే అనిసూచింపబడినది.) 2

శ్లో॥ సమేత్య దైత్యాధిపతేః పురే స్థితాః
కిరీటబద్ధాఞ్జలయః ప్రణమ్య తే ।
న్యవేదయ న్మన్మథశత్రుసూనునా
యుయుత్సునా జమ్భజితం సహాగతమ్ ॥ 3

శ్లో॥ దాసీకృతాశేషజగత్త్రయం న మాం
జిగాయ యుద్ధే కతిశః శచీపతిః? ।
గిరీశపుత్రస్య బలేన సామ్ప్రతం
ధ్రువం విజేతేతి స కాకుతో ఉహసత్ ॥ 4

శ్లో॥ తతః కృధా విస్ఫురితాధరాధరః స
తారకో దర్పితదోర్బలోద్ధతాన్ ।
యుధే త్రిలోకీజయకేలిలాలసః
సేనాపతీ న్సన్నహనార్థ మాదిశత్ ॥ 5

శ్లో॥ మహాచమూనా మధిపాః సమన్తతః
సన్నహ్య సద్యః సుతరా ముదాయుధాః ।
తస్థు ర్వినమ్రక్షితిపాలసఙ్కులే
తదఙ్గణద్వారవరప్రకోష్ఠకే ॥ 6

శ్లో॥ స ద్వారపాలేన పురః ప్రదర్శితా
న్కృతానతీ న్బాహువరా నధిష్ఠితాన్ ।
మహాహవాంభోధివిధూననోద్ధతాన్
దదర్శ రాజా పృతనాధిపాన్ బహూన్ ॥ 7

రాక్షసరాజగు తారకుని నగరమందున్న ఆ రాక్షసులు అందరు కలిసి, తమ కిరీటపుటంచులయందు, అంజలిని ఘటించి, నమస్కరించి, "యుద్ధము చేయగోరినవాడై, దేవేంద్రుడు మదనాంతకుడగు శివపుత్రుని (కార్తికేయుని) సేనాపతిగా తోడుతెచ్చుకొని వచ్చియున్నా"డని విన్నవించిరి. 3

"ముల్లోకములను దాసులుగాచేసికొనిన, నన్ను, ఆ శచీపతియగు ఇంద్రుడు ఎన్నిసార్లు గెలిచినాడు? (అబ్బో చాలామార్లు గెలిచినాడు!) ప్రస్తుతము గిరీశపుత్రుడయిన కుమారస్వామితో కలిసివచ్చి, అతని బలము నాశ్రయించి ఇక తప్పక నన్ను గెలువగలడు!" అని వేళాకోళముచేసెను. (ఎన్నడు నన్ను గెలువలేదని ఎత్తిపొడుపుగా మాట్లాడెను.) 4

తదనంతరము కోపముతో క్రిందిపెదవి అదురుచుండగ, ముజ్జగములను గెలుచు ఆటయం దుత్సాహవంతుడైన ఆ తారకాసురుడు గర్వించిన, భుజబలోద్ధతులైన, తన సేనాపతులను యుద్ధమునకు సన్నద్ధులు కావలె నని ఆజ్ఞాపించెను. 5

ఆయుధముల నెత్తిపట్టుకొని, మహాసైన్యాధిపతులు, వెంటనే యుద్ధమునకు బాగుగా సిద్ధమైనవారై, రాజురాక కొఱకై ఎదురుచూచుచు, వినమ్రులై రాజులతో నిండిన, తారకాసురుని రాజభవనప్రాంగణపు మధ్యభాగమునందు అంతట నిలబడియుండిరి. 6

ఆ రాక్షసరాజైన తారకుడు, తన ఎదుట ద్వారపాలకులచేత చూపబడిన, లోనికి వచ్చుటకై అనుమతింపబడిన, శ్రేష్ఠములైన బాహువులుకల, ద్వారమువద్ద వేచి ఉన్న, మహాయుద్ధరూపమునఉన్న సముద్రమును కంపింపచేయుటయందు ప్రగల్భులైన, (మహావీరులైన) చాలామంది సేనానాయకులను చూచెను. 7

## ససైనిక తారకస్య ప్రయాణమ్

శ్లో॥ బలీ బలారాతిబలాతిశాతనం
దిగ్దన్తినాద, ద్రవ, నాశనస్వనమ్ ।
మహీధరామ్భోధి న వారితక్రమం
యయౌ రథం ఘోర మథాధిరుహ్య ॥ 8

శ్లో॥ యుగక్షయక్షుబ్ధపయోధినిఃస్వనా
శ్చలత్పతాకాకులవారితాతపాః ।
ధరారజోఽగ్రస్తదిగన్తభాస్కరాః
పతిం ప్రయాన్తం పృతనా స్త మన్వయుః ॥ 9

శ్లో॥ చమూరజః ప్రాప దిగన్తదన్తినాం
మహాసుర స్యాభిసురం ప్రసర్పిణః ।
దన్తప్రకాణ్డేషు సితేషు శుభ్రతాం
కుమ్భేషు దానామ్బుఘనేషు పఙ్కతామ్ ॥ 10

శ్లో॥ మహీభృతాం కన్దరదారణోల్బణై
స్తద్వాహినీనాం పటహస్వనై ర్ఘనైః ।
ఉద్వేలితా శ్చుక్షుభిరే మహార్ణవా
నభఃప్రవన్తీ సహసాభ్యవర్ధత ॥ 11

శ్లో॥ సురారినాథస్య మహాచమూస్వనై
ర్విగాహ్యమానా తుములైః సురాపగా ।
అభ్యుచ్ఛ్రితై రూర్మిశతైశ్చ వారిజై
రక్షాలయ న్నాకనికేతనావలీమ్ ॥ 12

## సేనాసమేతుడై తారకుడు యుద్ధమునకు వచ్చుట

అనంతరము బలవంతుడైన ఆ తారకుడు, ఇంద్రసైన్యమును హరించు నదియును, దిగ్గజములనాదమును, మదమును నశింపజేయు శబ్దము కలదియును (ఆ రథపు శబ్దమును విని, దిగ్గజములు కూడ మౌనమును వహించి భయముతో మదమెండిపోయిన గజము లగునని భావము.) పర్వతముల మీదను, సముద్రములయందునుకూడ, అడ్డు ఆపులేని నడక కలదియును అగు భయంకరమైన రథమునెక్కి, యుద్ధమునకై బయలుదేరెను. 8

ప్రళయకాలపు సముద్రపుఘోషవంటి భయంకరమైన శబ్దముకలవియును, కదులుచున్న తమ పతాకాసమూహముచేత ఎండను అడ్డుకొనినవియును, తమ కదలికలచే భూమినుండిలేచిన దుమ్ముతో సూర్యుని, దిగంతములను కూడ మింగివేసినవియును అగు సేనావాహినులు, యుద్ధమునకై బయలుదేరిన తమ నాయకుడగు ఆ తారకాసురుని వెనుక నడిచినవి. 9

దేవసైన్యమునకు ఎదురుగా బయలుదేరిన మహాసురుడగు తారకునియొక్క సైన్యపు కదలికవలన ఉద్భవించిన ధూళిరేణువులు, ఐరావతము మొదలగు దిగ్గజములయొక్క దంతములు అను కొమ్మలమీదపడి, తెల్లదనమును పొందెను. ఆ ధూళియే మదజలమును ఎక్కువగా స్రవించు దిగ్గజముల కుంభస్థలముల మీదపడి, బుదర అయ్యెను. 10

పర్వతగుహలను పగులగొట్టుటలో ఉద్ధతములైన (గర్వించిన) తారకాసుర సైన్యపు యుద్ధభేరీనాదములచేత మహాసముద్రములు తమ చెలియకట్టను దాటివచ్చి క్షోభమునందినది. ఆ పటహధ్వనిని వినుటవలన కలిగిన భయము చేత ఆకాశగంగకూడ వెంటనే తన గట్టుదాటి ఉప్పొంగి ప్రవహించెను. 11

సంకులమైన ఆ రాక్షసరాజుయొక్క మహాసైన్యపు ఘోష తనలోనికి ప్రవేశింపగనే ఆకాశగంగ యందలి పద్మములతోను, వందలకొలది తరంగములతోను కలసి ఉప్పొంగి, స్వర్గములోని భవనపంక్తులను కడిగివేసెను. 12

## తారకస్యోత్పాతపరమ్పరావర్ణనమ్

శ్లో॥ అథ ప్రయాణాభిముఖస్య నాకినాం
ద్విషః పురస్తా దశుభోపదేశినీ ।
అగాధదుఃఖామ్బుధిమధ్యమజ్జనం
బభూవ చోత్పాతపరమ్పరా తవ ॥ 13

అవ. : ఇతః పరమ్ ఆగామి - ఇత్యాదిభి రేకాదశభి రుత్పాత
పరమ్పరామేవ ప్రపఞ్చయతి.

శ్లో॥ ఆగామిదైత్యాశనకేలికాంక్షిణీ
కుపక్షిణాం ఘోరతరాపరమ్పరా ।
దధౌ పదం వ్యోమ్ని సురారివాహినీ
రుప ర్యుప ర్యేత్య నివారితాతపా ॥ 14

శ్లో॥ ముహు ర్విభగ్నాతపవారణధ్వజ
శ్చలద్ధరాధూలికలాకులేక్షణః ।
ధూతాశ్వమాతఙ్గమహారథాకరా
నవేక్షణో ఽ భూ త్ప్రసభం ప్రభఞ్జనః ॥ 15

## తారకునకు కనపడిన అపశకునపరంపరా వర్ణనము

పిమ్మట, యుద్ధసన్నద్ధుడై బయలుదేరిన ఆ దేవశత్రువగు తారకాసురుని ఎదుట "ఓ తారకాసురుడా! నీకు అగాధమైన దుఃఖసముద్రమునందు స్నానము చేయుట సంభవించుగాక" అని అశుభములను సూచించు దుఃశ్శకునపరంపర సాక్షాత్కరించెను. 13

**అవతారిక** : ఇచ్చట నుండి పదునొకండు శ్లోకములలో కనబడిన ఉత్పాతపరంపరనే వర్ణించుచున్నాడు.

ఇకముందు రాక్షసులను భుజించుట అనుక్రీడను కోరుకొనుచున్నదియును, ఎండను ఆపకుండ (ఎండను మాడ్చుచునే) రాక్షససైన్యముల నెత్తిమీద ఆకాశమునందు మిక్కిలి భయంకరములైన గ్రద్దలు మొదలగు అశుభసూకమైన పక్షులపంక్తి ఎగురసాగినది. (ఈ శ్లోకమునందు 1.ప్రయాణము తగదని సూచించుట, ఆకస్మికముగ అశుభసూకములైన గ్రద్దలు సైన్యముమీద ఎగురుట, 2. పక్షులు ఎగురుచున్నను ఎండ అక్కడ పడుచుండుట అను రెండు దుశ్శకునములు చెప్పబడినవి. వీనివలన రాక్షససైన్యము తప్పక మరణించునని సూచింపబడినది.) 14

ఛత్రములతోపాటుగా, ధ్వజములనుకూడ విరుగగొట్టినదియును, దుమ్మును ఎగురగొట్టి ఆ ధూళికణములచేత చూపరులకళ్ళను ఆకులపరిచినదియును, ప్రచండత్వముచేత ఆకాశమునందు గిరగిర తిరుగుచున్న అశ్వములను, మాతంగములను (ఏనుగులు) మహారథములను కనపడకుండ చేసినదియును, సైన్యమునంతటిని ఆక్రమించినదియును అగు 3. ప్రభంజనము (ఝంఝూవాతము) ఉద్భవించినది. ఇది మూడవ అపశకునము. 15

శ్లో॥ సద్యో విభిన్నాఞ్జనపుఞ్జతేజసో
ముఖై ర్విషాగ్నిం వికిరన్త ఉచ్చకైః ।
పురః పథోఽతీత్య మహాభుజఙ్గమా
భయఙ్కరాకారభృతో భృశం యయుః ॥ 16

శ్లో॥ మిలన్మహాభీమభుజఙ్గ భీషణం
ప్రభు ర్దినానాం పరివేష మాదధౌ ।
మహాసురస్య ద్విషతోఽతిమత్సరా
దివాన్త మా సూచయితుం భయఙ్కరః ॥ 17

శ్లో॥ త్విషా మధీశస్య పురోధిఽమణ్డలం
శివాః సమేతాః పరుషం వవాసిరే ।
సురారిరాజస్య రణాన్తశోణితం
ప్రసహ్య పాతుం ద్రుత ముత్సుకా ఇవ ॥ 18

శ్లో॥ దివాపి తారా స్తరలా స్తరస్వినీః
పరాపతన్తీః పరితోఽథ వాహినీః ।
విలోక్య లోకో మనసా వ్యచిన్తయ
త్ప్రాణవ్యయాన్తం వ్యసనం సురద్విషః ॥ 19

శ్లో॥ జ్వలద్భి రుచ్చై రభితః ప్రభాభరై
రుద్భాసితాశేష దిగన్తరామ్బరమ్ ।
రవేణ రౌద్రేణ హృదన్తదారణం
పపాత వజ్రం నభసో నిరమ్బుదాత్ ॥ 20

అప్పుడే నూరబడిన కాటుకవలె నల్లనైనకాంతికలవియును, ఎత్తైనవియును (పెద్దవియును) మిక్కిలిభయంకరమయిన ఆకారముకలవియును, అగు 4. పెద్ద పాములు ఎదురుగా విషరూపమైనఅగ్నిని తమ ముఖములద్వారా వెదజల్లుచు, సైన్యము వెళ్ళవలసిన మార్గమును అడ్డముగా దాటుకొనుచు వెళ్ళిపోయినవి. ఇది నాలుగవ దుఃశకునము. 16

దినాధిపతియగు సూర్యుడు, శత్రువైన తారకాసురుని అంతమును (వినాశమును) సూచించునట్టి, అతిభయంకరములైన, ఒండొరులతో కలిసిన, పాములచేత ఏర్పడిన భయంకరమైన 5. గూడును (పరిధిని) శత్రువులపైగల అతిమాత్సర్యమును సూచించుటకేమో అన్నట్లు ధరించెను. ఇది అయిదవ ఉత్పాతము. 17

6. ఆడునక్క లన్నియు కలిసి, బయటకువచ్చి, సూర్యబింబమున కెదురుగా నిలబడి, దేవశత్రువైన తారకునియొక్క యుద్ధప్రాంతమందలి నెత్తురును వెంటనే బలవంతముగా త్రాగ నుత్సహించుచున్నవో అన్నట్లు, 7. కఠోరముగా ఊళ వేయసాగినవి. (నక్క అఱుపును ఊళ అందురు). ఇందు ఆఱు మఱి ఏడు అను ఉత్పాతములు సూచింపబడినవి. (6వది పట్టపగలు, సూర్యుని ఎదుటకు నక్కలన్నియు కలిసివచ్చుట అనునది, 7వది అవి కర్ణకఠోరముగా రోదించుట అనునది.) 18

పిమ్మట పగటిపూటకూడ చంచలములై, వేగవంతములైన 8. నక్షత్రములు అసురసైన్యము చుట్టునుపడుటను చూచి, దేవశత్రువగు తారకుని ప్రాణనాశనము అవధిగాగల ఆపద కలుగబోవుచున్నదని జనులందరు తలచిరి. ఇది ఎనిమిదవ ఉత్పాతము. 19

9. మేఘములేకుండనే ఆకాశమునుండి, చుట్టును మండుచున్న వెలుగులకాంతులతో దిగంతములను ఆకాశప్రాంతమునుకూడ వెలిగింపజేయుచు, 10. మహాభయంకరమైన శబ్దముతో గుండెను చీల్చునట్టి పిడుగు పడెను. ఇందు 9వ అపశకునము మేఘములేని ఆకాశమునుండి పిడుగుపడుట, 10 అది పడి దుష్ఫలితమును సూచించుట అను రెండు అపశకునములు చెప్పబడినవి. 20

శ్లో॥ జ్వలద్భిరఙ్గారచయై ర్నభస్తలం
వవర్ష గాఢం సహ శోణితాస్థిభిః ।
ధూమం జ్వలన్త్యో వ్యసృజ న్ముఖై
రజో దధు ర్దిశో రాసభకణ్ఠధూసరమ్ ॥ 21

శ్లో॥ నిర్ఘాతఘోషో గిరిశృఙ్గశాతనో
ఘనో ఽమ్బరాశాకుహరోదరమ్భరిః ।
బభూవ భూమ్నా శ్రుతిభిత్తిభేదనః
ప్రకోపికాలార్జితగర్జితర్జనః ॥ 22

శ్లో॥ స్ఖలన్మహేభం ప్రపతత్తురఙ్గమం
పరస్పరాశ్లిష్టజనం సమన్తతః ।
ప్రక్షుభ్యదమ్భోధివిభిన్నభూధరా ద్బలం
ద్విషో ఽభూ దవనిప్రకమ్పాత్ ॥ 23

శ్లో॥ ఊర్ధ్వీకృతాస్యా రవిదత్తదృష్ట్యః
సమేత్య సర్వే సురవిద్విషః పురః ।
శ్వానః స్వరేణ శ్రవణాన్తశాతినా
మిథో రుదన్తః కరుణేన నిర్యయుః ॥ 24

11.ఆకాశము, మేఘములులేకుండగనే మండుచున్న కర్రలసమూహామును (కొరివి), 12.నెత్తుటిని, ఎముకలను వర్షముగా కురిసెను. 13.అందువలననే దిక్కు లన్నియు మండుచు, గాడిదమెడవలె ధూసరవర్ణముకల (పొగరంగులో ఉన్న) ధూళికణములను తమముఖములనుండి వెలువరింపసాగినవి. (ఈ శ్లోకము నందు మేఘములు లేకుండగనే వానకురియుటఅనునది 11వ ఉత్పాతముగను, నెత్తురు ఎముకలువానగా కురియుట 12వ ఉత్పాతముగను, దిక్కులు బూడిద రంగు ధూళికణములను వెలువరించుట 13వ ఉత్పాతముగను చెప్పబడినవి). **21**

బాగుగా కోపించిన యముడు చేసిన గర్జనను భయపెట్టునదియును, ఆకాశమునకు దిక్కులకు మధ్యగల భాగమును నింపునదియును, కొండల శిఖరములను విరుగగొట్టునదియును, గంభీరమైనదియును అగు 14. పిడుగు మోత బహుళమై, కర్ణపుటములను పగులగొట్టున దయ్యెను. (పిడుగుపాటు మోత 14వ అపశకునముగా ఈ శ్లోకమునందు సూచింపబడినది.) **22**

అట్లే ఉప్పొంగిన సముద్రజలముల ప్రవాహవేగమువలన పర్వతములను విరుగగొట్టిన 15.భూకంపము కారణముగా, శత్రువయిన తారకాసురుని సైన్యమందలి పెద్ద గజేంద్రములు తొట్రుపడినవి. గుఱ్ఱములు నిలబడలేక క్రిందపడినవి. అన్నివైపులనున్న జనము భూకంపకారణముగా ఒకరొకరిమీద పడి అతుకుకొనినట్లుపడిరి. (భూకంపము 15వ ఉత్పాతము.) **23**

16. కుక్కలన్నియు గుమిగూడి, ముఖమును పైకెత్తినవై సూర్యునియందు చూపును నిలిపి, దీనముగా (కరుణరసపూరితముగా) చెవులు చిల్లులుపడునట్టి శబ్దముతో అరుచుచు దేవద్వేషియగు తారకుని ముందుకు వచ్చిచేరినవి. కుక్కల కరుణారావము 16వ అపశకునము. **24**

## నిషిద్ధేఽపి తారక స్యాగ్రేప్రస్థానమ్

శ్లో॥ అపీతి పశ్య న్పరిణామదారుణాం
మహత్తమాం గాధ మరిష్టసన్తతిమ్ ।
దుర్దైవదష్టో న ఖలు న్యవర్తత
క్రుధా ప్రయాణవ్యవసాయతో ఽసురః ॥ 25

శ్లో॥ అరిష్ట మాశంక్య విపాకదారుణం
నివార్యమాణో ఽపి బుధై ర్మహాసురః ।
పురః ప్రతస్థే; మహతాం వృథా భవే
దసద్గ్రహాన్ధస్య హితోపదేశనమ్ ॥ 26

## మహోత్పాతవర్ణనమ్

అవ. : ఇదానీం పఞ్చభిః పఞ్చ మహోత్పాతా నాహ.

శ్లో॥ క్షితౌ నిరస్తం ప్రతికూలవాయునా
తదీయచామీకర ఘర్మవారణమ్ ।
రరాజ మృత్యో రివ పారాణావిధౌ
ప్రకల్పితం హాటకభాజనం మహత్ ॥ 27

శ్లో॥ విజానతా భావిశిరోనికృన్తనం
ప్రజ్ఞేన శోకాదివ తస్య మౌలినా ।
మహు ర్గలద్భి స్తరలై రలన్తరా
మరోది ముక్తాఫలబాష్పబిన్దుభిః ॥ 28

## యుద్ధముచేయవద్దనినను తారకుడు ముందుకు సాగుట

భావికాలమునందు ధృడముగా బాధించు, గొప్ప భయంకరమైన, అపశకునపరంపరను చూచికూడ దురదృష్టముచేత హతుడై, ఆ రాక్షసుడు కోపముచే "వినాశకాలే విపరీతబుద్ధిః" అను సామెతప్రకారము తన యుద్ధ ప్రయత్నమునుండి విరమింపలేదు. 25

"ఈ అపశకునములు భావికాలమున భయంకరమైన ఫలితముల నిచ్చునని" ఎంతగానో ఆలోచించి, పండితులైనవారు (వివేకశీలురు) ఎంత చెప్పి ఆపజూపినను, మహాసురుడైన తారకుడు యుద్ధముచేయుటకే ముందుకు సాగెనుకాని, వెనుతిరుగలేదు. ఏలయనగా మొండిపట్టుదలచే వివేకమును కోల్పోయిన జ్ఞానాంధునకు మహాత్ములు చెప్పిన మంచిమాటలు (ఉపదేశములు) వ్యర్థములే అగునుకదా! 26

## మహోత్పాతములను వర్ణించుట

**అవతారిక :** ఇచ్చట నుండి ఐదు శ్లోకములలో ఇప్పుడు పంచమహోత్పాతములను వర్ణించుచున్నాడు.

ఆ తారకునియొక్క బంగారుగొడుగు, ఎదురుగాలిచేత క్రిందికి పడగొట్టబడినదై, మృత్యుదేవతయగు యమునికి సమర్పింపబడిన బంగారు భోజనపాత్రయో అన్నట్లు ప్రకాశించెను. 27

భావికాలమునందు జరుగబోవు అతని శిరఃఖండనమును తెలిసికొనిన, ఆ తారకుని కిరీటము, మిక్కిలి దుఃఖమునొంది, మాటిమాటికి జారిపడుచున్న చంచలములయిన ముత్యములు అను బాష్పబిందువులను విడుచుచు మిక్కిలి దుఃఖించెనో అన్నట్లు కనబడినది. 28

శ్లో॥ నివార్యమాణై రభితో ఽనుయాయిభి
ర్గ్రహీతుకామై రివ తం ముహు ర్ముహుః ।
అపాతి గృధ్రై రభిమౌలి మాకులై
ర్భవిష్య దేత న్మరణోపదేశిభిః ॥ 29

శ్లో॥ సద్యో నికృత్తాఞ్జన సోదరద్యుతిం
ఫణామణిప్రజ్వలదంశుమణ్డలమ్ ।
నిర్య ద్విషోల్కానలగర్భఫూత్కృతం
ధ్వజే జన స్తస్య మహాహి మై త ॥ 30

శ్లో।7 రథాశ్వకేశావలి కర్ణచామరం
దదాహ బాణాసన బాణబాణధీన్ ।
అకాణ్డత శ్చణ్డతరో హుతాశన
స్తస్యాతనుస్యన్దనధుర్యగోచరః ॥ 31

శ్లో॥ ఇత్యా ద్యరిష్టై రశుభోపదేశిభి
ర్విహన్యమానో ఽప్యసురః పునః పునః ।
యదా మదాన్ధో న గతా న్న్యవర్తతా
మ్బరా త్తదా భూ న్మరుతాం సరస్వతీ ॥ 32

శ్లో॥ మదాన్ధ మా గా భుజదణ్డచణ్డిమా
వలేపతో మన్మథహన్తృసూనునా ।
సురైః సనాథేన పురన్దరాదిభిః
సమం సమన్తా త్సమరం విజిత్వరైః ॥ 33

ఈ తారకుడు, భావికాలమున మరణించునను విషయమును సూచించుచున్న, రాక్షసుల మాంసమును తినుటకు తొందరపడుచున్న గ్రద్దలు, అన్నివైపులనుండి తమ సహచరపక్షులు వెంటవచ్చుచుండగా మాటిమాటికి ఆపబడకుండ ఆ తారకుని పట్టి తినగోరుచున్నవో అన్నట్లు ఎదురుగావచ్చి అతని కిరీటముమీద పడసాగినవి. 29

అప్పుడేనూరబడిన కాటుకకు సోదరునివలెనున్న, నల్లనికాంతిగలదియును, పడగమీదిమణులచేత అధికమైన కాంతిపుంజముకలదియును, వెడలగ్రక్కుచున్న విషాగ్ని మధ్యభాగమునగల బుసలుకలదియును అగు ఒక మహాసర్పమును జను లందరును ఆ తారకుని జండామీద చూచిరి. ఈ సర్పదర్శనము కూడ ఒక ఉత్పాతమే. 30

ఆ తారకాసురుని మహారథముయొక్క ముందుకనబడిన, మహా భయంకరమైన అగ్ని, వేళకానివేళయందు అతని రథమునకుకట్టిన గుఱ్ఱముల జూలును, కర్ణచామరములను ధనుర్బాణములను తూణీరములను కాల్చివేసెను. ఇది మరియొక ఉత్పాతము. 31

మదాంధుడైన తారకాసురుడు, అశుభమును సూచించునట్టి, పైన పేర్కొనబడిన అపశకునములు, విఘ్నములు కల్పింపబడినవాడైనను తన యుద్ధప్రయాణమును మానలేదు. అప్పుడు ఆకాశమునుండి దైవవాణి ఇట్లు వినబడినది. 32

"ఓరీ మదాంధుడా! నీ భయంకరమైన భుజముల గర్వమునాధారముచేసికొని, విజయశీలురైన ఇంద్రాదిదేవతలతో పరివేష్టింపబడి, మదనాంతకుడగు శివకుమారుని సేనానాయకునిగా గ్రహించి, నీపైకి వచ్చుచున్న దేవతలతో యుద్ధము చేయుటకు వెళ్ళకుము." 33

## తారకసమరానౌచిత్యవర్ణనమ్

అవ. : అథ 'గుహః' - ఇత్యాదిభి శ్చతుర్భిః కుమారవిషయే తారకకర్తృక సమరానౌచిత్యమేవ దర్శయతి.

శ్లో॥ గుహో ఽసురైః షడ్దినజాతమాత్రకో
నిదాఘధామేవ నిశాతమోభరైః ।
విషహ్యతే నాభిముఖో హి సజ్గరే
కుత స్త్వయా తస్య సమం విరోధితా? ॥ 34

శ్లో॥ అభ్రంలిహైః శృఙ్గశతైః సమన్తతో
దిక్చక్రవాలైః స్థగితస్య భూభృతః ।
క్రౌఞ్చస్య రన్ధ్రం విశిఖేన నిర్మమే
యేనా హవ స్తస్య సహ త్వయా కుతః? ॥ 35

శ్లో॥ లబ్ధ్వా ధనుర్వేద మనఙ్గవిద్విష
స్త్రిస్సప్తకృత్వః సమరే మహీభుజామ్ ।
కృత్వాభిషేకం రుధిరామ్బుభి ర్ఘనైః
స్వక్రోధవహ్నిం శమయా మ్బభూవ యః ॥ 36

శ్లో॥ న జామదగ్న్యః క్షయకాలరాత్రికృ త్స
క్షత్రియాణాం సమరాయ వల్గతి ।
యేన త్రిలోకీసుభటేన తేన
కుతో ఽవకాశః సహ విగ్రహాగ్రహే? ॥ 37

## యుద్ధముచేయుట తారకునకు తగదని వర్ణించుట

అవతారిక : ఇచ్చటి నుండి నాలుగు శ్లోకములలో తారకుడు కుమారస్వామితో యుద్ధముచేయుటయందలి అనౌచిత్యమును వివరించుచున్నాడు.

నీకు యుద్ధమునం దెదురుగా నిలుచునట్టి, పుట్టి ఆరుదినములు మాత్రమే గడిచిన, దేవసేనాధిపతియగు గుహుని పరాక్రమమును, (కుమారస్వామి పరాక్రమమును) రాత్రి దట్టముగా వ్యాపించియుండు చీకటి సూర్యతేజమును తట్టుకొనలేనట్లు, ఎవరును సహింపలేరు, అనుచు ఇక అతనితో నీకెక్కడి విరోధము చెల్లును? (అతనితో యుద్ధముచేయుట అనుచితమని భావము.)34

ఆకాశమునంటుకొనునంతటి ఎత్తైన వందలకొలది శిఖరములు కలదియును, దిగంతములవరకు అన్నివైపులనుండి వ్యాపించినదియును అగు క్రౌంచపర్వతము ఏ కుమారస్వామిచేత ఒక్క బాణముతో తూటుకొట్టబడినదో అట్టి వానితో నీవు, ఎట్లు యుద్ధము చేయుదువు? ఈ యుద్ధ మనుచితము. 35

ఏ పరుశురాముడు మన్మథదాహకుడైన శివునినుండి ధనుర్వేదమునుపొంది (చదివి) యుద్ధమునందు రాజుల రుధిరధారలతో 21 సార్లు అభిషేకమును చేసి, తన కోపాగ్నిని ఉపశమింపచేసికొనెనో (తరువాతి శ్లోకములతో అన్వయము.) 36

ఎవడు క్షత్రియులకు కాళరాత్రిని సృష్టించెనో, ఆ పరశురాముడుకూడ, ఏ జగదేకవీరుడైన ఈ దేవసేనాపతితో యుద్ధము చేయుటకై ముందుకుసాగడో, అట్టి ఈ కార్తికేయునితో యుద్ధముచేయుటకు నీ కవకాశ మెక్కడిది? అని హేళనపూర్వకముగా దైవవాణి చెప్పినది. (నీ వీతనితో యుద్ధము చేయవద్దు. మరలి పొమ్ము అని భావము.) 37

అవ. : నను నివర్తనే పునరపి వధశఙ్కేతి చేత్ తత్రాహ.

శ్లో॥ త్యజాశు గర్వం మదమూఢ! మా స్మగాః
స్మరారిసూనో ర్వరశక్తిగోచరమ్ ।
త మేవ నూనం శరణం వ్రజాధునా
జగత్సు వీరం స చిరాయ జీవ తత్ ॥ 38

శ్లో॥ శ్రుత్వేతి వాచం వియతో గరీయసీం
క్రోధా దహంకారపరో మహాసురః ।
ప్రకమ్పితాశేష జగత్త్రయోఽపి స
న్నకమ్ప తోచ్చై ర్దివ మభ్యధాచ్చ సః ॥ 39

## దేవా నుద్దిశ్య తారకోక్తిః

అవ. : అథ 'కిమ్' ఇత్యాదిభి స్త్రిభి స్తదుక్తి మాహ.

శ్లో॥ కిం బ్రూథ రే వ్యోమచరా మహాసురాః
స్మరారిసూనుప్రతిపక్షవర్తినః ।
మదీయబాణవ్రణవేదనా హి సా
ఽధునా కథం విస్మృతి గోచరీకృతా ॥ 40

శ్లో॥ కటుస్వరైః ప్రాలప థామ్బరస్థితాః
శిశో ర్బలాత్ షడ్దినజాతకస్య కిమ్? ।
శ్వానః ప్రమత్తా ఇవ కార్తికే నిశి
స్వైరం వనాన్తే మృగధూర్తకా ఇవ ॥ 41

అవతారిక : యుద్ధప్రయత్నమును మానుమనిచెప్పి, మానిన తరువాత చంపుదు రేమో అను అనుమానమును తీర్చుటకు సమాధానమును చెప్పుచున్నాడు.

ఓ ఉన్మత్తుడైన మూర్ఖుడా! వెంటనే నీ దురభిమానమును విడిచిపెట్టుము. మదనాంతకుని కుమారునివద్ద నుండు శ్రేష్ఠమైన 'శక్తి' అను నాయుధపు కంటపడకుము. అందువలన ఆ జగదేకవీరుడైన కార్తికేయునే ఇప్పుడు శరణు పొందుము. ఆతని శరణుపొందుటవలన చిరకాలము జీవింపుము. (కుమార స్వామి తప్ప ఇతరు లెవ్వరును నీ ప్రాణములను రక్షింపలేరని భావము.)38

ఆకాశమునుండి వెలువడిన, భావగంభీరమైన ఇట్టిమాటనువిని, కోపమువలన అహంకరించినవాడై, ఆ తారకాసురుడు ముల్లోకములను గడగడలాడించిన, వాడైనను, తా నిపుడు, భయకంపితు డయ్యెను. మరల స్వర్గమువైపునకు తిరిగి, బిగ్గరగా ఇట్లనెను. 39

## దేవతల నుద్దేశించి తారకునిప్రసంగము

**అవతారిక :** ఇచ్చటినుండి మూడు శ్లోకములలో ఆ తారకుని మాటలను చెప్పుచున్నాడు.

"ఓ ఆకాశసంచారులారా! గొప్ప సురులారా! మీరు స్మరశత్రువైన, శివకుమారుడగు కార్తికేయుని, మా ప్రతిపక్షమునందు (శత్రుపక్షమునందు) ఉండికూడ ఏమి మాట్లాడుచున్నారు? (మీ రిట్లు మాట్లాడుట తగ దని భావము.) నేను పూర్వము మీ శరీరములపైన్న బాణములతో చేసిన గాయములబాధను అప్పుడే ఎట్లు మర్చిపోయినారు? (యుద్ధములో ఇక ముందు మిమ్ము నేను తినబోవుచుండుటవలన ఆ బాధనే గుర్తుంచుకోవలె నని భావము.) 40

ఓ దేవతలారా! మీరు ఆకాశముననిలబడి, పుట్టి ఆరురోజులుగడిచిన ఈ బాలుని యొక్క పరాక్రమము కారణముగా, కార్తికమాసమునందు పిచ్చికుక్కలవలెను, రాత్రిపూట అరణ్యమధ్యమునందు ధూర్తమృగములవలెను ఎందుకు కర్ణకఠోరముగ ప్రేలాపములను చేయుచున్నారు? (నా వలన నిర్వీరులైన మీరు ఇట్లు ప్రేలాపింపరాదు.) 41

శ్లో॥ సజ్జేన వో గర్భతపస్వినః శిశు ర్వరాక
ఏషో ఽ న్త మవాప్స్యతి ధ్రువమ్ ।
అతస్కర స్తస్కరసజ్గతో యథా
త ద్వో నిహన్మి ప్రథమం తతో ఽ ప్యముమ్ ॥ 42

శ్లో॥ ఇతీరయ త్యుగ్రతరం మహాసురే
మహాకృపాణం కలయ త్యలం కృథా ।
పరస్పరోత్పీడితజానవో భయా
న్నభశ్చరా దూరతరం విదుద్రువుః ॥ 43

శ్లో॥ తతో ఽ వలేపా ద్వికటం విహస్య స
వ్యధత్తకోశా దసి ముత్తమం బహిః ।
రథం ద్రుతం ప్రాపయ వాసవాన్తికం
నన్వి త్యవోచ న్నిజసారథిం రథీ ॥ 44

తారకసేనాయా ఇన్ద్రసేనా సంముఖగమనమ్

శ్లో॥ మనో ఽ తివేగేన రథేన సారథి
ప్రణోదితేన ప్రచల న్మహాసురః ।
తతః ప్రపేదే సురసైన్యసాగరం
భయఙ్కరాకార మపార మగ్రతః ॥ 45

శ్లో॥ పురః సురాణాం పృతనాం ప్రథీయసీం
విలోక్య వీరః పులకం ప్రమోదజమ్ ।
బభార భూమ్నా థ స బాహుదణ్డయోః
ప్రచణ్డయోః సజ్గరకేలికౌతుకీ ॥ 46

మీతోడి సంబంధము కారణముగా శోచనీయుడై, ఎదుటనున్న ఈ గర్భతపస్వియగు (చిన్నతనమునుండి తపస్సుచేయు నిరుపేద అని భావము.) శివకుమారుడైన, వరాకుడైన(కృపణుడైన) ఈ బాలుడు, దొంగ కానివాడు దొంగలతో స్నేహముచేసి, దొంగవలె నగుట నిజమైనట్లు, మీతో చేరి, మీతోబాటు చచ్చును. కనుక ముందుగా మిమ్ము చంపుదును. ఆ తరువాత ఈ కుమారస్వామినికూడ చంపుదును. 42

మహాసురుడైన తారకుడు ఈ విధముగా పలుకుచు మిక్కిలి కోపముతో మహా ఖడ్గమునుచేతబట్టగనే, దేవతలు భయపడినవారై, ఒకరినొకరు తొక్కుకొనుట వలన మోకాళ్ళనొప్పికలవారై, మిక్కిలి దూరముపారిపోయిరి. 43

ఆ తరువాత తారకుడు గర్వముతో వికటాట్టహాసముచేసి, ఒరనుండి భయంకరమైన కత్తిని బయటకుదూసి, పిదప రథము నెక్కి, తన సారధితో "సారధీ రథమును వేగముగా ఇంద్రునివద్దకు చేర్చుము" అనెను. 44

## తారకునిసేన ఇంద్రునిసేనకు ఎదురుగా వెళ్ళుట

తరువాత మనసుకంటె వేగముగా సారధిచేత నడుపబడుచున్న రథమునెక్కి ముందుకుసాగుచున్న తారకాసురుడు, అతని ఎదుటనున్న అంతులేని (భయంకరాకారముగల) దేవసేనాసముద్రమును ప్రవేశించెను. 45

మహాసురుడైన ఆ తారకుడు అపారమైన దేవసైన్యమును తన ఎదుట నుండగ, చూచి, పరాక్రమవంతములైన భుజదండములపై ఆనందమువలన కలిగిన పులకరింతను ధరించెను. (యుద్ధక్రీడయందు ఉత్సాహముకల వీరులకు శత్రుసైన్యదర్శనమే మహానందకారక మగునని భావము.) 46

శ్లో॥ తతో మహేన్ద్రస్య చరా శ్చమూచరా
రణాన్తలీలారభసేన భూయసా ।
పురః ప్రచేలు ర్మనసో ఽతివేగినో
యయుత్సుభిః కిం సమరే విలమ్బ్యతే? ॥ 47

శ్లో॥ పురః స్థితం దేవరిపో శ్చమూచరా
బలద్విషః సైన్యసముద్ర మభ్యయుః ।
భుజం సముత్క్షిప్య పరేభ్య ఆత్మనోఽ
భిదాన ముచ్చై రభితో న్యవేదయన్ ॥ 48

శ్లో॥ పురోగతం దైత్యచమూమహార్ణవం
దృష్ట్వా పరం చుక్షుభిరే మహాసురాః ।
పురారిసూనో ర్నయనైకకోణకే
మము ర్భటా స్తస్య రణేఽవహేలయా ॥ 49

శ్లో॥ ద్విషద్బలత్రాసవిభీషితాశ్చమూ
ర్దివౌకసా మన్ధకశత్రునన్దనః ।
అపశ్య దుద్దిశ్య మహారణోత్సవం
ప్రసాదపీయూషధరేణ చక్షుషా ॥ 50

శ్లో॥ ఉత్సాహితాః శక్తిధరస్య దర్శనా
న్మృధే మహేన్ద్రప్రముఖా మఖాశనాః ।
అహం మృధే జేతు మరీ నరీరమ
న్న కస్య వీర్యాయ వరస్య సఙ్గతిః? ॥ 51

అనంతరము, మనోవేగముకంటె అధికవేగముగలవారును, యుద్ధములో తమ బాహుపరాక్రమపు చమత్కారమును అధికముగా ప్రదర్శింప నుత్సాహము కలవారును అగు ఇంద్రునిసైన్యమునందు సంచరించు సైనికులు ముందుకు సాగిరి. యుద్ధముచేయగోరువారు యుద్ధము చేయుటలో ఆలస్యము నోర్చుదురా? (వెంటనే తలపడుదురని భావము.) 47

తారకుని సైన్యమునందు తిరుగు సైనికులు, ఎదుటనున్న బలారియగు ఇంద్రుని సైన్యసముద్రమున కెదురేగి, పిమ్మట చేతిని పైకెత్తి, తమతమ పేర్లను బిగ్గరగా శత్రుసైన్యములోనివారికి నివేదించిరి. 48

ఇంద్రాదిమహాదేవతలు తమ ఎదుటనున్న సైన్యసముద్రమునుచూచి, మిక్కిలి క్షోభించిరి. "యుద్ధమునందు నేనుండ నాముందు దేవసైన్య మెంత?" అని తారకుడు అవహేళనముచేయుటచేత ఆ దేవసైన్యమందలి సైనికలు (భటులు) శివపుత్రుడైన కుమారస్వామియొక్క నేత్రకోణములలోనికి ప్రవేశించిరి. (కన్నులలోనికి చూచిరి. లేక అతని కంటపడిరి అని భావము.) 49

మహారణోత్సవమునకై ఎదురుచూచుచున్న అంధకారికుమారుడగు కార్తికేయుడు, తారకాసురుని సైన్యమునుచూచి భయపడిన దేవసైన్యమును, తన అనుగ్రహామృత పూర్ణమైన దృష్టితోచూచెను ('మీరు భయపడకుడు, ప్రసన్నులుకండు, సందేహ పడకుండ యుద్ధము చేయుడు' అని ఉపదేశించి నట్లున్నదని భావము.) 50

'శక్తి' అను ఆయుధవిశేషమును ధరించిన, యుద్ధమునందు కార్తికేయుని చూచుట కుత్సాహమును పొందిన, ఇంద్రప్రముఖులైన, యజ్ఞభోక్తలయిన దేవతలు, యుద్ధమునందు "నేనే శత్రువును గెలువజాలినవాడను, ఇతరులెవరును గెలువలేరు" అని పలుకుచు, ఆనందించిరి. శ్రేష్ఠులతోడి మహాత్ములతోడి స్నేహము ఎవరికి పరాక్రమప్రేరకముకాదు? - అందరిని ప్రేరేపించుననని భావము. (పరాక్రమము కోల్పోయిన వారికి మరల పరాక్ర

## సేనయోః కోలాహలవర్ణనమ్

శ్లో॥ పరస్పరం వజ్రధరస్య సైనికా
ద్విషో ఽపి యోద్ధుం స్వకరోద్ధృతాయుధాః ।
వైతాలికశ్రావితతారవిక్రమా
భిదా నమీయు ర్విజయైషిణో రణే ॥ 52

శ్లో॥ సంగ్రామం ప్రలయాయ సన్నిపతతో వేలా మతిక్రామతో
వృన్దారాసురసైన్యసాగరయుగస్యాశేషదిగ్వ్యాపినః ।
కాలాతిథ్యభుజో బభూవ బహలః కోలాహలః క్రోషణః
శైలోత్తాలతటీవిఘట్టనపటు ర్బ్రహ్మాణ్డకుక్షిమ్భరిః ॥ 53

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"సురాసురసైన్యసంఘట్టః"నామ పంచదశః సర్గః

-o0o-

మోత్సాహము నిచ్చునది మహాపురుష సంశ్రయమే కాని మఱొక మార్గము లేదని భావము.) 51

## దేవానవ సైన్యముల కోలాహల వర్ణనము

యుద్ధభూమియందు పరస్పరముగెలువగోరినవారై, యుద్ధముచేయుటకై తమతమ చేతులలో ఆయుధముల నెత్తిపట్టుకొనినవారై, దేవేంద్రునియొక్కయు, ఆతని శత్రువగు తారకునియొక్కయు సైనికులు, వందిమాగధులు వారివారి పేర్లను ఉచ్చైఃస్వరముతో (బిగ్గరగా) పాడుచుండగా, ఒక సైన్యము నింకొక సైన్యమును, ఒకరిని మరియొక్కరును, సమీపించిరి. 52

ప్రళయమును (వినాశమును) సృష్టింపగోరి, యుద్ధముకై ముందుకు దూకుచున్న మర్యాదను (న్యాయాచరణమును, జవదాటుచున్నవియను, నియమముల నతిక్రమించి యుద్ధముచేయువాని వద్ద హద్దుమీరుచున్నవియును, అన్ని దిక్కులయందు వ్యాపించినవియును, యమధర్మరాజు చేయు ఉచిత సత్కారమును, (మరణమును) అనుభవింపబోవుచున్నవియును అగు దేవదానవుల రెండు సైన్యసాగరములయొక్క గంభీరఘోష, ఎత్తైన తాటిచెట్లుకల పర్వత శృంగములను కూడ పడగొట్టుటకు సామర్థ్యముకలదియై బ్రహ్మాండ భాండము నిండనిండినదై, అధికముగా వ్యాపించెను. ఈ అర్థము ఉభయ సైన్యములకు సంబంధించినది. ఇది శార్దూలవిక్రీడితవృత్తము.

**ఇక సాగరములకు సంబంధించిన అర్థమిది.**

చెలియలికట్టనుదాటినవై, ఉప్పొంగుటవలన అన్నిదిక్కులయందు వ్యాపించి, ప్రళయకాలమునందు సముద్రములో నీరు ఉప్పొంగువలన ఎటుచూచినను నీరే ఉండుటవలన ఆనీటి చల్లదనపు ఆతిథ్యమును అనుభవించుచున్న దేవ రాక్షససైన్య సాగరములయొక్క గంభీరఘోష వ్యాపించినది. 53

ఇది మహాకవి శ్రీకాళిదాసు రచించిన "కుమారసంభవ"మను మహాకావ్యమునందు
"సురాసురసైన్యసంఘట్టము" అను పేరుగల పదునేనవ సర్గమునకు
"ప్రవచనప్రభాకర, ఉపన్యాసకేసరి, భాగవతరత్న" బిరుదాంచితుడైన
బ్రహ్మశ్రీ గోళ్ళమూడి వెంకట శ్రీహరి సుబ్రహ్మణ్య శర్మ
వెలయించిన ఆంధ్రానువాదము.

-o0o-

# కుమారసమ్భవమ్

## "సురాసురసేనాసఙ్గ్రామవర్ణనమ్"

## నామ షోడశః సర్గః

శ్లో॥ అథాన్యోన్యం విముక్తాస్త్రశస్త్రజాలై ర్భయఙ్కరైః ।
యుద్ధ మాసీ త్సునాసీర సురారిబలయో ర్మహత్ ॥ 1

### సేనయోర్యుద్ధవర్ణనమ్

శ్లో॥ పత్తిః పత్తి మభీయాయ రణాయ రథినం రథీ ।
తురఙ్గస్థం తురఙ్గస్థో దన్తిస్థం దన్తిని స్థితః ॥ 2

శ్లో॥ యుద్ధాయ ధావతాం ధీరం వీరాణా మితరేతరమ్ ।
వైతాలికాః కులాధీశా నామా న్యల ముదాహరన్ ॥ 3

# కుమారసంభవము

## “సురాసురసేనాసంగ్రామవర్ణనము” అను పదునారవ సర్గము

దేవదానవులు కలిసికొనిన తరువాత, ఒండొరులను కొట్టుటకై విడువబడిన, భయంకరములైన, మోహనముమొదలగు అస్త్రములచేత ఇంద్రునియొక్కయు, తారకాసురునియొక్కయు సైన్యములమధ్య ఘోరమైన యుద్ధము ప్రారంభమయ్యెను. ఈ సర్గములోని శ్లోకములు అనుష్టప్ ఛందస్సునందు కూర్పబడినవి. 1

### ఉభయసైన్యముల యుద్ధవర్ణనము

ఉభయసైన్యములలోని పదాతిదళము-పాదచారులతోను, రథికులు - రథికులతోను, అశ్వారూఢులు-గుర్రముమీద ఉన్నవారితోను, ఏనుగుమీద ఉన్నవారు - ఏనుగుమీద ఉన్నవారితోను ఆ యుద్ధమునందు తలపడిరి. 2

పరస్పరము యుద్ధముచేయుటకు పరుగులిడుచున్న వీరయోధులయొక్క పేర్లను కులాభిమానముకలిగిన వైతాళికులు, “ఇత డీ వీరుడు. ఇతని పే రిది. దేశ మిది'' అని వారిని మాటలతోనే అలంకరించుచున్నట్లు జయజయ నినాదములతో ప్రస్తుతించిరి. 3

శ్లో॥ పతతాం వన్దివృన్దానాం ప్రవీరా విక్రమావలీమ్ ।
క్షణం విలమ్బ్య చిత్తాని దదు ర్యుద్ధోత్సుకాః పురః ॥ 4

శ్లో॥ సఙ్గ్రామానన్దవర్ధిష్ణౌ విగ్రహే పులకాఞ్చితే ।
ఆసీ త్కవచవిచ్ఛేదో వీరాణాం మిలతాం మిథః ॥ 5

శ్లో॥ నిర్దయం ఖడ్గభిన్నేభ్యః కవచేభ్యః సముత్థితైః ।
ఆసన్ వ్యోమ దిశ స్తూలైః ఫలితై రివ పాణ్డురాః ॥ 6

శ్లో॥ ఖడ్గా రుధిరసంలిప్తా శ్చణ్డాంశుకరభాసురాః ।
ఇత స్తతోఽపి వీరాణాం విద్యుతాం వైభవం దధుః ॥ 7

శ్లో॥ విసృజన్తో ముఖై ర్జ్వాలా భీమా ఇవ భుజఙ్గమాః ।
విసృష్టాః సుభటై రుష్టై ర్వ్యోమ వ్యానశిరే శరాః ॥ 8

శ్లో॥ బాఢం వపూంషి నిర్భిద్య ధన్వినాం నిఘ్నతాం మిథః ।
అశోణితముఖా భూమిం ప్రావిశ న్దూర మాశుగాః ॥ 9

ఆ ప్రకృష్టులైన యోధులు, తమ పరాక్రమసూచకమగు విక్రమావళులను వైతాళికబృందము బాగుగాచదువుచుండగా విని, "కేవలము తాము చెవులతో వినుటచేత మాత్రమే అర్థము బోధపడదు అను భావముచేత అర్థగ్రహణా స్వాదనమువలన కలిగిన ఆనందము ననుభవించుటకు" ఆ వందిమాగధుల ఎదుట క్షణకాలము నిలిచి, వారిమాటలపై మనస్సును లగ్నము చేసిరి. **4**

పులకరించినదియును, ఉభయసైన్యములలోని వీరుడు మరియొక వీరుని కలిసికొనినపుడు వారికి సమరానందము పెరుగుటవలన వారివారి శరీరములు ఉప్పొంగి, వానిపైనున్న కవచములు బిగిసి బిగిసి విరిగిపోయినవి. **5**

క్రూరముగా కత్తితో నరుకబడిన, కవచములనుండి ఎగురుచున్న, దూదిపింజల చేత ఆకాశముతో సహా దిక్కు లన్నియు ముసలితనముచేత వచ్చు తెల్లదనముచేత తెల్లబడినవో అన్నట్లుండెను. (కవచములను పగులగొట్టుటయందు వీరుల సమరోత్సాహము సూచితమైనది.) **6**

నెత్తురులో మునిగినట్లు ఇరువైపుల సూర్యకిరణములు పడుటచేత మెరియుచున్న వీరులయొక్క ఖడ్గములు మెరుపుతీగలతో పోల్చదగినవై శోభించినవి. (ఆ ఖడ్గములు, వీరవరుల చేతిలోనుండి ఝళిపింపబడుచున్నప్పుడు సూర్య కిరణములు ఆ వీరుల శత్రుసైన్యవినాశక సామర్థ్యమును, ఖడ్గవిద్యా నైపుణ్యమును సూచించుచున్నవని భావము.) **7**

కోపించిన సుభటులచేత విడువబడిన బాణములు తమ ముఖములనుండి అగ్నిజాలలను విడుచునట్టి భయంకరములైన సర్పములేమో అన్నట్లు ఆకాశమునం దంతటను వ్యాపించినవి. **8**

ఒండొరులను బాగుగా కొట్టుకొనుచున్న ధనుర్ధరులయొక్క (యోధులయొక్క) శరీరములను చీల్చియును, ఆ బాణములు వేగముగా పయనించుటవలన తమ ముఖములకు నెత్తురంటుకొనకుండగనే భూమిలోనికి చాలదూరము ప్రవేశించినవి. (ఇచ్చట బాణమునకు ఆశుగము=వేగముగా పోవునది అను అర్థము సార్థకమైనది.) **9**

శ్లో॥ నిర్భిద్య దన్తినః పూర్వం పాతయామాసు రాశుగాః ।
పేతుః ప్రవరయోధానాం ప్రీతానా మాహవోత్సవే ॥ 10

శ్లో॥ జ్వలదగ్నిముఖై ర్బాణై ర్నీరన్ధ్రై రితరేతరమ్ ।
ఉచ్చై ర్వైమానికా వ్యోమ్ని కీర్ణే దూర మపాసరన్ ॥ 11

శ్లో॥ విభిన్నం ధన్వినాం బాణై ర్వ్యథార్త మివ విహ్వలమ్ ।
రరాస విరసం వ్యోమ శ్యేనప్రతిరవచ్ఛలాత్ ॥ 12

శ్లో॥ చాపై రాకర్ణ మాకృష్టై ర్విముక్తా దూర మాశుగాః ।
అధావన్ రుధిరాస్వాద లుబ్ధా ఇవ రణైషిణామ్ ॥ 13

శ్లో॥ గృహీతాః పాణిభి ర్వీరై ర్వికోశాః ఖడ్గరాజయః ।
కాన్తిజాలచ్ఛలా దాజౌ వ్యహస న్నమ్మదా దివ॥ 14

శ్లో॥ ఖడ్గాః శోణితసన్దిగ్ధా నృత్యన్తో వీరపాణిషు ।
రజోఘనే రణేఽనన్తే విద్యుతాం వైభవం దధుః ॥ 15

శ్లో॥ కున్తాశ్చకాశిరే చణ్డ ముల్లసన్తో రణార్థినామ్ ।
జిహ్వాభోగా యమస్యేవ లేలిహానా రణాఙ్గణే ॥ 16

ఆ యుద్ధోత్సవమునందు, సంతసించిన వీరశ్రేష్ఠులయొక్క బాణములు ఏనుగుల శరీరములనుండి దూసుకొనిపోయి, వాని శరీరములను నేలకూల్చినవి. తరువాత అవి(బాణములు) కూడ పడినవి. 10

ప్రజ్వరిల్లుచున్న అగ్ని ముఖమునందు (ములికియందు)గల, ఒకరొకరిని కొట్టుకొనుచున్న, ఎడతెగని బాణములచేత ఆకాశమంతయు నిండిపోగా, దివ్య విమానములపై విష్ణ్వాది దేవతలు అచ్చటినుండి దూరముగా తొలగిరి. 11

ధనుర్ధరులయొక్క బాణములచే చీల్చబడిన, అందువలననే బాధతో దుఃఖ పడుచున్న, విరసమైన (కర్తవ్యమును మఱచిన) ఆకాశము గ్రద్దల అరుపులు అను మిషతో కర్ణకఠోరముగా అరిచెనో అన్నట్లున్నది. 12

చెవివరకు లాగబడి విడువబడిన, యుద్ధముచేయగోరు, యోధులయొక్క ధనుస్సులనుండి విడువబడిన, బాణములు, నెత్తురును చవిచూచుటయందు ఆశగలవో అన్నట్లు దూరప్రాంతములకు పరుగెత్తినవి. (వీరుల బాణములు సుదూరప్రాంతములకేగి అచ్చటి శత్రువులను సంహరించుచున్నవని భావము.)13

వీరులచేత చేతితోపట్టుకొనబడిన, ఒరలేని ఖడ్గపంక్తులు, తమనుండి వెలువడు కాంతిజాలములు అను మిషతో, యుద్ధమునందు వీరులైన శత్రువులను సంహరించు కార్యమునందు మేమేసమర్థులము, ఇతరులకెవ్వరికి చేతకాదు అని చాటుచు, ఆనందముతో నవ్వుచున్నవో అన్నట్లు మెరియుచున్నవి. 14

నెత్తుఱులో మునిగిన ఖడ్గములు, వీరుల చేతులయందు నాట్యముచేయుచు దుమ్ముతో నిండిన, అపారమైన యుద్ధభూమియందు మెరుపుతీగల వైభవమును వహించినవి. 15

యుద్ధభూమియందు ప్రచండముగా ప్రదీపించు కుంతములు (ప్రాస) అను ఆయుధములు నాలుకను పైకిచాచి, నాకుచున్న యముని నాలుకలేమో అన్నట్లు ప్రకాశించినవి. 16

శ్లో॥ ప్రజ్వలత్యాన్తి చక్రాణి చక్రాణి వరచక్రిణామ్ ।
చణ్డాంశుమణ్డలశ్రీణి రణవ్యోమని బభ్రముః ॥ 17

శ్లో॥ కేచి ద్వీరైః ప్రణాదైశ్చ వీరాణా మభ్యుపేయుషామ్ ।
నిపేతుః క్షోభతో వాహా దపరే ముముహు ర్మదాత్ ॥ 18

శ్లో॥ కశ్చి దభ్యాగతే వీరే జిఘాంసౌ ముద మాదధౌ ।
పరావృత్య గతే క్షుబ్ధే విషసాదాహవప్రియః ॥ 19

శ్లో॥ బహుభిః సహ యుద్ధ్వా వా పరిభ్రమ్య రణోల్బణాః ।
ఉద్దిశ్య తా నుపేయుః కేఽపి యే పూర్వవృతా రణే ॥ 20

శ్లో॥ అభితో ఽభ్యాగతా న్యోద్ధుం వీరాన్ రణమదోద్ధతాన్ ।
ప్రత్యనన్దన్భుజాదణ్డరోమోద్గమభృతో భటాః ॥ 21

శ్లో॥ శస్త్రభిన్నేభకుమ్భేభ్యో మౌక్తికాని చ్యుతా న్యధః ।
అధ్యాహవక్షేత్రముక్తకీర్తిబీజాఙ్కురశ్రియమ్ ॥ 22

## సురాసురవీరాణాం యుద్ధవర్ణనమ్

శ్లో॥ వీరాణాం విషమై ర్ఘోషై ర్విద్రుతా వారణా రణే ।
శాస్యమానా అపి త్రాసా ద్భేజు ర్ధూతాఙ్కుశా దిశః ॥ 23

మహాకాంతితో వెలుగొందు కాంతిమండలముకలవియును, సూర్యమండలపు శోభవంటి శోభకలవియును, చక్రాయుధమునుచేబట్టి యుద్ధముచేయు వీరశ్రేష్ఠుల చేతులలోని చక్రములు, యుద్ధభూమి అను ఆకాశమునందు స్వేచ్ఛగా పరిభ్రమించినవి. 17

ఎదురెదురుగా వచ్చిన వీరులయొక్క సింహనాదములచేత క్షోభించిన కొందరు వీరులు, మతిచలించినవారై మూర్ఛిల్లి, గుఱ్ఱమునుండి క్రిందపడిరి. మరికొందరు గర్వమువలన మాటిమాటికి తెలివిని కోల్పోయినవారైరి. 18

ఒక వీరుడు యుద్ధముచేయుటయందు ప్రీతికలవాడై తన ఎదుటికిరాగా, తన కోరిక తీరినదని సంతసించెను. ఈతని దెబ్బలచే క్షోభించినవాడై, ఆ వచ్చిన వీరుడు వెనుతిరిగి పారిపోగా, తన కోర్కె నెరవేరనందుకు దుఃఖించెను. 19

యుద్ధమునందు ఉద్భటులైన కొందరు యోధులు చాలమందితో పోరాడి కాని, పరిభ్రమించి కాని, యుద్ధముచేయుటకై వానికే ఎదురేగిరి. ఎవ రెవరితో యుద్ధముచేయుట కంగీకరించిరో ఎవ రెవరితో పూర్వము యుద్ధముచేసిరో వారితోనే మరల యుద్ధముచేయుటకు వెళ్ళిరి. 20

దృఢములైన భుజములు పులకరించిన, యోధులు, యుద్ధమదముచేత ఉద్ధతులైన, అందువలననే యుద్ధముచేయుటకు చుట్టుముట్టి వచ్చుచున్న, శత్రువులను చూచి సంతోషించిరి. 21

శత్రువులచేత పగులగొట్టబడిన మదగజముల కుంభస్థలములపైనుండి క్రిందపడిన ముత్యములు, యుద్ధభూమియను పొలమునందు నాటబడిన కీర్తి బీజములయొక్క మొలకల శోభను ధరించినవి. (కీర్తిలతాంకురములవలె ముత్యములు శోభిల్లినవని భావము.) 22

## సురాసురవీరుల యుద్ధవర్ణనము

యుద్ధమునందు దుస్సహములైన వీరఘోషలకు భయపడి, పారిపోవుచున్న ఏనుగులు మావటులచేత శాసింపబడుచున్నవైనను, అంకుశపుపోటును లక్ష్యపెట్టక, భయము కారణముగా దిక్కులను సేవించినవి. (దిగంతముల వరకు పారిపోయినవని భావము.) 23

శ్లో॥ రణే బాణగణై ర్భిన్నా భ్రమన్తో భిన్నయోధినః ।
నిమమజ్జు ర్మిలద్రక్తనిమ్నగాసు మహాగజాః ॥ 24

శ్లో॥ అపారే ఽసృక్సరిత్పూరే రథే షూచ్చైస్తరే ష్వ పి ।
రథినో ఽభిరిపుం క్రుద్ధా హాంకృతై ర్వ్యసృజ ఞ్ఛరాన్ ॥25

శ్లో॥ ఖడ్గనిర్లూనమూర్ధానో వ్యాపతన్తోఽపి వాజినః ।
ప్రథమం పాతయామాసు రసినా దారితా నరీన్ ॥ 26

శ్లో॥ వీరాణాం శస్త్రభిన్నాని శిరాంసి నిపతన్త్యపి ।
అధావన్ దన్తదష్టోష్ఠభీమా న్యభిరిపుం క్రుధా ॥ 27

శ్లో॥ శిరాంసి వరయోధానా మర్ధచన్ద్రహృతా న్యలమ్ ।
ఆదధానా భృశం పాదైః శ్యేనా వ్యానశిరే నభః ॥ 28

శ్లో॥ క్రోధా దభ్యాపతద్దన్తి దన్తారూఢాః పదాతయః ।
అశ్వారోహా గజారోహప్రాణా న్ప్రాపై రపాహరన్ ॥ 29

శ్లో॥ శస్త్రచ్ఛిన్నగజారోహా విభ్రమన్త ఇత స్తతః ।
యుగాన్తవాతచలితాః శైలా ఇవ గజా బభుః ॥ 30

శ్లో॥ మిలితేషు మిథో యోద్ధుం దన్తిషు ప్రసభం భటాః ।
అగృహ్ణ న్యుధ్యమానాశ్చ శస్త్రైః ప్రాణా న్పరస్పరమ్ ॥ 31

యుద్ధమునందు శత్రుబాణసమూహముచేత మావటివాడు కొట్టబడగా, తాము కూడ దెబ్బతిన్నవై, గిరగిర తిరుగుచు మహాగజములు, గాయపడిన యోధుల యొక్క ఒకదానితో ఒకటి కలియుచున్న రక్తపునదులలో మునిగినవి. 24

రథములు ఎత్తైనవయినప్పటికిని, లోతైన, అపారమైన, నెత్తుటి ప్రవాహమునందు మునుగుచుండగా, వానిపైనున్న రథికులు కోపించినవారై, హుంకారములతో భయపెట్టుచు, శత్రువుమీదికి శరవర్షమును కురిపించిరి. 25

కత్తిచేత తలనరుకబడినవారై, (యోధులు) తన గుఱ్ఱముమీదినుండి క్రిందికి పడుచున్న వారైనను తమ ఖడ్గముతో శత్రువుయొక్క తలను నరికి, వానిని క్రిందికి పడవేసిరి. ఆ తరువాత తామును పడిరి. 26

శస్త్రములచేత నరుకబడి క్రిందపడినప్పటికిని క్రిందిపెదవిని కొరుకుచు, భయంకరమైన వీరులయొక్క తలలు, కోపముతో శత్రువున కెదురుగా పరుగిడసాగినవి. 27

అర్ధచంద్రాకారపు బాణములచేత నరుకబడిన శ్రేష్ఠయోదులయొక్క తలలను గ్రద్దలు తమ పాదములతో పట్టుకొని, అకాశమునందు మిక్కిలి వ్యాపించినవి. 28

పదాతిదళములోనివారును, అశ్వసైన్యములోని వారును కోపమువలన, తమ యెదుటికి వచ్చుచున్న వీరుల ప్రాణములను ఈటెలతో నపహరించిరి. 29

గజారూఢులైన వీరుల తలలను శస్త్రములచేత నరుకగా భయపడిన ఆ ఏనుగులు ప్రళయప్రభంజనముచే విరుగగొట్టబడిన పర్వతశిఖరములేమో అన్నట్లు ఇటునటు తిరుగుచు శోభిల్లినవి. 30

యుద్ధముచేయు కోరికతో గజారూఢులైన భటులు, ఒండొరులతో యుద్ధము చేయుచు తమతమ శస్త్రములతో ఒకరినొకరు బలవంతముగా చంపుకొనిరి. 31

శ్లో॥ రుషా మిథో మిలద్దన్తి దన్తసఙ్ఘర్షజో ఽనలః ।
యోధా న్యస్త్రహృతప్రాణా నదహ త్సహసారిభిః ॥ 32

శ్లో॥ ఆక్షిప్తా అపి దన్తీన్ద్రైః కోపనైః పత్తయః పరమ్ ।
తదసూనహర న్ఖడ్గఘాతైః స్వస్య పురః ప్రభోః ॥ 33

శ్లో॥ ఉత్క్షిప్య కరిభి ర్దూరా న్ముక్తానాం యోధినాం దివి ।
ప్రాపి జీవాత్మభి ర్దివ్యా గతి ర్వా విగ్రహై ర్మహీ ॥ 34

శ్లో॥ ఖడ్గై ర్ధవలధారాలై ర్నిహత్య కరిణాం కరాన్ ।
తై ర్భువాపి సమం విద్ధా న్సన్తోషం న భటా యయుః ॥35

శ్లో॥ ఆక్షి ప్యాభిదివం నీతాః పత్తయః కరిభిః కరైః ।
దివ్యాఙ్గనాభి రాదాతుం రక్తాభి ర్ద్రుత మీషిరే ॥ 36

శ్లో॥ ధన్వినః స్తురగారూఢా గజారోహాన్శరైః క్షతాన్ ।
ప్రత్యేచ్ఛ న్మూర్ఛితా న్భూయో యోద్ధు మాశ్వసత శ్చిరమ్॥ 37

శ్లో॥ క్రుద్ధస్య దన్తినః పత్తి ర్జిఘృక్షో రశినా కరమ్ ।
నిర్భిద్య దన్తముసలా వారురోహ జిఘృక్షయా ॥ 38

కోపముతో ఒకదానికొకటి ఎదురుపడిన ఏనుగుల దంతముల సంఘర్షణము వలన పుట్టిన అగ్ని, శత్రువులచే శస్త్రములచే చంపబడిన యోధులను వెంటనే దహించెను. 32

మిక్కిలి కోపించిన గజేంద్రులచేత విసిరివేయుటకై తొండముతో పట్టుకొనబడి కూడ, పాదచారులైన యోధులు తమ ప్రభువుయెదుట తమ ఖడ్గ ప్రహారములతో ఆ గజేంద్రుని ప్రాణములను హరించిరి. 33

ఏనుగులు పైకెత్తి, ఆకాశములోనికి దూరముగా విసరబడిన యోధులయొక్క ప్రాణములు, స్వర్గమార్గమును పొందినవి. కేవలము ఆ యోధుల శరీరములు మాత్రము భూమికి చేరినవి. 34

తెల్లనిఅంచుగల, నూరుటవలన వాడియైన, అద్వితీయములైన ఖడ్గములు, భూమితోపాటుగా ఏనుగుల తొండములను కూడా నరికి, సైనికులు తృప్తిని పొందలేకపోయిరి. (ఇంకెవరినైనను చంపుదునను సమరోత్సాహము కలవి అయ్యెనని భావము.) 35

ఏనుగులు తమ దండములవంటి తొండములతో లాగి, పైకెత్తి, ఆకాశము వైపునకు చేర్చిన పాదచారులను, ప్రేమతో రంభాది అప్సరసలు వేగముగా చేపట్టవలెనని కోరుకొనిరి. (అప్సరసలు అహమహమికతో 'నే నీతనిని స్వీకరింతును. నే నీతనిని స్వీకరింతును' అని త్వరపడిరని భావము.) 36

గుఱ్ఱములనెక్కి యుద్ధముచేయు, ధనుర్ధరులైన యోధులు తమ బాణములచే గాయపడిన, అందువలననే మూర్ఛితులైన, గజారూఢులైన వీరులనుచూచి వారితో మరల యుద్ధముచేయగోరి, వారు తెప్పరిల్లువరకు ఎదురుచూచు చుండిరి. 37

పాదచారియైన ఒక యోధుడు కోపించి, తనను చంపగోరుచున్న, ఏనుగుయొక్క తొండమును కత్తితో నరికి, ఇంకను ఆ ఏనుగును పట్టగోరి రోకలివలె దృఢమైన దాని దంతములపై కెక్కెను. 38

శ్లో॥ ఖడ్గేన మూలతో హత్వా దన్తినో రదనద్వయమ్ ।
ప్రాతిపక్ష్యే ప్రవిష్టోఽపి పదాతి ర్నిరగా ద్ద్రుతమ్ ॥ 39

శ్లో॥ కరేణ కరిణా వీరః సుగృహీతో ఽపి కోపినా ।
అసినా ఽసూ న్జహౌ రాశు తస్యైవ స్వయ మక్షతః ॥ 40

## తురఙ్గియుద్ధవర్ణనమ్

శ్లో॥ తురఙ్గీ తురగారూఢం ప్రాసే నాహత్య వక్షసి ।
పతత స్తస్య నాజ్ఞాసీ త్ప్రాసఘాతం స్వకే హృది ॥ 41

శ్లో॥ ద్విషా ప్రాసహృతప్రాణో వాజిపృష్ఠ దృఢాసనః ।
హస్తోద్ధృతమహాప్రాసో భువి జీవన్నివాభ్రమత్ ॥ 42

శ్లో॥ తురఙ్గసాదినం శస్త్రహృతప్రాణం గతం భువి ।
అబద్ధోఽపి మహావాజీ న సాశ్రునయనో ఽత్యజత్ ॥ 43

శ్లో॥ భల్లేన శితధారేణ భిన్నోఽపి రిపుణాశ్వగః ।
నా మూర్ఛ త్కోపతో హన్తు మియేష ప్రపతన్నపి ॥ 44

ఒక పాదచారి, ఏనుగుయొక్క రెండు దంతములను తన కత్తితో మొదలంట నరికి, వెంటనే, శత్రుసైన్యమునందు ప్రవేశించి కూడ, శత్రుసైన్యమునుండి బయటపడెను. 39

కోపించిన ఏనుగుయొక్క తొండుమచేత బాగుగా పట్టుకొనబడిన ఒకానొక వీరుడు, తన కత్తితో ఆ యేనుగుయొక్క ప్రాణములనే హరించెను. తాను గాయపడలేదు. 40

## ఇద్దరు అశ్వికుల యుద్ధవర్ణనము

అశ్వారూఢుడైన ఒక యోధుడు మరియొక అశ్వారూఢుని తన బల్లెముతో వక్షస్థలమునందు కొట్టి, శత్రువుపడుటను చూచిన ఆనందముతో ఆ చచ్చిన వాడు బల్లెముతో తన హృదయమునందు కొట్టిన బల్లెపు దెబ్బను తెలిసికొన లేకపోయెను. 41

శత్రువుచేత బల్లెము అను ఆయుధముచేత చంపబడినవాడై గుర్రపు వీపుమీద స్థిరముగా కూర్చొని (అంతకుముందు దృఢముగా కూర్చొని ఉన్నందువలన మరణించిన తరువాత కూడా దృఢాసనములో ఉండుట యుక్తమైనదే అని భావము.) తన చేతితో మహాశూలము నెత్తి పట్టుకొని, ఇంతకు పూర్వము కదులుచున్న గుర్రముపై కూర్చుండి యుండుటవలన మరణించిన తరువాత కూడా ఆ భ్రమణమునే కొనసాగించుచు, బ్రతికియున్న వానివలె యుద్ధ భూమిలో ఇంకొకడు భ్రమింపసాగెను. 42

తన నెవరును బంధింపకున్నను ఒక మహాశ్వము కన్నీటిని విడుచుచు, శత్రువుల శస్త్రముచే చంపబడి, నేలపైబడిన రౌతును విడిచి వెళ్ళలేదు. (మరల ఆతడు జీవింపవలెనను కోరికతో అచ్చటనే ఉండిపోయెనని భావము.) 43

శత్రువుచేత వాడియైన బల్లెముతో చీల్చబడినవాడైనను ఒక రౌతు మూర్ఛ పోలేదు. కాని కోపమువలన గుర్రమునుండి క్రిందికి పడుచునే తన శత్రువును చంపగోరెను. 44

శ్లో॥ మిథః ప్రాసాహతౌ వాజిచ్యుతౌ భూమిగతౌ రుషా ।
శస్త్ర్యా యుయుధతుః కౌచి త్కేశాకేశి భుజాభుజి ॥ 45

శ్లో॥ రథినో రథిభి ర్బాణై ర్హృతప్రాణా దృఢాసనాః ।
క్షతకార్ముకసన్ధానాః సప్రాణా ఇవ మేనిరే ॥ 46

శ్లో॥ న రథీ రథినం భూయః ప్రాహర చ్ఛస్త్రమూర్ఛితమ్ ।
ప్రత్యాశ్వసన్త మన్విచ్ఛ న్నాతిష్ఠ ద్యుధి లోభతః ॥ 47

శ్లో॥ అన్యోన్యం రథినౌ కౌచి ద్గతప్రాణౌ దివఙ్గతౌ ।
ఏకా మప్సరసం ప్రాప్య యుయుధాతే వరాయుధౌ ॥ 48

శ్లో॥ మిథో ఉ_ర్ధచన్ద్ర నిర్లూనమూర్ధానౌ రథినౌ రుచా ।
ఖేచరౌ భువి నృత్యన్తౌ స్వకబన్ధా వపశ్యతామ్ ॥ 49

శ్లో॥ రణాఙ్గణే శోణితపఙ్కపిచ్ఛిలే
కథఙ్కథఞ్చి న్ననృతు ర్ధృతాయుధాః ।
నదత్సు తూర్యేషు పరేతయోషితాం
గణేషు గాయత్సు కబన్ధరాజయః ॥ 50

ఒకరి నొకరు ప్రాసము అను ఆయుధముచే పొడుచుకొనినవారై గుర్రముల నుండి క్రిందకు (నేలపై) పడిన ఇద్దరు యోధులు కోపముతో శస్త్రికతో (చిన్న కత్తితో) యుద్ధము చేసిరి. పిదప జుట్టుజుట్టు పట్టుకొనియును తమ భుజము భుజమును పట్టుకొనియును ద్వంద్వయుద్ధమును చేసిరి. 45

రథారూఢులచేత బాణముల సహాయముతో చంపబడినను, దృఢమైన ఆసనము కలవారును, ఊడిన వింటినారిని సంధానపరచి సిద్ధము పరచుచున్నవారును అగుటవలన ఆ రథికులు చూపరులచేత బ్రతికిఉన్న వారివలెనే భావింపబడిరి. 46

రథారూఢుడు శస్త్రపు దెబ్బచేత స్పృహను కోల్పోయిన రథికుని, మరల కొట్టలేదు. కాని యుద్ధముచేయవలెనను ఆశతో ఆ రథికుడు మరల స్పృహలోనికి రావలెనని కోరుకొనుచుండెను. 47

శ్రేష్ఠమైన ఆయుధముకల ఇద్దరు రథికులు ఒకరొకరిచేతిలో మరణించి, స్వర్గమునకు వెళ్ళి, అచ్చట ఇద్దరును ఒకే అప్సరసను "నే నీమెను గ్రహింతును నే నీమెను గ్రహింతును" అని పలుకుచు అచ్చట కూడ కలహింప నారంభించిరి. 48

ఒండొరుల తలలను అర్ధచంద్రాకారపు బాణములతో నరుకుకొనిన, ఆకాశచారులైన, తేజోవంతులైన, ఇద్దరు రథికులు భూమిపై నాట్యము చేయుచున్న తమ మొండెములను చూచిరి. 49

తూర్యములు (వాద్యములు) మ్రోగుచుండగా, స్త్రీ పిశాచముల సమూహములు పాడుచుండగా, ఆయుధములను ధరించిన మొండెముల సమూహము, నెత్తుటి బురదలుకల యుద్ధభూమియందు అతి కష్టముగా నాట్యముచేసినవి. (ఈ శ్లోకము ఉపజాతి వృత్తమునందు కూర్పబడినది.) 50

## సమరే తారక స్యాష్టదిక్పాల సంముఖాగమనమ్

శ్లో॥ ఇతి సురరిపు ర్వృత్తే యుద్ధే సురాసురసైన్యయో
రుధిరసరితాం మజ్జద్దన్తిప్రజేషు తటే ష్వలమ్ ।
అరుణనయనః క్రోధా ద్భీమభ్రమద్భృకుటీముఖః
సపది కకుభా మీశా నభ్యాగమ త్స యయుత్సయా ॥ 51

ఇతి మహాకవి శ్రీకాలిదాసకృతౌ కుమారసమ్భవే మహాకావ్యే
"సురాసురసేనాసఙ్గ్రామవర్ణనమ్"నామ షోడశః సర్గః

-ం0ం-



దేవసైన్యము - నాయకుడు కుమారస్వామి. శ్లోకము 51

